# వోల్గానుంచి గంగాతీరము


మూలం :

రాహుల్ సాంకృత్యాయన్

తెలుగు :

స్వర్గీయ అల్లూరి సత్యనారాయణరాజు




అనుపమ ప్రచురణలు

# వోల్గానుంచి గంగాతీరము

మూలం :

రాహుల్ సాంకృత్యాయన్

తెలుగు :

స్వర్గీయ అల్లూరి సత్యనారాయణరాజు



అనుపమ ప్రచురణలు

హైదరాబాదు

మొదటి ముద్రణ : 1949
రెండవ ముద్రణ : 1957
మూడవ ముద్రణ : 1978

వెల :
Hard Cover Rs. 20-00/- (లైబ్రరీ ఎడిషన్-సెక్షన్‌కుట్టు)
సాదా ప్రతి Rs. 15-00/-

ప్రతులకు : వివరాలకు :
అనుపమ ప్రచురణలు
10-2-317/33
విజయనగర్ కాలనీ
హైదరాబాదు-500028

ప్రతులకు :
"ఓంకో" జిన్నూరు-534265

నవయుగ బుక్‌హౌస్
సుల్తాన్‌బజారు
హైదరాబాదు

ముద్రణ :
మాధురీ ప్రింట్ ఆర్ట్సు
లకడీ కా పూల్, హైదరాబాదు-500004.

# మా మాట

“వోల్గా సే గంగా” మహాపండిత రాహుల్ సాంకృత్యాయన్ రచనల్లో మణి పూస. వోల్గా-గంగానదుల మధ్యస్థ ప్రాంతంలో, 7500 సంవత్సరాల కాలంలో జరిగిన మానవజీవన వికాసాన్ని అక్షర చిత్రాల్లో ప్రదర్శించిన మహోత్తమ గ్రంథం యిది. ఇది 14 భాషల్లో అనువదించబడింది. ఈ పుస్తకాన్ని గురించి రాహుల్‌జీ స్వయంగా యిలా చెప్పారు.

“చరిత్ర మారుతూ మారుతూ సామ్యవాద ప్రాంగణంలోకి ఎలా అడుగు పెట్టవలసి వచ్చిందో కథారూపంలో తెలుసుకోవాలనుకున్నప్పుడు, వోల్గాసేగంగా చదివితే చాలు.”

ఇంతటి ఉత్తమ గ్రంథాన్ని స్వర్గీయ అల్లూరు సత్యనారాయణరాజుగారు జైలులో గడిపిన 5½ సంవత్సరాల కాలంలో మనోహరంగా తెనిగించారు. 1949, ఫిబ్రవరిలో మొట్టమొదటగా ప్రచురించబడింది. ద్వితీయ ముద్రణ 1957, జనవరిలో జరిగింది. స్వర్గీయ సత్యనారాయణరాజుగారి కుమారుడు శ్రీ అల్లూరి సుభాష్ చంద్ర బోస్, M. P. గారు యీ పుస్తకం ప్రచురణ హక్కుల్ని ఓంకో సంస్థకి యిచ్చారు. వారివద్దనుంచి ప్రచురణ హక్కుల్ని మేం స్వీకరించాం. మూడవ ముద్రణకు మాకీ సదవకాశాన్ని కలిగించిన శ్రీ సుభాష్‌చంద్రబోస్ M. P. గారికి, ఓంకో సంస్థకు మా కృతజ్ఞతాభివందనాలు ప్రకటిస్తున్నాం.

రాహుల్‌జీ యీ రచన పాఠకుల మనోవికాసానికి బాటలు వేస్తుందనే విశ్వాసంతో దీన్ని ప్రచురించాం. రాహుల్‌జీ తన రచనల్ని గురించి చెప్పిన మాటల్ని అవశ్యం మననం చేసుకుందాం :

“నా రచనలు చదివిన రచయితలు, పాఠకులు నా రచనల్ని మరిపించగల స్థాయిలో రచనలు సాగించాలని కోరుకుంటున్నాను. భావితరాలవారు శాస్త్రీయ విమర్శనా కుశలురైతే నాకు సంతృప్తి. అంతేగాని, నా రచనలు శాశ్వతంగా నిలిచి పోవాలన్న దురాశ నాకు లేదు. సమాజం మారుతూవుంది. ఆ మార్పు ప్రభావం

మానవుని మేధస్సుపై ప్రసరిస్తూనే వుంటుంది. యువత కోసమే నేను కలంపట్టాను. వారిమీద నాకెంతో ఆశ వుంది. ఈ సమాజాన్ని మార్చగల దిట్టలు వాళ్లే."

యువతరం మీద ప్రగాఢ విశ్వాసం పెట్టుకున్న స్వర్గీయ రాహుల్‌జీ పుస్తకాన్ని తెలుగు పాఠకులు గొప్పగా ఆదరిస్తారని మా ఆశ, విశ్వాసం. యువలోకాన్ని నవసమాజ నిర్మాణం వేపు యీ పుస్తకం ప్రేరేపించగలిగితే మాకు సంతృప్తి, సంతోషం.

ఇట్లు
మీ
అనుపమ ప్రచురణలు

# పరిచయం

ఈ అనువాదమునకు మాతృక యగు "వోల్గా సే గంగా" యను ఉద్గ్రంథమును రచించి విఖ్యాతులైన మహాపండిత శ్రీ రాహుల సాంకృత్యాయనులు నిజముగ మహా పండితులు. ఇప్పుడు దేశమునగల కొద్దిమంది మనీషులలో వీరు ప్రముఖులు. వీరికిని అనువాదకులకును భారత స్వాతంత్ర్యసమరమున సహయోధులుగ సామ్యము కలదు.

మూలముయొక్క ప్రాశస్త్యమును వర్ణించుటకిది తావుకాదు. మానవుని గాథ ఇది. మనుజుని జీవితమొకే సూటిబాటపై సాగినదికాదు. ఆటంకము లనేకముదాటి మానవుడు వికసించుచు వచ్చినాడు. తొలుత మానవసమాజమునకు నదీతీరములే ఆటపట్టులగుటచే వాటిలో ముఖ్యములగు వోల్గా గంగా నదులను, మధ్యప్రదేశము లను, అచట పెంపొందిన జాతులను కథావస్తువుగా గ్రహించి, 7500 సంవత్సరముల సదీర్ఘ కాలమున ఆ యాజాతులలో కలిగిన పరిణామ వికాసములను మన మనో నేత్రమునకు చక్కగ గోచరమగునట్లు 19 కథలలో రచయిత ఆవిష్కరించినారు.

ఇట్లు వోల్గా-గంగా మధ్యస్థజాతుల జీవనకథకు మంచిదర్పణమై యొప్పుచున్న ఈ గ్రంథమును తెలుగుచేసిన అనువాదకుని ఉద్దేశము హర్షించదగినది. ఈయన స్వాతంత్ర్యయోధుడని మాత్రమే లోకమునకు తెలియునుగాని భాషాప్రవీణుడనియు రచయిత యనియు తెలియదు. చెరసాలలో సిద్ధించిన యీఅనువాదము చదివి పాఠకులు ఆనందించగలరు.

అడయారు, బెజవాడ గోపాలరెడ్డి,
మద్రాసు. ౬-౨-౪౯.

౨

# తిలకరేఖ

ఇది ఒక కథ కాదు. ఒక నాటకం కాదు. ఒక నవల కాదు. చరిత్ర కాదు. భూగోళంకాదు. శాస్త్రమూకాదు. వీటి అన్నిటి సమ్యగ్రూపమైన ఒక మహాసృష్టి. మానవజాతి ఇన్నివేల సంవత్సరాలు పురోగమించిన తరువాత, మానవచరిత్రలో ఇన్ని యుగపుటలు తిరగవేయబడిన తరువాత, మానవజాతి ఇన్నివేల సంవత్సరాల అనుభవం సంస్కారరూపంగా జీర్ణించుకున్న తరువాత, మానవుడు ఒక్కసారి వెనక్కితిరిగి చూచుకున్నప్పుడు తాను నడిచివచ్చినపథం, తాను వ్రాసుకున్న ఆత్మ కథాఘట్టాలు, తాను పొందిన సుఖదుఃఖాల అనుభూతి, అతనికి ఏరూపంలో కనబడుతోందో, ఎంతటి ఆశ్చర్యం కలుగజేస్తోందో, ఎంతటి ఉద్వేగం కల్పిస్తోందో ఈగ్రంథంలో అద్భుతావహంగా ప్రదర్శింపబడింది. ఇది మానవజాతి సంస్కృతి చరిత్ర. మానవహృదయం గానంచేసిన యుగయుగాల సుఖదుఃఖ గీతికల సంపుటి. మానవమేధస్సు ఉద్గమించిన సోపానాలవరుస. నిజంగా ఇది ఒక అపూర్వసృష్టి.

హిందీ సారస్వతంతో ఏ స్వల్ప పరిచయం ఉన్నవానికైనా రాహుల్ సాంకృత్యాయన్‌ని గురించి, అతని రచనలను గురించి తెలియకపోదు. అతని రచనకు సారస్వతగౌరవంతోపాటు, పురోగమనశీల భావగౌరవంకూడా అనల్పంగా వుంది. అందువల్లనే ఈ గ్రంథానికి ఇంతటి విశిష్టత.

ఇందులో ఆయాకాలాలలోని ప్రముఖవ్యక్తుల చుట్టూవున్న చారిత్రకగాథల ఆధారంతో, నాటిప్రజల ఆచారాలు, అభిరుచులు, ఆదర్శాలు మొదలైన విశేషాలెన్నో రమణీయంగా చిత్రింపబడ్డాయి. అవి చదువుతూవున్నప్పుడు, ఆయా ప్రజలలో మనమూ ఒకళ్ళమై, ఆనాటి వాయువులు పీలుస్తూ, వాళ్ళ కష్టసుఖాల్లో భాగస్వామ్యం వహిస్తూ జీవిస్తున్న అనుభూతి కలుగుతుంది. ఏరచనకైనా ఇంతకంటే చరితార్థత ఇంకేముంది ?

దీన్ని అల్లూరి ఆంధ్రీకరించాడని విన్నప్పుడు నాకు నిజంగా మహాశ్చర్యం కలిగింది. హిందీలో ఈ గ్రంథాన్ని చదివి నేను ముగ్ధుడనయ్యాను. రాహుల్‌జీని ఆంధ్రీకరించడంలోని కష్టం నాకు తెలియనిది కాదు. ఈ ఆంధ్రీకరణ చదివేటప్పటికి

నా ఆశ్చర్యం ద్విగుణీకృతమైంది. అల్లూరి ఇంత చక్కని సారస్వతహృదయం కలవాడా? ఈ బృహద్గ్రంథాన్ని ఆంధ్రసరస్వతికి అమూల్యాభరణంగా సమర్పించి నందుకు ఆంధ్రజాతి అల్లూరికి శాశ్వత కృతజ్ఞమై ఉంటుందని ఆశిస్తున్నాను.

మాడభూషి వెంకటాచార్యులు,
ఎం. ఏ (హిందీ) ఎం. ఏ. (సంస్కృతం)
హిందీ ఉపాధ్యాయుడు
ప్రెసిడెన్సి కళాశాల, మద్రాసు.

మద్రాసు,
8—1—1949.

# 1

# వోల్గానుంచి గంగాతీరము

## "నిశా"

### (మొదటి కథ)

[దేశం – వోల్గాతీరం (పై భాగం); జాతి – ఇండో – యూరోపియన్;
కాలం – క్రీస్తుకు 6,000 సంవత్సరాల పూర్వం.]

అది మధ్యాహ్నసమయం. ఎన్నో రోజుల తరువాత యివాళ సూర్యుడు దర్శన మిచ్చాడు. అయినా మసగలేకుండా మేఘరహితంగా వాతావరణం వుండడంవల్ల సూర్యకిరణాలు బహు మనోహరంగా వున్నాయి. స్పర్శతో మనస్సు కెంతో హాయిని కలిగిస్తున్నాయి. మరి నాల్గువైపులావున్న దృశ్యమో? గంభీరమైన నీలాకాశంక్రింద, భూమి కర్పూరంలాటి తెల్లటి మంచుతో కప్పబడివుంది. ఇరువదినాలుగు గంటలుగా హిమపాతం లేనందువల్ల, భూమిపై నున్న మంచు గడ్డకట్టివుంది. హిమమయమగు యీ భూమి దిగంత వ్యాప్తంగా లేదు. ఉత్తర దిశనుంచి దక్షిణదిక్కువైపు కొన్నిమైళ్ళవరకూ ఒక చక్కని పొడుగైన వెండి రేఖలాగుంది. ఈ దీర్ఘ రేఖకు రెండువైపులా పర్వతాల పైన నల్లని వనపంక్తి వుంది. ఈ వనపంక్తిని దగ్గరనుండి చూద్దాం. దీన్లో రెండురకాల వృక్షాలుమాత్రమే ఎక్కువగా కన్పడు తున్నాయి. మొదటిరకం భూర్జవృక్షాలు తెల్లని బెరడుకలిగి వున్నాయి. ప్రస్తుతం ఆకులు లేవు. రెండవరకం దేవదారు వృక్షాలు తమ నసమైన శాఖలను విస్తరించుకొని వున్నాయి. వృక్షముల చాలా భాగ మింకా మంచుతో కప్పబడేవుంది. వాటి శాఖలపైనా, కాండముల పైనా నిలచివున్న మంచుబిందువులు వృక్షశాఖల్ని కృష్ణశ్వేత వర్ణంగా చేసి చూడ్డానికి మరింత శోభాయమానంగా చేస్తున్నాయి.

భయంకరమైన నిశ్శబ్దం నలుదిశలా రాజ్యంచేస్తూంది. పశువుల చప్పుడులు కాని, పక్షుల కలకలరవములుగాని, క్రూరమృగాల అరుపులుగాని వినరావు.

పర్వతశిఖరాలపైనున్న దేవదారుచెట్టు మీంచీ నాల్గుదిక్కులా తిలకిద్దాం రండి. అక్కడనుంచి చూస్తే బహుశా మంచు, భూమి, యీ దేవదారు వృక్షాలే

కాకుండా మరేమైనా అగుపించవచ్చు. ఇచ్చట పెద్ద వృక్ష రాజాలేతప్ప చిన్న చిన్న మొక్కలకూ గడ్డిపోచలకూ ఏమీ స్థానంలేదా? ఈ విషయంలో మేమేమీ అభిప్రాయ మివ్వలేము. చలి కాలపు రెండుభాగాల్ని గడిపి, యిప్పుడు అంతిమ భాగమైన మూడవ భాగంలో వున్నాం. ఈ వృక్షములన్నీ యేమంచులో అయితే పాతబడినట్లున్నాయో, ఆమంచుయొక్క దళసరిని కొలవడానికి మనవద్ద సాధనం ఏమీ లేదు. బహుశా నాలుగైదు బారలలోతు కలిగి యుండవచ్చు. ఇంకా హెచ్చుగనున్నా ఆశ్చర్యంలేదు. ఈ సం॥ర అధికంగా మంచుపడుతోందనేది అందరూ అంటూన్నదే! దేవదారు తరువుపైనుండి చూచినప్పుడు యేంకనిపిస్తూంది? అదే మంచు, అదే వన పంక్తి, అదే ఎత్తుపల్లాలతో కూడిన పర్వతభూమి. ఆ-అదిగో! ఆ పర్వతానికి వెనుకనుంచి ఏదో పొగలేస్తూంది. ప్రాణిశబ్దశూన్యమైన యీ అరణ్యంలో ధూమదర్శనం చిత్రంగానేయుంది. పోదాం-పదండి. అచ్చటికివెళ్ళి అదేమో తెలుసు కోవాలనే మన కుతూహలాన్ని తీర్చుకుందాం. పొగ చాలదూరంలో వుంది. కాని వినిర్మలమైన స్వచ్ఛందాకాశంలో మన కెంతో దగ్గరలో వున్నట్లు కనిపిస్తోంది. చివరకు నడిచి మనం పొగవస్తున్న ప్రదేశాన్ని చేరుకున్నాం. అగ్నిలోపడిన మాంసం, క్రొవ్వువాసన కొడుతున్నాయి. మాటలశ్వని కూడా వినిపిస్తోంది. ఇవి పిల్లల మాటల్లా వున్నాయి. మన అడుగులచప్పుడు గాని, ఉచ్ఛ్వాసనిశ్వాసములు గాని అక్కడకు వినపడకుండా మనం నడవాలి. లేకపోతే అక్కడివాళ్ళకు మన జాడ తెలిసిపోతుంది. తెలిస్తే వాళ్ళు మననేం చేస్తారో? లేక వాళ్ళకుక్కలు మనపై కురుకుతా యేమో?

ఆ—నిజంగానే వీళ్ళంతా బిడ్డలు. వీరిలో అందరికన్నా పెద్దబిడ్డ ఎనిమిది సంవత్సరాలకన్నా మించి యుండదు. అందరికన్నా చిన్నిబిడ్డకి ఒక సంవత్సరం వయస్సుంటుంది. ఒకేయింట్లో ఆరుగురు ఆడబిడ్డలు. ఇల్లంటే కట్టినయిల్లుకాదు. ప్రకృతిసిద్ధమైన పర్వతగుహమాత్రం. దీని కిరువైపులా వెనుకభాగం అంధకారంలో యెంతవరకూ వెళ్ళాయో మాకు తెలియడంలేదు. తెల్సుకోవడానికి యత్నించరాదు కూడా! మరి పెద్దవాళ్ళో? ఒక ముసలమ్మమాత్రం కనిపిస్తోంది. ఆమె తలవెంట్రుకలు జనపనారలా తెల్లగా, మెలికలువేసుకొని జడలల్లుకుపోయి ముఖాన్ని కప్పి వేస్తున్నాయి. ముసలమ్మ యిప్పుడే చేత్తో తల వెంట్రుకల్ని మొగంనుంచి తొలగించింది. కనుబొమ్మలు కూడా నెరసిపోయినవి, ముఖంనిండా లోతైన ముడతలున్నాయి. అవి ముఖం లోపలనుంచి పైకి ఉదికివస్తున్నట్లున్నాయి. గుహలో పొగలో

బాటువేడి కూడా వుంది. ముఖ్యంగా పిల్లలూ, మన ముసలమ్మ కూర్చున్నచోట నిప్పుంది. అవ్వ వంటిపైన బట్టగాని, ఏలాటి మరుగుగాని లేదు. ఎండిపోయిన పుల్లల్లావున్న ఆమె చేతులు పాదాలకు దగ్గిరగా భూమి మీద పడివున్నాయి. ఆమె కళ్ళు దిగబడిపోయి గుంటల్లా వున్నాయి. తేలికైన నీలిరంగు కలిగిన ఆమె కంటిపాపలు కాంతిహీనంగా కన్పడు తున్నాయి. కాని మధ్యమధ్య ఆకళ్ళలో తేజస్సు ఉట్టిపడుతోంది. దానివల్ల ఆ కళ్ళలోని జ్యోతి పూర్తిగా నశించిపోలేదని తెలుస్తూంది. చెవులుమాత్రం చాల మెలకువతో వున్నట్లున్నాయి. పిల్లల శబ్దం మామ్మ బాగా వినగలుగుతూందనేది స్పష్టం. ఇప్పుడే ఒకబిడ్డ అరిచాడు. వెంటనే ఆమెకళ్ళు ఆ వైపుకు తిరిగాయి. అక్కడ 7 1/2 సం॥రముల వయస్సుగల యిద్దరు బిడ్డలున్నారు. వారిలో ఒకటి మగబిడ్డ, రెండోది ఆడబిడ్డాను. ఒడ్డుపొడుగులు సమానం. ఇద్దరి కేశాలుకూడా మొక్కజొన్న పొత్తికుచ్చురంగుతో పోల్చదగిన తెలుపుతోవున్నాయి. ముసలమ్మ తల వెండ్రుకలవలె తెలుపే అయినా, యివి సజీవంగానూ కాంతియుతంగానూ వున్నాయి. వీళ్ల శరీరాలు పుష్టిగానూ, అరుణ గౌరవర్ణ మిశ్రితంగానూ ఉన్నాయి. కళ్ళు విశాలమైనవి. కంటి పాపలు ఘనమైన నీలిరంగులో వున్నాయి. కుర్రాడు గొంతు చించుకొని గొల్లుమంటున్నాడు. ఆడపిల్ల ఒక చిన్న మాంసపుముద్దును నోట్లోపెట్టుకొని చప్పరిస్తూ, పీలుస్తూ నుంచుంది. అవ్వ కంపితస్వరంతో "అగిన్‌:రా, ఇక్కడకురా అగిన్! యిందమ్మా!" అంది.

అగిన్ లేవడమే లేదు. అప్పుడొక ఎనిమిది సంవత్సరాలవయస్సు గల కుర్రవాడు అగిన్‌ను లేవనెత్తి ముసలమ్మ చెంతకు చేర్చాడు. ఈ కుర్రాడి వెండ్రుకలు కూడా రంగులో ఆ చిన్న బిడ్డకివిలాగే వున్నాయి. కాని యివి కొంచెం పొడుగ్గానూ మరిన్ని జడలేసుకొని వున్నాయి. వీడి శరీరంకూడా గౌరవర్ణంగానే వుంది. కాని అంత పుష్టిగాలేదు. వంటినిండా నల్లమన్నూ, దుమ్మూను. ఈ పెద్దాడు చిన్నాణ్ణి ముసలమ్మ దగ్గర నుంచోబెట్టి,

"మామ్మా ! రోచన ఎముక లాగేసుకుంది. అందుకు అగిన్ ఏడుస్తున్నాడు." అంటూ పెద్దకుర్రాడు వెళ్ళిపోయాడు. ముసలమ్మ అగిన్‌ను ఎత్తుకుంది. వాడింకా యేడుపు సాగిస్తూనే వున్నాడు. మట్టితో నిండివున్న వాడిబుగ్గలపై నుంచి కన్నీటి ధార ప్రవహించి మరకలుపడ్డాయి. ముసలమ్మ బుడుతని చెక్కిళ్ళు ముద్దాపి చెలి

పిస్తూ, "అగిన్-ఏడ్వకు. రోచణ్ణికొడతా" అని సంవత్సరాలుగా కొవ్వుతో తడిసి నానియున్న భూమిపైన అరచేతితో చరిచింది. అగిన్ "ఊఁ, ఊ" యింకా ఆగలేదు: కన్నీటిధారకూడా కట్టలేదు. అవ్వ అగిన్ కన్నీళ్ళను తన మడ్డిచేతులతో తుడిచి ఎర్రని ఆ మరకల్ని నలుపు చేసింది. ఏడుస్తూన్న బిడ్డను మరిపించడానికి ఎండిపోయిన చర్మంలో ఇంకా మెరుస్తూన్న దుర్బలశరీరంనుంచి ఒడిలిపోయిన గుమ్మిడిపిందెలవలె వ్రేళ్ళాడుతున్న చర్మావశిష్టమైయున్న తనకుచములను కుర్రాడి నోటి కందించింది. వాటిని నోటికందించుకొని అగిన్ ఏడుపు మానేశాడు. అప్పుడే బయట ఎవరో మాట్లాడుతున్న శబ్దం వినిపించింది. కుర్రాడు తననోటిని ఆ శుష్క-స్తనాల్నుంచి వదలించుకొని ఆవైపు చూశాడు. ఎవరిదోకాని తియ్యటి వినసొంపైన శబ్దం వచ్చింది.. "అగి-గి-న్"

అగిన్ కెవ్వున ఏడ్చాడు. ఇద్దరుస్త్రీలు నెత్తినున్న కట్టెలమోపులను ఒకమూల దభీలున పారేశారు. ఒకరు రోచన్ వద్దకు, రెండోవారు అగిన్‌వద్దకు పరుగెత్తారు. అగిన్ యేడుస్తూ-'అమ్మా, అమ్మా' అన్నాడు. రోమయుతమైన తెల్లని ఎద్దుచర్మంతో కుడిచేతి కడ్డులేకుండా, కుడి స్తనంపైన అడవిముల్లుతో కుట్టబడియున్న పైటను యువతి తొలగించింది. చలికాలపు ఆహారలోపమువల్ల ఆమె తరుణ శరీరంపై మాంసం తక్కువగావుంది. అయినా సౌందర్యం అద్భుతంగా వుంది. దుమ్ముపడడంవల్ల ఆ ఎర్రని బుగ్గలు తెలుపూ, యెరుపు కలిసిన రంగుతో మెరుస్తున్నాయి; గోధుమవర్ణం కలిగిన ఆమె కురులు వదనాన్ని రక్షిస్తూ ఆచ్ఛాదితమై వున్నాయి; జడలుగట్టి లేవు. మాంసం అంత హెచ్చుగాలేకున్నా గుండ్రంగా పైకుబికి, నల్లని మొనలు కలిగిన ఆమె పెద్దపెద్ద కుచములూ, ఉదరరహితంగా ఉన్న ఆమె సన్నని కటి, భూరిపరిమాణంలో వున్న పిరుదులూ, కండరాలతో కూడిన గుండ్రని తొడలూ, హలాకారంతోనున్న ఆమె కాలి పిక్కలూ-ఆమె సౌందర్యానికి యింకేమి కావాలి? పద్దెనిమిది సంవత్సరాల ప్రాయంగల ఆ తరుణి అగిన్ను యెత్తుకొని అతని వదనాన్నీ, కళ్ళనీ, బుగ్గల్నీ ముద్దాడింది! అగిన్ ఏడ్పు మరచిపోయాడు. ఎర్రనైన అతడి పెదవుల్లో బియ్యపుగింజల్లాంటి తెల్లనిపండ్లు మెరుస్తున్నాయి. అతడి కండ్లు సగం మూతలుపడిపోయాయి. బుగ్గల్లో సొట్టలు పడ్డాయి. క్రిందపడియున్న వృషభచర్మంపైన యువతి కూర్చుంది. కోమలమైన తన స్తనాల్ని బిడ్డ తన రెండు చిట్టిచేతులతోను పట్టుకొని పాలుత్రాగనారంభించాడు. ఇదేసమయంలో, ఆ రెండవ నగ్నతరుణికూడా రోచనను తీసుకొచ్చి మొదటి ఆమెవద్ద చతికిలబడ్డది. వీళ్ళిరివురి ముఖాకృతులనుబట్టి అక్కచెల్లెండ్రని తెలిసిపోతోంది.

# 2

వాళ్ళు ఆ గుహలో మాట్లాడుకుంటూండగా విడిచి బయటకు వచ్చి చూస్తే, మంచుపైన తోలుతో కప్పబడిన కాళ్ళ ఆనవాళ్ళు కనబడుతున్నాయి. ఇవి యెక్కడికో ఓవైపుకు పోతున్నాయి. వీటిననుసరించి పోయి చూద్దాం. ఇదుగో, ఇక్కడి నుంచి ఈ పాదపంక్తి మళ్ళా ప్రక్కనున్న పర్వతారణ్యాల్లోకి పోయింది. మనం పరుగెత్తుతూ పోతున్నాం. కాని యీ పాదచ్ఛాయలు అంతం కావడంలేదు. మనం తెల్లని హిమక్షేత్రాల్ని ప్రవేశిస్తూ, అడవుల్ని అధిగమిస్తూ, పర్వత పంక్తుల్ని లంఘిస్తూ తిరిగి హిమక్షేత్రాల్లో అడుగెడుతూ, మరి కొన్ని పర్వతాలను దాటుతూ శరవేగంతో సాగిపోతున్నాం. చివరికి క్రిందనున్న వృక్షరహితమైన ఒక పర్వతశిఖరాగ్రముపై మనదృష్టి పడింది. అచ్చట క్రిందిభాగంనుండి లేస్తున్న హిమరాశి నీలాకాశంతో కలుస్తూంది. ఆ నీలనభంలో తమను అంకితం చేసుకుంటున్నట్లున్న ఎన్నో మానవమూర్తులు ఆపర్వతం వెనుక నిలుపమైపోతున్నాయి. వారి వెనుక భాగంలో గనుక నీలాకాశం లేకుండావుంటే మనం వారిని చూడగలిగేవాళ్ళమే కాదు: వారి శరీరాలపైన తెల్లని మంచు లాంటి వృషభచర్మా లున్నాయి. వారిచేతుల్లోని ఆయుధాలు తెల్లని రంగుపూసినట్లున్నాయి. అట్లాంటప్పుడు మహత్తరమైన ఆ హిమక్షేత్రంలో కదులుతూన్న ఆమూర్తుల్ని గుర్తించడం ఎట్లా?

ఇంకా దగ్గరకు పోయిచూద్దాం రండి: అందరికన్న ముందు బలిష్ఠశరీరం గల ఒక స్త్రీ వుంది. వయస్సు నలభై యాభైకి మధ్యవుంటుంది. నగ్నమైన ఆమె కుడిభుజాన్ని చూస్తేనే ఆమె చాలా బలిష్ఠయని తెలిసిపోతుంది. ఆమె కురులూ, ముఖమూ, అంగప్రత్యాంగాలూ, ఆ గుహల్లో మనంచూచిన యువతులవివలెనే వున్నాయి, కాని కొంచెంపెద్దవిగా మాత్రం వున్నాయి. ఆమె ఎడమచేతిలో మూడు గజాల పొడుగైన వాడి భూర్జవృక్షపుకర్రవుంది. ఒక పదునైన రాతిగొడ్డలి తోలుతో పేనిన త్రాడుతో ఆమె కుడిచేతిలోని కర్రపిడికి కట్టబడివుంది. ఆమె వెనుక నలుగురు పురుషులు, ఇద్దరు స్త్రీలు నడుస్తున్నారు. వారిలో ఒక పురుషునివయస్సు మాత్రం ముందు నడిచే స్త్రీకన్న హెచ్చుగా వుంటుంది. మిగిలినవాళ్ళ వయస్సులు 24 నుంచి 14 ఏళ్ళవరకూ ఉంటాయి. ఆ పెద్దవాని కేశములుకూడా పెద్దవిగనూ, గోధుమ వర్ణంగానూ ఉన్నాయి. అతనిముఖం ఆస్త్రీ రంగులోనేఉంది. కాని దట్టమైన గడ్డంతోను, మీసములతోను కప్పబడివుంది. అతని శరీరంకూడా ఆ స్త్రీ శరీరమువలెనే బలిష్ఠంగా

వుంది. ఆమెవద్దనున్న అస్త్రాలలాంటివే అతనివద్దనూ వున్నాయి. మిగిలిన ముగ్గురుపురుషులలోను, ఇద్దరిగడ్డాలూ, మీసాలుకూడా పెద్దాడివాటి వలెనే వున్నాయి. కాని వయస్సులో మాత్రం వాళ్లుచిన్న. ఇద్దరి స్త్రీలలోనూ ఒకామె వయస్సు యిరువై రెండూ, రెండవ అమ్మాయి వయస్సు పదహారు సంవత్సరాలకన్న తక్కువగా వుంటుంది. మొదట మనం ఆగుహలోని వాళ్ళని చూచాం. అవ్వనుకూడా చూచాం. ఇప్పుడందరినీ కలిపిచూస్తే ఈ కూటమంతా ఆముసలమ్మకు సంబంధించిన వాళ్ళలా స్పష్టంగా గోచరిస్తూంది.

ఈ స్త్రీపురుషుల చేతుల్లోని కఱ్ఱలూ, ఎముకలూ, రాతి ఆయుధాలు, వారి గంభీరమైన చేష్టలు చూస్తేవీరంతా వేటకు పోతున్నట్లుతోస్తుంది.

పర్వతంనుండి క్రిందికి దిగి నాయకురాలు—తల్లి అందాం—ఎడమ వైపుకు మళ్ళింది. మిగతావారంతా నిశ్శబ్దంగా ఆమెననుసరిస్తున్నారు. మంచుమీద నడుస్తూన్నప్పుడు చర్మంతో కప్పబడిన వారికాళ్ళ చప్పుడు ఏమాత్రము వినపడ్డం లేదు. శిరోభాగం ముందుకొరిగివున్న ఒక పర్వతం వుందక్కడ-దాని కిరుప్రక్కలా ఎన్నో పెద్దపెద్ద రాతి బండలు పడివున్నాయి. వేటకాండ్రు తమ గమనాన్ని చాలా తగ్గించేశారు. వాళ్ళంతా విడిపోయి చాలా మెలకువగా వున్నారు. కాళ్ళను మెల్లగా సాచి, ఆగి—ఆగి నిశ్శబ్దంగా ముందుకడుగువేస్తూ, పెద్దరాతి బండలమీద చేతుల పైన ఆనుకొంటూ, ముందుకు సాగిపోతున్నారు. తల్లి గుహద్వారంవద్దకు చేరింది. గుహకు బయటవున్న మంచుప్రదేశాన్ని ఆమె బహుసూక్ష్మంగా పరిశీలిస్తోంది. కాని ఎక్కడా అడుగుల జాడ కానరాదు. అప్పుడామె గుహలో ఒంటరిగా ప్రవేశిస్తుంది. కొన్నిబారలు దాటేసరికి గుహ ఒకప్రక్కకు తిరిగిపోయింది. అచ్చట వెలుతురు బహుతక్కువగావుంది. కొంచెంతడవు అక్కడాగి ఆమె తన కళ్ళను చీకటిలో చూచుటకు అలవరుస్తుంది. అప్పుడు మరింతముందుకు సాగుతుంది. అక్కడ మూడు భల్లూకాల్ని, తల్లి, తండ్రి, బిడ్డ—నిద్రిస్తూనో, మరణించియో కాని ముఖాలు క్రింది వైపుకు పెట్టుకొని పడివుండడం ఆమె చూస్తుంది. అవి జీవించివున్న చిహ్న లేమీ కన్పడవుమరి.

నాయకురాలు తిరిగివచ్చింది. బయట కాచుకొనియున్న పరివారమునకు తల్లి ముఖం వికసించివుండడం చూడగానే, భావం తెలిసిపోయింది. ఆమె తన బొటన వేలుతో చిటికినివేలిని ముడిచివేసి మిగతా మూడువేళ్ళనూ విప్పిచూపుతోంది.

తల్లి తరువాత ఇద్దరు మొగాళ్ళు తమ అస్త్రాలను సంభాళించుకొని ముందుకు సాగుతూన్నారు. తతిమావాళ్ళు శ్వాసావరోధంకూడ చేసి అక్కడే నిలిచి నిరీక్షిస్తున్నారు. తల్లి తిరిగి లోపలికిపోయి భల్లూకమువద్ద నిలుస్తుంది. పెద్దమగాడు ఆడ భల్లూకంచెంతకు చేరి నిలుస్తాడు. రెండోవాడు భల్లూకపుపిల్ల దగ్గరకుపోయి నిలుస్తాడు. తల్లి సౌంజ్ఞ చేస్తుంది. ముగ్గురూ వాడియైన తమదుడ్డు కర్రలతో ఒకేసారి 'ధన్' మని పొడుస్తారు. కర్ర కడుపులోనుంచి దూరి గుండెల్లో కెళ్ళిపోతుంది. ఒక్క జంతువూ కదలదూ, మెదలదు. చలికాలపు ఆరుమాసాల నిద్ర నుంచి మేల్కొనుట కింకా ఒక మాసం బాకీఉంది వాటికి. కాని ఈ సంగతి తల్లికి పరివారానికీ ఏమి తెలుసును? బహుజాగ్రత్తగా పనిజరుపుకోడమే వాళ్ళ పని. కర్రలను మరినాలుగైదు సార్లు భల్లూకపు పొట్టల్లో ఒకాడించి వాటిని వెల్లికలా పడేస్తారు. అప్పుడు నిర్భయులై వాటి ముందు కాళ్లు, ముట్టె పట్టుకొని బయటకి లాక్కొస్తారు. అందరూ ఆనంద భరితులై నవ్వుతూ గట్టిగా మాట్లాడుతూ వుంటారు.

పెద్ద భల్లూకాన్ని వెల్లికిలాపడేసి, తల్లి తన తోలు దుప్పటినుంచి చకుముకి రాతిచాకు బయటకు తీసింది. ఆ చాకును ముందు పొడిచిన గాయంలో పెట్టి పొట్ట నంతా చీల్చి వేసింది. రాతిచాకుతో ఇంత సులువుగాను, చక్కగాను చీల్చగలుగుటకు కారణం అలవాటూ, చేతుల్లోగల బలమూతప్ప మరేమీకాదు. గుండెకాయలోంచి ఒక మెత్తనిముక్క కోసుకొని ఆమె తన నోట్లో వేసుకొంది. ఇంకో ముక్క కోసి అందరికన్నా చిన్నవాడైన పద్నాలుగేండ్ల కుర్రాడినోట్లో పెట్టింది. మిగిలిన వాళ్ళంతా భల్లూకానికి చుట్టూ కూర్చొన్నారు. తల్లి గుండెకాయను ముక్కలుచేసి వరుసగా అందిస్తోంది, వాళ్లు కానిస్తున్నారు. మొదటి భల్లూకం తరువాత, తల్లి రెండవ భల్లూకాన్ని చెయ్యి చేసుకుంటూన్నప్పుడు పదహారేండ్ల యువతి ఆ చోటువిడిచి కొంచెం అట్లా వెళ్ళింది. మంచుగడ్డ ఒకటి నోటిలో వేసుకొంది. అదేసమయంలో అందరిలోకీ పెద్దవాడైన పురుషుడుకూడా బయటికొచ్చాడు. ఇతడుకూడా ఒక మంచుగడ్డ నోటిలో వేసుకొని యువతి చేయిపట్టుకొన్నాడు. ఆమె కొంచెం సంకోచించి శాంతించింది. పురుషుడు ఆమెను జతవేసుకొని ఒకవైపుకు తీసికొని పోయాడు. యువతీ, యువకుడూ చేతుల్లో మంచు గడ్డలు పెట్టుకొని, భల్లూకం దగ్గరకు తిరిగివచ్చేసరికి యిద్దరిబుగ్గలోను, కళ్ళలోను మరింత ఎరుపూ, కాంతి కనుపించాయి. పురుషుడు— అమ్మా! నీవు అలసిపోయావు. నేను కోస్తాను లే. తల్లి కత్తిని పురుషునిచేతి కిచ్చింది. ఆమె వంగి పద్నాలుగేండ్ల యువకుని ముద్దాడి అతనిచేయి పుచ్చుకొని బయటకు తీసుకొని పోయింది.

వారు మొత్తం మీద మూడు భల్లూకాల గుండెకాయల్నీ కూడా తినేశారు. గత నాలుగు మాసాలుగా తిండిలేకుండా నిద్రిస్తున్న భల్లూకాల్లో క్రొవ్వెక్కడుంటుంది? కాని లేతభల్లూకపు మాంసం బాగా మెత్తగానూ, రుచికరంగాను ఉంది. దాన్ని వాళ్ళు బాగా తిన్నారు. కాసేపు విశ్రాంతితీసు కోడానికి వారంతా ఒకేచోట దగ్గిర దగ్గిరగా పడుకున్నారు.

ఇక ఇంటికి పోవాలి. పెద్దభల్లూకాల్ని రెండింటినీ, నాలుగు కాళ్ళనూ, తోలు త్రాడుతో బంధించి యిద్దరిద్దరు దుడ్డుకర్రలను కాళ్ళమధ్యగా తొడిగి భుజాలకెత్తుకున్నారు. భల్లూకపుపిల్లని ఒక యువతి భుజంపై ఎత్తుకొంది. తల్లి తన రాతిగొడ్డల్ని సంభాళించుకొని ముందు దారితీసింది. అడవి మనుష్యులకు కాలము తెలుసుకోడానికి సాధనంలేదు. కాని యీ రాత్రి వెన్నెలవుంటుందని మాత్రం వారికి తెలుసును. కొంచెందూరం సాగిపోయేసరికే సూర్యుడు అస్తమించి పోతున్నట్లు తెలుసుకున్నారు. కాని ఇంకా పూర్తిగా అదృశ్యమయిపోలేదు. అందుచేత చాలసేపు సంధ్యకాంతులున్నాయి. అవికూడా తగ్గిపోగానే ధూమ్యాకాశాలలో వెన్నెలకు అధికారం వచ్చేశింది.

ఇంకా వారిగుహ చాలదూరంవుంది. బట్టబయల్లో ఒకచోట తల్లి అకస్మాత్తుగా ఆగిపోయి చెవియొగ్గి ఏమో వినసారంభించింది. అంతా నిశ్శబ్దంగా వింటున్నారు. పదునారేండ్ల యువతి ఇరువై రెండేండ్ల యువకునిచేరి "రోదే.........తోడేలు" అంది. తల్లికూడా తన తలను పైకీ క్రిందికీ వూపి, తొంగిచూచి "ఆ-తోడేళ్ళు-చాలా వున్నాయి. అవ్వో ! చాలా ఉన్నాయి' అంది. ఆవేశపూరితస్వరంతో "సిద్ధపడండి" అని హెచ్చరించింది. వేటాడబడిన ఆ శవాలను క్రింద పారేశారు. అందరూ తమతమ ఆయుధాలను సర్దుకొన్నారు. ఒకరి వీపుల నింకొకరి వీపులకు చేరవైచి నలుదిక్కులకూ ముఖాలుపెట్టి ఒకచోట అందరూ నిలబడ్డారు. మాటల్లోనే 7, 8 తోడేళ్ళు నాలుకలు తోడుకుంటూ గుర్రలు కొడుతూవచ్చి వాళ్ళచుట్టూ ప్రదక్షిణం చేయ మొదలెట్టాయి. మనుష్యుల చేతుల్లోని కర్రబల్లెములూ, రాతిగొడ్డళ్ళూ చూచి మీదికురికేందుకు వెనకాడుతున్నాయి. ఈసమయంలో యీ మనుష్యచక్రవ్యూహం మధ్యనవున్న చిన్నవాడు తనవద్దనున్న సన్నానికర్రను వంచి, తోలు త్రాడుతో బిగించి విల్లుగాచేశాడు. ఎక్కడదాచాడోమరి ! వాడియైన రాతిమొన కలిగిన బాణాన్నితీసి దానికి తగిలించి, రెంటినీ 24 ఏండ్ల యువకుని చేతికందించాడు. అంతే వాడు- ఆ యువకుణ్ణి చక్రవ్యూహం మధ్యకులాగి తను స్వయంగాపోయి వానిస్థానం

ఆక్రమించాడు. 24 ఏండ్ల ఆ యువకుడు విల్లును తనబలంతో బిగించి, బాణం ఎక్కుపెట్టిలాగి 'ఠన్' మని బాణాన్ని ఒకతోడేలుపొట్టలో సాచికొట్టాడు. తోడేలు గిర్రున తిరిగి నేలకూలిపోయింది. కాని సంభాళించుకొని మరలలేచి గ్రుడ్డితనంగా దాడిచేయడానికి ఉద్యమిస్తూన్నప్పుడు యువకుడు మరొకబాణాన్ని తీవ్రంగావిడిచాడు. దెబ్బసరిగా నాటిపోయింది. దానిపని అయిపోయిందని తెలుసుకొని మిగతా తోడేళ్లు దానిచెంతకు పోయాయి. దాని శరీరంనుంచి కారుతూన్న వేడిరక్తాన్ని నాకాయి. రక్తంఅయిపోగానే దాని మాంసాన్నే తిననారంభించాయి.

అవి తిండియావలో పడ్డాయికదాయని మనుష్యులు తమ వేటసామగ్రి నెత్తుకొని మెళకువతో పలాయనం సాగించారు. ఈసారి తల్లి అందరికన్నా వెనుకవుంది. మధ్యమధ్య వెనుదిరిగిచూస్తూ పోతూంది. ఈ రోజు మంచుపడలేదు. అందువల్ల వెన్నెలరాత్రిలో, వారిపాద చిహ్నాలు దారిని చక్కగా చూపించగలవు. వీరిగుహ యింకొక అరమైలు దూరంలోవుంది. ఇంతలోనే వెనుకనుండి తోడేళ్ళగుంపు మళ్ళీ వచ్చిపడింది. వేటనువారు క్రిందపారేసి, ఆయుధాలను సర్దుకొన్నారు. ఈ సారి ధనుర్ధారుడు ఎన్నోబాణాలను విడిచాడు కాని ఒక తృటికాలంకూడా ఒకచోట నిలబడకుండా వున్న తోడేళ్ళను ఏమీచేయలేక పోయాయి. ఎన్నోపేచీలు, పట్టుపట్టిన తరువాత నాలుగుతోడేళ్లు ఒక్కుమ్మడిగా పదునాలుగేండ్ల ప్రాయముగల యువతిపై కురికేశాయ్. పక్కనే నిలిచియున్న తల్లి తనబల్లేన్ని ఒకతోడేలు పక్కలో ఒక పోటుపొడిచి నేలనెట్టి కొట్టేసింది. కాని - - మిగిలిన మూడుతోడేళ్లూ, యువతి తొడను తీవ్రంగా గాయపరచి పడేశాయి. కనురెప్పపాటులో ఆమెపొట్టను చీల్చివేసి ప్రేవులుతోడేశాయి. అందరిదృష్టి అ అమ్మాయిని రక్షించడంలో కేంద్రీకరించి యున్నప్పుడు, మిగతామూడుతోడేళ్లు వెనుకనుంచి 24 సం॥ కుర్రాడిపై దాడిచేశాయి. ఆత్మరక్షణకు ఏ మాత్రం అవకాశం యివ్వకుండా అతనిగుండెలు పగలతీశాయి. వాళ్ళంతా తిరిగి ఆయువకునివైపు చూచేసరికి యిపతల యీ పిల్లని 50 గజముల దూరంలాక్కొనిపోయాయి తోడేళ్లు. ఇచ్చట సగంచచ్చిన తోడేలు దగ్గర ప్రాణాలు విడుస్తున్న యువకుణ్ని తల్లి చూచింది. సగంచచ్చిన ఆతోడేలునోట్లో ఎవడో ఒక కర్రదూర్చాడు. ఇంకొకడు దానిముందుకాళ్ళను రెంటింటినీ పైకెత్తి పట్టుకున్నాడు. మిగిలినవాళ్లు కారుచున్న దానిఉప్పని వేడిరక్తాన్ని లాగారు. దానిగొంతుకాడని కోసి తల్లి యీ పనిని మరింత సులభముచేసింది. ఈ కార్యకలాపమంతా కొద్దినిమిషాల్లోనే పూర్తయిపోయింది. ఆ యువతి దేహాన్ని విచారగించుట ముగించిన తరువాత కాని

తిరిగి తోడేళ్ళు తమపై ఆక్రమణచెయ్యవని చావగా మిగినవాళ్ళకు తెల్సు. ప్రాణావశిష్టుడైయున్న యువకుణ్ణికూడ తోడేళ్ళకు విడిచేసి చచ్చినతోడేళ్ళనూ, భల్లూకాన్ని యెత్తుకొని పరుగారంభించారు. ఎట్టకేలకు గుహ చేరుకున్నారు.

గుహలో అగ్ని కణకణ రాజుతోంది. ఎర్రని ఆ అగ్ని వెలుగులో బిడ్డలూ మొదటి యిద్దరు యువతులూ నిద్రిస్తున్నారు. కాళ్ళచప్పుడు విని ముసలమ్మ వణుకుతూవున్నా, గంభీరమైన స్వరంతో 'నిశా -- వచ్చావా!' అంది.

'ఆ' అని జవాబిచ్చి మొదట ఆయుధాల నొకప్రక్కగా ఒబ్బిడి చేసింది. తరువాత, తనవంటిపై కప్పుకొన్న చర్మమును తీసివేసి దిగంబరియైంది. వేట సామాగ్రిని దింపి మిగతావారుకూడ అదేవిధముగా చర్మపుదుస్తులను తొలగించి అగ్నియొక్క సుఖవంతమైన ఉష్ణస్పర్శను రోమరోమమునకు తగులనిచ్చారి. అప్పటికి నిద్రిస్తున్న యావత్పరివారము మేల్కొన్నది. చిన్నప్పటినుండియు యేమాత్రము చిన్నశబ్దము వినినను మేల్కొనుటకు వీరలవాటు పడియుంటారు. బహుమితముగా వ్యయపరుస్తూ తల్లి యింతవరకు కుటుంబనిర్వహణము చేసుకొని వచ్చింది. లేళ్ళు, దుప్పులు, చెవులపిల్లులు, ఆవులు, గొఱ్ఱెలు, మేకలు, గుర్రములు మొదలగు వేటజంతువులు చలికాలారంభము నాటికి దొరుకుట మానివేస్తాయి. ఎందువల్లనంటే ఇచ్చట తీవ్రమైన చలికి తాళలేక వేడి ప్రదేశమగు దక్షిణానికి అవిపోతాయి. ఈ మనుష్యపరివారముకూడా కొంచెము దక్షిణముపై పు పోవలసివస్తుంది. కాని ఈ రోజున తోడేలుకర్పణమైన యువతి జబ్బుగా నున్నది. ఆనాటి మానవధర్మానుసారం ఒకప్రాణి రక్షణకొఱకు యావత్తు పరివారమునూ ప్రమాదములో పెట్టకుండా ఉండుట యింటియజమానురాలగు తల్లికర్తవ్యం. కాని మాతృహృదయం స్వభావసిద్ధమైన బలహీనతను చూపెట్టింది. దానికి ఫలితముగా ఒకప్రాణికిబదులు రెండుజీవములను కోల్పోవలసివచ్చింది. ఆహారమునకు పనికివచ్చే జంతువులు మరి రెండునెలలు గడిస్తేనేగాని తిరిగి యీప్రాంతమునకురావు. ఈలోపున యింకా యెన్ని ప్రాణములు పోవలసియున్నాయో చూద్దాం. మూడు యెలుగొడ్లతోను, ఒకటి రెండు తోడేళ్ళతోను చలికాలమంతా గడచుట దుర్ఘటం.

పిల్లలు యింతవరకు ఆకలితో పడివున్నారు. వారికి తల్లి తోడేలు గుండెకాయను కోసి ముక్కలుచేసి యిస్తోంది. బిడ్డలు గుటకలువేస్తూ త్వరితంగా తింటున్నారు. చర్మమునకు రాపిడి తగులకుండా నేర్పుతో ఒలిచింది.

ఆ చర్మము ఎంతో ఉపయోగకారికదామరి – బాగా ఆకలిగొన్నవాళ్ళు ముందువచ్చి పచ్చిదే తినేశారు. ఆకలికాస్త చల్లారినపిమ్మట అందరు కలిసి నిప్పులో కాల్చుకొని తిననారంభించారు. కాల్చుకొన్న తమతమ ముక్కలలోనుంచి కొంచెం తినపని అందరూ వంతులువంతులుగా తల్లిని ప్రార్థిస్తున్నారు.

తల్లి —'ఊ. చాలు. ఈవేళ కడుపునిండా తినండి. రేపటి నుంచి యింత దొరకదు' అంది. ఆమె గుహలో ఒక మూలకుపోయి అక్కడ భద్రంగా వుంచిన ఒక తోలుబుర్రను తెచ్చి–'ఇదిగో యింతే వుంది. యివాళ మద్యంత్రాగి నృత్యం చేయండి. క్రీడలు సలుపండి!' అంది. చిన్నాళ్ళకు కొన్ని గుటకలు మాత్రం దొరికాయి. పెద్ద వాళ్ళకు ఎక్కువగా లభించింది. మత్తెక్కిపోయింది. కళ్ళెర్రబారిపోయాయి. పకపక నవ్వులారంభమయ్యాయి. పాట ప్రారంభమైంది. రెండు కర్ర పుల్లలతో పెద్దమగాడు వాద్యమారంభించాడు. మిగతా వాళ్ళంతా నాట్యం మొదలు పెట్టారు. నిజానికది ఆనందమైన రాత్రి. తల్లి రాజ్యమిది. కాని హెచ్చు తగ్గుల తోను, అన్యాయములతోను కూడిన రాజ్యంమట్టుకు కాదు. అవ్వా, పెద్దమగాడు తప్ప మిగిలిన వాళ్ళంతా ఆ తల్లి సంతానమే. ఈ తల్లి పెద్దమగాడు ఏకగర్భజనితులు. మొదటనుంచీ మనం గుహలోచూస్తున్న అవ్వే వీరితల్లి. ఇందువల్లనే నీ, నా భేదం లేదక్కడ. ఆప్రశ్నే రాజాలదు. ఈభేదం రావడావి కప్పటికింకా చాలాకాలం గడవాల్సివుంది. కాని–తల్లికి ఆమె అధీనంలోని పురుషులందరిపైనా సమానాధికారం వుంది. అంతేకాదు, ప్రధమాధికారంకూడా ఆమెదే! 24 సం॥ వయస్సుగలిగిన ఆమె పుత్రుడును భర్త అగువాడు గతించిపోవడంవల్ల ఆమెకు దుఃఖం కలుగుటకు వీలు లేదు. కాని ఆకాలపుజీవితం గతించినదానికంటే, వర్తమాన సుఖానికి ఎక్కువ ప్రాధాన్యత నిచ్చేది. తల్లికి ప్రస్తుతం ఇద్దరు భర్తలు సిద్ధంగానే యున్నారు. 14 సంవత్సరముల వయస్సుగల మూడవవాడు తయారగుతున్నాడు. ఆమెరాజ్యం వుండగానే, ఆమెబిడ్డలలో ఇంకెంతమంది భర్తలుగా తయారు కాగలరో ! తల్లి 26 సంవత్సరముల ప్రాయముగల యువకుని ఎక్కువగా ప్రేమిస్తోంది. అందువల్ల మిగిలిన ముగ్గురు యువతులకు 50 సం॥ల పురుషుడే దిక్కు! చలికాలం ముగియ వచ్చేసరికి ఒకనాడు ముసలమ్మ కాలంచేసింది! చంటివాళ్ళలో ముగ్గుర్ని తోడేళ్ళు పొట్టనెట్టుకున్నాయి. పెద్దమగాడు మంచు కరగడంవల్ల పొంగిన నదీ ప్రవాహంలో ఒకనాడు కొట్టుకొనిపోయాడు. ఈ విధంగా 16 గురు గల పరివారం 9 మందితో నిలచింది.

———

# 3

అది వసంతఋతువు. చాలరోజులుగా మృతప్రాయంగావున్న ప్రకృతిలో నూతనజీవితం ప్రారంభమౌతోంది. 6 మాసములనుంచి ఎండిపోయివున్న భూర్జ వృక్షశాఖలు లేచిగుళ్ళు తొడగనారంభించాయి. మంచుకరగి భూమి పచ్చని గడ్డి మొక్కలతో కప్పబడిపోతూంది. గాలి మూలికల వాసనను వెదజల్లుతోంది. క్రొత్తగా తడిసినమట్టి సుగంధాన్ని వ్యాపింపచేస్తోంది. నిర్జీవదిగంతం సజీవమవుతూంది. వృక్షాల పైన పక్షులు వివిధమైన మధురశబ్దాలను వినిపిస్తున్నాయి. ఘంఘూరపురుగు అనవరతం శబ్దంచేస్తోంది. మంచుకరిగి కాలువలుగా ప్రవహిస్తున్నచోట అంచుల మీద కూర్చొని జలపక్షులు క్రిమిభక్షణం చేస్తున్నాయి. కలహంసలు ప్రణయక్రీడ లాడుతున్నాయి. పచ్చని ఈ అడవిప్రాంతంలో యిప్పుడిప్పుడే లేళ్లు, దుప్పులు, మేకలు, గొఱ్ఱెలు, ఆవులు గుంపులు గుంపులుగా చేరి గంతులేస్తూ మేస్తున్నాయి. వీటిని కబళించడానికి చిరుతపులులు, తోడేళ్ళు మాటువేస్తు తిరుగుతున్నాయి. చలి కాలానికి ఆగిపోయిన నదీప్రవాహంలాగ అక్కడక్కడ నిలిచియున్న మానవ గుంపులుకూడా యిప్పుడు తరలి వస్తున్నాయి. వీరు తమ ఆయుధాల్ని, చర్మ సామగ్రినీ, బిడ్డలను, నిప్పును తీసుకొని ఆరుబయళ్ళకు పోసాగారు. రోజులు గడచిన కొలదియు వనస్పతుల్లోను, జంతువుల్లోను జీవంవచ్చినట్లే మనుష్యుల శుష్క చర్మాల్లో మాంసం, క్రొవ్వూ చేరుకుంటున్నాయి. పెద్దపెద్ద జూలుకలిగిన వారి కుక్కలు మేకలను, గొఱ్ఱెలను వేటాడుకొస్తున్నాయి. మానవులు స్వయంగా తామే పోయి వలలతోను, బాణాలతోను, కర్రబల్లెములతోను వేటాడుతున్నారు. నదుల్లో చేపలు సమృద్ధిగా లభిస్తున్నాయి. ఈ వోల్గానదీ పైభాగంలో నివసించేవారి వలలలో ప్రస్తుతం కావలసినన్ని చేపలు!

రాత్రులందు ఇంకా చలివేస్తోంది. కాని పగలుమాత్రం వేడిగానే ఉంది. నిశా పరివారం (తల్లి పేరు నిశా) ప్రస్తుతం అనేకమైన యితరపరివారములతో పాటుకలసి వోల్గానది ఒడ్డున వుంది. ఈమె పరివారానికి ఈమెయే సర్వాధికారి. ఈ విధంగానే ఇతర పరివారాల్లో కూడా తల్లులదే అధికారం కాని తండ్రులది కాదు. క్రియకు ఎవని తండ్రి ఎవరో? నిర్ణయించుట మాత్రము అసంభవం. 'నిశా'కు జన్మించినవారు మొత్తం 8 మంది కూతుళ్ళు, 6 గురు కొడుకులు. పోయినవాళ్లుపోగా ఆమె 55వ ఏట మిగిలినవాళ్ళ నలుగురు ఆడపిల్లలు, ముగ్గురు మగవాళ్ళను. వీళ్ళంత 'నిశా' సంతానమనుటలో సందేహములేదు. ఉండజాలదు. ఎందుకంటె ఆమె ప్రసవమే

యిందుకు ప్రబల నిదర్శనం. కాని ఈబిడ్డలతండ్రి ఎవరో చెప్పడం అసంభవం. 'నిశా'తల్లి -'ముసలమ్మ'ది రాజ్యంగా ఉన్నప్పుడు అనగా అవ్వ దృఢంగా ప్రౌఢగా నున్నప్పుడు ఆమె కెంతో మంది సోదరులే భర్తలుగను, పుత్రులే పతులుగనువుండిరి. వీరే 'నిశా' యువతిగా నున్నప్పుడు ఆమెతో ఆడి, పాడి, నృత్యముచేసి ఆమె ప్రేమకుపాత్రులగుటలో సఫలీకృతులయ్యారు. ఇక 'నిశా'యే పరివారానికి యజమానురాలైన తరువాత, నిరంతరం మార్పును కోరుతూండిన ఆమె ప్రేమకాంక్షను ఆమె సోదరులుగాని, వయస్సువచ్చిన పుత్రులుకాని తిరస్కరింప సాహసించేవారు కాదు. ఇందుచేతనే బ్రతికియున్న యీ ఏడుగురు సంతానంలోను, ఎవరికెవరు తండ్రియో తెల్పుట అసంభవం. 'నిశా' పరివారానికి యీనాడు ఆమె అందరికన్న పెద్దదీ, ముసలదీ, అధికారిణీకూడాను. ఈ అధికారం యింకెంతోకాలం నిలిచేది కాదు. ఇంకోసంవత్సరంలోనో, రెండుసంవత్సరాల్లోనో యీామె అవ్వకాబోతుంది. 'నిశా' యొక్క కుమార్తెలలో అందరికన్న పెద్దామె 'లేఖా' రాజ్యానికి రాబోతోంది. ప్రతిసంవత్సరం తోడేళ్ళకోరలనుంచీ, భల్లూకాల పంజాలనుంచీ, వోల్గానదీ వరదల నుండి బలికాకుండా పరివారాన్ని రక్షించాల్సినభారం, బాధ్యత యీ యజమానురాలి భుజస్కంధాల మీద పడుతుంది. ఈకర్తవ్య నిర్వహణభారమామెచే. అయినప్పటికీ గతంలో జరుగుతూవచ్చిన ప్రకారం 'లేఖా' చెల్లెండ్రు తమ స్వపరివారాల నేర్పాటుచు కోడానికే సమర్థులు కాగలరు. అనేక వీర్యాలకు ఒకేక్షేత్రమైతే జరిగినట్లే అనేక క్షేత్రములకు ఒకే వీర్యమైతేకూడా పరివారాభివృద్ధి ఆగిపోతుంది.

ఈ కుటుంబీకుల యజమానురాలు 'నిశా' తనపుత్రిక 'లేఖా' వేటలో చాలా సమర్థురాలై ఉండుట గమనిస్తోంది. పర్వతశిఖరాలకు కూడా 'లేఖా' లేడివలె ఎగబ్రాకి పోతోంది. ఇటీవల ఒకనాడు పర్వత శిఖరం చిటాలునొక రాతిపై తేనెపట్టు కనపడింది. అది ఎలుగుగొడ్డులు కూడా యెక్కజాలని ఎత్తులో ఉన్నది. ఆమె కర్రకు కర్రకట్టి వాటి సహాయంతో తేనెపట్టు దగ్గిరికి బల్లిపాకిపోయినట్లు పాకిపోయింది. విషపు అడివి లేనెటీగలను కాల్చివేసింది. తేనెపట్టుకు బెజ్జంపెట్టింది. ఆ అడవి తేనెపట్టునుంచి సుమారు 30 శేర్ల తేనె క్రిందవుంచిన తోలుదొన్నెలో కారింది. 'లేఖా' నెరవేర్చిన ఈ సాహసకృత్యాన్ని ఆమె కుటుంబీకులే కాకుండా, ఇరుగు పొరుగు వాళ్ళుకూడా యెంతో ప్రశంసించారు. 'నిశా' కుమాత్రం 'లేఖా' అంటే హితవులేదు. యువకులగు 'నిశా' పుత్రులు, 'లేఖా' యొక్క సౌంజ్ఞలప్రకారం నృతంంచేయడానికి సిద్ధంగావున్నంతగా 'నిశా' యొక్క ప్రార్థనలనుకూడా వినగోర

దంలేదు. అంతమాత్రాన, ఆమె ఆజ్ఞలను బహిరంగముగా తిరస్కరిస్తున్నారని అర్థం కాదుసూమా !

'నిశా' తనకర్తవ్యాన్నిగురించి ఆలోచించసాగింది. 'లేఖా' నిద్రపోతూ న్నప్పుడు గొంతు పిసికి చంపుదామనికూడ ఆమె తలపోసింది. కాని 'లేఖా' తన కంటె చాలబలిష్ఠమైనదనీ, ఒంటరిగా ఆమెను తానేమి చేయజాలననీ ఆమెకు తెలుసును. ఇతరుల సహాయంతీసుకొని తను ఆపని చేద్దామనుకుంటే యితరులు ఆమెకు ఈ కార్యంలో ఎందుకు తోడ్పడుతారు? పరివారంలోని పురుషులంతా ఏలాగైనా "లేఖా'కు ప్రణయ పాత్రులు, కృపాపాత్రులు కావాలని ప్రాకులాడుతున్నారు. పోనీ 'నిశా' పుత్రికలేమైనా తోడ్పడుతారేమోఅంటే వాళ్ళు 'లేఖా' అంటే విపరీతంగా భయపడుతున్నారు. అందువల్ల వాళ్ళు అందుకు సిద్ధపడ జాలరు. ఒకవేళ వాళ్ళు అపజయులైతే 'లేఖా' తమ ప్రాణాలపై భయంకరముగా పగతీర్చుకొంటుందని వాళ్ళకి తెలుసు.

'నిశా' ఏకాంతంగా ఏమేమో యోచిస్తోంది. అకస్మాత్తుగా ఆమె ముఖం వికసించింది. లేఖాను పడగొట్టడానికి ఏదోయుక్తి తట్టింది.

ఝాము ప్రొద్దెక్కింది. కుటుంబీకులంతా తోళ్ళదేరాల వెనుక దిగంబరులై యెండలో పడుకునీ, కూర్చొనీ చలిదీర్చుకొంటున్నారు, కాని 'నిశా' మాత్రం డేరాకు ముందుభాగంలో కూర్చొనివుంది. ఆమె చెంత 'లేఖా' కొడుకు మూడేండ్ల వాడు ఆడుకొంటున్నాడు. 'నిశా' రెండుచేతుల్లోను, ఎఱ్ఱని 'స్ట్రాబెరీ' పండ్లున్నాయి. ప్రక్కనుంచి వోల్గానదీధార ప్రవహిస్తూంది. భూమి ఏటవాలుగా నీటివరకూఉంది. ఆమె ఒక పండును ఆ వాలులోకి దొర్లించి విడిచింది. కుర్రాడు పరుగెత్తికెళ్ళి పట్టుకొని తినేశాడు. ఆమె అంతటితో ఊరుకోక, మరోపండు దొర్లించింది. ఈ సారి మరికొంచెం దూరం పోయాక పండును పట్టుకోగలిగాడు కుర్రాడు. ఆమె ఎన్నోపండ్లను గజిబిజిగా దొర్లించివేసింది. కుర్రాడు వాటినన్నింటినీ పట్టుకొనుటకు సహజంగా బహు త్వరపడ్డాడు. ఆతొందరలో పాపడు కట్టియున్న ఆ భూమిపై కాలుజారి బిడ్డడు అకస్మాత్తుగా దభీలుని వోల్గా ప్రవాహంలో పడిపోయాడు. 'నిశా' వోల్గావైపునకు మొగంపెట్టి కెవ్వున అరచింది. కొద్దిదూరంలో కూర్చొన్న 'లేఖా' చూచింది. పుత్రుడు కనబడకపోవటంవల్ల ఆమె ప్రవాహంలోకి ఉరికింది. ఆమె బిడ్డడు ప్రవాహంలో బుడగలువేస్తూ పైకీ క్రిందికీ తేలుతున్నాడు. ఆమె ఒక్క

దాటేసి పిల్లాణ్ణి చేజిక్కించుకోగలిగింది. నీరు ఎక్కువగా త్రాగివేయుట వల్ల కుర్రాడు సోలిపోయాడు. వోల్గాలోని మంచునీరు శరీరముపై ముల్లువలె గ్రుచ్చుకుపోతూంది. అంత చల్లగావుంది. 'రేఖా'కు ప్రవాహాన్ని యీదుకొని ఒడ్డుకు చేరుట కష్టంగావుంది. ఒకచేతిలో బిడ్డడున్నాడు. రెండవచేతితోను, కాళ్ళతోను, ఈదుటకు ప్రయత్నిస్తోంది. ఇలాంటి సమయంలో తన కంఠం ఎవరివో బలమైన చేతుల మధ్య చిక్కుకుపోతూన్నట్లు గ్రహించింది. అర్థంచేసుకోడానికి ఆమె కిప్పుడు ఆలస్యంకాలేదు. కొంతకాలంగా 'నిశా'యొక్క ధోరణిలోని మార్పు ఆమె చూస్తూనే వుంది. 'నిశా' నేడు తన మార్గంలో కంటకంగావున్న యీ 'రేఖా'ను తొలగించడానికి కంకణం కట్టుకుంది. ఇప్పుడు కూడా 'రేఖా' తన శక్తిసామర్థ్యాలనూ, బలాన్నీ చూపించగలదు. కాని ఆమె చేతిలో చంటిపిల్లవాడున్నాడు. 'రేఖా' బలాన్ని ఉపయోగిస్తుందని తెలుసుకొని 'నిశా' తన యావత్తు శరీరభారాన్ని రేఖాపై వేసేసింది. తన బొమ్మ 'రేఖా' నెత్తినవేసి అదుక్కు త్రొక్కేసింది. 'రేఖా' ఒకసారి మునిగిపోయింది. నీళ్లలో కాళ్ళూ, చేతులూ కొట్టుకోవడంతో బిడ్డ చేయి జారిపోయాడు. ఇప్పుడుకూడా 'నిశా' యింకా 'రేఖా'ను వివశురాలుగా అదిమిపట్టి వుంచింది. ఇంతలో అకస్మాత్తుగా 'రేఖా' పైకివచ్చి 'నిశా' మెడను చుట్టేసుకుంది, రేఖా స్పృహతప్పియుంది, ఆమె బిగువువల్ల 'నిశా' ఈదుటకు అసమర్థరాలై పోయింది. అయినా ఆమె మరికొంత ప్రయత్నంచేసింది. కాని నిష్ప్రయోజనం! ఇద్దరూ ఒకేసారి వోల్గాకు బలియైపోయారు.

వారిలో బలిష్ఠయైన 'రోచన' నిశా పరివారపు యజమానురాలైంది.

---

*[నేటికి 361 పురుషాంతరాలకు పూర్వపుకథ. అప్పుడు భారత, ఈరాను, యూరోపియ జాతులన్నీ ఒకగుంపు (కబీలా) రూపంలో వుండినవి. మానవత్వానికిది ఆరంభకాలం.]

# "దివా"

## (రెండవ కథ)

[ప్రదేశము-వోల్గాతీరము (మధ్యభాగం); జాతి-హిందూస్లావ్;
కాలం-క్రీస్తుకు 3500 సంవత్సరాల పూర్వం.]

'దివా! ఎండ చాలా తీవ్రంగావుంది. నీకెంత చెమటబట్టిందో చూడు. రా, ఇక్కడ రాతిపై కూచుందాం'.

'సరే.' అని దివా సూరశ్రవునితోపాటు విశాలమైన దేవదారు వృక్షచ్ఛాయలో రాతిపై చతికిలపడింది.

అసలే గ్రీష్మఋతువు. అపర్ణపువేళ. సూర్యుడు నిప్పులు గ్రక్కుతున్నాడు. మీదుమిక్కిలి మృగాలని వెంబడించడం! అట్లాంటప్పుడు దివా లలాటంపై శ్రమ బిందువులు ముత్యాల్లా రాలకుండా ఎట్లా వుంటాయి? కాని వారి ఆయాసం త్వరలో తీరి పోవడానికి అనువైన స్థలం యిది. పర్వతం ఆ పాదము స్తకంపచ్చికతో కప్పబడివుంది. విశాలమైన దేవదారు వృక్షాలు తమశాఖల్ని, చిగుళ్ళని అడ్డుగా బెట్టి సూర్యకిరణాలను ఆపుతున్నాయి. నేలపైన వివిధరకాల మూలికలు, లతలూ, చిన్న చిన్న మొక్కలూ వున్నాయి. కొంచెంసేపు కూర్చోగానే యీ యువతీ యువకులు తమ అలసటను మరచిపోయారు. నలువైపులావున్న పూలమొక్కలూ, వాటి సువాసన వారినెంతో ఆకర్షించాయి. యువకుడు తన ధనుస్సునీ, బాణాలనీ, పాషాణపరశు (రాతిగొడ్డలి) నీ దగ్గిరగావున్న రాతిపైబెట్టాడు. స్ఫటికంలాంటి తెలుపుతో ప్రక్కనే ప్రవహిస్తున్న జలప్రవాహం ఒడ్డున ఎన్నో పూల మొక్కలు వున్నాయి. వాటినుండి వంగపండు రంగు పూవులూ, తెల్లనివీ, ఎర్రనివీ యువకుడు కోయనారంభించాడు. యువతి కూడ తన ఆయుధాల్ని క్రిందబెట్టి తన పొడుగైన బంగారువన్నె గలిగిన కుచలను వ్రేళ్ళతో సవరించుకొంటోంది. జడలింకా తడిగానేవున్నాయి. ప్రవహిస్తున్న వోల్గా ధారవైపుకు ఆమె ఒక మారు చూచింది. ఇంతలో పక్షుల మధురకలరవము లామెను ఒక క్షణం తమవైపు కాకర్షించాయి. వంగి పువ్వులుకోస్తున్న యువకునిపై ఆమె దృష్టి ప్రసరించింది. అతని కేశములు కూడ బంగారుఛాయగలవే. కాని వాటిని

తన కేశములతో ఆమె పోల్చజాలదు. అవి ఆమెకు యెక్కువ అందంగా వున్నాయి. యువకుని నూనూగుమీసం బూడిదరంగు కలిగి దట్టంగావుంది. దానికి పై భాగంలో అతని ముక్కూ, బుగ్గలూ, లలాటం యొక్క ఎఱుపు ఛాయ చక్కగా కన్పడుతున్నాయి. తరుణిదృష్టి అతని భుజాలపైకి మరలింది. బలిష్ఠగాను రోమయుతంగాను వున్నాయి భుజాలు. ఆమధ్యనే ఒకనాడు ఇతడు దంతాలుకల ఒక క్రూరమైన అడవిపంది నడుమును తన రాతిబల్లెంతో ఒక్కదెబ్బతో విడగగొట్టేసిన సంగతి జ్ఞప్తికివచ్చిం దామెకు. ఆభుజాలే ఆరోజు నెంత కర్కశంగావున్నాయి? యీవేళ పువ్వులేరడంలో నెంతకోమలంగా అగుపిస్తున్నాయి? వాటి చాటు చాటున దాగుడుమూతలాడుచూ అప్పుడప్పుడు పైకి గంతులువేస్తున్న అతని కండరాలూ, పైకుబుకుతూన్న నరాలూ, అతని బలాన్ని ఇప్పుడు కూడా చాటుతూనేవున్నాయి. ఆభుజాల నొకసారి పోయి ముద్దాడు దామా అనిపించిదామెకు. అపును. ఈ సమయంలో ఆమె కవి అంత అందంగానూ ప్రియంగానూ తోచాయి. కొంచెంసేపటిలోనే దివా దృష్టి యువకుని తొడలపైబడింది. అడుగడుక్కి తొడల కండరాలు నాట్యంచేస్తున్నాయి. నిజంగా క్రొవ్వులేని మెలికలు తిరిగిన కండరాలతో కూడిన అతని తొడలు, చక్కని అతని పిక్కలూ, సన్నని అతని మోకాటి చిప్పలూ దివాకు అద్వితీయంగా కనిపిస్తున్నాయి. 'సూరశ్రవుడు' దివా ప్రేమను పొందడానికి మాటల్లో కాక చేతల్లో చాలసార్లు తన వాంఛను వెల్లడించాడు. నాట్యాలలో అతడనేక సార్లు తన కౌశల్యమునుచూపి దివాను ప్రసన్నరాలుగా చేయగోరాడు. దివా అనేక మంది యువకులతో నాట్యంచేసింది. ముద్దులు పెట్టింది. తన సర్వస్వం వారికి అర్పించింది. కాని పాపం సూరి, ఒక్క ముద్దుకు, ఒక్క ఆలింగనానికి, అంత ఎందుకు ఒకసారి చేయికలిపి దివాతో నృత్యం చేయదానికికూడా నోచుకోలేదు యింతవరకు-

ఇప్పుడు సూరి తనదోసిలి పుష్పాలతో నింపుకొని దివావైపు కొస్తున్నాడు. అతని నగ్నాంగాలు ఎంత పరిపూర్ణంగా వున్నాయి! అతని విశాల వక్షస్థలం, క్రొవ్వుతో నిండినది కాక చక్కని పలుచని కండరాలతో కూడిన అతని సన్నని ఉదరం ఎంత మనోహరంగా వున్నాయి! ఇంత వరకూ ఇతనిని లక్ష్యపెట్టక పోతినే యని ఆమె ఎంతో వగచింది. కాని వాస్తవానికి దీనిలో దివాతప్పేమియూ అంతగా లేదు. తప్పంతా సూరి తననోటికి వేసికున్న సిగ్గు అనే తాళానిదే. తలుపు కొట్టిన వానిని దివా ఎన్నడూ కాదని ఎరుగదు.

సూర్యశ్రవుడు దగ్గరకు రాగానే దివా చిరునగవుతో 'ఎంత అందంగాను సువాసనగానూ వున్నాయియాపూలు!'

సూరి పూలను రాతిపై పెట్టుతూ 'వీటిని నేను నీరంలో పెట్టినపుడు మరింత సౌందర్యంగా వుంటాయి'

'ఐతే నీవు నాకోసమేనా యీపూలు తెచ్చింది?'

'అవును, దివా! యీ పువ్వులను చూచాను. నిన్ను చూచాను. ఇంతలో జల పక్షులు వచ్చికొచ్చాయి.'

'జల పక్షులా?'

'అవును బహుసుందరమైన జలపక్షులు. వాటికి సంతోషమొస్తే యాపక్మనో వాంఛలను తీరుస్తాయి. కోపమొస్తే ప్రాణాల్ని నయిలం చేస్తాయి.

'ఐతే సూరీ! నన్ను ఎటువంటి జల పక్షినని తలుస్తావు?'

'కోపించవుకదా?'

'నీతో నేనెన్నడూ సంతోషించలేదుగా!' దివా దీర్ఘశ్వాస విడచి మౌన ముద్ర వహించింది. సూరి తిరిగి చెప్పనారంభిస్తూ 'కాదు దివా! నీ వెన్నడూ నాపై ఆగ్రహించలేదు. మనచిన్న నాటి రోజులు గుర్తున్నాయా?'

'అప్పుడుకూడా నీవు చాలా సిగ్గుపడేవాడవు.'

'కాని నీవు అప్పుడు నాపై కోపించేదానవు కావు'

'నిన్ను నేనే ముద్దెట్టుకొనేదాన్ని!'

'అవును ఆ ముద్దాడడం నాకు బహుప్రీతిగా వుండేది!'

'కాని యీ, నా గుండ్రని స్తనాలు వికసించ నారంభించాక యువక బృంద మంతా నాముఖం ఆశాపూరిత దృక్కులలో చూడనారంభించాక, నేను నిన్ను మరచి పోయాను' అని దివా కొంచెం ఖిన్నురాలైంది.

'కాని దివా! దీనిలో నీదోషమేమీలేదు'

'తప్పు ఎవరిది?'

'నాదంటాను. ఏమంటావా, మిగిలిన యువకులంతా నిన్ను ముద్దులడిగారు. నీవిచ్చావు. ఆలింగనాలడిగారు నీవిచ్చావు. వేటలో చతురులూ, నృత్యంలో నిపుణులు, బలీయులు, సుందరులూ అయిన యువకుల ఆశలను నీవు భంగపరచలేదు.'

'కాని సూరీ! నీవూ వాళ్ళలాగానేకాదు. వాళ్ళకన్న చతురుడవు, నిపుణుడవు, సౌందర్యవంతుడవు అయిన యువకుడవు. నీయాశలను నేను భగ్నపరచాను.'

'దివా! కాని నా ఆశలను నేనెన్నడూ వెల్లడించలేదు.' చిన్ననాడు మన మాటుపనేటప్పుడు కూడ వెల్లడించేవాడిని కాదు. అని దివాకు తెలుసును. 'యీనాడు దివా సూరిని మరచిపోయింది. యీ దివా (పగలు) ఆ ప్రకాశిస్తున్న సూరి (సూర్యుడు)ని మరచిపోతుందా? ఇప్పుడు నిన్ను మరువదు.'

'అయితే నేనదే సూర్యుడుగానూ, నీవదే పగలుగాను ఉందాం.'

పసిబిడ్డలలాంటి యీ నగ్నసౌందర్యమూర్తులు తమ అరుణా ధరాలను కలిపేశారు. విష్ణుకాంత పుష్ప రేఖల్లాగున నీలిరంగుతో పొడవుగావున్న కనురెప్పలను దివా అదేవిధంగావున్న సూరినేత్రాలలో గుచ్చుతూ, 'మనం ఏకగర్భజనితులం. నిన్ను నేను మరచిపోయా' దివాకళ్ళు చమర్చాయి. వాటిని సూరి తనబుగ్గలతో తుడుస్తూ— 'లేదు దివా! నీవు నన్ను మరచిపోలేదు! నీకు యీడురాగానే నీవాణీ, కండ్లూ, అంగములూనాకేమొ యితరంగా కనుపించాయి. అందువల్ల నేనే దూరంగా తొలగివుండ నారంభించాను.'

'బుద్ధిపూర్వకంగా కాదు. ఇకనుంచయినా నాదగ్గిర సిగ్గు పడవుకదా!'

'సిగ్గుపడను. సరే' అని ఒక కమ్మనుంచి నారపోచనుతీసి దానికి రంగు రంగు పూలు గుచ్చనారంభించాడు. పూలవడున బహుచక్కగా తయారుచేసాడు. తల వెంట్రుకలనుసద్ది ఆమె పీపుపైన పరిచాడు. వేసవిలో యువతీ యువకులు తరచు వోల్గానదీ జలక్రీడలతో ఆనందిస్తూండేవారు. యిందుచేత దివా కేశాలు మృదువుగా పరిశుభ్రంగా వున్నాయి. వాటిపైన నిడుపాటి పాపిడితీర్చిదిద్ది, మధ్యగా తెల్లపువ్వుల గుత్తినీ, యిరుప్రక్కలా వంగపండు పుష్పాలగుత్తుల్నీ వ్రేలాడవేసి

మధ్య వెండ్రుకలను ముడివేశాడు. దివా రాతిబండపై నట్టే కూర్చొనియుంది. సూరి నాలుగడుగులు వెనక్కివేసి, ఆమె ముఖాన్ని తిలకించాడు. అతనికది బహు అందంగా తోచింది. మరి కొంచెం వెనక్కిపోయి చూచాడు. మరింత సౌంద ర్యంగా తోచింది. కాని అంతదూరానికి పూలవాసన లభించటంలేదు. సూర్, దివా దరిచేరి తన బుగ్గలను ఆమె చెక్కిళ్ళకు చేర్చాడు. దివా తన సహచరుని కళ్ళను ముద్దెట్టుకుంది. తనకుడిచేతి నారని భుజంపై వేసింది. సూర్ తన యెడమచేతిని ఆమె కటికిచుట్టివేస్తూ, 'దివా! యీ పుష్పాలు నీసాంగత్యంవల్ల మరింత అందంగా వున్నాయి.'

'పుష్పాలా? నేనా?'

సూరి కేమిజవాబు తోచక కొంచెంఆగి—'నేను కొద్దిగా దూరం వెళ్ళి నిను చూచాను. నీవు ఎక్కువ అందంగా కనుపించావు. మరీ కొంచెం వెనక్కివెళ్ళి చూచాను మరింత సౌందర్యంగా కనపడ్డావు!'

'వుహు! అంతదూరాన్నుండి వద్దు—'

'వోల్గాతీరంనుంచి చూస్తే?'

సూరికళ్ళలో విచార రేఖలగు పడ్డాయి. 'దూరాన్నుంటే సుగంధం పోతుంది; రూపంకూడ లోపించిపోతుంది.'

'సూర్! అయితే, దూరాన్నుంచా దగ్గిరనుంచా?'

'దగ్గిరనుంచే దివా! ప్రకాశిస్తున్న పగలు చెంతనే సూర్యుడున్నట్లే'

'నేడు నాతో నృత్యంచేస్తావా? సూరీ'

'తప్పక'

'అయితే ఈ రోజు నేను మరోయువకుని వద్దకు వెళ్ళను.' అని దివా సూరిని గాఢాలింగనం చేసుకుంది.

యింతలో ఎంతో మంది యువతీ యువకులు వచ్చారు. కాని వారుమాత్రం ఒకరినొకరు కౌగలించుకొనే వుండిపోయారు. వాళ్ళంతా దగ్గరకొచ్చి 'దివా! ఇవాళ నీవు సూరిని సఖునిగా చేసుకొన్నావా?'

ముఖంవారి వంకత్రిప్పి—'అవును! యివిగో చూడండి యీపూలు సూరి నా కలంకరించాడు.'

ఒక తరుణి:- 'సూర్ ! నువ్వు బహుచక్కగా అలంకరిస్తావే ! నాకుకూడా అలంకరించవూ ?'

దివా :- 'యీవేళకాదు. నేడు రేపు సూరి నావాడు.'

తరుణి :- 'సూరి రేపు నావాడు.'

దివా :- 'రేపా? రేపుకూడా సూరి నావాడే!'

తరుణి :- 'రోజూ నీవాడేనా ! యిది సమంజసమా ?'

దివా తనతప్పును గుర్తిస్తూ — 'అక్కా ! రోజూకాదు. యీవేళా రేపు మాత్రమే!'

నెమ్మది నెమ్మదిగా యెండలో వేటకాండ్రు చేరారు. ఒక నల్లని పెద్దకుక్క దగ్గరకొచ్చి సూరి కాళ్ళను నాక మొదలెట్టింది. సూరికిప్పుడు తను వేటాడిన గొర్రె గుర్తుకొచ్చింది. దివా చెవిలో ఏదో చెప్పి అతడు పరుగెత్తాడు.

---

## 2

తడకల ఆవరణతోను గడ్డి కప్పులతోను ఒక విశాలమైన చావడి. రాతి గొడ్డళ్ళు పదునుగావున్నా వాటితో యింతకలప నరకడం సాధ్యంకాదు. అప్పటి వాళ్ళు కర్రా, కలపా కోయుటకు అగ్నిసహాయంకూడా తీసుకున్నారు. కాని రాతి గొడ్డళ్ళు కూడా ఉపయోగించాయి. సందేహంలేదు. మరి యీ చావిడి చాలాపెద్దది! దీనిలోనే నిశావంశీకులు నివశిస్తున్నది. యీ గుంపంతా ఒకేకప్పుక్రింద నివసిస్తూ, కలసి వేటాడుతూ, కలసే ఫలాల్నీ మధువునూ ప్రోగుచేస్తూంది. యావత్తు ముఠాకీ ఒక నాయిక—యజమానురాలు. వీరందరి వ్యవస్థనూ నడిపేది ఒక జన సమితి. యీ సంఘంనుంచి వ్యక్తుల జీవితంయొక్క ఏ అంశమూ వేరుకాదు.

వేట, నృత్యమూ, ప్రేమ, యిళ్ళు కట్టడం, ధరించడానికి యోగ్యంగా తోళ్ళను తయారుచేయడం మొదలగు యావత్తు కార్యకలాపం జనసమితి చేస్తుంది. వసులలో తల్లులది ప్రాధాన్యత. నిశా వంశీయులు నూటయాభై మంది స్త్రీపురుషులు యీ గుడిసెలో నివసిస్తున్నారు. అయితే వీళ్ళంతా ఏక కుటుంబీకులే అనటి లేక అనేక మనికూడా చెప్పవచ్చు, ఎందుకంటే తల్లి జీవించియుండగా ఆమె సంతానమంతా ఒకే కుటుంబం. వ్యక్తులంతా ఆతల్లి పేరుతో పిలువబడతారు. ఉదాహరణకు— దివా తల్లి లేకపోయినప్పుడు తానే స్వయంగా అనేక బిడ్డల తల్లియైనపుడు, ఆసంతానం దివాసూనులు (దివాపుత్రులు). దుహిత అనగా (దివాపుత్రి) లనీ పిలువబడతారు: అయినా దివా సంతానానికి స్వంత ఆస్తి (పండ్లు, మాంసము) వుండదు. కుటుంబంలోని స్త్రీ, పురుషులు కలసి పనిచేసి అందరూ కలసి అనుభవిస్తారు. అవసరమైతే కలసి వస్తుంటారు. ముఠాను కాదని వ్యక్తులకు ప్రత్యేకంగా ఏవిధమైన ఆస్తులు వుండవు. ముఠా ఆజ్ఞలు, దాని రీతిరివాజులూ, పాలించడంలో వ్యక్తులు వారి కోరికల్ని పాలించినట్లే భావిస్తారు.

మరి కుటీరమో! తాత్కాలికమైనదే! వేటజంతువులు దూరంగా పోయినా, పరిసరాల్లో కందమూలఫలాలు లోపించినా, యావత్తుముఠా మరొకచోటికి తరలిపోతుంది. తరతరాల అనుభవంవల్ల వేటజంతువులు ఎచ్చటనుంచి ఎచ్చటికి చేరగలవో వారికి తెలుసు. ఈ ప్రాంతాలు విడచిపోయాక వాటిపై కప్పు, గడ్డి పడిపోతుంది. కలపా, రాతిగోడలు కొన్ని వత్సరాలు మిగులుతాయి. క్రొత్త చోటికి వెళ్ళి అక్కడ యిండ్ల గోడలపై తిరిగి కప్పువేసి సామాను పెట్టుకోవడానికి, వంటకేర్పాటులతో క్రొత్తయిళ్ళు తయారుచేస్తారు. ఒకసారి పచ్చిమాంసాన్ని, యింకోసారి కాలామాంసాన్ని కాల్చి తింటారు. కాని ఎండినదాన్ని కాల్చడం నిషేధం. వోల్గాయొక్క యీప్రాంతంలో తేనె పుష్కలంగా వుంది. యిందుచే మధుభక్షులగు భల్లూకాలు గూడ యిచ్చట మెండు. నిశాకుటుంబీకులు మధువుకు పడిచచ్చేవాళ్ళు. తేనె, మద్యం మత్తు పదార్థంగా వారికిష్టమే.

స్త్రీలు, పురుషులూ మధురంగా పాడుతున్నారు. వస్త్రాలుగా తోళ్ళను వాడి బాగుచేయుటలేదు. మానవుడు ప్రతిపనినీ సాముదాయకంగా చేస్తుండడమే కాక మనోరంజకంగా వుండడానికి కూడా చేస్తున్నాడు. కలసి చేసేపనిలో పాట పాడటం ఒక అంగం. పనియొక్క శ్రమను సంగీతంలో మరచిపోతారు. కాని

మనము ప్రస్తుతం వింటూన్న సంగీతం పనిచేసేటప్పుడు పాడేవిలాలేదు. ఒకసారి స్త్రీల కోమల కంఠాల్లోంచి మృదువైన రసవత్తర రాగం: యింకోసారి పురుష కంఠాల నుంచి గంభీరమైన కఠిన-శధ్వని వినవస్తోంది. రా, పోయిచూద్దాం.

మఠాలోని స్త్రీ పురుషులూ, పెద్దలూ, చిన్నలూ, యువతీ యువకులూ మధ్యంలోని ఒక భాగంలో చేరారు. యింటికప్పు మధ్యలో కోసివేయబడివుంది. దానికి సరిగ్గాక్రింద భూమిపై దేవదారుకర్రలతో అగ్ని మండుతోంది. స్త్రీ' పురుషులు పెద్ద గొంతులతో ఏమో పాడుతున్నారు. మనకు వినబడుతున్న శబ్దాలు 'అ-అ-గి-అ-అగినీ-అగ్ని-దేవతా'

వీరంతా అగ్నిని ప్రార్థనచేస్తున్నారా? అదుగోచూడు, జననాయికా, జనసమితి నిర్వాహకులూ, అగ్నిలో మాంసమూ, క్రొవ్వు, పండ్లు, తేనె విడుస్తున్నారు. మానవులకు యీసారి బాగా వేట లభించింది. ఫలాలు, మధువు, పుష్కలంగా వున్నాయి. జంతువులనుండీ, శత్రువులనుండీ వారికి హాని కలుగలేదు. అందుచేతనే మానవులు నేడు, పౌర్ణమినాడు అగ్ని దేవునియడల తమ కృతజ్ఞతను వెల్లడి చేస్తూ, పూజార్చనలు చేస్తున్నారు. జన-నాయిక యిప్పుడే, సురారూపంలోనున్న మధువులో నింపిన ఒక గిన్నెను అగ్నిహోత్రుని కర్పించింది. మనుష్యబృందమంతా లేచి నుంచున్నారు. చంటిబిడ్డలవలె అంతా నగ్నంగా వున్నారు. చలి లేదు. మలమలలాడుతూన్న ఈ ఉక్కలో తన చర్మాన్ని ఇంకొక చర్మంతో కప్పడం అపభ్రంశంగా తలుస్తున్నారు. కాని వీరి శరీరాలు ఎంత సౌందర్యంగా వున్నాయి? వీళ్ళలో ఒక్కరికేనా పొట్ట పెరిగిందా? క్రొవ్వు ఎవ్వరి శరీరాన్నైనా పొంగించిందా? లేదు. దీన్నే సౌందర్యమంటారు. ఆరోగ్యమంటే యిదే. వీరందరి ముఖాకృతులూ ఒకేలాగున్నాయి. వీళ్ళంతా నిశాగర్భజనితులు. ఆమె తండ్రివల్లా, సోదరునివల్లా, పుత్రునివల్లా జన్మించినవారు. అందరూ ఆరోగ్యవంతులూ, బలిష్టులూనూ. దుర్బలుడైన వ్యక్తి ఈ జీవితంలో, ఈ పశుజగత్తు యొక్క శత్రుత్వంలో యీ ప్రకృతిలోను బ్రతుకుట దుర్లభం.

నాయకురాలు లోపలికి వెళ్ళింది. మట్టితో అలికిన నేలపై అంతా కూర్చున్నారు. మధువు గూనలలో వస్తోంది. కొందరి దగ్గర పుర్రెతో చేయబడిన గిన్నెలు, మరికొందరివద్ద కొమ్ము గిన్నెలూ, యింకా కొందరివద్ద ఎముకల పాత్రలు, కొందరివద్ద దేవదారు పత్రపు దొన్నెలు వున్నాయి. యువతీ యువకులు

జోడాలుగా కూర్చొని సురాపాన గోష్ఠిలో మునిగివున్నారు. కాని నియమ విరుద్ధం. తమ యవ్వనంలోవలెనే యిప్పటి యువతులు పూర్తిగా ఆనందం అను భవించాలనీ ముసలమ్మల వాంఛ, కొంధరు తాతలకు యెంతో మంది యువతులు మాత్రం ఆఖరి అమృత గుళికలను త్రాగిద్దామని వాంఛిస్తున్నారు. అదిగో చూడండి దివాను. ఆమెవద్ద ఎంతో మంది యువతీ యువకులు కూర్చొని వున్నారు. ఆమె చెయ్యి ఋభుని భుజంపై వేసివుంది. సూరి చమూరో కూర్చున్నాడు. భోజనం, పానం, గానం, నృత్యం, శయనం అన్నియూ అచ్చటనే. దినమంతా వారందరు తమతమ నియమము ప్రకారము పండ్లు తెచ్చుట, వేటాడుట, మొదలగు గృహ కృత్యములు నెరవేరుస్తారు. పిల్లలు యిసుక తిన్నెలపై సంతోషముతో ఆడు కొంటారు.

వృద్ధులందరూ నిశారాజ్యంలోకంటె ఇప్పుడు ఎక్కువ సుఖంగానూ, సంతుష్టిగానూ వున్నారు. ప్రస్తుతం జీవించివున్న ఒక్క తల్లి యొక్క ఏకైక రాజ్యం కాక, అనేకమంది మాతలయొక్క పరివారాలు కుటుంబాలువున్న ముఠాగావుంది, జనసమితియొక్క శాసనం. యిందు వల్ల ఏ నిశా కూడా తన లేఖాను వోల్గాలో ముంచివేయవలసిన పని లేదు.

---

## 3

దివాకు నలుగురు కుమారులు ఆయిదుగురు కుమార్తెలు కలిగారు. 45 వ ఏట ఆమె నిశా కుటుంబానికి జననాయిక అయింది. గత పాతికేండ్లలో నిశా పరివారం మూడురెట్లు పెరిగింది. యిందుకు సూరి దివా అధరాల్ని ముద్దాడి అభినందించినప్పుడల్లా ఆమె 'యిదంతా అగ్నియొక్క దయ. యిది భగవంతుని ప్రతాపం. అగ్నిని శరణు జొచ్చిన వానికి అన్నివైపులా మధువు వోల్గా నదీ ధారలాగున ప్రవహిస్తుంది. అతని వనంలో అన్నిరకముల జంతువులు మేస్తాయి' అంది.

నిశాజనసమూహానికి చాలాకష్టంగావుంది. కారణం స్థలంబాధ లేక పోయినా ఇప్పుడు మూడు రెట్లు మృగక్షేత్రం అధికంగా కావలసి వస్తున్నందువల్లనే! యీ

సమూహం నేడు ఏస్థలంలో తమదేరాను వేసు కొన్నారో దానికి ఉత్తరంగా ఉషా జన సమూహానికి చెందిన మృగక్షేత్రం (వేటస్థానం) వుంది. వీరిద్దరి మృగక్షేత్రా లను మధ్యన కొంత ఎవరికీ చెందని వనప్రాంతంవుంది. నిశా జనసమూహం ఎవరికీ చెందని యీ క్షేత్రంలోకి వెళ్ళడమేకాక ఉషాజనానికి చెందిన క్షేత్రంలోనికి కూడ చాలాసార్లు వేటకెళ్ళింది. వీరిజనసమితి ఉషా జనసమూహంతో పోరాటం రావచ్చుననే సంభావ్యతను గుర్తించింది కాని వేరే ఉపాయంతోచలేదు. దివా ఒకరోజున సమితితో 'భగవంతుడు యిందర్నీ సృజించాడు. వీళ్ళకొరకే యీ అడవులు. యీ వనాలను విడచి వీరి పోషణకు ఆహారం యివ్వలేము. యీ వోల్గానదిలోని చేపలను విడువ జాలనట్లే నిశాజనసమూహం ఈ అడవులలోని భల్లూకాల్ని, ఆవుల్ని, గుఱ్ఱాల్ని కూడా విడువజాలదు.'

ఉషాజనసమూహం నిశాజనంచేస్తున్న యీ దురన్యాయాన్ని చూసింది. వీరి జనసమితి నిశాజనసమితితో సంభాషణలు జరిపింది. తేట తెల్లంగా యీలాగున నచ్చచెప్పింది.– 'ఆదికాలంనుంచి మన రెండు సమూహాల మధ్యను ఎప్పుడూ యుద్ధం జరగలేదు. మనం ప్రతిశరదృతువులోనూ యిచ్చటికి చేరివుంటూవచ్చాం'... కాని ఆకలితో చచ్చి న్యాయం నడపడానికి నిశాజనం యెట్లాసిద్ధపడుతుంది? అన్ని చట్టాలు విఫలమైనప్పుడు, అడవి చట్టాల్ని శరణువేడుక వలసివస్తుంది. యిరు పక్షాలూ లోలోపల దీనికై సిద్ధపడ నారంభించాయి. ఒకరిజాడ యింకొకరికి తెలియడం సాధ్యంకాదు. ఎందువల్లనంటే, ప్రతి ఒక్కరూ కూడ, తమతమ వివాహాది కార్యాలూ, చావు బ్రతుకులూ తమముతా లోపలనే చేసుకుంటూ వుండెడివారు.

నిశాజనసమూహం యొక్క ఒకముఠా యితరమృగక్షేత్రంలోనికి వేట కెళ్ళారు. ఉషాజనసమూహం మాటేసుకు కూర్చొని వున్నారు. వారు దాడిచేసే శారు. నిశాజన సమూహం కూడా నిలబడి పోరేరు. కాని వీళ్ళుబాగా సిద్ధపడి తగినంత మంది రాలేదు. యెంతో మంది చచ్చిన వాళ్ళనక్కడ విడిచేసి, యెందరో గాయపడ్డ వాళ్ళను తీసికొని పారిపోయారు. యీ సంగతి జననాయిక వింది. జన సమితి దీనిపై యోచించింది. సర్వసాధారణసభ – యావత్తు స్త్రీ పురుషులతో కూడిన పెద్దసభకూడింది. విషయమంతా చచ్చిన వాళ్ళ పేర్లతో సహ తెలిపారు. గాయపడ్డవాళ్ళను ఎదురుగా పెట్టి చూపించారు. సోదరులూ, తోబుట్టువులూ, కుమార్తెలూ జరిగిన అన్యాయానికి పగతీర్చుకోవాలని జనసమూహాన్ని హెచ్చరిం

చారు. రెచ్చగొట్టారు. హత్యలకు ప్రతీకారం చేయకపోవటం ప్రజాధర్మానికి అత్యంత విరుద్ధకార్యం. మనుష్యుడు ప్రజాధర్మవిరుద్ధమైన ఏకార్యాన్ని చేయజాలడు. హత్యలకు బదులు తీర్చుకోవాలని జనసమూహం ఏకగ్రీవంగా తీర్మానించింది.

నృత్యవాయిద్యాలు రణభేరీలుగా మారిపోయాయి క్షణంలో-బిడ్డల్ని వృద్ధుల్ని రక్షించడానికి కొద్దిమంది స్త్రీ పురుషులు తప్ప, మిగిలిన వాళ్ళంతా బయల్దేరారు. వారి చేతుల్లో ధనస్సులూ, రాతిగొడ్డళ్ళూ దుడ్డుకర్రలూ, బడితెలువున్నాయి. వారు తమ శరీరాలకు దళసరైన చర్మాలను కవచాలుగా తొడుక్కున్నారు. ముందు డప్పులు మ్రోగుతూ పోతున్నాయి. వెనుక సాయుధులగు స్త్రీ పురుషులు సాగి పోతున్నారు. జననాయిక దివా అందరికన్నా ముందుంది. భేరీవాయిద్యాలు చాలా దూరం వరకూ వినిపిస్తున్నాయి. జనుల కోలాహలంలో అరణ్యం ప్రతిధ్వనించి పోతోంది. పశువులూ, పక్షులూ, భయంతో అటునిటు పరుగెత్తు తున్నాయి.

తమ స్వక్షేత్రాన్ని విడిచి వారు ఎవరికీ చెందని క్షేత్రంలో ప్రవేశించారు. సరిహద్దు చిహ్నాలు లేకపోయినప్పటికీ, ప్రతి వేటగాడు తన సరిహద్దున్నెరుగును. దానికోసం అసత్యమాడజాలడు. అసత్య మనేది మనుష్యుని కింతవరకు ఒక అపరి చితమైన వస్తువుగానూ, కఠిన విద్యగానూ వుంది. వేటకాండ్రు ఈ సమాచారాన్ని తమ సమూహానికి తెలియపర్చారు. అంతట వారు తమ గుడిసెలనుండి సాయుధులై బయల్దేరారు. ఉషాదుహితా ప్రస్తుతం న్యాయాన్ని కోరుతూంది. యామదుహితా తన మృగక్షేత్ర రక్షణను కోరుతూంది. కాని వీరి మిత్రులుకానివారు దీని నిష్పక్షపాతంగా చూడలేదు. ఉషాజనపు మృగక్షేత్రంలో యిరువురకూ యుద్ధం సాగింది. చకుముకిరాళ్ళ కొనలుగా గలిగిన బాణాలు 'రయి'మని దూసుకుపోతున్నాయి. రాతి గొడ్డళ్ళు ఒకరిపైనొకరు దబదబ విసురుకుంటున్నారు. బల్లెలతోను. దుడ్డుకర్రలతోను ఒకరిపై నొకరు తీవ్ర ప్రహారాలు జరుపుతున్నారు. ఆయుధాల కొరత ఏర్పడితే యీ సైనికులు, సైనికరాండ్రు రొమ్ములతోనూ, చేతులతోనూ, చేతికందిన రాళ్ళతోనూ సమరం సాగిస్తున్నారు.

నిశాజనసంఖ్య, ఉషాజనసంఖ్యకంటె రెట్టింపుంది. ఇందువల్ల నిశాజన సమూహాన్ని గెలవడం అసంభవం. కాని పోరాటం తప్పనిసరి. చివరకు లఖుబద్ధ వరకూ పోరాటం తప్పదు. పగలు యామం ప్రొద్దెక్కిన తర్వాత యుద్ధమారంభ మైంది. అరణ్యంలో ఉషాజనసమూహం యొక్క మూడు వంతులలో రెండు వంతులు హతమైపోయారు. గాయపడ్డ వాళ్ళని మాత్రం శత్రువులు చంపలేదు.

గాయపడ్డ వాళ్ళను హింసించడం లేక తరమడం, అప్పటి జనయుద్ధంలో అధర్మమైనపని. మిగిలిన ఒక వంతు జనం వోల్గా ఒడ్డున పోరుతూ ప్రాణాలు విడిచారు. వృద్ధుల్నీ, బిడ్డల్నీ వెంటపెట్టుకొని తల్లులు యిల్లు విడిచి పారిపోవాలని చూచారు. కాని ఆ సమయం దాటిపోయి అపాయం ముంచుకొచ్చింది. నిశా జనసమూహపు అనాగరిక స్త్రీపురుషులు వారిని తరిమి తరిమి పట్టుకున్నారు. పురిటింట్లోని పసిబిడ్డల్ని కటికరాళ్ళపై వేసి కొట్టేశారు. స్త్రీపురుష వివక్షత లేకనే వయోవృద్ధుల మెడలలో రాతిబండలు బిగకట్టి వోల్గాలో ముంచేశారు. వారి యిండ్లలోనున్న మాంసం, ఫలాలూ మధుభాండాలు, యింకా యితరమైన సామగ్రి బయటకు తీసికొని మిగిలిన పిల్లల్నీ, స్త్రీలనీ ఆ గుడిసెల్లో బంధించి నిప్పెట్టేశారు. నాలుకల్తోడుతూ ఆకాశమునంటే అగ్నిజ్వాలల మధ్యనుంచి వస్తున్న ప్రాణుల ఆక్రందన ధ్వనులు విని ఆనందిస్తూ నిశా జనసమూహం అగ్నిదేవునికి ధన్యవాదాలిచ్చింది. శత్రువుల వద్ద దోచుకొన్న సురతో, మాంసంతో తమనీ, తమ యిష్టదేవతల్నీ తృప్తిపరచుకున్నారు.

జననాయిక దివా చాల సంతోషంగావుంది. ముగ్గురు తల్లుల ఒడులనుండి వారి బిడ్డలను లాక్కొని కటికరాళ్ళపై వేసి కొట్టింది. బిడ్డల తలలు పగిలి ఛళ్ళుమని శబ్దమయినప్పుడామె సంతసంతో వికటాట్టహాసం చేసింది. భోజన పానాది క్రియలనంతరం ఆ అగ్నివల్ల కలిగిన వెల్తురులో నృత్యం ఆరంభమైంది. దివా నేడు తన చిన్న కుమారుడగు 'వసు'తో నృత్యం చేస్తుంది. యీ నగ్నమూర్తులు రెండూ నృత్యం యొక్క తాళపు మేళవింపులో ఒండొరులను ముద్దాడుతూ, కౌగిలించుకుంటూ గుండ్రంగా తిరుగుతూ నాట్య విన్యాసాలు ప్రదర్శిస్తున్నారు. నేడు వసు, తన జననాయికకు ప్రేమపాత్రుడైనాడని అతడు విజయోన్మత్తురాలైన తన తల్లి యొక్క ప్రేమను ప్రోదిచేయునని అందరికీ తెలుసును.

నిశాకుల మృగక్షేత్రం యిప్పుడు నాలుగింతలుకు పెరిగిపోయింది. శత్రువుల వినాశానికి యికనేమీ భయంలేదు. ఇప్పుడున్న భయమల్లా ఏమంటే చంపబడిన ఉషాజనం బ్రతికుండగా వారు సాధించ లేనిదాన్ని చచ్చి భూతప్రేతాలయి సాధించ కోరుతున్నారు. కాలిపోయిన ఆయింటి ఆవరణలో ఒక ప్రేతపురం (భూతనగరం) తయారయింది. నిశా పరివారానికి ఆ స్థలంగుండా ఒంటరిగా రాక పోకలుచు అసంభవంగావుంది. వేటగాండ్రు, చాలదూరంవరకూ విస్తరించియున్న అగ్ని ముందు వందలకొలది నగ్నమూర్తులు నృత్యం చేయడం చూచారు. స్థానచలన

సమయంలో నిశా పరివారం ఆ ప్రాంతంలోంచే పోవాలి. కాని పగటివేళనూ బహు సంఖ్యాకులుగనూ పోయేవారు. దివాసంగతి చెప్పనక్కరయేలేదు. ఎన్నోసార్లు చీకట్లో పసిపాపలు భూమి నుండి పైకెగిరి ఆమె చేతుల్ని కౌగలించుకొన్నట్లుగా చూచి ఆమె వులిక్కిపడి కెవ్వన అరచేది.

---

# 4

దివాకు యిప్పుడు 70 ఏండ్లకు పైబడ్డాయి. ప్రస్తుతం ఆమె నిశా జనానికి నాయికగాదు. కాని యిప్పుడు కూడా ఆ ముఠాకు ఆమె మాననీయయగు ఒక వృద్ధురాలు. ఏమంటే 20 ఏండ్లు ఆమె జన నాయికగా ఉండి అభివృద్ధి చెందుతూన్న తన సమూహాభివృద్ధికెంతో కృషిచేసింది. ఈకాలంలో నిశాజనం యితర జనులనేకులతో పోరాటాలు జరుపవలసి వచ్చింది. ఈ సమూహంవద్ద యింకా అనేక మాసాలకు పర్యాప్తమైన మృగక్షేత్రాలున్నాయి. దివాకు యిదంతా భగవంతుని కృపగా వుంది. చేతులారా నేలనెట్టి కొట్టబడిన బిడ్డలదృశ్యం మాత్రం ఆమె నిద్రను భంగపరుస్తున్నది.

అవి చలికాలపురోజులు. వోల్గాజలం గడ్డకట్టుకుపోయింది. మాసాలుగా కురుస్తున్న మంచువల్ల ఘనీభవించిన నీరంతా, ఒక పెద్ద వెండితిన్నెలాగు అగుపడుతోంది. రెండోవైపు శిశిరఋతువుయొక్క నిర్జీవత, నిస్తబ్దతా అరణ్యంలో క్రమ్ముకొనివున్నది. నిశా జనసంఖ్య యిప్పుడు మరింత హెచ్చింది. ఇందువల్ల వారి ఆహార పరిమాణం కూడా తగినంతగా హెచ్చడం తప్పనిసరి. కాని పనిచేసే వారు కూడ హెచ్చుగావున్నారు. పనిరోజులలో వారు అధిక పరిమాణంలో ఆహార సంచయం చేస్తున్నారు. చలికాలంలో కూడా పెంపుడుకుక్కలను తీసికొని నిశా-పుత్రి, పుత్రులు వేటకెళ్ళి ఏకొద్దో గొప్పో తెస్తున్నారు. ఇచ్చట వీరు వేటలో మరొక నూతన పంథా కనిపెట్టారు. మేత లేకపోవడంచేత లేళ్ళూ, ఆవులూ, గుర్రాయా మొదలయిన జంతువులు ఒక అడవినుండి మరొక యడవికి పోతూండేవి. నిశాజనం నేలపడి మొలచే విత్తులను చూచారు. అందువల్ల గడ్డిగింజలను తడిగానున్న భూమిలో చల్లనారంభించారు. ఈ మొలవబెట్టిన గడ్డిమొక్కలు కారణంగా జంతు

ప్పలు మరికొన్ని రోజులు వెళ్ళిపోకుండా ఆ ప్రాంతంలో నిలిచిపోవడం మొదలు పెట్టాయి.

ఆరోజు ఋక్షశ్రవుని కుక్క చెవులపిల్లిని వెంటాడింది. అతడు కూడా దానివెంట పరుగెత్తాడు. దాగా చెమటపట్టగానే అతడు తన పెద్ద చర్మకవచాన్ని విప్పేసి భుజంపై వేసికొని తిరిగి పరుగెత్తాడు. కాని కుక్క యిప్పుడు కూడా కను పడ్డంలేదు. మంచులో దాని పద చిహ్నాలు మాత్రం కనుపిస్తున్నాయి. అతడలసి పోయాడు. యాలి ఒక వృక్షస్కంధంపైన విశ్రాంతికోసం ఆసీనుడయ్యాడు. పూర్తిగా ఆయాసం తీరకముందే అతనికి దూరంగా ఎక్కడో తనకుక్క అరుపు వినవచ్చింది. లేచి అతడు తిరిగి పరుగెత్తడం ఆరంభించాడు. శబ్దం దగ్గరకు యింకా దగ్గరకు వస్తూంది. దగ్గరకు వెళ్ళి చూచేసరికి ఒక సుందరి దేవదారు వృక్షానికి జేర్లబడి నిలబడి వుంది. ఆమె శరీరంపైన ధవళచర్మవసనాలున్నాయి. తెల్లనిటోపీలోనుండి ఆమె బంగారువన్నెగల వెంట్రుకలు అక్కడక్కడ బయల్పడి మెరుస్తున్నాయి. ఆమె కాళ్ళ వద్ద చచ్చిన ఒక చెవులపిల్లి పడివుంది. ఋక్షశ్రవుణ్ణి చూచి, కుక్క ఆమెదగ్గరకు వెళ్ళి మరింత గట్టిగా అరవడం ఆరంభించింది. అతనిదృష్టి సుందరివదనంపై బడింది. ఆమె చిరునవ్వుతో "మిత్రుడా! యీకుక్క నీదా?" అంది.

"అవును; నాదే కాని నిన్నెప్పుడూ చూడలేదే."

"నేను కురుజనమునకు చెందినదానను. యిది కురుజనుల భూమి."

"కురుజనులదా!" అని అతడు ఆలోచనలో పడిపోయాడు. కురుసమూహం అతని పొరుగునేవుంది. యెన్నో వత్సరాలుగా యిద్దరికి పడటంలేదు. మధ్యమధ్య యుద్ధాలుకూడా జరుగుతూనేవున్నాయి. కాని కురుజనం, ఉషా-జనంకన్న యెక్కువ తెలివైనవారు. ఇందుచేత యుద్ధంలో జయించే ఆశలేనప్పుడు కాళ్ళకు బుద్ధిచెప్పి పని నడుపుకుంటున్నారు. ఈ విధంగా చేతులు ప్రసాదించలేని సఫలతను కాళ్ళే వారు జీవించి వుండడానికి కారణమవుతున్నాయి. నిశా-పుత్రులు మాటిమాటికీ కురు సంహారానికి తీర్మానించుకుంటున్నారు. కాని యింత వరకు వారు తమ నిశ్చయాన్ని కార్యాచరణకు తేలేకపోయారు.

ఋక్షుడు మౌనముద్ర వహించి యుండడం చూచి "యీ చెవుల పిల్లిని నీ కుక్క చంపింది. దీనిని తీసికొనిపో."

"కాని. యిది కురుజనుల మృగక్షేత్రంలో చచ్చింది."

"అవును. చచ్చింది కాని నేను యీ కుక్క యజమానికోసం ఎదురు చూస్తున్నాను."

"ఎదురు చూస్తున్నావా ?"

"అవును. అతనురాగానే యీ చెవులపిల్లి నతని కిచ్చేద్దామని."

కురునామం విని ఋక్షుని మనస్సులో కొంచెం ద్వేషభావం పొడచూపింది. కాని యీ సుందరి యొక్క స్నేహ పూరితమైన మాటలు విని ఆ ద్వేషం తొలగి పోయింది. అతడు ప్రత్యుపకారభావ ప్రేరితుడై — "యీ వేట జంతువునేకాక నీవు నాకుక్కను కూడ నాకిచ్చావు. యీ కుక్క నాకు చాల ప్రియమైనది."

"చాలా అందమైనది కూడ."

"యెంతమందిలో నున్నాసరే, నా అలికిడి వినేసరికి నాదగ్గర కొచ్చేస్తుంది."

"దీని పేరు ?"

"శంభూ"

"మిత్రమా ! మరి నీ పేరో ?"

"ఋక్షశ్రివరోచనా—సూను"

"రోచనా—సూను ! మాఅమ్మపేరు కూడా రోచనయే." ఋక్షా ! తొందర లేకపోతే కొంచెం కూర్చుంటావా ?"

ఋక్షుడు ధనస్సునూ, కవచాన్ని మంచుపై బెడుతూ— "అయితే యిప్పుడు మీ అమ్మ లేదా ?"

"లేదు. ఆమె నిరాజనపు యుద్ధంలో చంపబడింది. నన్నెంతో ప్రేమించేది:" అని అంటూనే కళ్ళనీళ్ళు గ్రక్కుకుంది.

ఋక్షుడు ఆమె కన్నీళ్ళను తనచేతులతో తుడుస్తూ— "యీ యుద్ధం యెంత చెడ్డది !"

'అవును. యుద్ధంలో యెందరో ప్రియమైన వాళ్ళు మనల్ని విడిచి పోతారు.'

'యిప్పుడు కూడా ఆయుద్ధం ముగియలేదు.''

'ఎవళ్ళో ఒకళ్ళు నాశనం అయ్యేదాక అదెట్లా ఆగుతుంది ?''

'నిశా—శ్రతులు మరలింకొకసారి దాడి చేయబోతున్నారని వింటున్నాను. వారుకూడ నీలాంటి వాళ్ళుగానే వుంటారు గదా యని ఆలోచిస్తున్నాను ఋక్షా !'

'నీలాంటి యువతులే కురుజనంలో వుంటారనుకుంటాను.'

'అయినప్పటికీ, మనం ఒండొరులను చంపుకోవాలి. ఋక్షా ! ఏమీ వింత ?'

తనవారంతా మూడు రోజుల తర్వాత దాడి సలుపనున్నారన్న సంగతి ఋక్షునకు గుర్తుకొచ్చింది. అతడు ఏమో మాట్లాడేదానికి ముందుగానే యువతి మరల యిట్లా అంది—'కాని మేమికపోరాడం.'

'పోరాడరా ! కురుజనం యుద్ధంచేయరా ?'

'అవును' మా సంఖ్య చాలా తగ్గిపోయింది. జయించే ఆశ మా కిసుమంతైనా లేదు.'

'అయితే కురుజన మేంచేస్తారు ?'

'వోల్గాతీరాన్ని విడిపెట్టి దూరంగా పోతాం. వోల్గామాత ప్రవాహమెంత ప్రియమైంది ! ఇక యిది చూడటానికి లభించదు. అందుకనే నేను ఘంటలాదిచ్చట కూర్చొని దీని నిర్మలధారను చూస్తున్నాను.'

'అయితే నీవిక వోల్గాను చూడలేవన్నమాట.'

'ఇకపై భాగ్యంకూడా వుండదు. గంభీరమైన యీ జలంలో యీదుతుంటే యెంత హాయిగా వుండేది !' యిట్లా అంటూంటే సుందరి చెక్కిళ్ళపై అశ్రుబిందువులు క్రిందికి జారుతున్నాయి.

ఉదాసీనుడై అతడు 'యెంత క్రూరం, యెంత నిర్దయ !'

'కాని యిది జనధర్మం రోచనా—సూను.'

'అనాగరిక ధర్మంకూడా !*

---

* ఇప్పటికి రెండువందల తరాలకిముందు ఆర్య – గుంపుకు చెందినదీకథ. ఆకాలంలో భారత, ఈరాను, రష్యాల శ్వేతజాతులకు చెందిన ఒకజాతి వుండేది. దానిని ఇండో – స్లావులనీ, లేక శతం – వంశీయులనీ అంటారు.

# "అమృతాశ్వుడు"

## (మూడవ కథ)

[దేశం – మధ్య ఏషియా; పామీర్ (ఉత్తరకురు):
జాతి – ఇండో ఇరానియన్; కాలం – క్రీ. పూ. 3000 సం॥ర పూర్వం]

ఫర్గాణాకు చెందిన చక్కని పర్వతాలూ, సర్వత్రా ప్రవహిస్తున్న సెల యేళ్ళూ, పైకుబికివస్తూన్న పాతాళగంగ ధారలూ, యెంత అందంగా వున్నాయో, కాశ్మీర దేశపు సహజ సౌందర్యాన్ని స్వయంగా కళ్ళార చూచినవారే తెలుసుకొన గలరు. హేమంత ఋతువు గడచి వసంత ఋతువు ప్రవేశించింది. వసంతశ్రీ - ఆపర్వత భూమిని భూతల స్వర్గంగా చేస్తోంది. పశుపాలురు శీతకాలపు విడుదుల నుండీ, పర్వతగుహల నుండీ, రాతి యిండ్ల నుండీ బయలుదేరి సువిశాలమైన పచ్చిక బయళ్ళలోనికి వచ్చేశారు. వారి ఎత్తటి గుఱ్ఱపుదేరాలనుండి - పొగ వస్తోంది. ఇప్పుడే ఒకదేరా నుండి ఒకయువతి భుజంపై కడవపెట్టుకొని రాళ్ళపై సొగసుగా నడుస్తూ నదీతీరం వైపుకు పోతూంది. యింకా ఆమె చాలదూరం పోకమునుపే ఒకపురుషుడొచ్చి ఆమెముందు నిలబడ్డాడు. యువతివలెనే అతని శరీరంపైనకూడా పల్చని తెల్లటి బొచ్చు కంబళి రెండుకొనలు కుడిభుజంపై నుండునట్లు శరీరం యావత్తు కప్పబడింది. కాని వక్షార్ధమూ; మోకాళ్ళ క్రింద భాగం మాత్రం కప్పబడి

లేవు. పురుషుని గోధుమవర్ణపు తలవెంట్రుకలూ, మీసాలు చక్కగా తీర్చిదిద్ది వున్నాయి. సుందరి అతనినిచూచి ఆగిపోయింది. పురుషుడు చిరునవ్వుతో 'సోమా! నేడు నదికి ఆలస్యంగా వెడుతున్నావేమి ?'

'అవును, ఋజ్రాశ్వా! కాని నీవు దారితప్పినావే!'

'లేదు. ప్రేయసీ! నేను నీ వద్దకే బయలుదేరి వచ్చాను.'

'నావద్దకా ? చాలారోజులకు.'

'యీ వేళ సోమపుజ్ఞప్తికొచ్చింది!'

'బాగుంది! అమృతాశ్వుడు భోజనానికి కూచున్నాడు. నేను నీళ్ళుతీసుకొని వెళ్ళాలి.'

తరువాత మాట్లాడుకుంటూ యిద్దరూ నదీతీరానికివెళ్ళి యింటివైపు బయల్దేరారు.

'అమృతాశ్వుడు పెద్దవాడయ్యాడు.'

'నువ్వుచూచి చాలకాలమైంది.'

'నాల్గు సంవత్సరాలుగా!'

'యిప్పుడీతడు పన్నెండేళ్ళవాడు. నిజం చెబుతున్నాను. ఋజ్రాశ్వా! రూపంలో అతడు నీకు సరిసమానుడు.'

'ఏమో ఎవరికి తెలుసు ? ఆరోజుల్లో నేనుకూడా నీ కృపాపాత్రుణ్ణే! అమృతాశ్వుడింతకాలం యెక్కడున్నాడు ?'

'మాతామహునివద్ద వాల్హీకులతో.'

సుందరి నీటితోనిండియున్న బుంగను డేరాలోపెట్టి ఋజ్రాశ్వుని రాకను తన భర్త కృచ్ఛాశ్వునికి తెలిపింది. ఇరువురూ అమృతాశ్వునితో డేరావెలుపలికి వచ్చారు.

'మిత్రమా, కృచ్ఛాశ్వా! యెల్లావున్నావు ? కుశలమేకదా?' అని ఋజ్రాశ్వుడు ఆదరముగా అడిగాడు.

'అగ్ని దేవునికృప, ఋజ్రాశ్వా! రా, రా. మరి యిప్పుడే సోమాన్ని (భంగు) తేనెతోను, గుర్రపుపాలతోను తయారుచేశాం'

'మధు సోమమా? కాని యింత ప్రొద్దున్నే యెట్లా'

'గుఱ్ఱపువేటకెడుతున్నాను. బయటగుఱ్ఱం సిద్ధంగావుంది చూడలేదూ!'

'అయితే యీ సాయంత్రానికి తిరిగి రాదలచుకోలేదా?'

'బహుశా అందుకనే యీ భంగుపాత్రా, మధురమైన అశ్వ మాంసమూను.'

'అశ్వమాంసమా!'

'అవును. మాపశువులపై అగ్నిదేవుని కృపవుంది. నేను అశ్వాల్నే అధికంగా పెంచుతున్నాను.'

'అయితే కృచ్ఛ్రాశ్వా! నీ పేరుమాత్రం ఉల్టాగావుంది.'

'నా తల్లిదండ్రులకాలంలో మా యింట్లో అశ్వాలకొరత ఉండినది. అందుకనే యీ పేరు పెట్టారు.'

'కాని యిప్పుడింక ఋద్ధాశ్వుడవ్వాలి.'

'సరే. లోపలికిపద.'

'కాని మిత్రమా! యీ దేవదారు వృక్షచ్ఛాయలోనే యీ పచ్చికపైనే కూర్చుందాం ఏమంటావు?'

'అట్లాగే. సోమా! తీసుకురా సోమం (భంగురసం) మాంసాలతో మిత్రుని యిచ్చదే తృప్తిపరుద్దాం.'

'కాని, కృచ్ఛ్రా! అశ్వాలకై పోనుంటవే!'

'దానికేం. నేడుకాకపోతే రేపు. కూర్చో!'

సోమ సోమపుపాత్రాను గిన్నెలను తెచ్చింది. ఇద్దరు మిత్రుల పక్కా అమృతాశ్వుడుకూడా చతికిలబడ్డాడు. సోమము (భంగురసము) క్రిందనుంచుతూ— 'పశువుతెస్తానుండండి! కూర్చోవచ్చును.'

ఋజ్రాశ్వుడు — 'వద్దు సోమా! కోమలమైన యీ పచ్చిక పశువుకన్న బాగుంది.'

'అవునుగాని, యిదిచెప్పు ముందు. ఋజ్రా! ఉప్పుతో ఉడకబెట్టిన మాంసం తింటావా, లేక నిప్పులో కాల్చినది కావాలా? ఎనిమిదినెల్ల దూడ మాంసం బహు మృదువుగా వుంది.'

'సోమీ! నాకు కాల్చినదూడే చాల బాగుంటుంది. నేను అప్పుడప్పుడు దూడను మొడలాగే కాల్చేస్తాను. కొంచెం ఆలశ్యమౌతుంది. కాని మాంసం బహు మధురంగా వుంటుంది.'

'మరి నీకో సోమీ! నా గిన్నెను నీ అధరాలతో మధురంగా చేయాలి.'

కృచ్ఛ్రాశ్వుడు—'అవునవును, సోమీ! ఋజ్రుడు చాలకాలం తర్వాత వచ్చాడు.'

సోమ—'నేనిదిగో యిప్పుడే వస్తా. నిప్పు చాలావుంది. మాంసం మల్చడంలో ఆలస్యంకాదు.' కృచ్ఛ్రాశ్వుడు గిన్నెలు గిన్నెలు యెత్తి పోసేసుకోవడం చూచి ఋజ్రాశ్వుడు—'యేమిటాతొందర?'

'సోమం అంత తీపైనదింకోటి లేదు. సోమా హస్తం, సోమం, సోమం, అమృతం. యిది సోమపానం చేసినవాణ్ని అమృతంగా చేస్తుంది. సోమంత్రాగి అమృతమైపో.'

'గిన్నెలకు గిన్నెలు త్రాగు నీవరుసచూస్తే త్వరలో మృత ప్రాయుడ వయ్యేటట్టున్నావు.'

'సోమం అంటే నా కెంతప్రేమో నీకు తెలుసా? ఋజ్రా!'

యిదే సమయంలో కాల్చిన మూడు మాంసపు ముక్కలను చర్మంపై పెట్టుకొని సోమ వచ్చింది.

'కాని కృచ్ఛ్రా! అయితే నీవు సోమను ప్రేమించడంలేదా?' అని అడిగింది. 'సోమను, సోమంనూకూడా' అని కృచ్ఛ్రాశ్వుడు మారినస్వరంతో అన్నాడు. అతని కండ్లు ఎరుపు రెక్కుతున్నాయి. 'సోమా యీపేళ నీకే' అన్నాడు.

'అవును. నేడు నేను అతిథి ఋజ్రునికే చెందుతాను.'

కృచ్ఛ్రాశ్వుడు నవ్వడానికి యత్నిస్తూ—'అతిథా లేక పాతమిత్రుడా!' అని వేళాకోళంచేశాడు. ఋజ్రాశ్వుడు చేయిపట్టుకొని సోమాను తనప్రక్కను కూర్చోబెట్టుకొని సోమంతో నిండియున్న తన గిన్నెను ఆమెనోటికందించాడు. సోమ రెండు గుటకలువేసి 'యిక నీవు త్రాగు ఋజ్రా. చాలకాలాని కీసుదినం వచ్చింది.'

ఋజ్రాశ్వుడు గిన్నెనంతా ఒక్కతృటిలో ఖాళీచేసి క్రిందబెడుతూ—'నీపెదవులు తాకగానే సోమీ! యీ సోమం యెంత మధురమై పోతుంది!' అన్నాడు. కృచ్ఛ్రాశ్వునిపై సోమ ప్రభావమారంభమైంది. అతడు తనగిన్నెను తొందరగానింపి సోమను చేరుతూ కుంటుపడిపోతూన్న స్వరంతో అన్నాడు. —అ-సో-సో-సోమే-దా-నీ-నీ-ని-కూ-మ-మ-ధు-ధు-ద.

సోమా దానిని ఎంగిలిచేసి తిరిగి యిచ్చివేసింది. అమృతాశ్వుడికి పెద్దవాళ్ళ సరససల్లాపాలు రుచికరంగా తోచకపోవడంవల్ల, అతడు నవయస్కులగు బాల బాలికలతో ఆడుకోడానికి పారిపోయాడు. కృచ్ఛ్రాశ్వుడు మూసుకుపోతున్న కను రెప్పలతో ముందుకు తూలిపోతున్న శిరస్సుతో 'సో - మే - పా - పా - ట - ట-పా - డ - నా ?'

'అవును నీవంటి గాయకులు పుపువంశంలో కలరా ?'

'అం-అం-తే-నా-లా-టి-గా-గా-యక-కు డు లే - నేలేదు క-క-ను-ను-క-వి-ని-న-ను-త్రా-తా-గా-గా-లి సో-మ-మం-'

'ఆపవోయ్ కృచ్ఛ్రా! నీ పాట కట్టిపెట్టు. మృగాలన్నీ అడవి విడిచి పారి పోతున్నాయి.'

'ఉ - ఊః'

సోమంత్రాగి అమృతులుగా అవడాని కిదిసమయంకాదు. సూర్యాస్తమయం తర్వాత. కాని కృచ్ఛ్రాశ్వుడికేదైన వంకదొరకాలి కదా! అతడు వళ్ళుమరచి పడిపోయిన తర్వాత సోమా-ఋజ్రాశ్వులు గిన్నెలక్కడే వదలేసి నదీతీరానుపోయి ఒకరాతిబండపై కూర్చున్నారు. యిచ్చట పర్వతాలమధ్య ధార కొంచం సమతల భూమిలో ప్రవహిస్తుంది. కాని ప్రవాహం మధ్య చాలారాళ్ళ కుప్పలు వున్నాయి. వాటిపై నీరు 'కర్‌కర్'మని శబ్దంచేస్తూంది. రాళ్ళచాటున అక్కడక్కడ చేపలు రెక్కలాడించుకుంటూ అటూ యిటూ తిరుగుతున్నాయి. అక్కడ విశాలమైన

సాల, దేవదారు మొదలయిన వృక్షాలున్నాయి. పక్షులు కలకలరవములు చేస్తూన్నాయి. సుగంధ పూరితమైన పిల్లవాయువులు మెల్లగావీస్తూ హృదయంగమంగా ఉన్నాయి. చాలకాలము తర్వాత యీ సుందరనదీ తీరాన్ని వారిద్దరూ తమ పూర్వప్రేమను జ్ఞప్తికి తెచ్చుకుంటున్నారు. ఆరోజుల్లో గోధుమ వర్ణకాంతిలో అలరారే ఆమె కురులూ, వసంతోత్సవ సందర్భంలో ఋజ్రాశ్వుడు తన మేనమామ యింటికి వెళ్ళిన ఆరోజులు వారికిప్పుడు గుర్తొస్తున్నాయి.

సోమ అతని మేనగోడలు. ఋజ్రాశ్వుడుకూడా అప్పుడు ఆమె ప్రియులలో ఒకడు. అప్పుడు సోమాను కోరేవాళ్ళలో చాలాపోటీ, పట్టుదల వుండేది. చివరకు కృచ్ఛ్రాశ్వుడు జయించాడు. యితరులతోపాటు ఋజ్రాశ్వుడుకూడా ఓటమిని ఒప్పుకో వలసి వచ్చింది. ఇప్పుడు సోమ కృచ్ఛ్రాశ్వుని పత్ని. కాని ఉత్సాహ పూరితమైన ఆయుగంలో స్త్రీ తనపురుషునియొక్క ఒక చరాస్తిగా తయారవడానికి ఒప్పుకో లేదు. ఇందుచేతనే ఆమె తానుకోరిన ప్రియుని ఎంచుకోవడానికి అధికారం కలిగి యుంది. అతిథులచెంతకూ మిత్రులవద్దకు స్వాగతమిచ్చేందుకు తన స్త్రీని పంపడము ఆరోజులలో సర్వసామాన్యమైన సదాచారంగా వుండేది. నేడు సోమ ఋజ్రాశ్వుని సొత్తు.

సాయంకాలము ముఠాలోని స్త్రీ పురుషులంతా మహాపితరుని (ముఠానాయకుడు లేక శాసించేవాడు) విశాల గుహాంగణంలో సమావేశమయ్యారు. సోమం మధు సుర రుచికరమైన గోమాంస అశ్వమాంసాదులు తేబడుతున్నాయి. మహాపితరుడు పుత్రోత్సవం జరిపిస్తున్నాడు. కృచ్ఛ్రాశ్వుడు నిషాలోఉన్నాడు. అతనికిబదులు సోమా-ఋజ్రాశ్వులచ్చటికి చేరారు. చాలారాత్రివరకు సురాపాన, గాన, నృత్యములతో మహోత్సవం నడచింది. సోమా ఋజ్రాశ్వుల నృత్యగానాల్ని కురులు ఎప్పటివలెనే ఎంతో మెచ్చుకున్నారు.

'మధురా నీవు అలసిపోలేదుకదా ?'

'లేదు. నాకు గుఱ్ఱపుస్వారి చాలాయిష్టం. కాని ఆదోపిడిగాండ్రు నిన్ను చాల అసహ్యకరంగా బంధించారే ?'

'అవును. వాళ్ళు వాహ్లీకభక్తుల గోవుల్ని అశ్వాల్ని దోచుకొన రాలేదు. కన్యలను దోచుకోడానికే వచ్చారు.'

'అవును. పశుపోషిడి యిరుపక్షాలకీమధ్య చిరస్థాయియైన శత్రుత్వాన్ని పుట్టిస్తుంది. కన్యాపహరణము తాత్కాలికపు వైరుధ్యాన్ని మాత్రమే కలిగిస్తుంది. చివరకు మామగారు అల్లుణ్ణి సత్కరింపక తప్పదుకదా'

'కాని నాకు నీపేరు తెలియదే.'

'అమృతాశ్వుడు. కృచ్ఛ్రాశ్వపుత్రుడను, కౌరవుడను.'

'కౌరవుడవా! మన నామేనమామకులంవాడు. మధురా నీకిక భయంలేదు. నీవెక్కడికి వెడతావు. మధురముఖంలో ఆనందరేఖ మెరసి మధ్యలోనే ఆగిపోయింది. అమృతాశ్వుడర్థం చేసుకున్నాడు. మాటలధోరణి మారుస్తూ పస్థలకన్యలు మావూరికికూడ వచ్చారు.'

'అందరూ అపహరింపబడేనా.'

'కాదు. వారి మేనకోడండ్రు చాలమందివున్నారు.'

'అయితేసరే. కాని కన్యలకోసం యీదోపిడీ-కొట్లాట నాకు చాలఅసహ్యంగా తోస్తోంది.'

'నాకూ అంతే మధురా! అక్కడ స్త్రీ పురుషులకుమధ్య ప్రేమసాధ్యమా? కాదా? యని కూడ వాదెపగరు.'

'మేనమామకూతురితో వివాహం యింతకంటె మంచిది. యెందు వల్లనంటే మొదటినుండీ పరిచితులయి వుండడానికి అవకాశం లభిస్తుంది.'

'నీకెవరైనా అట్లాంటి ప్రియుడున్నాడా? మధురా!'

'లేడు. నాకెవరూ మేనత్తలులేరు.'

'పోనీ యింకెవరైనా?'

'స్థిరమైన వాడెవడూ లేడు.'

'నన్నదృష్టవంతుణ్ణి చేయగలవా'

మధుర లజ్జాయుత దృక్కులు నేలవైపుకు పోయాయి.

'మధురా యితరులకు చెంది స్వతంత్రులుగా స్త్రీలున్న ప్రదేశాలున్నాయి.'

'అర్థంకాలేదు.'

'వారినెవ్వరూ దోచుకోరు. వారి నెవ్వరూ శాశ్వతంగా తమపత్నిగా చేసుకోన జాలరు. అక్కడ స్త్రీ పురుషులు సమానులుగా వుంటారు.'

'సమానంగా ఆయుధాల నుపయోగించగలరా ?'

'ఆ ! స్త్రీ స్వతంత్రురాలు.'

'ఎక్కడుంది ఆ ప్రదేశం ? అమృత్ - అమృతాశ్వా'

'కాదు. అమృత్ అనే పిలు. మధురా ఆప్రాంతం యిచ్చటకు పశ్చిమంగా చాలదూరంలో వుంది.'

'నువ్వక్కడి కెప్పుడైనా వెళ్ళావా ? అమృత్'

'ఆ : అరణ్యాలలో స్వేచ్ఛావిహారంచేసే మృగమువలె వృక్షాలపై స్వతంత్రంగా ఎగిరే విహంగంలాగ అక్కడ స్త్రీ జీవితపర్యంతం సర్వ స్వతంత్రయై వుంటుంది.'

'అది చాలా చక్కని దేశమయివుంటుంది. అక్కడ స్త్రీ నెవ్వడూ దోచుకోడు గదా ?'

'సర్వస్వతంత్రయైన ఆడుపులిని బ్రతికుండగా ఎవడు దోచుకోగలడు ?'

'మరి పురుషుడో? అమృత్.'

'పురుషుడుకూడా స్వతంత్రుడే.'

'బిడ్డల సంగతి ?'

'మధురా ! యిల్లూవాకిలీ వేరు. యావత్తుగ్రామం ఒకే పరివారంగా వుంటుంది.'

'మరి తండ్రి కర్తవ్యం ?'

'తండ్రి అనడానికి వీల్లేదు. మధురా! అచ్చట స్త్రీ ఏఒక్కని పత్నికాదు. ఆమె ప్రేమ స్వచ్ఛందమైనది.'

'అయితే అక్కడెవరికీ తండ్రెవరో తెలియదా?'

'ఆగృహానికిచెందిన యావన్మంది పురుషులూ తండ్రులే.'

'యిదేమి రివాజు!'

'యిందువల్లనే అచ్చటి స్త్రీ స్వతంత్రురాలు. యోధ. వేటాడ గలదీని.'

'మరి గోవుల – అశ్వాల పోషణో?'

'ఇక్కడ లేళ్ళు అడవులలో వున్నట్లే అక్కడ గోవులూ అశ్వాలూ అడవులలోనే వుంటాయి.'

'మేకలూ గొర్రెలూ?'

'అచ్చటివారికి పశుపాలన తెలియదు. వేటాడి చేపలుపట్టి అరణ్యఫలాలతో కాలక్షేపం చేస్తారు.'

'కేవలం వేటతోనే అయితే వాళ్ళకు పాలుదొరకవు కాబోలు?'

'తల్లిపాలే! అదయినా చిన్నతనంలో మాత్రమే'

'గుడ్డపు స్వారీకూడా లేదా?'

'లేదు చర్మధారణంతప్ప రెండోది యెరుగరు.'

'అయితే చాలా దుఃఖపడుతూంటారులావుంది.'

'కాని అక్కడి స్త్రీలు స్వతంత్రలు. వారు ఫలాల్ని పోగుచేస్తారు. వేటాడ తారు. యుద్ధంలో శత్రువులపై రాతిగొడ్డళ్ళూ బాణాలు విసురుతారు.'

'నాకుకూడా యిది యిష్టమే. ఆయుధాలుపయోగించడం నేర్చుకున్నాను. కాని యుద్ధంలోకి పురుషులవలె వెళ్ళడానికి అవకాశ మెక్కడిది?'

'పురుషుడు యీ వనితను తీసుకున్నాడు. అశ్వాలనీ, గోవుల్నీ, గొర్రెల్నీ మేకల్నీ తాను పెంచుతున్నాడు. స్త్రీని పశుపత్నిగా కాక గృహపత్నిగా జేశాడు.'

'కన్యలను అపహరణ కనుకూలంగా చేసిపెట్టాడు. అక్కడి కన్యలు అపహరింప బడుట లేదనుకుంటా అమృత్ !'

'ఒక సమూహంలోని పిల్లలూ పిల్లవాళ్ళు ఎల్లప్పుడూ ఆ కూటమిలోనే వుంటారు. బయటికిచ్చేదిలేదు. బయటినుంచి పుచ్చుకొనేదిలేదు.'

'అందుచే కన్యలు అపహరింపబడుతుంటారా?'

'అవును మధురా! నా సంగతో'

'నేను నీదాననే అమృత్.'

'కాని నేను నిన్ను అపహరించ కోపటలేను.'

'అయితే నన్ను యుద్ధం చేయనిస్తావా ?'

'నాకు సాధ్యమయినంతవరకూ'

'వేటాడనిస్తావా ?'

'నాకు సాధ్యమయింతవరకూ'

'సాధ్యమా ?'

'యెందుకంటె నేను మహాపితరు (ప్రాంతీయశాసకు)ని ఆజ్ఞ పాలించాలికదా ! నేనేమీ నీ స్వాతంత్ర్యాన్ని అరికట్టను.'

'ప్రేమించడానికీ ప్రేమించకపోవడానికి కూడానా ?'

'ప్రేమ మన పరస్పర సంబంధానికి పునాదివేస్తోంది. సరే దానికూడా.'

'అయితే, అమృత్ నేను నీప్రేమను స్వీకరిస్తున్నాను'

'మనం కురుజనంలోకి పోదామా లేక పక్థుల్లోనికా ?'

'నీ యిచ్ఛవచ్చినచోటికి'

అమృతుడు గుఱ్ఱాన్ని వెనక్కిత్రిప్పాడు. మధుర చూపిన మార్గం గుండా పక్థులగ్రామం చేరుకున్నారు. అచట ఒకదేరాలో ఒకడు చంపబడ్డాడు. యింకో యింట్లో మరొకడు గాయపడ్డాడు. మరొకని కుమార్తె దోచుకొనబడింది. నలువైపులా

అల్లకల్లోలంగావుంది. మధురతండ్రి తల్లిని ఊరడిస్తున్నాడు. అప్పుడే అతని దేరాముందుగా ఒక గుర్రంవచ్చి నిలబడింది.

అమృతాశ్వుడు మధురా క్రిందకురికాడు. అమృతాశ్వుణ్ణి బయట వుండమని చెప్పి తను లోపలికెళ్ళింది. అకస్మాత్తుగావచ్చి తమ ముందు నిలిచిన కుమార్తెను చూచి తండ్రి ఆశ్చర్యపడ్డాడు. తరువాత తల్లి కుమార్తెను వొళ్ళోకి తీసుకొని కన్నీళ్ళలో ఆమె ముఖాన్ని తడిపివేయ మొదలెట్టింది. తరువాత మధుర తండ్రితో 'వాల్హీకులు పక్కకన్యలను దోచుకొని తీసుకొనిపోతూ నన్నుకూడా తీసుకుపోతున్న వారు మరికొంచెం వెనుకబడ్డారు. అవకాశంచూచి నేను గుఱ్ఱం నుంచి దూకేశాను. నన్ను చివరికి పట్టుకుని తస్కరింపజూచారు, కాని నేను ఎదురుతిరిగాను. ఇంతలో ఒక అశ్వారోహకుడగు యువకుడువచ్చాడు. అతడు వాల్హీకుణ్ణి గద్దించి గాయపరచి నేల కూలద్రోసేశాడు. ఆ కురుకుల యువకుడే నన్నిక్కడకు చేర్చవచ్చాడు!' అంది.

తండ్రి—'మరి నిన్నాయువకుడు తీసుకొని పోగోరలేదా ?'

'బలాత్కారంగా కాదు'

'కాని మన దేశాచారప్రకారం నీ పతనిదానవయ్యావు'

'అతనిని ప్రేమిస్తున్నాను కూడా! నాన్నా'

మధురా తండ్రి దేరానుంచి వెలుపలికివచ్చి అమృతాశ్వుణ్ణాహ్వానించి లోనికి తీసుకుపోయాడు. గ్రామస్థులకది వింతగా తోచింది. తరువాత అందరి గౌరవ సానుభూతులలోను అమృతాశ్వుడు మధురాసమేతుడై అత్తవారిల్లు విడచిపోయాడు.

---

# 3

ఇప్పుడు అమృతాశ్వుడు కురుగ్రామానికి మహాపితరుడయ్యాడు. అతనివద్ద వందలాది గుఱ్ఱాలు, గోవులూ, గొర్రెలూ, మేకలూ యెన్నోవున్నాయి. అతని నలుగురు కొడుకులూ, మధురా యింటిపనులు చూస్తున్నారు. గ్రామంలోని బీద

తరగతికి చెందిన కొందరుకూడా వారివద్ద పనిచేస్తున్నారు. నౌకర్లవలెకాక స్వకుటుంబీకుల మాదిరిగనే; ఒక కురునకు మరొకరికి ఏమీ తేడా వుండజాలదు. అమృతాశ్వునికి ఆ గ్రామంలో యాభై కుటుంబాలకన్న యెక్కువున్నాయి. వారిమధ్య తగాయిదాలూ, వ్యాజ్యాలు పరిష్కరించడము, తీర్పులు చెప్పడం అతనే. నీటి వసతులూ, మార్గసౌకర్యాలూ మొదలగు యావత్తు సార్వజనిక కార్యనిర్వహణం కూడా అతనే చేస్తున్నాడు. యుద్ధభయం ప్రతినిమిషం ఉండనేవుంది. అందువల్ల సేనకంతకు అధిపతియై నడపడం అతని కన్నిటికన్న ముఖ్యకర్తవ్యం. అసలు యుద్ధాల్లోని విజయమే మానవుని మహాపితరపదవికి అర్హునిచేసింది. అమృతాశ్వుడు గొప్ప యోధుడు. పక్థులూ, వార్షికులూ మొదలగు అనేకమందితో జరిపిన యుద్ధాలలో అతడు అపూర్వ సాహసాన్ని ప్రదర్శించాడు. అతడు మధురాకు చేసిన వాగ్దానాలను పాలించాడు.

మధురా అమృతాశ్వునితోకలసి ఛల్లూరాళ్ళి, తోడేళ్ళనీ, పెద్దపులుల్నీ వేటాడడమేకాకుండా యుద్ధాల్లోకూడా పాల్గొన్నది. కొందరు దీనికంగీకరించలేదు. స్త్రీ గృహ కృత్యాలు మాత్రమే చేయాలని వారి వాదన. అమృతాశ్వుడు ప్రప్రథమం మహాపితరుడుగా యెన్నుకొనబడినప్పుడు కురుకులం మహోత్సవం జరుపుతోంది. ఆనాటికి మాత్రం యువతీ యువకులు తాత్కాలిక ప్రణయాన్ని ఏర్పరుచుకొన్నారు. గ్రీష్మఋతుకాలంలో నదీతీరాల్లోను, పర్వతాలపైనా గుర్రాలూ ఆవులూ, స్వేచ్ఛగా మేస్తూన్నాయి. గ్రామవాసులు తమకు శత్రువులు గలరనే సంగతి విస్మరించారు. పశుధనంతోనే వారి శత్రుసంఖ్యకూడా పెరిగింది. కురుజనులు వోల్గాతీరంలో నున్నప్పుడు వారివద్ద పశుధనంలేదు. ఆకాలంలో వారు ఆహారాన్ని అడవులలో సంపాదించుకోవలసివచ్చేది. అప్పుడప్పుడు ఆకలితోనే వుండాల్సివచ్చేది. ఇప్పుడు కురుజనులు వేటజంతువుల్ని ఆవుల్ని, గుర్రాల్ని, గొర్రెల్ని, మేకల్ని, గాడిదల్ని పెంపుడువాటిగా చేసుకున్నారు. అవి వారికి మాంసము, పాలూ, చర్మమూ మాత్రమే కాక వస్త్రాలునికూడా యిస్తున్నాయి. కురుస్త్రీలు దారం తీయడంలోనూ, కంబళ్ళు నేయడంలోను నిపుణులు. కాని యీ నిపుణత సమాజంలో వారి ఇదివరకటిస్థానాన్ని యథాస్థితిగా వుంచలేక పోయింది. యిప్పుడు రాజ్యం స్త్రీది కాదు పురుషునిది. జననాయికారాజ్యమూ కాదు; జనసమితిరాజ్యమూకాదు, మిదుమిక్కిలి యోధుడైన మహాపితరుని రాజ్యం. అతడు జనాభిప్రాయం తీసుకొంటూ చాలావరకు తన యిష్టాను సారం పాలిస్తున్నాడు. స్త్రీ రాజ్యంలో యావత్తుపరివారమూ ఎల్లప్పుడూ ఒక్కటిగా

వుండేది. ఒక్కుమ్మడిగా పనిచేసేది, దానికి బదులు ఇప్పుడు తమ తమ పరివారాలూ, తమ తమ పశుధనం వాటియొక్క లాభనష్టాలు, తమంత తామే అనుభవించడం ప్రారంభమైంది. అయినా ఆత్మరక్షణార్థం అందరూ మునుపటివలె ఐక్యతను ప్రదర్శిస్తున్నారు.

మహాపితరుని మహోత్సవంలో లీనమైపోయిన ప్రజలు తమ పశువులసంగతే మరచిపోయారు. వాద్య ఘోషలో చిందులు త్రొక్కుతూన్న వారికి కేవలం సురా, సుందరులధ్యానం తప్పితే వేరొక ధ్యాసలేదు. ఇక తెల్లవారుటకు జాముమాత్రమే వుంది. కాని నృత్యం ఆగే సూచనలెక్కడాలేవు. యిదే సమయంలో నాల్గువైపులా కుక్కలు బిగ్గరగా మొరుగుతూ ఎత్తైన పర్వతభూమికి పరుగులెడుతూన్నట్లు కనుపడ్డాయి. అమృతాశ్వుడు కొంచెం మితంగా సోమపానం చేసేవాళ్ళలో ఒకడు. సోమపానంవల్ల కళ్ళలో కాస్త యెరుపౌస్తే చాలతడు దానితోనే ఆనంద పడతాడు. వివేకం తప్పిపోకుండ మాత్రం చూచుకుంటాడు. అందువల్ల కుక్కలు మొరుగుటతో నెమ్మదిగా లేచాడు.

కర్రపిడిగల తన పాషాణదండమును తీసుకొని నదీతీరంవైపు శబ్దాన్ననుసరించి పోసాగాడు. కొంతదూరం పోయేసరికి అస్తాచలానికి చేరుకుంటున్న చంద్ర కాంతిలో ఎవరో స్త్రీ వస్తూన్నట్లగుపడింది. ఆమె మధురా యని దరిచేరిన తరువాత తేలింది. ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసములు వేగంగా సాగుతున్నాయి. ఉత్తేజిత స్వరంతో "పురులు మన పశువుల్ని తోలుకొనిపోరున్నారు."

"తోలుకుపోతున్నారా ! అయ్యో ! మన యువకులంతా మైకంలో ఉన్నారే! మధురా నీ వెంతవరకూ వెళ్ళావు ?"

"యిదిగో! యీ సంగతి తెలుసుకోగలిగినంతవరకూ వెళ్ళాను."

"పశువులన్నింటినీ తోలుకుపోతున్నారా ?"

"చాలసేపటినుంచి చిందరవందరగానున్న పశుగణాన్ని ప్రోగుచేయడంలో నిమగ్నులయి వున్నారని తోస్తుంది."

"నీ ఉద్దేశమేమిటి? మధురా!"

"ఇది అలస్యానికి సమయంకాదు."

"మరి మన యావన్మంది యువకులూ మైకంలోవున్నారే?"

"రాగలిగినవాళ్ళను వెంటబెట్టుకొని దాడిచెయ్యాలి."

"అవశ్యం అంతే. కాని ఒక సంగతి మధురా నీవు నాతో రాకూడదు. మన వారిలో సగంమందికి యీవార్త తెలియగానే మత్తు వదలి పోతుంది. మిగిలిన వాళ్ళను పెరుగు త్రాగించు. మత్తు వదలిపోయిన వాళ్ళను ఎప్పటికప్పుడు పంపి వేయాలి."

"మరి కురుస్త్రీలో?"

"వారు యుద్ధరంగములో దుముకుటకు మహాపితరునిగా ఆజ్ఞాపించగలను. మరచిపోయిన ఆ పురాతనాచారాన్ని మనం ఆచరణలోపెట్టాలి!"

అతని ఆజ్ఞానుసారం వాద్యాలన్నీ ఒక్కసారిగా ఆగిపోయాయి. స్త్రీ పురుష లంతా మహాపితరునిచుట్టూ చేరారు. వాస్తవానికి గోవులు, అశ్వములు అపహరింప బడ్డాయన్న వార్త వినగానే వారిలో ఎంతో మందికి నిషా దిగిపోయింది. వారికి ఎక్కడలేని వీరావేశం ఆవహించింది. మహాపితరుడు మేఘగంభీర నిస్వనంతో "కురుస్త్రీ పురుషులారా! శత్రువులగు పురులనుంచి మన సంపదను వశపరచుకోవాలి. యుద్ధం జరుగుతుంది. మీలో చైతన్యులుగానున్న వారంతా అశ్వారోహణచేసి ఆయుధాలు ధరించి నావెంటరండి. నిషాలోనేవున్నవారు మధురానుండి పెరుగు తీసుకొని త్రాగండి. మత్తు వదలగనే పరుగునరండి. కురుస్త్రీలారా! మీరుకూడా రణరంగమునకు రావలెనని ఆజ్ఞాపిస్తున్నాను. పూర్వకాలపు కురుస్త్రీలు యుద్ధ రంగంలో పురుషులతో సమానంగా పాల్గొనేవారని మనం పెద్దల నుండి విన్నాం. ఇదే మీ మహాపితరుని ఆజ్ఞ."

క్షణంలో 40 గుఱ్ఱాలు సిద్ధమయ్యాయి. పురులు త్రోలుచెయ్యగలిగినన్ని పశువులతో పర్వతభూమి పైభాగానికి తోలుకు పరుగెడుతున్నారు. 2 గంటల తరువాత పూర్తిగా తెల్లవారిన తరువాత కురులు వారిని చూడగలిగారు. గుఱ్ఱాలతోను గోవులతోను కూడిన మందను తీసుకొని ఆ పర్వతాల్లో పరుగెత్తడం అంత తేలికైన పనిగాదు. పురులు గుఱ్ఱాలను తమ తోలుకఱ్ఱలతో అదలిస్తూ త్వరితంగా పోతున్నారు. వారు సుమారు నూరువరకూ ఉన్నారని అమృతాశ్వుడు చూచాడు. 40 మంది

మాత్రమే గల చిన్నముఠాను కలిగి వారితో యుద్ధంచేయుటను గురించి తల బ్రద్దలు కొట్టుకొని ఆలోచించదలచలేదు. పొడుగైన కొమ్ముల బరిశెల్ని సంభాళించుకొని శత్రువుపై దెబ్బతియ్యమని అతడాజ్ఞాపించాడు.

కురువీరులూ వీరాంగనాలూ-అవును వీరాంగనలు సగంకన్న తక్కువగాలేరు- నిర్భయులై తమ అశ్వాలను ముందుకురికించారు. వీరినిచూచి పురులు దిగువకు పరుగెత్తారు. కాని పశువుల నాపివుంచడానికై కొందరు పురులుమాత్రం అక్కడ నియమింపబడ్డారు. అశ్వాల నధిరోహించి పోరుటకు వారు నదీతీరపు మైదానంలోకి పోయిరు కురులకోసం యెదురుచూస్తున్నారు. అప్పటి అమృతాశ్వుని ఆకృతిచూడాల్సిందే కాని వర్ణింప నలవికాదు. అతని అశ్వం "అమృతా" అతడూ ఏకశరీరానికి చెందిన అంగాలుగా కనిపిస్తున్నారు. పదునైన లేతికొమ్ము బల్లెపుదెబ్బ ఒక్కసారి తిన్నవాడు రెండోసారి గుర్రంపై కనబడ్డంలేదు. అంతతో వాడిపని ఆఖరు. పురులు ధనస్సులూ బాణాలపైనా, రాతిగొడ్డళ్ళపైనా ఎక్కువగా ఆధారపడి ఘోరమైన తప్పిదంచేశారు. వారివద్దకూడా కురులవద్దనున్నట్లే కొమ్ముల బల్లెములు వుండివుంటే, కురులు వారి నెదిరించలేకపోయేవారు. గంటసేపు సమరం సాగింది; పురులింకా నిశ్చలంగా నిలచియున్నారు. కాని వారి మూడు భాగాల్లో ఒకభాగం హతులయిపోయారు. యిది ప్రమాదమైన సంగతి. యిదేసమయంలో 30 మంది అశ్వారోహులగు కురులు గర్జిస్తూ రణరంగానికి చేరుకున్నారు. మళ్ళీ కురుల ధైర్యసాహసాలు ఇనుమడించి పోయాయి. అందువల్ల పురులు ఘోరంగా హతులుకాసాగారు. ఈ క్లిష్టపరిస్థితిలో పశువుల నాపడానికి నియమింపబడ్డ అశ్వారోహులు కూడా వచ్చేశారు. కాని యింతలో 40 మంది కురు స్త్రీ పురుష యోధులతో మధురా వచ్చి చేరుకుంది. గంటన్నరకాలం సంకుల సమరం సాగింది. యెక్కువమంది పురులు హతులయ్యారు. కొద్దిమంది పలాయనమయ్యారు.

కురువాహిని పురుగ్రామంవైపుకు సాగిపోయింది. ఆ వూరు నాలుగుక్రోసులకు పైనవుంది. గ్రామమంతా శూన్యంగావుంది. ప్రజలు దేశాలను విడిచి కాళ్ళకు బుద్ధి చెప్పారు. వారి పశువులు అన్నిచోట్లా మేస్తున్నాయి. కాని కురులు ముందు పురుల పని పట్టించాల్సివున్నారు. పురులు పుప్పిలో చిక్కుకొనిపోయారు. పై భాగానికి పారిపోవడానికి సావకాశంలేదు. పర్వతమార్గం మరింత ఒడుపు తిరిగినచోటికి చేరారు. అంతేకాక ఎక్కడానికి వీలులేనంత ఏటవాలువుంది. అయిననూ ప్రాణ

సంరక్షణార్థం స్త్రీపురుషులు గుఱ్ఱాలమీదనే పారిపోతున్నారు. తుదకు గుఱ్ఱాలు ముందుకుసాగ వీలులేకపోయింది. అందువల్ల నడక ప్రారంభించారు. కురులు వారిని సమీపించారు. పిల్లలూ, ముసలాళ్లూ, స్త్రీలూ, వేగంగా ముందుకు సాగలేరు కనుక వారికి పరుగెత్తే అవకాశమివ్వడానికి కొందరు కురుభటులు ఒక యిరుకుచోట నిలబడి పోయారు. యీ స్థలంలో తమ బలాన్నంతటినీ వుపయోగించజాలరు, కనుక పురులనుండి మార్గాన్ని నిరాటంకం చేయటానికి కొన్ని గంటలు పట్టింది. పురులూ కురులుకూడా యిప్పుడు కాలినడకనే వున్నారు. కాని పురుల్లో కొద్దిమంది మాత్రమే పురుషులు మిగిలారు. అందువల్ల యెంతోకాలం వాళ్ళు తమ పరివారాన్ని రక్షించలేరు. కాబట్టి ఒకరోజున కొద్దిమంది సాహసికాండ్రగు స్త్రీలను తీసుకొని ఒక దుర్గమమైన మార్గంద్వారా ఆ పర్వత సముప్రదేశాన్ని విడిచి; పర్వతాలను దాటి దక్షిణానికి తరలిపోయారు. అక్కడక్కడ దాగి ప్రాణభిక్ష కోరుతున్న బిడ్డల్నీ వృద్ధుల్నీ స్త్రీలను కురులు పట్టుకున్నారు. ఖైదీలుగా వుంచడం యీ పితృయుగంలో నియమవిరుద్ధమైన సంగతి. అందువల్ల వారు బిడ్డలనూ వృద్ధులనూ హతమార్చి స్త్రీలను తమ వెంట తీసుకొచ్చారు. పురులయావత్తు పశుధనము వారి వశమై పోయింది. యిప్పుడు ఆ పచ్చని నదీతీర సముప్రదేశమంతా క్రింద నుండి పైవరకూ కురుల పశువుల బీడయిపోయింది. మహాపితరుడు ఒకతరం వరకూ ఒక స్త్రీకంటె హెచ్చుమంది భార్యలను కలిగియుండుట శాస్త్రసమ్మతమని ప్రకటించాడు. ఈ కాలమునందే మొట్టమొదటిసారి కురుల్లో సవతులు ఏర్పడ్డారు.*

---

* [నేటికి రెండువందల తరాలనాటి ఒక ఆర్యజనసమూహానికి సంబంధించిన కథయిది. ఆ కాలంలో భారతావనికి ఉత్తరానికిచెందిన ఒక శ్వేతజాతుల సమితా ఉండేవి. ఈ రెంటియొక్క సమ్మిళితనామమే 'ఆర్యులు'. పశుపాలనమే వారి జీవనోపాధికి ముఖ్యసాధనం.]

# "పురుహూతుడు"

## (వాల్గవ కథ)

[దేశం-వక్షుఉపత్యకా (తాజికిస్తాన్); జాతి-ఇందో-ఇరానియన్;
కాలం - క్రీస్తుకు 2500 సంవత్సరాల పూర్వం.]

వక్షునదీ ప్రవాహం గరగరమంటూ మధ్యగా ప్రవహిస్తోంది. దానికి కుడి వైపున ప్రవాహాన్ని ఆనుకొని పర్వతపంక్తులున్నాయి. ఎడమవైపు భూమి చాలా ఏటవాలుగా వుండడంవల్ల లోయ వెడల్పుగా కనిపిస్తోంది. దూరాన్నుంచి చూస్తే ఉన్నతమైన దేవదారు వృక్షాల నలుపుతప్ప మరేమీ కనుపించడంలేదు. సమీపించిన తరువాత క్రిందిభాగం ఎక్కువ పొదవుగాను, పైకిపోయినకొద్దీ చిన్న శాఖలతో పాటు బాణాలవలె యున్న శృంగాలు కనబడుతున్నాయి. వాటిక్రింద అనేక వనస్పతులూ, యితరమొక్కలూ వున్నాయి. గ్రీష్మఋతువు ముగిసిపోయింది. వర్షాలు ప్రారంభం కాలేదు. ఉత్తర హిందూదేశపు మైదానాల్లో ప్రజలు వేడికి తాళ లేక విపరీతంగా విసిగిపోయి వుంటారు. కాని 7000 అడుగుల యెత్తుగలిగిన యీ పర్వత భూమిలో వేడిమి అడుగుబెట్టలేకపోతోంది. వక్షునదికి ఎడమవడ్డున ఒక యువకుడు పోతున్నాడు. అతని శరీరంపై ఉన్నికవచమూ, దానిపైన చాలాచుట్లు చుట్టబడిన నడుముకట్టూ, క్రిందభాగంలో ఉన్నిపైజామా, పాదాలకు తాళ్ళతో కట్టబడిన చెప్పులు వున్నాయి. శిరస్సుపై ధరించిన కోతిటోపీలాంటి వస్తువును తీసి వేసి, అతడు తనభుజంపైనున్న ఉత్తరీయంపై పెట్టుకొన్నాడు. దీర్ఘములై మెరుస్తూన్న అతని గోధుమవర్ణపు కేశములు వీపుపైని పడియుండి పిల్లగాలి విసుళ్ళకు అప్పుడప్పుడు అల్లల్లాడుతున్నాయి. అతని నడుమునుండి చర్మంతో చుట్టబడి ఒక రాగిఖడ్గం వ్రేలాడుతోంది. అతని సన్నని వీపుపై పుపుగుడుమువ్వలతో అల్లిన ఇలాసంవుంది. యువకుడు దానిలో యెన్నో యితరవస్తువులూ, తెరచియున్న ధనస్సూ బాణాలతో నిండినపొదిని కలిగియున్నాడు. అతనిచేతిలో ఒక దండంకూడా వుంది. విశ్రాంతి తీసుకుంటూన్నాడు. ఇప్పుడతడు ఎత్తైన ప్రదేశానికి పోవలసి వస్తోంది. అతని ముందు బలిష్ఠమైన 6 గొర్రెలు నడుస్తున్నాయి. వాటివీపులపైన గోధుమ పిండితోనూ, శనగపిండితోనూ నిండిన గుఱ్ఱపువెంట్రుకలతో అల్లినవి పెద్దపెద్ద

సంచులు వున్నాయి. యువకుని వెనుక ఒక యెఱ్ఱని బొంతకుక్క నడుస్తూంది. పక్షుల మధురగంభీరస్వరాలతో పర్వతప్రాంతం ప్రతిధ్వనిస్తూంది. అతడు అందువల్ల ఆకర్షితుడై ఈలవేస్తున్నాడు.

ఇక్కడ ఒక రాతిగుట్టనుంచి సన్నని తెల్లటిధారగా పడుతూన్న సెలయేరు చూచాడు. ఆ ధార రాళ్ళనుండికాక సరిగా క్రిందపడ్డానికి ఎవరో ఒక కర్రగొట్టాన్ని తగిలించారు. గొఱ్ఱెలు అలసి క్రిందపడుతున్న నీళ్ళుత్రాగుతున్నాయి. యువకుడు దగ్గరలోనే తీగెలలో చిక్కుకొనియున్న చిన్నచిన్న ద్రాక్షగుత్తుల్ని చూచాడు. తన గోతాన్ని క్రిందికి దింపి ద్రాక్షలు తృప్తిగా తిననారంభించాడు. ద్రాక్షపండ్లలో యింకా పగరుతోకూడిన పులుపు జాస్తిగావుంది. అవి పండుటకు యింకా ఒకనెల పడుతుంది. కాని అవికూడా బాగున్నాయి. అందుచేత ఒక్కొక్కటే త్రుంచి నోట్లో విసురుకున్నాడు. బహుశా అతడు చాలా దప్పిగొనివుంటాడు. అలసినవానికి చన్నీళ్ళు చెరుపు చేస్తాయి. అందువల్ల దప్పిగాయున్నా అతడు ఇంకా నీళ్ళుత్రాగుట లేదు. గొఱ్ఱెలు నీళ్ళుత్రాగి పచ్చటి పచ్చికను మేస్తున్నాయి; బొంతకుక్కకు వేడి భరించుట అందరికంటె కష్టంగావుంది. అందువల్ల అది తన యజమానితోగాని గొఱ్ఱెలతోగాని పోక దారిలో పారుతున్న నీళ్ళలోకిపోయి పడుకుంది. అది యింకా ఆయాసపడుతోంది. దాని పొడుగాటి ఎఱ్ఱని నాలుక వ్రేలాడి లప లప లాడుతోంది. యువకుడు ధారక్రింద నోరుపెట్టి తలవెంట్రుకల ముందుజడను తడుపుకుంటూ ముఖ ప్రక్షాళనం పూర్తిచేశాడు. అతని యెఱ్ఱనిబుగ్గల్ని దొండపళ్ళలాంటి పెదవుల్ని కప్పడానికి గోధుమవర్ణపు నూనూగుమీసాలు యిప్పుడిప్పుడే మొలకెత్తుతున్నాయి. గొఱ్ఱెలు మైమరచి మేస్తుండడంచూచి యువకుడు తన మూటవద్ద కూర్చున్నాడు. చెవులు నిగిడించి తనవైపు చూస్తున్న బొంతకుక్క చూపులభావాన్ని గ్రహించి తన గోతంలోంచి ఎండు గొఱ్ఱెమాంసపుముక్కను తీసి తన నడుమునకున్న పటకాలోని పదునైన రాతికత్తితోకోసి కొంచెం తానుతింటూ మరికొంచెం కుక్కముందు వేశాడు. యింతలో కర్రగంట ఖణఖణ శబ్దం వినబడింది. పొదచాటునుంచి సగంమాత్రమే కనిపిస్తూ రెండుగాడిదలు ఒకదానితరువాత మరొకటి రావడం అతడుచూచాడు. వాటి వెనుక 16 సంవత్సరముల వయస్సుగల యువతి సరిగా తనవలెనే దుస్తులుధరించి, వీపుమీద గోతం తగిలించుకొని రావడం చూచాడు. నోటినుండి సహజంగా ఈల మ్రోగనారంభించింది. అతనికి ఉచ్ఛ్వాస నిశ్వాసము లెంతసహజమో, ఆలోచనలో నోటినుండి ఈలపాట రావటం అంత స్వాభావికమైపోయింది. యువతికి ఈలశబ్దం

4)

వినపడింది. ఆమె అవైపు చూచిందికూడా. కాని యువకుని శరీరం లతలతో కప్పబడి యుంది. అతడామెను 50 బారల దూరాన్నుంచి చూచాడు. చైనా యువతి ముఖంవంటి నాజూకైన బహుఅందమైన ఆకృతి అతని హృదయఫలకంమీద పడింది. ఆమె యెక్కడికి పోతుందో తెలుసుకొనవలెనని చాలా ఆతురతతో నిరీక్షిస్తున్నాడు. ఇటు వక్షునది ఉపరిభాగంలో ఎక్కడా గ్రామం లేదని అతనికితెలుసు. అందువల్ల తన వలెనే ఆమెకూడా బాటసారిణియని తెలుసుకోగలిగాడు.

యువతియొక్క అపరిచితమైన అందమగు ముఖాన్ని చూచి బొచ్చుకుక్క మొరగడం మొదలెట్టింది. యువకుడు 'ఊరుకో ఝబరా' అనగానే అది మెదల కుండా అక్కడే చతికిలబడిపోయింది. యువతియొక్క గాడిదలు నీళ్ళుత్రాగసాగాయి. ఆమె తనగోతాన్ని దింపుకొనబోగా యువకుడు తన బలీయమైన భుజములలో బరువునందుకొని క్రిందపెట్టాడు. యువతి చిరునవ్వులో తనకృతజ్ఞతను తెలుపుతూ—

'చాలా ఉక్కగావుంది!'

'ఉక్కకాదు. ఎత్తునెక్కుటవల్ల అలాగేవుంటుంది. కొంచెం విశ్రమించగానే చమట తగ్గిపోతుంది.'

'ఇవాళ వాతావరణం బాగానేవుంది.'

'యింకా పదిపదిహేను రోజులవరకూ వర్షభయంలేదు.'

'వర్షాలంటే నాకుభయం. నదులు మార్గావరోధంగా ఉంటాయి; జారుడువల్ల ప్రయాణం సాగదు.'

'గాడిదలకు నడక మరీకష్టమౌతుంది.'

'మాకు గొఱ్ఱెలులేవు. అందువల్ల గాడిదెలను తీసుకొచ్చా. సరేకాని, ఈ నీ ప్రయాణం ఎక్కడికి మిత్రమా?'

'పొలిమేరకు పోతున్నా. ఈమధ్య మాగొఱ్ఱెలు, ఆవులు, గుర్రాలూ అక్కడే వున్నాయి.'

'నేనూ అక్కడికే. పిండి, ధాన్యం, ఫలాలు, ఉప్పుతీసుకుపోతున్నా!'

'నీ పశువుల్ని ఎవరు చూస్తున్నారు?'

'మా ముత్తాత, సోదరుడు, తోబుట్టినవాళ్ళూను.'

'నీ ముత్తాత చాలా వృద్ధుడనుకొంటా.'

'చాలా. అంతముసలాడు బహుశా యెక్కడాఉండడు.'

'అయితే అతడు ఏలాగున పశువుల్ని చూడగలడు?'

'అతడు యింకా ఎంతో బలంగావున్నాడు. అతని తలవెంట్రుకలు, కనుబొమ్మలు అన్నీ తెల్లబడిపోయాయి. కాని అతని పళ్ళుగట్టిగా వున్నాయి. చూపులకు 50 లేక 55 ఏండ్లవాడిలా వుంటాడు.'

'అయితే అతడిని యింట్లోనే వుంచాలి.'

'అసలు అతడు కదలడుగా! నేను పుట్టకముందునుంచి ఆయనగారు ఏవూరు పోలేదు.'

'ఏఊరికీపోడూ?'

'వెళ్ళగోరడు. ఊరంటే అతనికసహ్యం. మనుష్యుడు ఒకచోట కట్టుబడియుండుటకు పుట్టలేదంటాడు. పుక్కిటి పురాణాలెన్నో చెబుతాడు. సరేకాని నీపేరేమిటి మిత్రమా?'

'మాద్రీ-పుత్రపౌరవ పురుహూతుడు.'

'నీ పేరేమి సోదరీ?'

'రోచనా మాద్రి.'

'అయితే నువ్వు మా మేనమామల కులానికి చెందినదానవు. సోదరీ! మీరు ఎగువమద్రులా? దిగువవారా?'

'ఎగువమద్రులమే.'

వక్షునది ఎడమతీరాన్ని పురుల గ్రామాలున్నాయి. కాని దాని క్రిందిభాగం - ఏదయితే క్రిందిమైదానంలో కలుస్తుందో - అది మద్రులవంశంలోవుంది. కుడివైపు తీరమంతా పైభాగం మద్రులచేతుల్లోనూ క్రిందిభాగం పరుషులచేతుల్లోనూ వుంది. విస్తీర్ణం జనసంఖ్యలనుచూస్తే పరుషులు మద్రులకంటె తక్కువగాలేరు. పురుషులకు

దిగువనున్న మద్రులు దిగువమద్రులుగా పిలువబడుతుండేవారు. రోచన పైభాగపు మద్రులకు చెందినది. పురుహూతు మేనమామ గ్రామంకూడా పైమద్రులభాగంలో వుంది. యీ విషయాన్ని తెలుసుకొన్న తరువాత వారిమధ్య ఆత్మీయత హెచ్చింది. పురుహూతుడు 'రోచనా! నేడు మనం సరిహద్దు చేరలేం. నీవు ఒంటరిగా రావడానికెట్లా సాహసించావు?'

'రాత్రివేళ చిరుతపులుల నుంచి గాడిదలను రక్షించడం దుర్ఘటమని నేనెరుగుదును. కాని తాతకు తిండిసామాన్లు చేర్చడం అత్యవసరం. పురుహూత్! మా తాతకు నేనంటే ఎంతో యిష్టం. ఇటీవల చాలామంది సరిహద్దుకు పోతున్నారు. కాబట్టి ఏవరో ఒకరు దారిలో తటస్థపడగలరని భావించాను. నిప్పుసహాయంతో పనిజరుపుకోవచ్చు ననికూడా ఆలోచించాను.'

'ప్రయాణంచేస్తూ నిప్పు వెలిగించడం వీలుపడదు. నీవద్ద *అరణివుందా రోచనా?'

'ఆ: వుంది'

'అయినా! అరణిని రాపిడిచేసి నిప్పుచేయడం తేలికకాదు. సరే నాదగ్గఱ ఒక అరణివుంది. అది మా పితామహునికాలంనుంచి మా యింట్లోవుంది. ఈ అరణి నుంచి వెలువడిన అగ్నిద్వారా ఎన్నో యజ్ఞాలు, దేవపూజలు జరిగాయి. నాకు అగ్నిదేవుని మంత్రంకూడా జ్ఞాపకముంది. అందుచేత అగ్ని త్వరగా ప్రసన్న మౌతుంది.'

'పురుహూత్! యిప్పుడు మనం యిద్దరంవున్నాం. అందువల్ల చిరుతపులి మనదగ్గరకు రావడానికి సాహసించదు.'

'మనఝబరా (బొచ్చుకుక్క) కూడావుంది రోచనా.'

'ఝబరా'

---

* అరణి – ఆకాలంలో నిప్పు పుట్టించడానికి ప్రత్యేకమైన పుల్లలను ఒక దానితో ఒకటి రాపిడిచేసేవారు. ఇప్పటికీ, యాగములలోను, యజ్ఞాల్లోనూ పుల్లలలో చేసిన అగ్నినే వాడుతారు. ఆపుల్లలను 'అరణి' అంటారు.

'అవును యీ ఎఱ్ఱపక్కి'

"ఝబరా, ఝబరా" అని అతడు పిలువగానే అది లేచి నిల్చొని యజమానుని చేయి నాక మొదలెట్టింది. రోచనాకూడా "ఝబరా, ఝబరా" అని పిలిచింది. కుక్కవచ్చి ఆమెకాళ్ళను వాసన చూడసాగింది. రోచనా దాని వీపుమీద చేయివేసి నిమరగానే ఝబరా తోకాడిస్తూ, ఆమె కాళ్ళలోనికి పోయి పండుకొంది.

"రోచనా! ఇది చాలా తెలివిగలది"

"బలిష్ఠమైందికూడా", అంది.

"అవును తోడేలుకు, భల్లూకానికి, చిరుతపులికి దేనికీ ఇది భయపడదు.'

గొఱ్ఱెయూ గాడిదలూ యిప్పటికి బాగా మేశాయి. అలసట తీరిపోయింది. అందుచే యువతీయువకులిద్దరూ తిరిగి ప్రయాణం సాగించారు. ఝబరా వారి వెను వెంట పోతోంది. వారు నడిచిపోయే మార్గం వంకరలు తిరిగి కఠినంగావుంది. అందుచేత నెమ్మదిగా సాగుతున్నారు. పురుహూతుడు నేలకు తగులుచున్న స్ట్రాబెరి (చలిప్రదేశంలో వుండే) ఫలాల్ని, మరొకచోట వాక్కాయల్ని కోస్తాడు. వాటిని రోచనకుకూడా యిస్తున్నాడు. మంచి మంచి పండ్లు యింకా ముగ్గలేదని అతని మొర. సాయంకాలంవరకూ వారు యిదే విధంగా మాట్లాడుకుంటూ యెగువకు పోయారు. సూర్యాస్తమయమౌతోంది. దగ్గరలోనున్న ఒక పొదక్రిందనుండి గల గల శబ్దం చేసుకుంటూ ప్రవహిస్తున్న నీటిధారను చూచాడు. దగ్గరలోనే ఒకచోట సగం కాలిన కట్టెముక్కలూ, బూడిదా, గుఱ్ఱపులద్దెలూ, పడివున్నాయి. పురు హూతుడు బూడిదను కదిపాడు. దానిలో నిప్పు అణగివుంది. అతడు అపరిమితా నంద భరితుడౌతూ 'రోచనా! రాత్రిమకాంకు యింతకన్న మంచి స్థలం లభించదు. దగ్గిరలో నీళ్ళున్నాయి. గడ్డి అధికంగావుంది. ఎండుపుల్లలుకూడా వున్నాయి. ఇంతే కాకుండా ఉదయం యిక్కడనుండి పయనమైపోయిన బాటసారి అగ్నిని బూడిద క్రింద అణచిపోయాడు'

'అవును పురుహూత్! యింతకన్న మంచిచోటు చిక్కదు. ఇక్కడే రాత్రికి ఆగుదాం. ముందుకు పోయేసరికి చీకటిపడి పోతుంది.' అంది.

పురుహూతుడు తక్షణం తన గోతాన్ని దింపివేసి, రోచనా గోతాన్ని కూడా దింపాడు. ఇద్దరూకలసి గాడిదలపైనున్న బరువును దింపేశారు. వాటికట్టులన్ని

విప్పివేశారు. గాడిదలు యిటూఅటూ రెండుసార్లు దొర్లి, మేతకు పోయాయి. గొర్రెల్ని బలవంతంగా పట్టుకు లాగుకొనిరావలసి వచ్చుటవల్ల వాటి బరువులు దింపడం ఆలస్యమైంది. రోచన నీళ్ళునింపే తిత్తిని తీసుకొని నీటివద్దకుపోయింది. పురుహూతుడు ఆకులూ చిన్న పుల్లలూవేసి నిప్పురాజేసి, కట్టెలు తగిలించి పెద్ద మంట తయారుచేశాడు. రోచనా నీళ్ళునింపుకొని వచ్చేసరికి పురుహూతుడు రాగి పాత్ర ముందెట్టుకొని ఆవుకాలులోని నాల్గోవంతు ముక్కను చాకుతోకోస్తూ రోచనతో 'రేపు సాయంకాలానికే మనం ఎగువకుచేరుతాం. నీసమూహం దగ్గరలోనే వుంటుంది.'

'మనం చేరబోయే ఎల్లకు, తూర్పుగా మూడు క్రోసులదూరం వుంటుంది.'

'నాది ఆరుకోసులు తూర్పునవుంది. రోచనా నీతాత సమూహం నాదారిలోనే వుంటుంది.'

'అయితే నీవు మా తాతను చూడగలవు. మాతాత నిన్ను చూడడం ఎట్టా సాధ్యమాయని ఆలోచిస్తున్నాను.'

'యింకొక రోజేకదావుంది. అందువల్ల పాతికతొడ చాలు. పైగా యిది వెనుకభాగందికూడాను. రోచనా!'

'నావద్ద లేగదూడ కాలువుంది. ఈరోజుల్లో మాంసం ఎక్కువ కాలం నిల వుంటే వాసనొస్తుందికదా!'

'ఉప్పువేసి మాంసం వుడకబెడితే యెట్లావుంటుంది?'

'చాలాబాగుంటుంది. నాదగ్గర వుప్పుకూడావుంది. మాంసం వుడకబెట్టి ఆఖరున కొంచెం పిండికూడా కలిపితే చక్కని సూప్ తయారవుతుంది. నిద్రపోయే ముందు సూప్ దొరుకుతుంది.'

'నేనొంటరిగావుంటే సూప్ తయారుచేసేవాణ్ణికాదు. చాలా సేపుపడుతుంది. మనకు అంతవరకూ పశువుల్ని కట్టెయ్యడంలోను బాతాఖానీతోనూ సరిపోతుంది.'

'మాతాత నేనువండిన సూపునెంతో మెచ్చుకొంటాడు. పురుహూత్! పైగా యిది రాగిపాత్ర.'

'అవును. రాగి చాలాఖరీదు రోచనా! ఈపాత్ర ఒక గుర్రపు విలువచేస్తుంది. కాని యిది ప్రయాణంలో ఎంతో వీలు.'

'నీయింటిదగ్గర చాలాపశువులుంటాయనుకొంటా!'

'చాలాధాన్యంకూడాను రోచనా! అందువల్లనే ఈపాత్ర ఒక గుఱ్ఱపువెలసరే యిది తీసుకో. నేను మాంసంకోశాను. నీళ్ళు ఉప్పు వేసి నువ్వు మాంసాన్ని నిప్పుమీదపెట్టు. నేను నిప్పు తయారుచేస్తాను. తరువాత కొంచెం గడ్డికోసి గాడిదల్నీ గొఱ్ఱెల్నీ మధ్యగా యిక్కడ కట్టెయ్యాలి. నీకు తెలుసా మనకు ఆవుదూడమాంసం యెంత రుచికరమో, చిరుతపులికి గాడిదమాంసం అంతకన్న యెక్కువరుచి. యుబ్బర్! అంతవరకూ నీవుకూడా తింటూవుండు' అంటూ ఒక మాంసపు ముడుసును కుక్కకు విసిరేశాడు. అది తోకాడించుకుంటూ దానిని కాలితో త్రొక్కిపట్టి, దంతాలతో విరుగగొట్టడానికి ప్రయత్నిస్తూంది. పురుహూతుడు రోమకవచాన్నీ, నడుం కట్టును తొలగించాడు. చేతుల్లేని జుబ్బాలోంచి ఆతని విశాలమైన వక్షస్థలం, కండలు తేరిన బాహువులు, 20 సం॥రముల వయస్సుగల అతని బలమును వెల్లడిస్తున్నాయి. అంగ ప్రత్యంగాలు మరింత ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. గోతంలోంచి కొడవలి తీసి మాటల్లోనే పెద్ద గడ్డిమోపు కోశాడు. చెవులు పట్టుకొని గాడిదలను గొఱ్ఱెలను తీసుకొనివచ్చి వాటినికట్టేసి వాటిముందు యింత గడ్డిమోపు పారేశాడు. పనిపూర్తి చేసుకొని పురుహూతుడు కూడా అగ్ని వద్దకు వచ్చాడు. రోచన ఉడికిన మాంసపు ముక్కల్ని బయటకుతీసి చర్మంపై వుంచుతోంది, పురుహూతుడు గోతంనుండి ఒక చర్మంతీసి బయటవరిచి, కర్రపాత్రతో పానీయాన్నికూడా తీసి బయటపెట్టాడు. అది తీస్తూంటే పిల్లనగ్రోవి పైకివచ్చి క్రిందపడిపోయింది. కోమలమైన చంటిబిడ్డ చేయిజారి క్రిందపడితే తల్లిపొందే మనోవేదననే ఆతడు పొందాడు. వెంటనే పిల్లనగ్రోవిని నేలనుంచి తీసికొనితుడిచి ముద్దాడి పదిలంగా గోతంలో పెట్టబోతున్నాడు. రోచన యిదంతాచూచి 'పురుహూత్, నీవు మురళి వాయిస్తావా?'

'ఈమురళి నాకు చాలా ప్రియమైనది, రోచనా! నాప్రాణాలు దీనిలోనే కాపురముంటూన్నట్లనిపిస్తుంది నాకు.'

'నాకు పిల్లనగ్రోవి వినిపిస్తావా పురుహూత్?'

'ఇప్పుడేనా! భోజనానంతరం.'

'ఇప్పుడే వాయించు కొంతసేపు.'

సరేఅని పురుహూతుడు పిల్లనగ్రోవిని పెదవులకుచేర్చి ఎనిమిది వ్రేళ్ళనూ దానిరంధ్రాలపై ఆడించడం మొదలెట్టినప్పుడు విశాల వృక్షచ్ఛాయలనుండి క్రమ్ము కొస్తున్న కనుచీకటీ, ఆ ప్రశాంత వాతావరణంలో దిగంతాల్ని ప్రతిధ్వనింపచేసే ఆమధురధ్వని నలుదిక్కులా ఇంద్రజాలాన్నే ప్రసరింపచేస్తోందా యనిపించింది. రోచనా మైమరచి తన్మయత్వంతో ఆధ్వని నాలకిస్తోంది. పురుహూతుడు తన పిల్లనగ్రోవిపై ఊర్వశీ వియోగంవల్ల వ్యాకులుడైన పురూరవుని విరహగీతాన్ని ఆలాపిస్తున్నాడు. పాట ఆగిపోగానే రోచనకు తనని స్వర్గాన్నుంచి నేలపై పడ త్రోసినట్లు తోచింది. ఆమె ఆనందాశ్రువులతో 'పురుహూత! నీపిల్లనగ్రోవి పాట బహు మధురంగావుంది. నేనింతవరకూ లయలో కూడిన యీలాంటి మురళీగానం విననేలేదు.'

'అందరూ అలాగే అంటారు. అదేమో నాకు తెలియదు. మురళిని పెదవులకు చేర్చగానే నన్ను నేనే మరచిపోతాను. ఈమురళి నాదగ్గరవుంటే ఈ ప్రపంచంలో దేనితోనూ నాకు నిమిత్తంలేదు.'

'సరే. రా, పురు! యిక మాంసం చల్లారిపోతుంది.'

'రోచనా! నేను ఇంటినుంచి బయలుదేరునప్పుడు మా అమ్మ యీద్రాక్షాసవం (సుర) యిచ్చింది. కొద్దిగావుంది. మాంసంతోపాటు యిది త్రాగితే బాగుంటుంది.'

'మద్యం నీకు ప్రియమేనా ?'

'అంత యిష్టమనిచెప్పలేను. రోచనా ! ప్రీతికి అంతులేదుకదా ! దాని కళ్ళు కొంచెం ఎరుపెక్కినట్లు తోచగానే మరొక గుటకకూడా వేయలేను.'

'నేనూ అంతే. మత్తెక్కి, ఒళ్ళుతెలియని వారిని చూస్తే నాకు చాలా అసహ్యం వేస్తుంది.'

రోచన ఒక కొయ్యదొన్నెను తీసి దానిలోని మూడోవంతు మాంసం యుబ్బర్‌కు వేసింది. ఇద్దరూ మెల్లిగా భోజనం పూర్తిచేశారు. ఇంతలో చీకటి పడింది. కట్టెలతో భగభగమండుతూన్న అగ్నిహోత్రుని అరుణకాంతిలో ఆచుట్టు

ప్రక్కల కొద్దిజాగాతప్ప అక్కడ మరేమీ అగుపడ్డంలేదు. అప్పుడప్పుడు ఏవో కొద్ది ధ్వనులు మాత్రం వినబడుతున్నాయి. అవి పురుగుల, క్షుద్రజంతువుల ధ్వని కావచ్చు. మాటలూ, మధ్యమధ్య మురళీగానం కూడా నడుస్తోంది. బాగా పిండితో ఉడికిన సూప్‌కూడా తయారైంది. ఇరువురు గిన్నెలతో వేడివేడి సూప్ త్రాగారు. రోచన చర్మముతో తయారైన ప్రక్కను వేసుకొని, తాను బట్టువిడిచే యత్నంలో వుంది. పురుహూతుడు అగ్నికి మరిన్ని పుల్లలుచేర్చాడు. పశువులముందు గడ్డేశాడు. వనదేవతల్ను ప్రార్థించాడు. బట్టలువిడిచి పడుకొని నిద్రపోయాడు. వాళ్ళు ఉదయం లేచి ఒకరినొకరు సాక్షాత్తు సోదరీసోదరులవలె భావించ సాగారు. రోచన లేచిన వెంటనే పురుహూతుడు తన సంతోషం ఆపుకోలేక 'నామనస్సు నిన్ను ముద్దాడ గోరుతోంది. సోదరీ రోచనా!'

రోచన-'నేనుకూడానిన్ను....పురు! యీ ప్రపంచంలో మనం అన్నా చెల్లెళ్ళ వలె ఉన్నాం.'

పురుహూతుడు చెదరిపోయిన ఆమె తలవెంట్రుకలను సర్దుతూ, మృదువైన రెండుచెక్కిళ్ళూ ముద్దాడాడు. వారిముఖాలు ప్రసన్నంగాను, నేత్రాలు చెమ్మగిలీ వున్నాయి. ముఖాలు కడుక్కొని వాళ్ళు కొంచెం పిండీ ఎండుమాంసమూ తిని పశువులపై బరువువేసి మళ్ళీ బయల్దేరారు. మార్గమధ్యంలో మరి రెండుమూడు చోట్ల వాళ్ళు విశ్రమించారు. కాని మాటలసందడిలో ఎంత తేలికగా సరిహద్దుకూ మాద్రలాతవద్దకూ చేరగలిగారో వాళ్ళకు తెలియలేదు.

రోచన పురుహూతుని తాతకు పరిచయం చేసింది. పురువుల వీరత్వాన్ని ప్రశంసిస్తూ అతన్ని తాత ఆహ్వానించాడు.

---

## 2

ఈ సరిహద్దులో ఒక చిన్న గ్రామంవుంది. ఇక్కడి ఇళ్ళన్నీ, డేరాలు గడ్డిగుడిసెలూను. దిగువప్రాంతంలో ఎత్తైన పర్వతభూమిలోకూడా దట్టమైన దేవదారు వృక్షాలు అడివేసుకు పోయివుంటే, వృక్షాలు యిక్కడ పేరుకైనాలేవు.

ఇది సమతలభూమి. పచ్చని పచ్చికబయలు. ఈ మైదానంలోనే ఒకచోట గొఱ్ఱెలూ, యింకొకచోట ఆవులూ, మరొకచోట గుఱ్ఱాలూ మేస్తున్నాయి. వీటన్నిటి మధ్య అక్కడక్కడ చిన్నచిన్న గుఱ్ఱపుపిల్లలూ, కోడెలూ, కుప్పిగంతులేస్తూ ఆడుతున్నాయి. ఈ ప్రాంతాన్ని చూచే మాద్రతాత 'మనిషి ఒకేచోట బంధింపబడి వుండటానికి పుట్టించబడలేదు' అంటాడు. మాద్రతాత గుడారం ప్రస్తుతం ఇక్కడేవుంది. గడ్డితరిగిపోగానే ఆతడింకోచోటికి వెళ్ళిపోతాడు. యిక్కడ పాలు, పెరుగు, వెన్న, మాంసం, పుష్కలంగావున్నాయి. ప్రతి 15 లేక 20 రోజులకూ ఒకరు గ్రామంనుంచివచ్చి వెన్నా, మాంసం తీసుకుపోతుంటారు. చలికాలంలో యిచ్చట మంచు విపరీతం. వీలైతే తాత అప్పుడుమకాం యిక్కడే; కాని పశువులు మంచుతిని జీవించలేవుకదా? అందుచేత ఆయనగారు చుట్టుదారిని కొంచెం దిగువకు అడవిప్రదేశంలోకి వచ్చేస్తాడు. పశువులన్నీ దిగువకు గ్రామానికి చేరుకుంటాయి. ఆ ప్రాంతం విడిచిపోవడం తలపెడితే తాతకు వల్లమాలిన కోపం వచ్చి కొట్టొస్తాడు.

ప్రయాణికులిద్దరూ తాత డేరాకు చేరుసరికి ఇంకా ప్రొద్దుంది. అందుచేత సామాన్లు దింపినతరువాత తాత వారిని నవ్విస్తూ గుఱ్ఱపుపాలలోనున్న పెద్దకొయ్య గిన్నె తెచ్చి వారిముందు పెట్టాడు. నాలుగు మూడు గిన్నెలపాలలోనే వాళ్ళిద్దరి ప్రయాణప్పుబడలిక తీరిపోయింది. ఇంతలో సాయంకాలం లేగదూడలను గుఱ్ఱపు పిల్లల్ని తోలుకొని రోచనా సోదరసోదరులు, గ్రామంలోని యితరపశువులను చూచే యువతీయువకులూ వచ్చారు. రోచనా తాతదగ్గిర పురుహూతుని మురళీగానాన్ని యెంతో పొగడుతోంది. ఇక తాతలాంటి ఆనందజీవి పురుహూతుడ్నెట్లా విడుస్తాడు. ఆయనకూ ఆగోత్రం (మురా) లోని యితర యువతీయువకులకూ మురళీగానం బహుప్రియం. రాత్రి నృత్యం జరిగినప్పుడు అక్కడకూడా పురుహూతుడు తన కౌశల్యాన్ని గొప్పగా చూపాడు. తెల్లారిన తరువాత పురుహూతుడు శలవు తీసుకో గోరితే తాతెందుకెళ్ళనిస్తాడింతత్వరగా? మధ్యాహ్న భోజనానంతరం తాత ఆత్మ కథ ప్రారంభించాడు. గోతందగ్గిర ఉంచిన రాగిపాత్రను చూచి కథ ప్రారంభం అయింది. తాత యిలా మొదలెట్టాడు.

'ఈరాగిలోహాన్ని వ్యవసాయాన్నీచూచి నాహృదయం మండిపోతూంది. యీవస్తువులు వక్షునదియొడ్డుకు వచ్చిననాటినుండి నలువైపులా పాపం, అధర్మం పెరిగిపోయాయి. దేవతలుకూడా కుపితులైపోయారు. అంటురోగాలూ, ఎన్నో

ఇతరవ్యాధులు ప్రారంభమయాయి. పోట్లాటలూ, నరుకులూకూడా హెచ్చి పోయాయి.

'యింతకుముందివిలేవా తాతా' అన్నాడు పురుహూతుడు.

'లేదబ్బాయీ! యివి నా చిన్నతనంలో కొంచెం కొంచెం వచ్చాయి. మా తాత వీటిపేర్లుకూడా వినలేదు. అప్పుడు రాయి, ఎముకా, కొమ్మూ, కఱ్ఱ మొదలయిన వాటితో తయారైన ఆయుధాలే వుండేవి.'

'అయితే కఱ్ఱ (కలప) ఎట్లాకోసేవారు తాతా?'

'రాతిగొడ్డళ్ళతో'

'చాలాసేపు పడుతూవుండి వుంటుంది. బహుశా యింతబాగా తెగివుండవు.'

'ఇదిగో యీతొందరే అంతాధ్వంసం చేసేసింది. ఒక రాతి గొడ్డలి కోసం మనం రెండుమాసాల గ్రాసాన్ని కాని, సగం జీవితం పొడుగునా స్వారీకి పనికివచ్చే గుర్రాన్ని కాని ఖర్చుపెడుతున్నాము. ఒకదానితో అడవుల కడవులు నశింపజేయడం లేక గ్రామాన్నంతటినీ చంపేయడం జరుగుతోంది. కాని గ్రామం అడవిచెట్లలాగు నిరాయుధంగాలేదు. దానివద్దకూడా అదేవిధమయిన పదునైన గొడ్డలుంది. ఈ రాతిగొడ్డలొచ్చి యుద్ధాన్ని మరింత క్రూరతరం చేసేసింది. దీనిగాయం నుంచి విషంపుడుతోంది. పూర్వం బాణపుములుకులు రాతివి వుండేవి. అవి యిప్పటి వలె పదునైనవికావు. కాని నిపుణహస్తాలలో అవి చాలా శక్తివంతంగావుండేవి. ఇప్పుడీ రాగిములుకులతో ముక్కు పచ్చలారని పిల్లకాయలుకూడా పెద్దపులుల్ని వేటాడ గోరుతున్నారు. నిపుణుడగు ధనుర్ధారుణ్ణి కావాలని యిప్పుడు ఎవడైనా యెందుకు వాంఛిస్తాడు?'

'తాతా! నీఅభిప్రాయాల్లో ఒకదానితో నే నేకీభవిస్తున్నాను. మనిషి ఒక చోట బంధితుడై ఉండడానికి పుట్టలేదు.'

'అవునునాయనా! ప్రతిరోజూ ఒకేస్థలంలో మలవిసర్జనచేయడం యెంత అసహ్యంగా వుంటుంది. మనదేరా ఈవేళ యిక్కడుంది. పశువులిక్కడున్న తృణాన్ని మేసేస్తాయి. దీనికి చుట్టుప్రక్కల మనుష్యులవీ, పశువులవీ మల మూత్రాలు కనబడ్డం ప్రారంభిస్తాయి. అప్పుడు యీస్థలంవిడిచి యింకోస్థలానికి

వెడతాం. అక్కడ నవీనమైన పచ్చిక అధికంగా వుంటుంది. అచ్చట భూమీ, నీరూ, గాలీ ఎక్కువ పరిశుద్ధంగా వుంటాయి.'

'అవును తాతా! నాకుకూడా ఆలాంటి ప్రదేశమంటేనే చాలా యిష్టం. అట్టి చోటనే నామురళి యెక్కువ తియ్యగా పలుకుతుంది.'

'బాగాచెప్పావబ్బాయీ! పూర్వం మేము దేరాలగుంపునే గ్రామం అనేవాళ్ళం. ఈగుంపులు సంవత్సరంకాదు సరికదా, మూడు మాసాలుకూడా ఒకేచోట వుండేవి కాదు. కాని నేడు గ్రామాలు పుత్రపౌత్రాది భావిసంతతికొరకు తయారై పోతున్నాయి. గాలియైనా లోపలికిరాకుండా రాళ్ళతోనూ, మట్టితోను, కలపతోను గోడలు కడుతున్నారు. రాళ్ళతోను, కర్రలతోను, గడ్డితోను మిద్దెలూ, కప్పులూ వేస్తున్నారు. వాటిలోనికి గాలి ఎల్లావస్తుంది? పేరుకు అగ్నిని దేవుడనీ, వాయువుని దేవుడనీ అంటున్నారేకానీ వారియెడల మన హృదయాల్లో ఆ భక్తిగౌరవాలు లేవు. ఇందువల్లే నేడు యెన్ని కొత్త కొత్త రోగాలొస్తున్నాయో. ఓ సూర్యభగవానుడా! ఓ అశ్వనీకుమారా (దేవవైద్యా)! ఓ అగ్నిదేవా! యీ మానవులపై మీరు చూపిస్తున్న ఆగ్రహం తగినదే.'

'కాని తాతా! ఈ రాగిగొడ్డళ్ళనీ, రాగి ఖడ్గాలనీ, రాగిబాణాలనీ విడిచి ఎట్లా బ్రతకడం? వీటిని విసర్జిస్తే శత్రువులు మనల్ని ఒక్కరోజులో మింగెయ్యరా?'

'అవును వత్సా! రెండుమాసాల గ్రాసము లేక సగంజీవితం వరకూ ఉపయోగపడే అశ్వాన్ని సంతోషంగా ఇచ్చిపెట్టి ప్రజలు రాగిఖడ్గం కొనలేరు. వక్షుమాతను మచ్చుచెచ్చినవాళ్ళు దిగువనున్న మద్రులూ, కురులూను. వక్షునది యెంతదూరం వరకూ పోతుందో నేనేకాదు ఎవరూ ఎరుగరు. ఇల్లాంటి అవిద్యాలు ప్రేలేవాళ్ళే యీనది పృథ్వికి చిట్టచివరనున్న అపారమైన జలధిలోకి పోతోందని అంటారు. అవును ఇదిమాత్రం వాస్తవం. మద్రులూ, కురులూ నివసించే భూభాగం తరువాత వక్షునది పర్వతాలను విడిచి మైదానాల్లోకి పోతూంది. తరువాత అసత్యములాడే భగవద్విరోధుల భూమిఉంది. అక్కడ పొడుగైన కాళ్ళూ, చిన్న పర్వతాలవంటి శరీరాలుగల జంతువులు ఉంటాయంటారు. వాటి నేమంటారబ్బాయీ! జ్ఞాపకశక్తి అంతకంతకు క్షీణించిపోతూంది.'

'ఒంటె-(ఉష్ట్రకుతుర్, ఊ, ట్, ఒంటె) తాతా! కాని ఒక దిగువమాద్రుడు

ఒకనాడు 6 మాసాల వయస్సుగల ఒంటెపిల్లను తెచ్చాడు. అది పర్వతమంత వుండదు. కాని మన గుర్రమంత వుంటుంది.'

'అవునా నాయనా! బయటదేశాలు తిరిగివచ్చేవాళ్ళు అబద్ధాలాడుట ఎక్కువగా నేర్చుకుంటారు. – ఏమంటారు దాన్ని?'

'ఒంటె'

'ఆ ఒంటె వక్షునదికి యీవొడ్డున నిలబడి అద్దరినున్న గడ్డిని మేయగలదనీ, దానిమెడ అంతపొడుగనీ వర్ణిస్తారు. యిదికూడా అబద్ధమేకదూ నాయనా?'

'అవును రాజా: ఆ ఒంటెపిల్ల మెడ గుర్రపుమెడకన్న నిశ్చయంగా పెద్దదే; కాని అద్దరివడ్డు గడ్డిని ఇద్దరినుంచి మేయగలదనుట శుద్ధఅబద్ధం.'

'అబద్ధాలకోరులైన యీ మద్రులూ, పురులూ, రాగిఆయుధాలవల్ల అనేక రోగాల్ని వ్యాపింపజేశారు. పర్శువులు ఉత్తర మద్రులగు మాపై వీటితోనే దాడిచేశారు. యిది మా తండ్రికాలంనాటి మాట. రెండురెండు గుర్రాలనిచ్చి ఒక్కొక్క రాతి గొడ్డలిని వాళ్ళ దిగువమద్రులనుంచి కొన్నారు.

'రాగి గొడ్డళ్ళముందు రాతిగొడ్డళ్ళు నిరుపయోగమయ్యేవికదా! తాతా?'

'అవును నిరుపయోగంగానే వుండిపోయినాయనా! అందుచేతనే మద్రులు విరివిగా రాగి ఆయుధాలు కొనవలసివచ్చింది. పురువులపైన దిగువ దాడిచేసినప్పుడు మీవాళ్ళ మద్రులగు మావద్దనుంచి రాగి శస్త్రాలను కొన్నారు. ఉత్తర మద్రులకీ, పురువులకూ మధ్య ఎప్పుడూ తగాదా వినలేదన్నాయి! కాని పర్శులూ, దిగువ మద్రులూ, ఎల్లప్పుడూ దొంగపనులు చేస్తూవచ్చారు. సదా పురాతన ధర్మాలను విడిచి, కొత్తవి మాట్లాడుతూవచ్చారు. వారివల్లనే మనవాళ్ళుకూడా తమప్రాణరక్షణార్థం వారి ననుసరింప వలసివచ్చింది. దిగువమద్రులూ పర్శులుకూడా అయఃకాంత శస్త్రాలను (రాగి ఆయుధాల్ని) విడిచిపెట్టనంతవరకూ, పైభాగంలోనున్న మనంవాటిని విడిచి పెట్టడం ఆత్మహత్య చేసుకోడమని నా అభిప్రాయం. నాయనా! ఈ రాగి ఇంత వ్యాప్తి యగుట చాలా చెడుగు అని నానిశ్చితాభిప్రాయం. ఈ పాపాన్ని వ్యాపింపజేసిన ఈ రెండు జాతులకూ భగవదాశీర్వాదం ఎన్నటికి లభించదు. వీరు తప్పక ఘోరాంధకార బంధురమైన పాతాళంలోనికి పోతారు. వాళ్ళను చూచియే, వీళ్ళకుభయపడినందుననే,

మనమట్టిగ్రామాలు మళ్ళీ రాతి గ్రామాలయ్యాయి. పూర్వం ఇదిగో యీలాంటి డేరాలవి; నేడిక్కడా, రేపక్కడా నివశించేటటువంటి గ్రామాలు వక్షునదీగర్భంలో వున్నాయి. కాని ఈ మద్రులు, పర్శులు దీన్ని ముక్కలుచేశారు. ఎక్కడచూచి వచ్చారో; వీళ్ళు ఈరాగి అస్త్రాలతోనే భూమాతహృదయాన్ని చీల్చేశారు. ఈలాంటి పాపం యిదివరకెప్పుడూ ఎవరూ చేయలేదు. నాయనా! భూమిని మాతృదేవత అంటాంకదా!'

'అవును తాతగారూ! భూమిని భూమాత అంటారు! దేవీ యంటారు! ఆమెను పూజిస్తారు.'

'ఆ ధరిత్రీమాత హృదయాన్ని ఈ పాపులు తమచేతులారా చీల్చేశారు. ఇంకేంచేశారు, పేరు మరచిపోతున్నాను. జ్ఞాపకశక్తి పనిచేయుటలేదు నాయనా!'

'కృషి, వ్యవసాయం (సాగు).'

'అవును వ్యవసాయం (సాగు) చేశారు. గోధుమలు చల్లారు. వరి, యవలు నాటారు. ఇంతవరకూ ఎన్నడూ యిది విననైనాలేదు. మన పూర్వులెన్నడూ ధరిత్రీ మాత (భూమాత హృదయాన్ని చీల్చలేదు. దేవిని అవమానపరచ లేదు. భూమాత మన పశువులకు గడ్డినిచ్చేది. భూమాత అరణ్యాలలో తియ్యని ఫలాలు ఉండేవి. మనము ఎన్నితిన్నాతరిగేవికావు. కాని ఈ మద్రుల పాపకారణంగా మొలలోతు పెరుగుతూండిన గడ్డంతా ఏమైపోయిందో? ఇప్పుడు ఆ బలిష్టమైన ఆవులన్నీ ఏమైనాయి? వాటిల్లో ఒక్కఆవు యావత్తు మద్రసమూహానికీ ఒకరోజు భోజనానికి సరిపోయేది. ఆ ఆవులు ఏమయ్యాయో! అవి నేడులేవు. ఆగొర్రెలూ లేవు. అడవిలేళ్ళూ, భల్లూకాలుకూడా అప్పుడు బ్రతికినంతకాలం బ్రతుకుటలేదు. ఇదంతా భూదేవి కోపకారణంగా వచ్చిందితప్ప మరేమీకాదు నాయనా!'

'తాతా! మీరెన్ని శరదృతువులు చూచారు?'

'నూటపైగా నాయనా! ఆకాలంలో మా గ్రామంలో పది మట్టిడేరాలుండేవి. ఇప్పుడు మట్టిఇండ్లు' రాతిగృహాలూ నూరున్నాయి. పొలాలూ వ్యవసాయం లేని ఆరోజుల్లో మాకు అస్థిరగ్రామాలు ఉండేవి. వ్యవసాయం వచ్చేశాక గోధుమల్ని లేళ్ళుతినేయకుండా చూడడం, యితర పశువులనుండి కాపాడడం వుండేవి. పొలాలు,

మనుష్యుల్ని కట్టివేసి యుంచుటకు కట్రాడుకర్రలై పోవాలా? కాని పత్నా! మానవుడొకచోట కట్టుబడియుండుటకు పుట్టలేదు. మానవుల కోసం, దేవతలుచేయని పని యీ మద్రులూ, పర్శులూ చేసి చూపించారు.'

'అవునుగాని రాజా! కావాలంటే మాత్రం మనం యిపుడే వ్యవసాయాన్ని విడువగలమా? నేడు మనం తినే ఆహారంలో సగభాగం ధాన్యమే.'

'అవును నాయనా! నేను ఒప్పుకుంటాను! కాని ధాన్యం మనపూర్వులు తినేవారుకాదు. ఇక్కడికి 25 క్రోసులు దక్షిణంగా గోధుమ అడవిఉంది. అక్కడ గోధుమలు వాటంతట అవే మొలుస్తాయి. ఎవరిసృష్టి లేకనే పండి నేలపై రాలి పోతాయి. వాటిని ఆవులతిని ఎక్కువగా పాలిస్తాయి. గుర్రాలు ఏంటాయి? బలిష్ఠంగా ఉంటాయి. ప్రతిసంవత్సరం మనపశువులు అక్కడికిపోతాయి. భూదేవి ధాన్యాలను మనకోసం కనలేదు. వాటిగింజలు నేడు మనపొలంలో పండేవాటికన్న చిన్నవిగా వుండేవి. భూమాత వీటిని పశువులకోసం సృష్టించింది. అడవిగోధుమలు ఎక్కడ నశించిపోతాయోయని నాకు చాలాభయంగావుంది. మనతిండికంటావా? యీఆవులు, గుర్రాలు, గొర్రెలు మేకలూ వున్నాయి. అడవిలో ఎలుగుగొడ్లూ, లేళ్ళూ, పందులూ మొదలగు ఎన్నోరకములయిన వేటలున్నాయి. ద్రాక్ష ఆదిగాగల ఎన్నో ఫలాలున్నాయి. ఈ ఆహారమంతా ధరిత్రీమాత (భూదేవి) మనకు సంతోషంగా యిస్తూ ఉండేది. కాని ఈ మద్రులూ, పురువులూ పాడుగాను, వాళ్ళు పురాతనాచార మర్యాదలను ధ్వంసంచేసి నూతనపంథాపట్టారు. అందువల్లనే మానవులపై దేవతలు ఆగ్రహించారు. వక్షువాసుల లలాటాన్నింకా ఏమేమి లిఖించబడిందో తెలియదు నాయనా! నేను పాతికేండ్లనుంచి ఈసీమ (ఎల్ల) విడిచి గ్రామానికి పోలేదు. చలికాలంలో దిగువనున్న ఒకగుడిసెకు పోతాను. కాని ప్రజలంతా పూర్వులేర్పరచిన పద్ధతుల నన్నింటినీ తెగేసిపారెయ్యవలెనని చూస్తుంటే, ఇంక అక్కడికి ఏలాగున వెళ్ళగలను? పూర్వుల ముఖతహా వెలువడిన వాణినికూడా నేను యిన్నాళ్ళనుంచీ భద్రపరుస్తున్నాను. ఇప్పటికీ నేర్చుకోవాలనుకునేవారు నాదగ్గర కొస్తుంటారు. కాని ఆ వాణిని ఒప్పుకోనివారి సంఖ్య నానాటికి పెరిగిపోతోంది. మద్రులకీ పర్శులకీ వ్యవసాయంవల్ల కడుపు నిండుటలేదని వింటున్నాను. ప్రస్తుతం వారు వక్షువాసుల ఆహారవస్త్రాదుల్ని మోసుకొనివెళ్ళి యెక్కడిచ్చివస్తున్నారో, వాటికిబదులు ఏమి లభిస్తోందో—? ఇదిగోచూడు గుర్రాన్నిచ్చి కొన్నపాత్ర. ఆకలితో చావవలసివస్తే ఈపాత్రను తినడంవల్ల కడుపునిండుతుందా? ఇప్పుడిక పురులు కడుపుకు తిండీ,

కట్టడానికి గుడ్డా లేనివారయ్యారు. వాటిబదులు నువ్వు వాళ్ళఇండ్లలో ఈ పాత్రలను చూస్తావు.'

'తాతగారూ! ఇంకోసంగతి వింటున్నాం. దిగువమద్ర స్త్రీలు చెవులకు, ముక్కులకూ పసుపుపచ్చని, తెల్లని ఆభరణాలు ధరించడం మొదలుపెట్టారట! ఒక చెవికిధరించిన నగకు ఒక గుర్రపువెల పడుతోంది. తాతా! దాన్ని 'రాగి' అనరు 'సువర్ణ' మంటారు. తెల్లదాన్ని 'వెండి' అంటారు.'

'ఎవరూ చంపిపారవేయుటలేదీ అన్యాయపు మనుష్యుల్ని. వీళ్ళుయావత్తు వక్షుజనసమూహాన్ని నాశనంచేసి విడిచిపెడతారు. మన కూటికీ, గుడ్డకూ మిగిలినది కాస్తాకూడా వీళ్ళు విడిచిపెట్టరు. మన స్త్రీలుకూడా వాళ్ళనుచూచి రెండుగుఱ్ఱాల ఖరీదు చేసే కుండలాల్ని చెవులకు ధరిస్తారు! ఓ దయానిధీ! అగ్నిదేవా! ఇక ఎక్కువకాలం నన్ను మానవుల్లో వుంచకు! పితృలోకంలోనికి తీసుకొనిపో!'

'ఇంకో ఘోరపాపం. తాతా! మద్రులూ, పర్శులూ ఎక్కడనుంచో మనుష్యుల్ని పట్టుకొచ్చారు. వాళ్ళచేత రాగికత్తులూ, రాగిగొడ్డళ్ళూ చేయిస్తున్నారు. వాళ్ళు చాలా నిపుణులైన చేతిపనివారు. కాని మద్రపర్శులు వాళ్ళని పశువుల్లాగ అవసరంకొద్దీ అమ్మివేస్తున్నారు. వ్యవసాయం, కంబళ్ళనేత, ఇంకాయేమేమో యితరపనులు బంధించి తేబడిన ఈ మనుష్యులచేత వాళ్ళు చేయిస్తున్నారు. ఈ మనుష్యుల్ని దాసులంటారు.'

'మానవుల్ని అమ్ముకొనుటయా? మేము తిండి, బట్ట అమ్మడమే తప్పుగా తలచేవాళ్ళం. మన పూర్వులగు పితృదేవతలు మద్రులింత నీచస్థితిలోకి పోతారని కలలోకూడా అనుకొనిఉండరు. వ్రేలు కుళ్ళిపోతే దానికిముందు కోసిపారవేయడమే, లేకపోతే శరీరమంతా కుళ్ళిపోతుంది. పుత్రా! ఈమద్రుల్నీ, పర్శుల్నీ వక్షునదీ తీరంలో ఉండనిచ్చుట పాపం. ఎక్కువకాలం నేను జీవించి ఉండను.'

మద్ర తాత చెప్పేకథలు బహుమనోరంజకంగా వుండేవి. ఉపయోగకరమైన ఆయుధాలను త్యజించి, మానవజాతి శత్రువులమధ్య, క్రూరమృగాలమధ్యా బ్రదుకుట అసాధ్యమని తెలుసుకోగలిగిన సామర్థ్యము పురుహూతునికి వుంది.

మూడవరోజు అతడు పయనమై సెలవు తీసుకుంటున్నప్పుడు వృద్ధుడు ఆతని లలాటాన్ని, కనుబొమ్మలనీముద్దాడి ఆశీర్వదించాడు. రోచన అతడిని సాగనంపేందుకు

చాలాదూరం వెళ్ళింది. వియోగ సమయమున యిదవురిచెక్కిళ్ళపై కన్నీటికాల్వలు కలసి ప్రవహించాయి !

---

# 3

పాతికేళ్ళు దాటినతరువాతనైనా మద్రతాతమాట నిజమైంది. దిగువమద్రులూ, పర్శులూ నానాటికి ఎగువమద్రులనీ, పురుపుల్నీ అణచేస్తూపోయారు. ఇక్కడ ఈ ఎగువప్రజల్లో బట్టా, కంబళ్ళూ తయారుచేసే స్వతంత్ర స్త్రీపురుషులు నివసిస్తున్నారు. వారితిండికీ, గుడ్డకీ ఎక్కువ ఖర్చుఅవుతోంది. అక్కడ దిగువమద్రులవద్దా, పర్శుపులదగ్గరా దాసులున్నారు. వారు చేసేవస్తువులంత బాగాలేవు; అయినా చౌకగా వున్నాయి. అచ్చటివ్యాపారులు ఈ వస్తువులనన్నింటినీ బయటిదేశాలకు ఒంటెల పైన, గుర్రాలమీదా వేసి తీసుకొనిపోతే అవి చాలాబాగా అమ్ముడుపోతున్నాయి. ఎగువజనానికికూడా యిప్పుడు రాగివస్తువు లత్యధికసంఖ్యలో కావలసివచ్చాయి. ఒకటి – నానాటికీ అవి చౌకయిపోతున్నాయి; రెండోది – మట్టితోను, కర్రతోను చేసిన వస్తువులకంటె అవి గట్టిగాను యెంతోకాలం మన్నేవిగాను వుంటున్నాయి.

25 ఏళ్ళక్రితం యెక్కడైతే రాగిపాత్ర ఒకటిరెండు ఇండ్లలో కానవచ్చేదో, అక్కడే యిప్పుడు ఏ యిల్లూ రాగిపాత్రలేకుండాలేదని చెప్పాలి. బంగారం, వెండి ప్రాభవంకూడా హెచ్చిపోతూంది. వాళ్ళు వీటికోసం ఆహారపదార్థములు, కంబళ్ళు, చర్మాలు, గుఱ్ఱాలు, ఆవులు అమ్మేయవలసి వస్తోంది. దానివల్ల వారిపతన మారంభమైంది. ఎగువవారిలో కొందరు స్వయంగా వ్యాపారం చేయాలని ప్రయత్నించారు. ఎందువల్లనంటే దిగువనున్న పొరుగువారు తమను మోసగిస్తున్నారని వారికి సందేహం కలిగింది. కాని వక్షునది క్రిందిభాగానికివెళ్ళే దారి దిగువవారి జన్మభూమి గుండా పోయింది. ఆ మార్గ సౌకర్యాన్ని మద్రులు ఎగువవారికివ్వడానికి యిష్టపడ లేదు. ఎన్నోసార్లు యీ సమస్యపై కూడా చిన్న చిన్న తగాదాలువచ్చాయి. చాలాసార్లు ఉత్తరమద్రులూ, పురువులూ బయటదేశాలకు పోవడానికి యితరమార్గా లన్వేషింప చూశారు. కాని సఫలీకృతులు కాలేకపోయారు. దిగువవారికి చెందిన ఈసంఘర్షణలో

ఒక ముఖ్యవిషయముంది. అదేమంటే దిగువవారు రణంలో తాము ఐక్యతను నిలుపుకో లేకపోయారు. ఎగువవారు సమైక్యతతో దాడులు, ఎదురుదాడులు చేయగలిగేవారు. ఈ యుద్ధాల్లో తన వీరత్వంచేతా, బుద్ధికుశలతవల్లా పురుహూతుడు తనప్రజల ప్రేమకు పాత్రుడయ్యాడు. 30 సంవత్సరముల చిన్న వయస్సులోనే పురుజనం అతనిని తమ మహాపితరునిగా ఎన్నుకొన్నారు.

దిగువమద్రులు వ్యాపారరీత్యా సాగిస్తున్న ఈ అన్యాయాన్ని ఆపకపోయిన యెడల, ఎగువప్రజలకు భవిష్యత్తులేదని పురుహూతునికి స్పష్టంగా తెలిసింది. రాగి యొక్క విలువ, ప్రభావం తగ్గలేదు సరికదా పైపెచ్చు నానాటికి దాని సర్వప్రియత్వం హెచ్చిపోతూంది. ఆయుధాలు, పాత్రలు, ఆభూషణాలకొరకు మాత్రమేకాక యీ కాలంలో ప్రజలు మారకం నిమిత్తం మణుగులకొద్దీ మాంసం, లేక కంబళ్ళు తీసుకొని వెళ్ళుటకుబదులు రాగిఖడ్గాలు లేక కత్తులూ తీసికొనివెళ్ళడానికి యిచ్ఛగిస్తున్నారు. పురుహూతుడు తన జనసమావేశంలో దిగువమద్రుల వ్యాపార సంబంధమైన అన్యాయాలే తమ దుఃఖాలకు కారణమని చెప్పాడు. మార్గకంటకులైన మద్రులను ఏరివేయకపోతే, తామంతా వారికి కీలుబొమ్మలై పోవలసివస్తుందని అందరూ అంగీకరించారు. వారికి దాసులైపోయే రోజుకూడా బహుశా రావచ్చునని భావించారు. పురువులయొక్క, ఉత్తరమద్రులయొక్క మహాపితరుల సమిష్టి సమావేశంలోకూడా యీ నిర్ణయానికేవచ్చారు. ఉభయజన సమూహాలూ కలిసి యుద్ధాన్ని నడిపేందుకు పురుహూతుణ్ణి తమ సమ్మిశ్రిత సేనాధిపతిగా ఎన్నుకొన్నారు. అతనికి 'ఇంద్ర' పదవినిచ్చారు. ఈ విధంగా పురుహూతుడు ప్రథమ ఇంద్రుడు అయ్యాడు.

పురుహూతుడు బహుతీవ్రంగా సైనిక సన్నాహాలు ప్రారంభించాడు. ఇంద్రుడవగానే అతడు ఆయుధాలు తయారుచేయించుటకు ఇరువురి కమ్మరిబానిసలకు తనవద్ద ఆశ్రయమిచ్చాడు. ఎగువజనం ఆ బానిసలయెడల చాలచక్కగా ప్రవర్తించేవారు. వారిసహాయంవల్ల తాము అయఃకాంత శస్త్రనిర్మాణంలో చాల నిపుణులయ్యారు.

ఈ విధంగా మద్రులలోను, పురువుల్లోను ఎందరో లోహపుపని నేర్చుకొన్నారు. తమ కమ్మరిబానిసలను తిరిగి యిచ్చివేయమని నోటితో అడుగుటయే కాక, శస్త్రాలనుకూడా ఉపయోగింపచూశారు. కాని దిగువ ప్రజలలో వ్యాపార తత్వంతోపాటు, యుద్ధపరాక్రమంలోకూడా లోపంవచ్చేసింది. యుద్ధంలో విఫలులై పోయిన తరువాత వాళ్ళు రాగిని యివ్వడం ఆపుచేశారు. కాని దానివల్ల తమ

వ్యాపారమే నాశనమైపోతుందని వారికి త్వరలో తెలిసింది. మద్రులు, పురులు వెనుకటికాలంలో కొనివుంచుకున్న పశ్వాదులు, యితరపాత్రలతో తమ అస్త్రశస్త్రాలను తయారుచేసుకోడంలో ఒక తరంవరకూ స్వతంత్రులు. (ఒకతరం వరకూ రాగి యితరులనుంచి రాకపోయినా ఇబ్బంది లేనిస్థితిలో వున్నారు – అనువాదకుడు.)

చివరకు ఇంద్రుడూ, అతని రెండు జనసమూహాలూ, మద్ర పర్శులను తుడిచి వేయడానికి సంకల్పించారు. పురుహూతుడు స్వయంగాకూడా లోహపుపనిని నేర్చుకున్నాడు. అతని సూచనల ప్రకారం ఖడ్గాలూ, బరిసెలూ, బాణపుములుకులూ మొదలైనవాటిల్లో చాలా సంస్కరణలు జరిగాయి. అతడు తెలివిగల బలిష్ఠులైన భటుల ఛాతీలను (రొమ్ముల్ని) ఎముకదెబ్బలనుంచి రక్షించడానికి ఎన్నో రాగి వక్షకవచాలను చేయించాడు. మొట్టమొదట కేవలం ఒక శత్రువుతోనే పోరాడాలని అతడు నిశ్చయించాడు. దీనికి పర్శువులను మట్టుబెట్టాలని తీర్మానించుకొన్నాడు. చలికాలంలో పర్శులు అధికసంఖ్యాకులుగా వ్యాపారం నిమిత్తం బయటి ప్రాంతాలకు పోతూండేవారు. ఇంద్రుడు యిదే మంచి అదనుగాభావించాడు. ఉత్తరమద్రులకూ, పురువులకూ చెందిన యోధులకతడు యుద్ధకళాకౌశల్యాన్ని నేర్పాడు. పర్శులకూ, మద్రులకూమధ్య శత్రుత్వం అనాదిసిద్ధంగా వస్తున్నప్పటికీ, వక్షుభూభాగం నుండి నామరూపాలు లేకుండా చేయగలిగేంత ఘాతుకమైన శత్రుదాడి ఈవిధంగా తటాలున వచ్చిపడుతుందని పర్శులకెట్లా తెలుస్తుంది? ఇంద్రుడు స్వయంగా తాను నాయకత్వం వహించి, ఎన్నికగన్న మెరికల్లాంటి మద్ర, పురుయోధులతోసహా దాడిచేశాడు. పర్శులు ఇంద్రుని యుద్ధకారణాన్ని తక్షణం అర్థంచేసుకోగలిగారు. అర్థంచేసుకొన్న వెంటనే తమ ప్రాణాలొడ్డి, అసమాన ధైర్యసాహసాలతో పోరాడారు. కాని ఆతొందరలో వారు తమ యావత్తు గ్రామస్తుల్నీ ప్రోగుచేయడానికి అవకాశం లేకపోయింది. ఇంద్రునిసేన ఒకదాని తరువాత యింకొకటి వారిగ్రామాలను వశపర్చుకొంటూ, వేలకొలదీ పర్శులను సంహరించింది. ఎవ్వరినీ ఖైదీగా పట్టుకోలేదు. అక్కడ దిగువమద్రులు ఆపద నర్థంచేసుకొనేసరికి సమయం దాటిపోయింది. చివర గ్రామాలుమాత్రం కొద్దిగా దిగడిపోయాయి. వాటికోసం వలసిన భటుల్నక్కడవిడిచి, పురుహూత ఇంద్రుడు కురుభూమికి వచ్చేశాడు. దిగువమాద్రులు ఎదిరించారు. కాని పర్శులకు పట్టినగతే వారికీ పట్టింది. దిగువమాద్రులకూ, పర్శులకూచెందిన చేజిక్కిన ప్రతిపురుషుణ్నీ, బాలుణ్నీ, యువకులనూ వృద్ధులనూ; వారు ప్రాణాలతో విడువలేదు. స్త్రీలనుమాత్రం తమ స్త్రీలలో కలుపుకున్నారు. చేజిక్కిన బానిసల్లో, తమ

దేశాలకు తిరిగిపోగోరినవారిని పంపేశారు. కొద్దిమంది దిగువమాద్రులూ, పర్శ స్త్రీ పురుషులూ ప్రాణాలు కాపాడుకొని వక్షునదీప్రాంతాన్ని విడిచి పశ్చిమదిక్కుగా పోయారు. వారి సంతానమే, తరువాత ఈరానుపర్శు (పర్షియన్) లనీ; మద్రు (మిడియన్) లనేపేర్లతో పిలువబడ్డారు. వారి పూర్వీకులపై ఇంద్రుని నాయకత్వంలో జరిగిన అత్యాచారాల్ని వారు మరువలేకపోయారు. ఇందువల్లనే 'ఈరానీయులు' ఇంద్రుణ్ణితమ ఘోరశత్రువుగా యెంచసాగారు. యావత్తు వక్షునదీప్రాంతాన్నీ ఉత్తర మద్రులూ, పుపవులూ స్వాధీనం చేసుకొన్నారు. ఉభయులూ వక్షునది కుడియెడమ తీరాల్ని పంచుకొన్నారు. నవీనత్వాన్ని విసర్జించి పురాతన పద్ధతిని పునఃస్థాపించుటకు వక్షువాసులు శక్తికొలదీ యత్నించారు. కాని వారు రాగిని విసర్జించి రాళ్ళఆయుధాల వైపుకు మరలజాలక పోయారు. రాగికొరకు వక్షుపర్వత ప్రాంతీయులు బయటివారితో వ్యాపారసంబంధాలు పెట్టుకోవడం అత్యంతావశ్యకమైంది.

బానిసత్వాన్ని మాత్రం వారెన్నడూ చేబట్టలేదు. బయటివారిక్ వక్షు ప్రాంతంలో స్థిరనివాసులయ్యే హక్కు యివ్వబడలేదు. శతాబ్దాలు గడిచిన పురుహూత ఇంద్రుణ్ని ప్రజలు విస్మరించినా, లేక అతన్ని దైవంగా భావించినా, వక్షునదీ ప్రాంతము అందరినీ పోషించుటకు సరిపోనంతగా జాతి అభివృద్ధిపొందినది. ఇందువల్ల వారి సంతానమెందరో దక్షిణానికి వలస పోవలసిన వారయ్యారు.

దీనికిపూర్వం ప్రతివాడు స్వతంత్రుడై స్వేచ్ఛాజీవితాన్ని గడిపేవాడు మహపితరుని ప్రాధాన్యత ఉన్నప్పటికికూడా అతడు ప్రజలపై ఆధారపడి సమస్తమూ చేస్తూండేవాడు. కాని వక్షుతీరపు అంతిమపోరాటం అనేక సమూహాలకు ఏకైక సేనాధిపతిగా ఇంద్రుని సృష్టించింది.

---

* నేటికి నూటయెనభై తరాలకు ముందుకాలంనాటి ఆర్యజనుల కథయిది. ఈ కాలంలో వీరినుంచియే కొందరి సంతానం భారతావనివైపు బయలుదేర బోతున్నారు. అప్పటికి సేద్యం, రాగివాడకం ఆరంభమైంది. ఆర్యులు తాము స్వీకరించిన బానిసత్వాన్ని తిరిగి విసర్జించాలని కోరుతున్నారు.

# "పురుధానుడు"

## (ఐదవ కథ)

[దేశం-ఎగువస్వాత్; జాతి-ఇండో-ఆర్యన్;
కాలం-క్రీస్తుకు 2,000 సంవత్సరాలకు పూర్వం.]

అది సుందరమైన గృహములుగల ప్రదేశం (సువాస్తు). దాని ఎడమవైపున ఆకుపచ్చని పర్వతాలతోను జలధారలతోను పచ్చని గోధుమసస్యంతోను కనుల పండువగానున్న ప్రదేశంవుంది. ఆర్యులు రాతిగోడలతోను, దేవదారుపలకలతోను తాము నిర్మించిన సువాస్తు గృహాలనుచూచి గర్వపడుతున్నారు. అందువల్లనే ఈ ప్రదేశాన్ని 'సువాస్తు' (సుందరమైనభవనాల ప్రదేశం-స్వాత్) అని నామకరణం చేసారు. వక్షునదిని దాటుతుంటే ఆర్యులకు 'పామీర్' 'హిందూకుష్' పర్వతదుర్గమ సీమలను (ఎల్లలు) పంజకోరావంటినదులను ఎన్నికష్టాలు పడి దాటారో బహుశా చాలాకాలం జ్ఞాపకము వుండివుంటుంది. నేడు మంగళపుర్ (మంగుళూరు)లో జరుగుతున్న ఇంద్రపూజోత్సవాలు, ఈదుర్గమమార్గాలగుండా తెలివిగానడిపించిన తమ ఇంద్రుని ఎడల కృతజ్ఞతను ప్రకటించుటకేమో! ఎవరికెరుక? నేడు మంగళపురానికి చెందిన పురుషులు తమ సుందరగృహాలను పచ్చని దేవదారు కొమ్మలతోను, వివిధ వర్ణ సమన్విత పతాకాలతోను అలంకరించారు. పురుధానునిచేతిలోని ఎర్రజెండాను అతనిప్రక్కనేయున్న సుమేధుడు తీసుకుంటూ 'మిత్రమా! ఈజెండాలు చాలతేలికగాను మృదువుగాను వున్నాయి. మేము ఇట్టి వస్త్రాలను ఇంకా తయారుచేయుట లేదు. ఇవి ఏదో కొత్తరకపు గొర్రెలజాపతు ఉన్ని అనుకుంటా.'

'ఇది గొర్రె వున్నికాదు, సుమేధా'

'మరేమిటి?'

'చెట్లపై మొలిచే ఒకరకపు వున్ని'

'మాప్రాంతాల గొర్రెలమీద వున్నివుంటే, యిచ్చట చెట్లపై మొలుస్తుందా?'

'ఆ. ఆలాగేచెపుతారు. కాని నేను చూడలేను.'

సుమేరుడు పెద్ద తకిలీని త్రిప్పుతూ 'వాళ్ళెంత అదృష్టవంతులు. వారికి చెట్లపై వున్ని లభిస్తోంది. మనకుకూడా లభిస్తేనో!'

'చలిని ఎండను అవి ఎంతవరకు కాస్తాయో మనకు తెలియదు. కాని సుమేధా! వృక్షాలమీద మాంసము దొరకదా?'

'ఒకచోట చెట్లపై వున్నిదొరికితే, మరొకచోట మాంసము లభించవచ్చును. కాని ఖరీదో?'

'ఉన్నిగుడ్డలకంటె వెలచాల తక్కువె. కాని వాటివలె యిది మన్నదు.'

'దీన్ని ఎక్కడకొన్నావు?'

'అసురులవద్దనుండి. ఇక్కడికి 50 మైళ్ళ దూరంలో వాళ్ళదేశం వుంది. వాళ్లు ఈబట్టలనె కట్టుకుంటారు.'

'అయితే ఈచొకవాటిని మనంకూడా ఎందుకు ధరించరాదు?'

'ఇవి చలిని ఆపజాలవు.'

'మరి అసురులు ఎట్లాకట్టుకుంటున్నారు?'

'వారిది చలిప్రాంతంకాదు. అక్కడ అణుమాత్రమైనా మంచుపడదు.'

'నీవు వర్తకానికి తూర్పు, ఉత్తరము, పశ్చిమము వైపులకు వెళ్ళకుండా దక్షిణానికే ఎందుకుపోతావు?'

'లాభంకోసం. అనేకవస్తువులు దొరుకుతాయి. కాని ఒక్క చిక్కుఉంది. అది వేడిప్రదేశం. అందువల్ల చల్లదనానికి ప్రాణం తహతహలాడిపోతుంది.'

'పురుధాన్! అక్కడివారు ఏలా ఉంటారు?'

'వారు పొట్టిగావుంటారు. రంగు రాగిరంగు. కురూపులు. ముక్కు అసలు వున్నట్లేవుండదు. అక్కడ మనుష్యులను అమ్మటం, కొనడం, అనే ఒక చెడ్డ రివాజువుంది.

'అమ్మడం, కొనడమా! వాళ్ళను ఏమంటారు?'

'బానిసలు అంటారు.'

'బానిసలకూ స్వాములకూ (యజమానులు) రూపురేఖలలో ఏమైనా తేడా వుంటుందా?'

'లేదు. కాని బానిసలు బీదవారు. పరాధీనులు. వారి మాన ప్రాణాలు యజమానుల చేతుల్లో ఉంటాయి.'

'ఇంద్రుడు మనలను కాపాడుగాక! అట్టివారి ముఖాలుకూడా చూచుట కలుగకుండుగాక!'

'మిత్రుడా, యింకనూ తకిలీమీద దారముతీయుచునే ఉన్నావు. యజ్ఞమునకు పోవలదా!'

'ఇంద్రపూజాసమయమందు దొరకు మాంసమూ, మద్యమూ పోగొట్టుకొనునంతటి వెర్రివాడనుగాను. తప్పక వెడదాం.'

'మరి నీ భార్య ఏమిచేస్తోంది? ఈమధ్య దర్బారులో ఆమె జాడనేలేదు.'

'పురుధాన్! వెంగపెట్టుచున్నావా?'

'వెంగేమిటి? ఆ ప్రశ్నేలేదు. నీవు ముసలితనంలో ప్రేమించాలని చూచావు.'

'50 ఏళ్ళకే ముసలితనంరాదు.'

'కాని 50 కీ 20 కీ మధ్య చాలాతేడావుంది.'

'అయితే ఆమె ఈవాళ నిరాకరించియుండవలసినది.'

'ఆవేళ గడ్డం మీసం గొరిగించి 18 ఏండ్ల వాడవయ్యావు. అదీకాక ఉషా తల్లిదండ్రులదృష్టి నీమీదకాక నీపశువులమీద పడింది.'

'చాలించు. అంతటితో. మీకు(స్త్రీ)ల్లు ఎప్పుడూ....'

'సరే. ఇకమానివేద్దాం. మేళతాళాలు వినిపిస్తున్నాయి. యజ్ఞం ఆరంభ మౌతోంది.'

'ఆలస్యంనీది. తిట్లుతినేది పాపం, సుమేధుడు?'

'అయితేపద, ఉషానుకూడా వెంటబెట్టుకుపోదాం. రా'

'ఇంక ఇంటివద్దే వుంటుందా!'

'మరి. ఈవున్నీ, తకిలీ ఇంట్లోపెట్టాలి.'

'ఇవి యజ్ఞాలకు అడ్డంకాదు.'

'ఇందుకే ఉషా నిన్ను మెచ్చుకోదు.'

'మెచ్చుకుంటుంది. కాని మంగళాపురపు యువకులగు మీరు మెచ్చుకో నిస్తారా?'

అని మాట్లాడుకుంటూ నగరానికి వెలుపలనున్న యజ్ఞవేదికవైపుపోతున్నారు. యువతీయువకులు ఎవరినైనా కలుసుకొనినచో వారు చిరునవ్వు నవ్వుతారు. అతడు కంటిసౌంజ్ఞలవల్ల యువతీ యువకులదృష్టి త్రిప్పేసుకునేవాడు. సుమేధునిదృష్టి ఒక సారి ఒక యువకునిపై పడింది. ఇంకేముంది. అతడు వాగనారంభించాడు.

'ఈ యువకులు మంగళాపురానికి కళంకులు.'

'మిత్రమా ఏం?'

'మిత్రమాలేదు, పౌత్రమాలేదు. నన్నుచూచి నవ్వుతున్నారు.'

'వీడుకొంటివాడు. నీకు తెలియనిదేముంది. పట్టించుకోవద్దు.'

'మంగళాపురంలో పెద్దమనిషి ఎవడూలేడు.'

యజ్ఞ వేదికదగ్గర పెద్దమైదానముంది. దానిలో అక్కడక్కడ మంచె లున్నాయి. దేవదారు పత్రముల తోరణములు వ్రేలాడుతున్నాయి. గ్రామంలోని

స్త్రీపురుషులు అందరూ చేరారు. సాయంత్రమింకా పెద్ద ఉత్సవముంది. అప్పుడు గ్రామంలోని వారంతా చేరుతారు. అప్పుడు స్వాత్ నదికి ఆవలి ఒడ్డున నివసించే మద్రులుకూడా వచ్చి ఉత్సవంలో పాల్గొంటారు.

స్నేహితులిద్దరు కలసి రావడంజూచి ఉషా తన మృదుహస్తాలతో సుమేధుని చేతులు కలుపుతూ

'పియసుమేధా! ప్రొద్దుణుంచీ నీకోసం వెతికి వేసారాను. నీజాడే తెలియ లేదు!'

'నేను బ్రతికే ఉన్నాను. చావలేదు.'

'ఇట్టి అవాచ్యాలు రానివ్వకు. నీవు ఉండగానే నన్ను వితంతువును చెయ్యకు.'

'మన పురులలో మరదులకు లోపంలేదు. పునిస్త్రీలకు మరదులు చేదా?'

'బాగాచెప్పావు. పురూ—ఈమెనన్ను మోసగించడానికి వచ్చింది. ఉదయము నుంచీ ఎందరి గుమ్మాలు తొక్కిందో. ఎంతమంది ఆమెను కోరుతారో. అందు వల్ల అనేక పోట్లాటలూ, హత్యలూను. ఈమెవల్ల సుమేధుడికి చాలా చెడ్డపేరు వస్తోంది.'

ఉషా అతని చేతుల్నివిడచి, దృష్టిని, స్వరభావభంగిమములను మారుస్తూ 'అయితే నీవు నన్ను మాయచేద్దామని అనుకొంటున్నావా ఏో. నా దారి నే చూసు కొంటా.' అని ఆమె పురుధానునిచూచి నవ్వుతూ వేదికవద్దనున్న గుంపులో లీన మైంది.

స్వాత్ ప్రదేశంలో వక్షుతీరంలోవలెనే పెద్ద గుర్రపు మాంసం దొరుకు తున్నది. సంవత్సరానికల్లా ఈరోజుననే యిచ్చట గుర్రపు మాంసం సాధారణంగా తినకపోయినా ఇంద్రుని వార్షికపూజా యజ్ఞ శేషాన్ని అందరూ భక్తిభావంతో గ్రహిస్తారు. మహాపితరుడు నేడు ఇంద్రునకు ప్రియమైన బలిని యిచ్చుటకు సంసిద్ధుడై యున్నాడు. అతనికి బలివిధానం అంతా తెలుసు. మంత్రాలన్నీ జ్ఞాపకమున్నాయి. బాజాలు, మంత్రస్తోత్ర పారాయణతోపాటు అశ్వస్పర్శ, ప్రోక్షణ మొదలుకొని

ఆలంబనము (వధ) వరకు యావత్తు క్రియా ముగిసింది. అశ్వమాంసమును పచ్చిగాను, మరెంతో తాలింపుపెట్టి అగ్నికి సమర్పించారు. యజ్ఞ శేషం పంకం ముగిసే సరికి సాయంత్రం కావచ్చింది. అప్పటికి మైదానమంతయు స్త్రీపురుషులతో నిండి పోయింది. వారు సుందరమైన వస్త్రాలను భూషణములను ధరించారు. స్త్రీలు మృదువైన రంగురంగుల నగిషీకంబళ్ళు, పటకాలు కలిగివున్నారు. నగిషీ కలిగిన రెవికలు తొడుక్కొన్నారు. హెచ్చుమందికి సువర్ణకుండలాలున్నాయి. వసంతకాల మగుటవల్ల వికసించిన పూలు కురులయందు అలంకరింపబడ్డాయి. ఇంద్రోత్సవ కారణంగా వారు స్వచ్ఛంద ప్రణయానికి సంపూర్ణాధికారం కలిగివున్నారు. సాయంకాలం నీటుగా సింగారించుకొని పురుధానునితో ఉష తిరుగుతూంటే సుమేధునిదృష్టి వారిపై బడింది. ఇంద్రోత్సవంనాడు ఆమెను ఏమీ అనలేక మొఖం చాటేసుకున్నాడు. గతసాలున జనపతి కోపకారణం అతడు మరువలేదు. నేడు వాస్తవంగా మధుమిశ్రితసోమం నదులుగా ప్రవహిస్తోంది. అనేక గ్రామాలనుంచి పుష్కలంగా మంచి మాంసం, ఆవుదూడలు, ప్రజలు సోమంకొరకు చేరవేశారు. ప్రణయ సామ్రాజ్యంలో విచ్చలవిడిగా సంచరించే యువతీయువకులు మాంసంతింటూ, సోమపానంచేస్తూ నాట్యంచేస్తున్నారు.

ఇంద్రోత్సవం ముఖ్యంగా యువతీయువకుల పండుగ. ఆనందదాయకమైనది. నేడు వీరు ఏవిధమైన బంధనములు లేని సర్వ స్వతంత్రులు.

---

## 2

స్వాత్‌నదికి పై భాగము ఫలవంతమైనది. ఇచ్చట పశుసంపద హెచ్చు. ప్రజలు చాలా సుఖంగానూ, సుభిక్షంగానూ జీవిస్తున్నారు. వారికి రాగి, బంగారము, వెండి, రత్నములు మొదలగు విలాసవస్తువులు దొరుకవు. వీటికి గిరాకీ చాలా హెచ్చు. ఇవి స్వాత్‌నదీ కుభా (కాబుల్) నదుల సంగమ ప్రదేశంలోనున్న అసుర నగరంలో దొరుకుతాయి. దీనినే ఆర్యులు పుష్కలావతి అని పిలిచేవారని తెలుస్తోంది. ఇదేపేరుతో మనం పిలుద్దాం. శీతకాలంలో స్వాత్, పంజకోరా ప్రాంతాలలో నివసించే పురులూ, కురులూ, గాంధారులు, మద్రులు, మల్లులు, శివి, ఉశీనరులు

మొదలగు కొండజాతులవారు వర్తకంకోసం పుష్కలావతీ మైదానంలో తమ గుర్రాలలోను, కంబళ్ళతోను, మకాంచేస్తారు. అసురనగర వ్యాపారులు ఇచ్చటనే వీరికికావలసిన వస్తువులనిచ్చి, తమకు కావలసిన సరుకులు పుచ్చుకొనేవారు. శతాబ్దములనుంచి ఇల్లా జరుగుతోంది. ఈమారు పురులు పురుధానుని నాయకత్వం క్రింద పుష్కలావతీనగరానికి వచ్చారు. అసుర నగరవాసులు పర్వతవాసులకన్న తెలివైనవారు. వారు పురులు మొదలగు కొండజాతులవారిని మాయపుచ్చుతున్నారనే ప్రతీతి వుంది. వారు కొండజాతులవారిని బుద్ధిహీనులుగను, అడవిమనుష్యులుగను తలచేవారు. ఇది కొంతవరకు సత్యమే. కాని ఈసత్యాన్ని ఆర్యులలో తెలివైనవారెవ్వరూ ఒప్పుకోరు. రానురాను ఆర్యులలో పురుధానునివంటివారు చాలమంది అసురుల భాషను అర్థంచేసికోడమూ, వారితోకలసి తిరగడమూ జరిగింది. అందువల్ల తమను అసురులు ద్విపాదపశువులుగా తలుస్తున్నారని తెలిసిపోయింది. ఇదే ఈరెండు జాతులమధ్యా కలహానికి ప్రారంభం.

అసురుల నగరాలు సుందరమైనవి. అవి ఇటుకగోడలతో కట్టబడి, చెరువులు, మార్గములూ కలిగివున్నాయి. ఇండ్లలో స్నానపుగదులు, మురికికాల్వల ఏర్పాట్లు ఉన్నాయి. ఆర్యులుసహితం పుష్కలావతీ సౌందర్యాన్ని మెచ్చుకునేవారు. కొంతమంది అసురయువతుల సౌందర్యాన్ని-ముక్కూ, పెదులూ, ఒడ్డుపొడుగులలో లోపాలున్నా-అంగీకరించేవారు. కాని దేవదారువృక్షాలతో కప్పబడిన లోయలలో కలపతో నిర్మించిన భవనాలతో పాడి దారులు తీర్చియున్న గృహములతో అలంకృతమైన మంగళాపురం పుష్కలావతికి తీసిపోదని వాదించేవారు. మాతృభూమిని విడిచి పుష్కలావతిలో ఒక్క మాసంకూడా ఉండలేకపోయేవారు. తమ స్వాత్ నదీ జలమే పుష్కలావతిలో లభించినా రుచికరంగా ఉండేదికాదు. అసురులగాలి తగులగానే ఆపవిత్రజలం కలుషితమై పోయిందని వారి అభిప్రాయం. ఏమైనా అసురులు తమతో సమానులు అని ఆర్యులు అంగీకరించలేదు. ముఖ్యంగా వారి దాసదాసీజనులనూ, అచ్చటి వేశ్యలనూ చూచినతరువాత అసురులు తమతో సాటివారని అసలే అంగీకరించుటలేదు.

ఆర్యులకు అసురులలోనూ, అసురులకు ఆర్యులలోను వ్యక్తిగతంగా ఎందరో మిత్రులు ఏర్పడ్డారు. అసురరాజు పుష్కలావతికి దూరంగా సింధుతీరమున ఎచ్చటనో నివసిస్తూన్నందువల్ల పురుధానుడు అతనిని చూడలేదు. కాని అతడు అసుర రాజ ప్రతినిధిని మాత్రం చూశాడు. ప్రతినిధి సోమరి, మొద్దు, సోమపానం

వల్ల అతడెప్పుడూ నిషాలో ఉంటాడు. వెండి, బంగారపు ఆభరణములు ధరించినా అతడు అందవికారి. పురుధాముని దృష్టిలో ఈ ప్రతినిధిగల రాజ్యమూ, రాజూ అనిన ఏవగింపుగలిగింది. రాజుగారి బావమరది అగుటచే ప్రతినిధి పదవి పొందాడని పురుధానుడు విన్నాడు.

అనేక సంవత్సరాల స్నేహకారణంగా పురుధానునికి అసుర సమాజంయొక్క ఆంతరంగిక బలహీనతలెన్నో తెలిసాయి. అసురులలో పైవర్గాలవారు తెలివైన వారైనా వారిలో పిరికితనం హెచ్చు. భటుల, బానిసల సహాయంతో వారు శత్రువులను యింతవరకు ఎదుర్కొంటున్నారు. దుర్బలులతో తప్ప బలీయులగు శత్రువులతో వీరు పోరాడజాలరు. అసురరాజుకు, వాని సామంతులకు భోగలాలాసత్వమే ఏకైక ఆశయం. ప్రతిసామంతరాజు వందలాదిదాసీలను కలిగియుండేవాడు. స్త్రీలనుకూడ దాసీలుగానే చూచేవారు. ఇటీవల అసురరాజు కొంతమంది ఆర్య (పర్వత) స్త్రీలను బలాత్కారంగా తెచ్చి తన రాణివాసంలో చేర్చుకొన్నాడు. అందువల్ల ఆర్యుల్లో గొప్ప ఆవేశం ప్రబలింది. కాని అసురరాజధాని చాలా దూరంలో ఉన్నందువల్లనూ, ఆర్యస్త్రీలను అసురరాజు తీసుకుపోయాడనే సంగతి కథలుగా చెప్పుకోవటంవల్ల ఇబ్బంది లేకుండాపోయింది. పుష్కలావతినుంచి ఆభరణమూలూ, నూలుబట్టలూ, అస్త్రశస్త్రాలు మొదలైనవి సువాస్తులో మాత్రమేకాక కునార్కు ఎగువనున్న కంటకావృతమైన ఖనాద్ పూరిండ్లలోకూడ అమ్ముడయ్యేవి. నిపుణులగు అసుర శిల్పకారులచే చేయబడిన ఆభరణములకొరకై సువాస్తునందలి సౌందర్యపశులు ముగ్ధులైపోతున్నారు. అందువల్ల ప్రతి సంవత్సరం ఆర్యస్త్రీలు వర్తకులతో పుష్కలావతికి రానారంభించారు. పాపం! సుమేధుడు నిజంగా మరణించుటవల్ల ఉషా నేడు వితంతువు. ఇప్పుడామె మరదియగు పురుధానుని భార్య. ఈమెయు పురుధానుని వెంట పుష్కలావతికి వచ్చింది. అసురరాజభటులు చక్కని ఆర్యస్త్రీలు పురుధానుని డేరాలయందు కలరని రాజుకు విన్నవించిరి. ఆర్యులు తిరిగి పోవునపుడు వారిపై దండెత్తి దోచుకొనవలెనని నగరాధిపతి నిర్ణయించాడు. పీతకేశులు బలమైనవారని తెలిసికూడా ఇట్లు నిర్ణయించుట నగరాధిపతి బుద్ధిశూన్యతను తెలుపుతోంది. నగరాధిపతి తనస్నేహితుడగు ఒకవర్తకుని సౌందర్యవతియగు కుమార్తెను బలాత్కారముగా అపహరించెను. ఆవర్తకుడు నగరాధిపతికి ఆగర్భశత్రువాయెను. ఉషాకూడా ఆ అసురవర్తకుని యింటికి చాలా పర్యాయములు వెళ్ళింది. పురుధానుని ద్విభాషా పరిచయంవల్ల ఆమెకు వర్తకుని భార్యతో పరిచయం ఏర్పడింది. ఇక పురుధానుడు

తిరిగి స్వదేశం వెళ్ళిపోవాలి. హెచ్చుబేరం సాగించే పురుధానునికి ప్రయాణమునకు 2 రోజులు ముందుగా వర్తకుడు విందుచేశాడు. ఆ సమయంలో నగరాధిపతి నీచ సంకల్పాన్ని వర్తకుడు పురుధానునికి వెల్లడించాడు. ఆ రాత్రి పురుధానుడు యావన్మంది యాత్రికులగుఆర్యనాయకులతోను చర్చించాడు.అస్త్రములులేనివారు ఆయుధము లను కొన్నారు. గుర్రాలూ తదితర వస్తువులూ అమ్మేశారు. తేలికవీ అవసరమైనవీ మాత్రం అట్టేపెట్టు కొన్నారు.

స్వాత్ ప్రాంతపు ఆర్యస్త్రీలలో శృంగారతాపత్రయం హెచ్చుతున్నా వారు ఆయుధశిక్షణను మాత్రం విస్మరించలేదు. అందువల్ల వారుకూడా తమతమ ఖడ్గాలనూ, డాలులనూ సంబాళించుకున్నారు. అసురభటులు సరిహద్దులోకి పర్వతద్వారంవద్ద దారిఅడ్డి దాడిచేస్తారని అదేసమయంలో వెనుకనుంచికూడా ముట్టడి జరుపుతారని పురుధానునికి తెలుసు. రానున్న ఆపద ముందుగా తెలియుటచే అతడు తగుఏర్పాటులు చేసికొన్నాడు. మామూలుగా పంజకోరా, కునార్, స్వాత్ ప్రాంతాలకుచెందిన ప్రయాణీకులు ఒకరికొకరు సంబంధంలేకుండా ప్రయాణం చేసేవారు. కాని యిప్పుడు అట్లుకాక అందరూ అద్రిద్వారంవద్ద కలుసుకొనుటకు ఏర్పాటు చేసికొన్నారు. రెండు మూడు క్రోసులలో ద్వారం ఉందనగా ముందుగా పురుధానుడు 25 మంది అశ్వికులను అచ్చటకు పంపెను. వారులోపలికి సాగిపోతూండగా అసురులు వారిపై దాడిప్రారంభించారు. వెంటనే వారు వెనుకకు తిరిగివచ్చి పురుధానునికీసంగతి తెలిపారు. అతడు వెనుకనుంచి వచ్చే శత్రువుల్ని వదిలించుకోవాల్ని తలచాడు. దీనివల్ల సులువుకూడా ఉంది. ఎందువల్లననగా అసురులింకా గుర్రములమీదనుండి యుద్ధం చేయలేరు. యాత్రికులగుంపు ఆగిపోయింది. కొందరుభటులను అక్కడ విడిచి మిగిలిన అశ్వారోహులతో పురుధానుడు వెనుకకు మరలాడు. పీతకేశులు తటాలున తమపై పడతారని అసురులు భావించలేదు. పీతకేశుల (పచ్చని వెంట్రుకలు కలవారు). పొడుగైన బల్లాలముందు పెద్దపెద్ద ఖడ్గాలధాటికీ వారు ఎక్కువసేపు ఆగలేక పోయారు.

ఆర్యులు వారిని కేవలం పరాజితులుగా మాత్రమేచేసి విడవాలని కోరుటలేదు. ప్రతీకారంచేయాలని వాంఛిస్తున్నారు. పారిపోతున్న అసురసేనల్ని అశ్వారోహులను వెంటబెట్టుకొని యాత్రికులతోకలసి పుష్కలావతి నగరంవైపు తరిమారు. నగరాధిపతికూడ కథ యిల్లా అడ్డం తిరుగుతుందని అనుకోలేదు. అతిసులువుగా అసుర దుర్గము, నగరాధిపతీ పీతకేశుల వశమయ్యారు. పీతకేశులు అసురుల ఈద్రోహము

నకు ఆవేశులై అతినిర్దయగా వారిని వధించారు. నగరాధిపతిని నాల్గువీధుల మొగలో అతనిని ప్రజలఎదుటనే చిత్రవధ చేసారు. స్త్రీలను ,బిడ్డలను, వర్తకులను చంపలేదు. ఆసమయంలో ధానిసలనే సంపాదించవలెనను కోరిక ఆర్యుల (పీతకేశులు)కు ఉండి ఉంటే ఇంతమందిని వధించేవారేకారు. పుష్కలావతిని చాలాభాగం భస్మీపటలం చేశారు. ఇది ప్రథమ అసురదుర్గపతనగాథ.

అసుర పీతకేశుల మహాయుద్ధం అనగా దేవాసుర సంగ్రామం ఈ విధంగా ఆరంభమైంది. పురుధానుడు తిర్గివచ్చి అబ్దద్వారంవద్ద మిగిలిఉన్న అసురసైనికులను సంహరించి, యావన్మంది పీతకేశ యాత్రికులతో తమతమ జన్మస్థానములకు పోయారు. అనేక సంవత్సరాలవరకు పుష్కలావతీ నగరవ్యాపారము నశించి పోయింది. అసురుల వస్తువులను పీతకేశులు కొనుటకు నిరాకరించారు. కాని రాగిని, ఇత్తడిని వారెన్నాళ్ళు బహిష్కరించగలరు. *

---

* నేటికి 160 తరాలముందు ఆర్య (దేవ) — అసుర సంఘర్షణ జరిగింది. దానికి చెందినదే ఈ కథ. ఆర్యులయొక్క పర్వత సమాజంలో ధానిసత్వం అంగీకరించబడలేదు. రాగి, యిత్తడుల గిరాకీ హెచ్చింది. వాణిజ్యపు ప్రాబల్యం అధికమైంది.

# "అంగిరా"

## (ఆరవ కథ)

[స్థానం - గంధార్ (తక్షశిల); జాతి - హైందవ - ఆర్య;
కాలం - క్రీస్తుకు 1800 సంవత్సరాల పూర్వం.]

'ఈనూలుబట్ట వృధా. దీనితో చలీ ఆగదు, వర్షాన్నుంచి రక్షణాలేదు.' అంటూ తడసినబట్టనుతీసి కంబళీ కప్పుకొంటూ యువకుడన్నాడు.

రెండవవాడు తనబట్టను తలుపుమీద వేస్తూ 'కాని వేసవి కాలంలో యిది బాగావుంటుంది అన్నాడు.

యింకా ప్రొద్దుంది. కాని సత్రంలో నిప్పుదగ్గిర యిప్పటినుంచీ జనం తిష్ట వేసుక్కూర్చున్నారు. ఈ యిద్దరు యువకులూ పొగలో కూర్చోకుండా గాలితగలాలని కిటికీవద్ద కంబళ్ళు కప్పుకుని కూర్చున్నారు.

'మనం యీపాటికి ఒక ఆమడవెళ్ళివుండేవాళ్ళం. రేపు గంధార్ (తక్షశిల)కు చేరగలిగే వాళ్ళం. కాని యీ వర్షంలో, గాలిలో ఏం చెయ్యగలం?' అన్నాడు మొదటి యువకుడు.

'ఈ చలికాలం మార్పుకూడా చాలా పెద్దది. కాని యీ మార్పులే లేకపోతే మనరైతులు వర్షంకురిపించమని ఇంద్రుణ్ని ప్రార్థనమీద ప్రార్ధనలు చేస్తారు. పశుపాలురు మరీగోలెడతారు.' అన్నాడు రెండోవాడు.

'మిత్రమా! ఔనుమరి. కేవలం బాటసారులు మాత్రమే వర్షంకావాలని కోరరు. పైగా ఎవ్వడూకూడా ఎల్లప్పుడూ యాత్రికుడుగా నుండడుకదా!'

తరువాత మెడమీదనున్న పెద్దగాయపుమచ్చను చూచి అతడెయిట్లా అడిగాడు. 'నీ పేరేమి మిత్రమా?'

'పాలమాద్రుడు. మరి నీపేరో?'

'వరుణసౌవీరుడు. అయితే, నీవు తూర్పునుంచి వస్తున్నావా?'

'అవును. మద్రులనుండి. నీవు దక్షిణాన్నుంచికాదూ? దక్షిణాన్ని యిప్పుడు కూడా అసురులు ఆర్యులతో పోట్లాడుతున్నారని చెబుతారు, నిజమేనా?'

'సముద్రతీరంలో వారికి ఒకేఒక నగరంమాత్రం మిగిలివుంది. ఇంద్రుడు ఏవిధంగా అసురుల, నూరునగర-దుర్గాల్ని ధ్వంసంచేశాడో విన్నావుకదా మిత్రమా!'

'అసురులు నగరదుర్గాల్ని లోహంతో కట్టినారా?'

'ఔను. వారిదగ్గర లోహం జాస్తీగావుంది. కాని నగర దుర్గాలు నిర్మించ డానికి తగినంతలేదు. ఈకథ ఎట్లా వ్యాపించిందో నాకు తెలియదు. అసురుల యిళ్ళు ఇటుకలతో కట్టినవి. (నిప్పుతో కాల్చిన నాల్గుకోణాలవి. అవి వెడల్పుకన్నా పొడు గెక్కువగా వుంటాయి.) వారి నగరంచుట్టూ కట్టియున్న గోడకూడా ఈలాంటి యిటుకలతోకట్టిందే! ఈయిటికలు ఎర్రగా వుంటాయి. కాని రాగికీ వీటికి యెంతో భేదముంది. వీటిని లోహమని చెప్పడానికి వీలేలేదు.

'కాని, వరుణా! మేము అసురులవి లోహపుదుర్గాలనే వింటూ వచ్చాం.'

'బహుశా! యీదుర్గాలు ఛేదించుటలో మన ఇంద్రు డెంత శక్తి వుపయో గించినాడో?'

'శంబరుని పరాక్రమ గాథలుకూడా చాలా వింటున్నాం. అతని యిల్లు సముద్రంలో వుండేదనీ, అతడిరథం గగనంలో నడిచేదనీ-యింకా యేమేమో!'

'రథంసంగతి శుద్ధఅబద్ధం. అసురులు యుద్ధంలో అశ్వారోహణలో మాత్రమే బలహీనులు. ఇప్పటికికూడా ఉత్సవసమయాల్లో అసురులు అశ్వరథాలనుగాక, వృషభ రథాలనే వాడుతున్నారు. మనం ఈ అశ్వాలమూలంగానే జయించామని నా అభి ప్రాయం. లేకపోతే అసురపురుల్ని జయించుట అసాధ్యం. శంబరుడు చనిపోయి 200 ఏళ్లు గడిచాయి. అప్పటి కతనివద్ద అశ్వరథంకూడా వుండివుండాలి. అంతేకాని గగనంలోపోయేమాట అబద్ధం.'

'శంబరుడంత సామాన్యశత్రువే ఆయితే ఇంద్రుడికింత గొప్పతనం ఎట్లా వచ్చింది ?'

శంబరుడు గొప్ప వీరుడుగనుక. అతని స్వర్ణంతో కూర్చిన లోహపుకవచాన్ని నేను సౌరవీరపురంలో చూచాను. అది చాల దృఢమైందీ, విశాలమైనదీని. అసురులు, సర్వసామాన్యంగా పొట్టిగా వుంటారు. కాని శంబరుడు చాలా పెద్దవాడు. చాలా పొడుగుగానూ బలిష్ఠమైనవాడుగా వుండేవాడు. మన మఘవా ఇంద్రుడు సన్నని సుందరుడగు యువకుడు. సింధునదీతీరంలో యిప్పటికీ అసురపుర దుర్గాలు ఉన్నాయి.

వాటిలోనుంచి కొద్ది వందలమంది ధనుర్ధారులు వేలాది శత్రుభటుల్ని దగ్గిరకు రాకుండా ఆపగలరు. వాస్తవంగా యీ అసురపురములే అయోధ్య (అ-పరాజేయ). అలాంటి అయోధ్యాపురములను తుత్తునియలుచేసిన మన మఘవా ఇంద్రుడు - కాదు, ఆర్యసేనా నాయకుడు మహాపరాక్రమశాలి.

'ఇప్పుడుకూడా దక్షిణమున అసురులకు బలంవుందా ? వరుణా !'

'సముద్రతీరపువారనున్న అంతిమకోట యీ మధ్యనే విచ్ఛిన్నమైపోయింది. ఆ యుద్ధంలో నేనుకూడా పాల్గొన్నాను.' అని చెప్తుంటే వరుణుని అరుణముఖంలో మరింత అరుణకాంతులు వ్యాపించాయి. అతడు తన ప్రకాశవంతమైన పీతకేశాల్ని వెనుకవైపుకు సరిదిద్దుకుంటూ - 'అసురుల అంతిమదుర్గం పతనమైపోయింది' అన్నాడు.

'మీ ఇంద్రుడెవరు ?'

'ఇంద్రపదవిని మేము రద్దుచేసేశాం.'

'రద్దు చేసేశారా ?'

'అవును, ఎందుకంటె; అదంటే మేము భయపడుతున్నాము.'

'భయమెందుకు?'

'ఇంద్రుడంటే మనం సేనానాయకుడనికదా తలుస్తాం ?'

'అవును.'

'సేనానాయకుడె సర్వస్వమూ అని ఆర్యులు ఒప్పుకోరు. యుద్ధ సమయంలో అతని ఆజ్ఞలను శిరోధార్యంగా భావిస్తారు. కాని ఆర్యులు తమలో ప్రతివానికీ తన అభిప్రాయాన్ని స్పష్టంగా చెప్పడాని కధికారముండే జనపరిషత్తునే అధికారిగా భావిస్తారు.'

'ఆఁ అల్లాగా!'

'కాని, దీనికి వ్యతిరేకంగా, అసురుల ఇంద్రుడు లేక రాజు, సర్వం తానుగానే వుంటాడు. అతను ఏ జనపరిషత్తునూ తనకు పై చేయిగా ఒప్పుకోడు. అసురరాజు నోటినుంచి వెలువడిన దాన్నంతా ప్రతి అసురుడూ చెయ్యాల్సివుంటుంది, లేకపోతే అతడికి మృత్యువే గతి.'

'ఇలాంటి యింద్రుణ్ని మనం మెచ్చుకోలేం.'

'కాని, అసురులు యిల్లాంటి యింద్రుణ్ని కోరుతూ వచ్చారు. రమరాజును మనుష్యునిగాకాక దేవతగా తలుస్తూవచ్చారు. అతనిని వారు ఏలా పూజిస్తారో వింటే నీవు విశ్వసించవు.'

'అవును. నేనుకూడా చూచాను. అసురపురోహితులు తమప్రజల్ని గాడిదలుగా చేసివేస్తున్నారు.'

'అవును. గాడిదలకన్న నీచంగా వారు స్త్రీ పురుష మర్మాంగములనుకూడా విగ్రహరూపములుగాచేసి పూజిస్తారని విన్నావుకదూ? స్త్రీ పురుషుల ఆనందాని కివి రెండూ సాధనాలని నేను ఒప్పుకుంటాను. వీటిద్వారా సంతానాభివృద్ధి అవుతుంది. కాని వీటిని మట్టిమూర్తులుగా చేసి పూజించడం యెంతటి మూర్ఖత్వం.'

'సందేహమేముంది?'

'కాని నాకు దీనిలో వట్టి టక్కరితనమే కనిపిస్తుంది. అయినా అసురరాజూ, అతని పురోహితులూ మూర్ఖులుకారు. ఆర్యులమగు మనకంటె తెలివైనవారు. వారి నగరాలవంటివి కట్టుటకు మనం వారినుండి చాలా నేర్చుకోవలసివుంటుంది. వారి బజారులు వికసిత తామరలతో కూడిన సరస్సులలోను, ఎత్తైనమేడలలోను ఉన్నాయి. ఇట్టి వీధులు ఆర్యభూమిలో యెక్కడా కానరావు. నేను ఉత్తర సౌవీరపు అసురుల

పరిత్యజించిన నగరాన్ని చూచాను. క్రొత్తగా జయించిన యీ నగరాన్ని ఆరూపంలో పెట్టలేకపోయాం. ఈ నూతన నగరాన్ని స్వయంగా శంబరుడు కట్టించాడని వింటాం— దేవపురంలావుంది.'

'దేవపురం ?'

' అవును దేవపురం. దానిని పృథ్విలో దేనితోనూ పోల్చలేం. మిత్రమా ! ఒక కుటుంబానికి వాసయోగ్యమైన యింటినే తీసుకోండి. దీనిలో అలంకరించిన ఒకటో, రెండో కూర్చునేగదులూ, వేరుగా వంటగదులూ, ముందువాకిట్లో ఇటుకల దాని, స్నానాలగది, శయనాగారం, సామానులగది ఉంటాయి. సాధారణవర్తకుల యిండ్లు రెండేసి, మూడేసి అంతస్థులుగా వుండడంకూడా నేను చూచాను. ఏమని వర్ణించను ? అసురపురాన్ని నేను దేవపురంతోనే పోల్చగలను.'

'తూర్పునకూడా అసురుల నగరాలున్నాయి. కాని, మద్రుల (స్యాల్‌కోట్) భూమికి అవి చాలాదూరంలో వున్నాయి.'

'ఔను మిత్రమా ! యిల్లాంటి నగరాల్ని నిర్మించినవారు మనకంటె ఎక్కువ నిపుణులని మనం ఒప్పుకతీరాలి. సముద్రమునుగూర్చి వినియున్నావా ?

'పేరువిన్నాను. అంతే.'

'కేవలం పేరు వినడంతోను, వర్ణించడంవల్లా అంచనా తెలియదు. సముద్ర తీరాన్ని నిలబడిచూస్తేనే కొంచెం కొంచెం అంచనా తెలుస్తుంది. ఎదురుగా నీలజలం నీలాకాశంతో కలసివుంది.'

'ఆకాశంతో కలిసివుందా ! నిజమా !'

'ఆఁ. ఎంతదూరం చూచినా నీరు తానేప్రమాణంలో లేస్తూవుంటుంది. చివరకు పోయిపోయి ఆకాశంతో కలిసిపోతుంది. రెంటింటి రంగూ ఒకటిగానే వుంటుంది. కాని సముద్రజలం కొంచెం యెక్కువ నీలంగా వుంటుంది. ఈ అపారసాగరంలో అసురులు తమ విశాల నౌకల్ని నిర్భయులై నడుపుతూ మాసాలూ, సంవత్సరాలూ ప్రయాణంచేస్తూ సముద్రంనుంచి వివిధరత్నాలను తెస్తున్నారు. అసురుల సాహసానికీ

నేర్పుకీ యిదికూడ ఒక ఉదాహరణే. ఇంతేకాదు, యింకోవిషయం నీవు వినే వుండవు. అసురులు నోటితో పలుకకుండానే సంభాషించగలరు.'

'పలుకకుండానా సంభాషించుట ? ఏమన్నావు మిత్రమా!'

'అవును మాట్లాడకుండానే. పట్టి, రాయి, చర్మం యిస్తేచాలు, ఒక అసురుడు దానిపై ఏవో గుర్తులు గీసిస్తాడు. రెండోవాడు సంగతంతా గ్రహించేస్తాడు.

'రెండుగంటలసేపు మాట్లాడి మనం తెలియజెప్పలేనంత విషయాన్ని వారు అయిదో పదో గుర్తులుగీసి తెలిసేటట్లు చేయగలరు. ఈ సంగతి ఆర్యులకెప్పుడూ తెలియదు. ఇప్పుడు మన ఆర్యులు ఆగుర్తుల్ని, గీతల్నీ నేర్చుకుంటున్నారు. కాని సంవత్సరాలు గడిచినా వారు నేర్చుకోవడం పూర్తికావడంలేదు.'

'అయితే తప్పకుండా అసురులు మనకంటే ఎక్కువ నిపుణులే !'

'వారిలో కమ్మరులు, వడ్రంగులు, మేదరులు, సాలీలు మొదలగువారు తమ హస్తనైపుణ్యాన్ని తమ వస్తువుల్లో చూపుతూనే ఉన్నారు. అట్లాంటప్పుడిక అసురులు మనకన్న అధిక నిపుణులనడంలో సందేహంఏముంది ?

'అసురులు ధీరులుకూడా అన్నావుకదూ ?'

'అవును కాని ధీరులసంఖ్య చాలాతక్కువ. వారి పిల్లలు ఆర్యులలోవలె ఉగ్గుపాలతో ఖడ్గప్రయోగం నేర్వరు. యోధులు వేరుగనూ శిల్పులు, వ్యాపారులు, బానిసలు వేరువేరు శ్రేణులుగను నున్నారు. యోధుల తరగతివారు తప్ప మరెవ్వరూ యుద్ధవిద్య నేర్చుకోరు. అట్టివారిని యోధులు చాలా హీనదృష్టితో చూస్తారు. దాస దాసీలస్థితి పశువులకన్న హీనం. వాళ్ళతో వ్యాపారం చేసుకొనడానికేకాక వాళ్ళ శరీరాలను యిచ్చవచ్చినట్లు వుపయోగించుకోవచ్చును.'

'అసురుల్లో యోధులెంతమంది యుంటారు ?'

'నూటికి ఒక్కరుకూడా ఉండరు. దాసదాసీలునూటికి నలభై, అర్ధబానిసలు నూటికి నలభై (శిల్పులూ, రైతులూ అర్ధబానిసలు), నూటికి పదిమంది వ్యాపారులు (వర్తకులు), మిగిలిన వారితరులు.'

'అందువల్లే అసురులు ఆర్యులచే ఓడిపోయారు.'

'అవును. వారి ఓటమికిది ఒక ప్రధానకారణం. మరొక పెద్దకారణమేమంటే వారు రాజును ప్రజలకందరికీపైన దేవునిగా తలంచడం.'

'ఆర్యులమైన మనం దీనినెన్నటికీ అంగీకరించలేం ?'

'ఇందుకునే మనం ఇంద్రపదవిని విచ్ఛిన్నం చేయాల్సి వచ్చింది. మఘవా ఇంద్రుని తదనంతరం ఎవరో ఒక ఇంద్రుని సంగతిది. అతడు అసురరాజులా కావాలని చూచాడు.'

'అసుర రాజులాగునా ? ఆర్యప్రజలను కాదనా !'

'అవును ! అతడొక్కడే కాదు, అతడి తర్వాత యింకొకడుకూడా, ఈ ప్రయత్నంలో అతనికి సహాయపడుతూంటే కొందరు దొరికిపోయారు.'

'సహాయం చేస్తుండగానా ?'

'అవును. యిందుకనే ఇక యింద్రపదవి రద్దుచేయాలని సౌవీర జనం నిర్ణయించారు. ఇంద్రునికి అశని (మెరుపు) దేవుని పేరుకూడావుంది. దీనివల్ల ప్రజల్లో భ్రమఏర్పడే ప్రమాదంకూడా వుంది.'

'సౌవీరప్రజలు మంచిపనిచేశారు మిత్రమా !'

'కాని ఆర్యజాతికి కళంకం తెచ్చేవాళ్ళెందరో పుట్టుకొచ్చారు. వీళ్ళు అసురుల ప్రతివిషయాన్ని ప్రశంసించడంలో అలసిపోవడంలేదు. అసురలదగ్గరవున్న ప్రశంసనీయాలను నేను ప్రశంసిస్తాను. వాటిని మనం నేర్చుకోవాలి. వారి ఆయుధాల్ని మనం అనుకరణచేశాం. వారి వృషభ రథాల్నిచూచి, మన మఘవా ఇంద్రుడు అశ్వరథాలు చేయించాడు. ధనుర్ధారునికి గుఱ్ఱంమీదకన్నా రథంపై ఎక్కువ వీలుంటుంది. అక్కడ కావలసినన్ని అంబులపొదులు పెట్టుకోవచ్చు. శత్రుబాణాల నుండి రక్షించుకోడానికి ఆవరణమేర్పర్చుకోవచ్చు. అసురుల కవచం, శక్తి, బాణం, గద మొదలగువాటినుంచి మనమెంతో నేర్చుకున్నాం. వారి నగరాలనుంచి కూడా మనం చాలావిషయాలు గ్రహిస్తున్నాం.వారి సముద్రయాత్రనుకూడా మనం నేర్చుకోవాలి.ఎందుకంటే రాగి మొదలయిన యితరలోహాలు,రత్నాలూ,యింకా అనేకమయిన యితరవస్తువులూ, సముద్రపు ఆవలినుండి వస్తున్నాయి. యిప్పుడుకూడా యీ

యావత్తువ్యాపారం అసురవర్తకుల చేతుల్లోనే వుంది. మనం వారినుంచి స్వతంత్రులం కావాలంటే, సముద్రంలో నౌకల్ని నడపడం నేర్చుకోవాలి. కాని మనం ఘోరంగా యెంచాల్సిన ఎన్నోవిషయాలు లింగపూజలాంటివి అసురులవద్ద వున్నాయి.'

'కాని లింగపూజను మెచ్చుకొనే ఆర్యుడెవడు ?'

'అట్లా అనకు మిత్రమా ! అసురుల్లాగే మనంకూడా మన పురోహితుల్ని ఏర్పాటుచేసుకోవాలని యెందరో ఆర్యులంటున్నారు. మనసమాజంలో యోధులూ, పురోహితులూ, వర్తకులూ, శిల్పులూ అనే భేదమేలేకుండా అందరూ అన్ని పనుల్నీ ఇచ్ఛానుసారంగా చెయ్యొచ్చు. కాని అసురులుమాత్రం వేరువేరు తరగతులుగా చేసిపెట్టుకున్నారు. నేడు ఆర్యుల్లోకూడా పురోహితులు బయలుదేరితే కొద్ది సంవత్సరాల్లోనే లింగపూజ ఆరంభం అయిపోతుంది. అసుర పురోహితులు చాలా కపటులు. స్వార్థసిద్ధికోసం ఆర్యపురోహితులుకూడా అదే చేస్తారు.'

'దీనివల్ల చాలా చెడుగొస్తుందే, వరుణా !'

'గత రెండువందల సంవత్సరాల అసుర సాంగత్యంవల్ల వారిచెడ్డ ఆర్యుల్లోకి ప్రాకిపోయింది. వాటినిచూచి ఆర్యవృద్ధులు నిరాశులై పోతున్నారు. నేను నిరాశపడ్డం లేదు. ఆర్యజనానికి వారి పురాతన విషయాలు సరిగ్గా నచ్చచెప్పేట్లయితే వారు పతనంచెందరని నా యభిప్రాయం.తక్షశిలలో అంగిరా అనే ఒక ఆర్యఋషి వున్నారని విన్నాను. ఆయన ఆర్యుల పురాతనవిద్యలో గొప్ప పండితులట. ఆర్యుల్ని ఆర్య మార్గంలో నడిపించడానికి ఆయన విద్యగరుపుతారట. ఆర్యుల విజయంకోసం నేను ఇదివరలో ఖడ్గంత్రిప్పాను. ఆర్యత్వరక్షణ కోరుతున్నాను.'

'ఏమి సంయోగమిది ! నేనుకూడా అంగిరాఋషిదగ్గరికే అస్త్ర శస్త్రాభ్యాసానికి పోతున్నా.'

'కాని, పాలా ! తూర్పుఆర్యుల విషయమేమి ?'

'తూర్పున ఆర్యజనులు దావాగ్నివలె ముందుకుసాగిపోతున్నారు. ఈ గంధార్ (తక్షశిల) భూమికి ముందుభాగాన్ని మా మద్రులం తీసుకున్నాం. దాని ముందు భాగాన్ని మల్లులు వశపర్చుకున్నారు. కురులూ పంచాలురు మొదలగువారుకూడా పెద్ద పెద్ద ప్రదేశాల్ని చేజిక్కించుకొన్నారు.'

'అయితే అక్కడ ఆర్యులు ఎక్కువగా ఉన్నారన్నమాట?'

'అంత ఎక్కువగాలేరు. ముందుకు పోయినకొద్దీ అసురుల యింకా తదితరుల యొక్క సంఖ్య అధికమౌతోంది.'

'ఇంకా యితరులెవరు?'

'అసురులు రాగిరంగులో వుంటారు. తూర్పున యింకో విధమయిన వాళ్ళున్నారు. వారిని కోలులంటారు. వారు బొగ్గులంత నల్లగా వుంటారు. వారు గ్రామాల్లోనే కాక, మృగాల్లాగ అడవుల్లోకూడా వుంటారు. అడవి కోలుల ఆయుధాలు రాళ్ళే.'

'అయితే, ఆర్యజనులు అనార్యులతో చాలా పోరాడవలసి వస్తుందన్నమాట.'

'అంతగా పోరాడడం ప్రస్తుతం చాలాతక్కువ. ఆర్యుల అశ్వాలను చూడడం తోనే అనార్యులు కాళ్ళకు బుద్ధిచెప్పుతున్నారు. కాని వారు రాత్రిళ్ళు, మా పట్టణము లపై దాడి చేస్తున్నారు. అందువల్ల మేము వారిమీద క్రూరత్వం వహించవలసి వస్తోంది. దీంతో అసురుల (శబరుల) కోలులయొక్క గ్రామాలకు గ్రామాలు ఖాళీ అయిపోయాయి. వారంతా తూర్పుదిక్కుకు పారిపోతున్నారు.'

'అలాగైతే మీరున్నచోట, అసురుల నడివడికలు ఆర్యులకు అలవడే ప్రమాదం లేదా?'

'మద్రజనుల్లో అప్రమాదం ఏమీలేదు. బహుశా మల్లుల విషయంలో కూడా యిదే అనుకుంటాను. మా ప్రాంతంలో వాస్తవానికి అనార్యులు అడవుల్లో మాత్రం వుండిపోయారు.'

మిత్రులిద్దరి సంభాషణ చీకటిపడేదాకా నడిచింది; సత్రపు రక్షకులు గనుక భోజనపానాదులసంగతి జ్ఞప్తికి తేకపోతే బహుశా ఆ సంభాషణ అప్పుడే ఆగేదికాదు. సత్రం గ్రామవాసులచేత కట్టబడింది. ఒక్క పీతకేశులకేకాక దానిలో యాత్రికులందరికీ నివసించే యేర్పాటులున్నాయి. తిండిసామానులేనివారికి సత్రం నుంచి పిండీ, గోమాంసపు సూపా లభిస్తుంది. సామానులు మొదలైనవి యిచ్చిన

యెడల సత్రపురక్షకురాలు భోజనం వండిపెడుతుంది. సోమానికి, సురకూ యీ సత్రం చాలా ప్రసిద్ధమైనది. వరుణుడూ పాలుడూ నిప్పులో కాల్చిన గోమాంసం తోనూ సురతోనూ తమ మిత్రత్వాన్ని దృఢపచ్చుకున్నారు.

---

## 2

అంగిరాఋషి సింధుతీరానికి తూర్పునవున్న గంధార జనుల ఉన్నతాధికారి యయిన జనపతిగా పనిచేశాడు. మొట్టమొదటితరం తర్వాత, పుష్కలావతినుండి అసురప్రజలు వలసపోవ నారంభించారు. కాని రెండవతరంలో కునార్‌తీరంనుండి వచ్చిన గంధారజనులశాఖ ఒకటి పశ్చిమగంధారుల నోడించింది. ప్రాణాలు దక్కించుకొన్న అసురులు చాలావేగంగా 'పశ్చిమగంధారు' నుండి పారిపోసాగారు. దీనికి 30 సంవత్సరాల తర్వాతనే సింధుకు తూర్పుభూభాగంపైన గంధారులూ, మద్రజనులూ దాడిచేశారు. వితస్తా (ఝీలమ్) నూ, సింధుయొక్క మధ్యభూమినీ గంధారులు ఆక్రమించుకొన్నారు. వితస్తాకీ ఐరావతి (రావి)కీ మధ్యభూమిని మద్రులు తీసుకున్నారు. ఈ విధంగా వారు దానిని విభజించుకొన్నారు. ఈ రెండు భూభాగాలూ రానురాను తూర్పుగంధార మద్రజనభూములని పేరు పొందాయి. ఈ ప్రథమ దేవా (ఆర్య) – అసుర సంగ్రామంలో రెండుజాతులూకూడా అమానుష క్రూరత్వాన్ని ప్రదర్శించడంలో పోటీపడ్డాయి. దీనికి ఫలితంగా తక్షశిలలో అసురులు పూర్తిగా లేకపోవుట; మద్రదేశంలో కొద్దిగామాత్రం మిగలడం జరిగింది. కాలంగడవడంతో పాటు అసురుల శతృత్వంకూడా తగ్గసాగింది. పీతకేశులుకూడా తమ యుద్ధ క్రూరత్వాన్ని తగ్గించారు. ఇంతేకాక వరుణపాలీపుడు చెప్పినట్లు, పీతకేసులపైన అనేక విషయాల్లో అసురుల ప్రభావం పడసాగింది. అంగిరాఋషి వక్షుతీరంలో వస్తూన్న ఆర్యపరంపరలోకెల్ల గొప్ప పండితుడు. ఆర్యులు తమ ఆచారవ్యవహారాల్నీ, రక్తాన్నీ దాని పారిశుధ్యాన్ని విడువకూడదని ఆయన కోరుతున్నాడు. ఇందువల్లనే ఆయన ఆర్యపోషణకు ప్రోత్సాహమిచ్చి కొంత ఆగిపోయిన మాంసభక్షణాన్ని పునఃస్థాపనచేశాడు. ఆయన ఆర్యత్వప్రేమా, విజ్ఞానం, యుద్ధవిద్యా నిపుణత్వం దేశం దశదిశల మారుమ్రోగడంవల్ల. అత్యంత మారాననున్న ఆర్యజనపదాలనుండి

కూడా ఆర్యకుమారులు ఆయనవద్దకు విద్యాభ్యాసంకొరకు రాసాగారు. గంధార పురంలో అంగిరా నాటిన ఈ విజ్ఞానబీజం మున్ముందు తక్షశిలరూపంలో ఒక మహా వృక్షంగా మారి దానిఛాయలో మధురమైన ఫలాలను అనుభవించడానికి వందలాది యోజనాల దూరాన్నుంచి ఆర్యవిద్యాప్రియులు వస్తారని ఆ కాలంలో ఎవరికైనా యెట్లాతెలుస్తుంది !

అంగిరాఋషి వయస్సు అరవైనాలుగు. ఆయన వెండిజుట్టు, నాభిపర్యంతం వ్రేళ్ళాడుతూ తెల్లగామెరుస్తూన్న గెడ్డమూ, ప్రశాంతమైన ఆయన గంభీర ముఖానికి వన్నెతెస్తున్నాయి: అప్పటికి యింకా వ్రాతకొరకు భూర్జపత్రాల నుపయోగించేకాలం రావటానికి శతాబ్దాలు గడవాల్సివుంది. ఆయన అధ్యాపకత్వమంతా వాగ్రూపంలోనే నడుస్తోంది. పురాతనగీతాలనీ, కవిత్వాన్నీ విద్యార్థులు పునశ్చరణద్వారా కంఠస్థం చేస్తున్నారు. దూరాన్నుంచి వచ్చిన విద్యార్థులు తమతోపాటు ఆహారపదార్థాల్ని తెచ్చు కోరు. అందుకని అంగిరాఋషియే విద్యార్థుల భోజనానికీ, వస్త్రాలకీ ఏర్పాటు చేయాల్సివచ్చేది. ఋషి పిత్రార్జితభూములేకాక విద్యార్థుల సహాయంతో అడవి కొట్టి కొత్తపొలాల్ని సేద్యంచేసి సాలుకుసరిపోయే గోధుమలు పండించేవాడు. ఇంకా ఆనాటికి తోటలువేయటం తెలియదు. కాని అడవుల్లో పండ్లుపండేకాలం వచ్చినప్పుడు తన శిష్యబృందాన్ని వెంటబెట్టుకొని ఆయన పండ్లుప్రోగు చేయడానికి వెళ్ళేవాడు.

పొలాలు దున్నేప్పుడూ, విత్తులు నాటేప్పుడూ, పంటకోసేప్పుడూ, పూలూ ఫలాలూ, కట్టెలూ ప్రోగుచేసేప్పుడు ఋషీ ఆయనవిద్యార్థులు వక్షుతీరంలోను, వనాస్తు లోను అల్లిన గీతాల్ని గొంతెత్తిపాడేవారు. గంధారమంతటిలోనూ అన్నిటికన్నా పెద్ద అశ్వస్థం (గుర్రాలనుపెంచే స్థానం) అంగిరాఋషిది. తన శిష్యులచేతా,పరిచితులచేతా, అనేక ప్రాంతాలు వెతికించి ఆయన మంచి ఉత్తమజాతికి చెందిన మగ గుర్రాల్నీ, ఆడగుర్రాల్నీ ప్రోగుచేసి వాటివంశాన్ని వృద్ధిచేశాడు. రానురాను చాలా ప్రసిద్ధికెక్కిన సైంధవజాతి గుర్రాల ప్రారంభం అసలు అంగిరాఋషి అశ్వస్థంనుండియే! ఇవి కాక ఆఋషివద్ద వేలాది ఆవులూ, గొర్రెలూ వున్నాయి. విద్యాధ్యయనంతోపాటు ఆయనశిష్యులు ఋషితోకూడా నిరంతరం పనిచేసేవారు. అందువల్ల శిష్యుల భోజన వస్త్రాదుల కేమీ లోపం కలిగేదికాదు. తక్షశిలచుట్టూవున్న యావత్తుపర్వతాలు మంచినీళ్ళతోనూ, మంచిఫలాలతోనూ, సస్యశ్యామలంగానూ వున్నాయి. అంగిరా శిష్యులతోపాటు ఆకాలంలో అడవినిగుండా, పాలునిగుండా గోశాలను సంరక్షణ

చేస్తున్నాయి. దేరాలను బయట కొంచెం దూరంలో ఎర్రని, తెల్లటి కోడెదూడలు గంతులేస్తున్నాయి. ఋషి తనశిష్యులతో పచ్చని పచ్చికమీద కూర్చొనివున్నాడు. అరని ఎడమచేతిలో సన్నని ఉన్ని ఏకుఉంది. కుడిచేతితో పెద్ద కర్రతకిలీని త్రిప్పుతున్నాడు. శిష్యుల్లోకూడా ఒకడు తకిలీని త్రిప్పుతూంటే, యింకొకడు ఉన్నిని పింజుతున్నాడు. మరొకడు చేతుల్తో పొడుగాటి ఏకుల్ని చేస్తున్నాడు. ఋషి యీవేళ ప్రాచీన నవీనాల్నిగురించి ఆర్య—అనార్యుల రీతిరివాజులనుగూర్చి శిల్పపరిశ్రమలో అవసరావసరములనుగురించి పాఠం చెప్తున్నాడు.

''బిడ్డలారా! ఆధునికపద్ధతులు అనుసరణీయములు కావలసియు, ప్రాచీన పద్ధతులనే అనుసరించవలెనని చెప్పడం చాలాతప్పు. వక్షురీకపు ఆర్యుల్లోని మొట్టమొదటిసారి రాతిఆయుధాలస్థానంలో రాగిఆయుధాలు ప్రచారంలోకి వచ్చినప్పుడు ఎందరో యీనూతనవస్తువును ఎదిర్చారు.'

ఋషికి ప్రియశిష్యుడైన వరుణుడు 'రాతిఅస్త్రాలతో పని ఎలాగున చేసేవారు?'

'పుత్రా: నేడు రాగిశస్త్రాలతో పనిజరిగిపోతూంది. రేపు దీనికన్న మన్నైన దేదైనా మరొకవస్తువు వచ్చినపుడు రాగిఆయుధంతో ఎట్లాపనిజరిగిందోనని అప్పుడు ప్రజలు ప్రశ్నిస్తారు. ఏ ఆయుధం ఎప్పుడు లభ్యమైతే దానితో మానవుడు పని నడుపుకుంటాడు. రాతిగొడ్డళ్ళతో యుద్ధాలు నడుస్తూండినప్పుడు, యిరుపక్షాల భుజాల వద్దకూడా రాతిగొడ్డళ్ళే వుంటూండేవి. ఒకపక్షానికి రాగిగొడ్డలిరాగానే రెండోపక్షం కూడా రాతిగొడ్డలివిడిచిపెట్టి రాగిగొడ్డలి చేపట్టవలసి వచ్చింది. వారు అట్లాచేసి యుండకపోతే ప్రపంచంలో బ్రతకడానికి వారికి స్థానముండేదికాదు. అందువల్లనే క్రొత్తవిషయాలన్నిటినీ త్యజించాలనడం తప్పని నేనుచెప్పాను. నేను అధునాతనత్వానికి విరోధినైతే ఇన్ని అందమైన గుఱ్ఱాల్నీ, ఇన్ని సుందరమైన అశ్వల్నీ సృష్టించగలిగి వుండేవాణ్ణికాదు. మంచి మగగుఱ్ఱాలనీ ఆడగుఱ్ఱాల్నీ ఏరాను. 35 సంవత్సరాల తరువాత దానిఫలితంగా మీరు అంగిరాఋషి తయారుచేసిన గుఱ్ఱాల వంశాన్ని చూస్తున్నారు.'

'అసురులు పొలాలకు చాల చక్కని ఏర్పాట్లు చూస్తూండేవారు. పర్వతనదుల నుండి కాలువలు త్రవ్వుకొచ్చి వాటికి నీరుపెట్టేవారు. మనం 'గంధారు' నందు

ఈ విషయాల్ని తెలుసుకొన్నాం. వారి పట్టణ నిర్మాణపద్ధతి, వైద్యచికిత్సకు సంబంధించిన ఎన్నో విధానాలూ చాలా బాగున్నాయి. వాటిని మనం స్వీకరించాం. ఆహారం బట్టలూ (ఉడుపులు) జీవితరక్షణకు ఉపయోగించే యితరవస్తువులూ మొదలైన వాటిని సనాతన అధునాతన తారతమ్యంలేకుండా, ఆర్యులనుండివచ్చాయా, అనార్యులనుంచి వచ్చాయా అనే ప్రసక్తిలేకుండా వాటిని స్వీకరించాల్సిఉంది. సవాస్తులో ఇంకా వెనుకటికాలంతో ఆర్యులు నూలువస్త్రాల పేరుకూడా ఎరుగరు; కాని యిక్కడ మనం వాటిని కట్టుకుంటున్నాం. వేసవిలో అవి బాగుంటాయి.'

కాని, విషతుల్యంగా మనం త్యజించాల్సిన విషయాలెన్నో వున్నాయి. అసురుల, లింగపూజాధర్మం గర్హ్యనీయమైనది. వారి జాతివిభజన మనం విస్మరించతగింది. ఎందుకంటే దానివల్ల మనవారు నిర్వీర్యులౌతారు. బంధువులలో హెచ్చుతగ్గుబాటం హెచ్చురేగింది. అసురులలో రక్తసంబంధంకూడదు; ఎందుకంటే మనంకూడా అసురులమైపోవడానికి దారి ఏర్పడిపోతుంది. ఆర్యుల్లోకూడా వివిధ చేరివసులకు విభిన్నవృత్తులకుచెందిన చిన్నచిన్న జాతులేర్పడిపోతాయి.'

పాల్— 'అసురులలో రక్తబాంధవ్యాన్ని ఆర్యులందరూ చెడుగా తలుస్తారు కదా!'

ఋషి— 'అవును, కాని దీనికి అంత శ్రద్ధతీసుకోడానికి సిద్ధపడరు. అసురస్త్రీలతో ఆర్యులు సంగమం చేయరా?'

వరుణుడు— 'అసురపుర వేశ్యలవద్దకు మనభటులు సర్వసాధారణంగా వెళ్తుంటారని సరిహద్దులో చెప్పుకుంటారు.'

ఋషి— 'దీనిపరిణామం ఏమిటి? వర్ణసంకరం హెచ్చవుతుంది. అసురులలో కూడా పీతకేశులగు బాలబాలికలు జన్మిస్తారు. ఆర్యులు మోసపోయి వారిని తమలో కలుపుకుంటారు. ఇక రక్తపారిశుద్ధ్య మెక్కడుంటుంది? ఇందుకనే రక్తపరిశుభ్రత కోసం మన స్త్రీ పురుషులుభయులూ బహుజాగరూకులై వుండాలి. ఇంతేకాదు, మనం ఆర్యజనపదంలో దాసత్వాచారాన్ని ఒప్పుకోకూడదు. ఏమంటే రక్తశుద్ధిని పాడుచేయడానికి యింతకంటే ప్రమాదకరమైన వస్తువు మరొకటిలేదు. ఇంతేకాక అనార్యులను ఆర్యజన ప్రదేశంలో నివసించుటకు తావులేకుండా చేయాలని నేనంటాను.'

'అన్నింటికన్న గొప్పప్రమాదమూ, అన్నిచెడుపులకూ మూలమూ అసురుల రాజ్యవిధానమే! దీని ఒకఅంగమే వారి పురోహితఆచారం. అసురజనానికి ఏఅధికారాలూ లేవు. అసుర రాజాజ్ఞ పాలించుటయే ప్రతిఅసురుని ధర్మం. ప్రజల భారాల్ని యావత్తు పైన దేవతలూ, క్రింద రాజూ తమభుజస్కంధాలపై వేసుకున్నారనీ, కనుక ప్రజలకు ఏమయినా చెప్పడానికీ చెయ్యడానికీ అధికారంలేదనీ పురోహితు డుపదేశిస్తాడు. రాజు సాక్షాత్తు భూలోకదైవం! శివి-సౌవీరులు ఇంద్ర పదవిని తొలగించేశారని విన్నప్పుడు నాకు అపరిమితానందం కలిగింది. అసుర రాజుకు ప్రాప్తించినంతస్థానం ఇంద్రుడికి ఆర్యుల్లో ఎప్పుడూ లభించలేదు. ఇంద్రుడు ప్రజలచే ఎన్నుకోబడిన ఒకమహాయోధుడు మాత్రమే! ప్రజలపై శాసనం చలాయించడానికి అధికారంలేదు. అయినప్పటికీ యీ పదవివల్ల ప్రమాదముంది. కొందరు దాని చాటున ఆర్యుల్లోకూడా రాజ్యాధికార సంప్రదాయాన్ని ప్రవేశపెట్టాలని యత్నించారు. ఆర్యులు తమ ఆర్యత్వాన్ని కాపాడుకోదలిస్తే, రాజుకుండే అధికారాలను వారు ఏవ్యక్తికి యివ్వరాదు. ఆర్యులకు అసురుల మతమంటే గొప్పద్వేషమున్న దనడానికి సందేహంలేదు. కాని ఏనాడు ఆర్యుల్లో రాజు ఏర్పడతాడో, ఆరోజునే అసురపౌరోహితునివంటి పౌరోహితుడుకూడా ఏర్పడతాడు.

అప్పుడు ఆర్యత్వం అంతరించిందనుకో! ప్రజల శ్రమఫలితంగా రాజు భోగభాగ్యాలనుభవిస్తాడు. దేవతల ఆశీర్వచనం పొందడానికని అతడు లంచమిచ్చి పురోహితుణ్ని తనవైపు త్రిప్పుకుంటాడు. ఈ విధంగా రాజూ పురోహితుడూ కలిసి ప్రజల్ని తమ బానిసలుగా చేసివేసుకుంటారు.

'మనం ఆర్యుల పురాతనాచారాల్ని చాలా దృఢంగా అనుసరించాలి. ఎక్కడైనా ఏ ఆర్యుడైనా వాటి నతిక్రమిస్తే అట్టివానిని ఆర్యుల జాతినుండి వెలివేసెయ్యాలి.'

---

## 3

సౌవీరుకు దక్షిణభాగం (కరాచీదగ్గర) నుంచి ఎన్నో దుఃఖకరమైన వార్తలు వచ్చుచుండి చేరుతున్నాయి. అంతిమ అసురమర్గ పతనంలోపాటు ఆర్యులమధ్య

గొప్ప కలహం ఆరంభంకానున్నదని తెలుస్తోంది. వరుణుడు తన గురువుతో సౌవీరుల సమస్యలను సమగ్రంగా చర్చించాడు. ఈకలహం మొదట సౌవీరులో పుట్టినను, యీ సుడిగుండంలోంచి యావన్మంది ఆర్యులూ బయటపడాల్సివున్నారు. ఇది అంగిరాఋషియొక్క అభిప్రాయం. పూర్వంనుంచీ ఎల్లప్పుడూ ఆర్యులు వ్యక్తికంటె, జన-శాసనానికి ప్రాముఖ్యతయిస్తూ వచ్చారు. అక్కడ అసురుల నిరంకుశరాజ్యాధికారాన్ని చూచి, ఎందరో ఆర్యనాయకులకు అధికారంపైనా, భోగాలపైన ఆశలు పుట్టవచ్చు. ఈ రెండు మనోవాంఛలమధ్యా సంఘర్షణ తప్పక జరిగితీరుతుంది. ఏ జనప్రదేశంలో అయితే అసురులసంఖ్య అధికంగా వుంటుందో అక్కడ యీ సంఘర్షణ మరింత హెచ్చుతూవుంటుంది. ఎందుకంటే అక్కడ పరాజితులైన అసురులు ఆర్యులు అంతఃకలహాలనుండి లాభం పొందదానికి వాంఛిస్తారు.

8 సంవత్సరముల పిదప, సౌవీరపురుష (రోటక్, రోడి) వార్తలు మరింత హృదయవిదారకంగా వుండటంవల్ల వరుణుడు గంధారపురం విడిచిపెట్టాల్సివచ్చింది. సత్రంలో కలసిన ఆ ప్రథమస్నేహితుడగు పాలమాత్రుడు అతనిని అనుసరించాడు. గంధార సరిహద్దుదాటి, వారు ఉప్పుపర్వతాల్లో సింధు జనప్రదేశంలో కాలెట్టారు. ఇప్పటికీ ఉప్పుకొతారుల్లో పనిచేసేవారు అసురులే. వారే హెచ్చుగా వర్తకులూ - శాల్మికులూ. దీని ప్రభావం పీతకేశుల (ఆర్యుల)పై చెడ్డగాపడింది. వారిలో సోమరితనం హెచ్చుగావుంది. తమపనిని అనార్యులగు కర్మకారులచేత చేయించు కోవాలని వాంఛిస్తున్నారు. వారు తమపని గుఱ్ఱపుస్వారి, ఖడ్గం త్రిప్పడంమాత్రమే అనితలుస్తున్నారు.

అసుర రాజులవలె క్రౌర్యాన్ని ప్రదర్శించే ఆర్యుల రాజ్యాధికారానికి అనార్య ప్రదేశం మంచి క్షేత్రంగా ఉంది. కాని ఉప్పుపర్వతాలను దాటినమీదట సౌవీరుల ప్రథమస్థానం (మూలస్థానం-మూల్తాను) చేరేటప్పటికి పరిస్థితి మెరుగనిపించింది. వారంతా ఆర్యులే. ఆ వేడిప్రదేశాన్ని సహించికూడా అచ్చట ఆర్యసాంప్రదాయా లను నిలుపుతున్నందుకు వారెంతో ప్రశంసార్హులు. వరుణుడూ, పాలుడూ వేసవి యందే ప్రయాణము చేస్తున్నారు. సింధునదిలో నావమీద ప్రయాణం చేస్తూండడం వల్ల కష్టమంతగా లేనిమాట నిజమే.

సౌవీరపురం (రోరుక్, రోడ్డు) లోని వేడిమి వారిని విపరీతంగా బాధించేస్తూంది. ఆర్యుల్లో యిప్పటికింకా లిపిప్రచారం కాలేదు. ఇందువల్ల సౌవీర ప్రయాణీకులద్వారా అప్పుడప్పుడు వరుణుడు తన మిత్రులకు పంపిన సందేశాలు పూర్తిగా అందలేదు. ఈసమయంలో అతనికెన్నోసార్లు అసురుల లిపి జ్ఞప్తికి వచ్చేది. సౌవీరపురం చేరినతరువాత వ్యవహారం చాలాదూరం పోయిందని అతనికి తెలిసింది. సౌవీరపురంలోనే సుమిత్రుణ్ని బలపరచేవారు తక్కువగావున్నారు. కాని దక్షిణ సౌవీరంలో మాత్రం అంతిమ అసురదుర్గ విధ్వంసకుడైన సుమేధుని పక్షీయులయిన ఆర్యులు చాలామందివున్నారు. ఈ అంతిమదుర్గ పతన సమయంలో సేనాధిపతి సుమిత్రుడు అసురనగరవాసులయెడ మితిమీరిన దాక్షిణ్యంచూపించాడు. అందువల్ల అప్పుడు సుమిత్రుడు వరుణుని ప్రశంసకు పాత్రుడయ్యాడు. కాని అదంతా సుమిత్రుని ఎత్తుగడఅని వరుణునికి తెలిసిపోయింది. ఈ పరాజయానంతరం అసురులు మరల ఆర్యుల కెదురుతిరిగి నిలబడలేరనీ, ఆ దయ నాధారంగా చేసుకొని సముద్రపు ఆవలిఒడ్డునున్న అసురులసంపత్తినీ శక్తినీ తమ వ్యక్తిగత లాభాని కుపయోగించుకొనగలమనీ అతడు తలచాడు.

సుమిత్రుడు ఇప్పుడుకూడా సైన్యాన్ని వెంటబెట్టుకొని సాగరతీరపు అసుర పురంలో వున్నాడు. కృత్రిమ యుద్ధాల మిషతో అక్కడి నుంచి వెనక్కి తిరిగేటట్టు లేదు. వరుణుడు మొదట సామాన్యనాయకుల్ని కలుసుకున్నాడు. వారికి సుమిత్రుని సంగతులు స్పష్టంగా తెలియవు. వ్యక్తిగతద్వేషాల కారణంగా కొందరు జన నాయకులు సుమిత్రుణ్ణి వ్యతిరేకిస్తున్నారని భావిస్తున్నారు. అంతట వరుణుడు ప్రజాపాలనకై బాధ్యులగు ప్రధాన జననాయకుల్ని కలుసుకొన్నప్పుడు వారు విషయం అంతా తెలియచెప్పారు.

సుమిత్రుని చెడునడత తమకు స్పష్టంగా తెలిసినా, ప్రజలకు ఈ సంగతి తెలియదని వారు సుమిత్రుని పరోక్షంగా అర్థంచేసి కొంటున్నారని వరుణుడికి చెప్పారు.

అసురపుర విజయసాధనలో వరుణుడు సుమిత్రుని ఉపనాయకుడు. అందు వల్లనే 9 సం॥లు గడిచినా ప్రజలు ఆనాటి అతని ఖడ్గప్రయోగ కౌశల్యాన్ని యింకా ప్రశంసిస్తూనే వున్నారు. ప్రజలకు యదార్థాన్ని తెలిపేముందు తానే ముందుగా సుమిత్రునిగూర్చి తెలిసికోవాలని వరుణుడు తలచాడు. అందుకొరకే ఒకనాడు

మిత్రులిరువురూ గాంధార వ్యాపారులవలె దుస్తులు ధరించి దక్షిణ సౌవీరానికి బయలుదేరారు. అసురపురం ఆర్యపురంలా గాక అసురులది వలనేఉంది. అక్కడ విపణివీధుల్లో దేశదేశాలతో వర్తకంచేసే అసురుల పెద్ద భవనాలున్నాయి. ఎందరో అసురసామంతులు ఆ పేటలలో నివసిస్తున్నారు. వారి పరిసరాలలో దాసదాసీలు నిలచివున్నారు. విజేతలైన ఆర్యులు ఎక్కడా అని వరుణుడాలోచింపసాగాడు. సుమిత్రుడు అసుర రాజుభవనంలో నివసిస్తున్నాడు. గాంధార వ్యాపారుని అనుమతితో పాలమాద్రుణ్ని వరుణడొకనాడు సుమిత్రునొద్దకు పంపాడు. అతడు తిరిగివచ్చి సుమిత్రుడు పూర్తిగా అసురరాజై పోయాడని తెలియజేశాడు.

సుమిత్రుని నివాసం ఒక ఆర్య సేనాధిపతియొక్క నిరాడంబర భవనంకాదు, అది వెండి బంగారములతో తులతూగే ఒక అసురదర్బారు. అతనిప్రక్కనిలచే సైనికుల్లోకూడా నిరాడంబరత్వంలేదు. అసురకన్యల నృత్యములలోను, మద్యపాన గోష్ఠులలోమాత్రం అక్కడ ఆర్యచిహ్నాలు గోచరిస్తున్నాయి. ఎందరో ఆర్యస్త్రీలు తమ భర్తలవద్దకు రావలెనని వాంఛిస్తున్నారు. కాని వంకలుపెట్టి వారిని ఆపు చేస్తున్నారు. ఎన్నిసార్లుకోరినా సుమిత్రుడు తనస్త్రీని రానివ్వకుండాచేశాడు. అదీగాక అసుర పురోహితకన్య ప్రేమలో చిక్కుకొన్నాడు. ఆమెఒక్కర్తేకాక నగరంలో ఎందరో అసురసుందరులు అతని అంతఃపుర పరిచారికలు! తన ఆర్యసైనికుల కూడా అతడు విశృంఖల స్వేచ్ఛను ప్రసాదించాడు. బయటనుంచి ఆర్యులువస్తే వారిని బానిసలుగా చేయచూచాడు. అందువల్ల దొమ్మీలు, పర్యవసానం ఆర్యులు రావడం మానివేయడం జరుగుతోంది.

వరుణుడు సమాచారమంతా పూర్తిగా తెలుసుకొని సౌవీరపురానికి ప్రస్థానం సాగించాడు. సౌవీరపురంలోని జననాయకులను పిలిచి అతడు సుమిత్రుని బలాన్ని గురించి తెలిపాడు. అసురపురంలోని ఆర్యభటులనేగాక అసురుల యావత్తుశక్తినీ ఢీకొనగలిగినంతబలం సుమిత్రునికి వుంది. అందుచే సిద్ధపడి అసలువిషయాన్ని ప్రజలకు వివరించాలని చెప్పాడు.

వరుణుడు నాట్యరంగంలో అందరికీ ప్రేమాస్పదుడు. సంవత్సరాలతరబడి భర్తల ముఖాలు చూడజాలకపోయిన ఆర్యస్త్రీలు పురుషుల చేష్టలను గురించి ఏకాంతంలో ఈ సుందర వర్తకునినుంచి విన్నప్పుడు వారికి యితనియందు పూర్తి నమ్మకం కలుగుతోంది. ఆనోటకానోట యీ సంగతులు బహువేగంగా వ్యాపించి

పోతున్నాయి. వరుణుడు కవికూడాను. అతడు భర్తృవియోగినులగు ఆర్యమహిళల తరఫున అసురకన్యకలను శపిస్తూ ఎన్నో గీతాల్ని వ్రాశాడు. భోగలాలసుడైన సుమిత్రుని స్వార్థమయజీవితాన్ని చిత్రిస్తూ ఎన్నో చక్కని పద్యాలుఅల్లాడు. అవన్నీ దావానలంలాగున యావత్తు సౌవీరఆర్య గ్రామాల్లోనూ వినపడుతున్నాయి. తుదకు అతడు ఆర్యపత్నులను కొంతమందిని వారి భర్తలవద్దకు పంపాడు. వారు తిరస్కృతులై వెనుకకు తిరిగిరావటంవల్ల పరిస్థితి మరింత విషమించింది. సుమిత్రుణ్ని తిరిగిరమ్మని కోరినప్పటికీ అతడంగీకరించలేదు. అప్పుడు ఆర్యులు అతని స్థానంలో వరుణుని సేనానాయకునిగా నియమించుకొని అపారసేనాసమేతులై అసురపురానికి బయలుదేరారు. వరుణుడు ఎదురుతిరిగి వచ్చాడని తెలియగానే సుమిత్రుని సైన్యంలో కలకలం పుట్టింది. ఎందరో తమ అనార్య ప్రవర్తనకు వాస్తవంగా పశ్చాత్తాపపడ్డారు. మిగిలిన సైన్యసహాయంతో పోరుసల్పుట నిష్ప్రయోజనమని సుమిత్రుడు గ్రహించాడు. ఇందువల్ల తుదకు అతడు వరుణునికి నగరం సమర్పించి సౌవీరపురానికి మరలిపోతానని తెలియచేశాడు. ఈ విధంగా, ఆర్యజనం ప్రథమ విషమపరీక్షలో ఉత్తీర్ణులయ్యారు.వరుణుడు అసురుల్ని వెంటాడి తరుమలేదు. ఎందుకంటే, వారు యిప్పుడు అస్త్రాలతో పోరాడడంలేదు. కాని ఆర్యుల్ని అసురుల ప్రభావాన్నుంచి దూరంగా వుంచడానికి అతడు ఒక ఆర్యపురాన్ని నిర్మించి అంగిరా ఋషి చెప్పిన ఎన్నో విషయాల్ని ఆచరణలో పెట్టసాగాడు.

---

* యిది నేటికి 152 తరాల వెనుకటి ఆర్యకథ.

# "సుదాసుడు"

## (ఏడవ కథ)

[దేశం - కురుపాంచాల (పశ్చిమ సంయుక్తప్రాంతం); జాతి— వైదిక ఆర్యులు; కాలం—క్రీస్తుకు 1500 సం॥ల పూర్వం]

వసంతఋతువు యిక ముగియనుంది. చనాబ్ నదీతీరాన కనుచూపుమేర ప్రదేశమంతటా పండిన గోధుమసస్యం బంగరువన్నెతో నిలబడి గాలి విసుర్లకు అలలులేస్తోంది. ఆపొలాల్లో అక్కడక్కడ స్త్రీ పురుషులు పాటలు పాడుతూ వరి కోస్తున్నారు. కోసినపొలాల్లో మొలచిన పచ్చనిపామును మేయటానికి ఆడగుఱ్ఱాల్ని వాటిపిల్లలతో విడిచారు. ఎండలో ఒకబాటసారి మెల్లగా సాగిపోతున్నాడు. అతని బూడిదరంగు కేశాలముడి ముందుకు వేళ్ళాడుతోంది. తలపై చింకిరి గుడ్డ తలపాగా వుంది. శరీరంపై ఒక పాతఉత్తరీయం; మోకాళ్ళవరకూ పంచెవుంది. చేతిలో ఒక కఱ్రవుంది. దాహంతో అతని నాలుక ఎండిపోతూంది. బాటసారి ముందు గ్రామానికి చేరిపోతామనే ధైర్యంతో వున్నాడు. కాని మార్గంప్రక్కనఒకమట్టినుయ్యి, ఒకచిన్న జమ్మిచెట్టునూ చూచాడు. అతడు మొదట తనపాగాగుడ్డతోను తరువాత కట్టుపంచెతోను అనంతరం రెండిటినీజోడించి కొసను నూతిలోని నీళ్ళలో ముంచడానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు. చివరకు భగ్నహృదయుడై చతికిలబడి దగ్గరున్న వృక్షానికి చేర్లబడ్డాడు. ఇక అక్కడనుండి లేవడం అసాధ్యమని అతడు తలుస్తున్నాడు. ఇంతలో ఒక భుజంపై నీటిబుంగా, రెండోభుజంమీద తాడుచుట్టా, చేతితో తోలుబొక్కెనా పెట్టుకుని ఒక యువతి అక్కడికొస్తూనట్లు కనబడింది. ఆ యువతి బావిదగ్గరకువచ్చి బుంగను క్రిందబెట్టింది. బొక్కెనను నూతిలో వేయబోతున్న సమయంలో ఆమె దృష్టి యాత్రికునిపై పడింది. అతడి ముఖం వాడిపోయింది, పెదవులు పగిలిపోయాయి. బుగ్గలు సొట్టలడిపోయి, కళ్ళుగుంటలడివున్నాయి. పాదరక్షలు లేని పాదాలు ధూళిధూసరితమైవున్నాయి. అయినప్పటికీ యివన్నీ అతని పడుచుదనాన్ని మరుగుపరచ లేకపోయాయి. లంగాను, రవికను ఒద్దికగా ధరించి వక్షోభాగాన్ని సెల్లాయితో అచ్ఛాదించుకొని స్వర్ణకేశములతో విరాజిల్లే యువతిని బాటసారి చూచాడు.

ఎండలో ప్రయాణంవల్ల యువకునిముఖం కందిపోయింది. లలాటంపైన పై పెదవి మీద చెమటబొట్లు నిలిచాయి. ఆమె కొంతసేపు ఆ అపరిచిత పురుషుని పైపైచూచి మధురస్వాభావికమైన చిరునవ్వుమోముతో మధురంగా 'సోదరా: నీవుదప్పిగొని వున్నావని తలుస్తా,' అంది.

బాటసారి ధైర్యాన్ని చిక్కబట్టి సాహసంతో 'అవును. నాకు చాలా దాహంగా ఉంది.'

'అయితే నీళ్ళుతెస్తా.'

యువతి చాదరలోనీళ్ళునింపేసరికి యువకుడు ఆమెదగ్గరకు వచ్చాడు. అతని బలిష్ఠశరీరము దీర్ఘకాయము అతని పౌరుషాన్ని చాటుతున్నాయి. యువతి చర్మపు పాత్రని నీటితో అతనికిచ్చింది. యువకుడు పెద్దగుటక వేసి రెండవంచి తాగుతున్నాడు. మళ్ళీ ఒక గుటకలో మరొక గ్లాసునీళ్ళు త్రాగాడు. గ్లాసు చేతిలోంచిజారి క్రింద పడింది. అతడు పాపం వెల్లకిల క్రిందపడిపోయాడు. ఒక్కక్షణకాలంపాటు యువతి నిశ్చేష్టఅయిపోయింది. యువకుని కళ్ళుతేలిపోవడం, అతను స్పృహతప్పి పడిపోవడం ఆమెచూచింది.

వెంటనే యువతి, తన తలకు కట్టుకున్న రుమాలును నీళ్ళలోతడిపి యువకుని ముఖాన్ని, నుదుటిని తుడవడం మొదలెట్టింది. కొద్దిక్షణాల్లోనే అతడు కళ్ళు తెరిచాడు. కొంచెం సిగ్గుపడి క్షీణస్వరంతో— 'నాకు చాలా విచారంగా ఉంది, కుమారీ! నిన్ను నేను కష్టపెట్టాను.'

'నాకేం కష్టంలేదు; ఈ నీ పరిస్థితిచూచి చాలా భయపడ్డా.'

'ఏమీ భయంలేదు. ఆకలిచేత, దప్పికచేత చాలా నీళ్ళుతాగేశాను. ఇక భయంలేదు.'

'ఆమాట వినగానే యువతి అక్కడనుండి ఒక్క పరుగుతీసి ఒకగిన్నెలో పెరుగూ, పిండీ, మధువు తెచ్చింది. యువకుని ముఖంలో సంకోచమూ, సిగ్గూ చూచి ఆమె—'నీవు సంకోచించకు బాటసారీ! నా సోదరుడుకూడా ఒకడు చాలా సంవత్సరాలక్రితం యిల్లువిడిచి పోయాడు. నీకు యీ అల్పసహాయం చేస్తూన్నప్పుడు నాకు నాసహోదరుడు జ్ఞాపకొస్తున్నాడు' అంది.

బాటసారి గిన్నెను పుచ్చుకొన్నాడు. తరుణి బొక్కెనతో నీళ్ళిచ్చింది. యువకుడు పిండికలుపుకుని మెల్లిమెల్లిగా త్రాగేశాడు. తర్వాత అతని మొగంలోని సగం అలసట తొలగిపోయింది. ఆత్మనిగ్రహం కలిగిన ఆ యువకుడు తన మౌన ముద్రనువిడిచి కృతజ్ఞతా సూచకంగా ఏమో మాట్లాడబోతూంటే అతని భావాల్ని ముందే గ్రహించినట్లు తరుణి- 'సంకోచించకు సోదరా! నీవు చాలాదూరాన్నుంచి వచ్చావని తోస్తోంది.' అన్నది.

'అవును, దూప్పనుంచి—పంచాల్ నుంచి.'

'ఎక్కడికి పోతావు?'

'యిక్కడికీ అక్కడికీ అని లేదు. ఎక్కడికిబడితే అక్కడికే.'

'అయినా.... ....'

'ప్రస్తుతం తిండికీ గుడ్డకీ ఏర్పాటు చేసుకోగలిగినంత ఏదయినా పనికోసం చూస్తున్నాను.'

'పొలం పనిచేస్తావా?'

'ఎందుకు చెయ్యను? నేను పొలం దున్నగలను. నాటు, కోతకూడా తెల్సు. కళ్లాల్లో పనిచేయగలను. గుఱ్ఱాల్ని, ఆవుల్ని మేపగలను. నాశరీరంలో బలంవుంది; యిప్పుడీమధ్యనే క్షీణించిపోయింది; కాని కొద్దికాలంలో బలమైన పనులుకూడా చేయగలను. కుమారీ! నేను ఎప్పటికి యజమానుని ఆజ్ఞాబద్ధుణ్ని.'

'మాతండ్రి నిన్ను పనిలోపెట్టుకోవచ్చు! నేను నీరు నింపుకొంటా నాతో రా! మాయింటికిపోదాం'.

యువకుడు నీటిబుంగను తను తీసుకురావడానికి ఎంతో ప్రయత్నించాడు. కాని యువతి ఒప్పుకోలేదు. పొలంలో ఒక ఎర్రని డేరావుంది. దానివెలుపల సుమారు నలభైమంది స్త్రీపురుషులు కూర్చునివున్నారు. వీరిలో యీ కన్యక తండ్రి యెవరో యువకుడు గుర్తించలేకపోతున్నాడు. అందరివస్త్రాలూ సాదాగా - ఒకే విధంగా వున్నాయి. అందరివీ పసుపుపచ్చని వెంట్రుకలే. తెల్లనిశరీరాలూ, నిశ్చింతతో కూడిన ముఖాలూను. తరుణి బుంగనూ, బొక్కెననూ దింపుకొని వారందరిమధ్యా

పరిచివున్న చర్మంపైనవుంచింది. తర్వాత అపవదిఏండ్ల ముదుసలి—కాని బలిష్టుడు—ఆరోగ్యవంతుడూ అయిన ఒకనివద్దకువెళ్ళి,

'పరదేశీయుడగు యీ యువకుడు ఏదయినా పని యిమ్మని కోరుతున్నాడు నాన్నా!'

'పొలంపనా? అమ్మా?'

'అవును ఎక్కడైనా సరే'.

'అయితే యిక్కడ పనిచెయ్యనియ్యి. ఇతరులకు యిస్తున్న వేతనమే ఇతనికీ యివ్వచ్చు.'

యువకుడామాటలు విని తన అంగీకారాన్ని తెలిపాడు. పిదప వృద్ధుడు—'రా అబ్బాయీ! నీవుకూడా రా. మధ్యాహ్నప్రభోజనాలు చేద్దాం.'

'ఆర్యా! నేనిప్పుడే మీకుమార్తెయిచ్చిన పిండి, నీరు త్రాగాను'.

'ఆర్యాలేదు గిర్యాలేదు. నేను విజయబుధుపుత్రమాత్రుణ్ణి. నీవు తినగలిగింది తిను. అపాలా! అశ్వినీ (ఆడగుర్రం) క్షీరముతో చేసిన మద్యం యివ్వు. యెండ దెబ్బకిది చాలామంచిది. యువకా! సాయంత్రం మాట్లాడుదాం. ప్రస్తుతానికి నీపేరు చెప్పు.'

'సుదాస పంచాలుడు.'

'సుదాస కాదు, సుదాః సుందరదానం యిచ్చేవాడు. తూర్పు వాళ్లైన మీరు భాషకూడా సరిగా మాట్లాడలేరా? పంచాల జనప్రదేశాన్నుంచా? సరె, అపాలా! యీ తూర్పువారు చాలా మొహమాటస్థులు. ఇతనికి తిండిపెట్టు.' అపాలా బలవంతంవల్ల సుదాసుడు రెండు మూడు గిన్నెల గుర్రపుపాలతో చేసిన పచ్చిమద్యం త్రాగాడు. ఒక రొట్టెముక్కకూడా గొంతులో వేసుకున్నాడు. గత రెండుదినాలుగా ఆకలితో వుండడంవల్ల అతని ఆకలి చచ్చిపోయింది. సూర్యుని ప్రచండత తగ్గుతూన్న కొలదీ సుదాసుడు తనలో చురుకుదనం హెచ్చడం కనిపెట్టాడు. సాయంత్రం గోధుమ సస్యపుకోతలో అతడు ఎవరికీ తీసిపోలేదు. అక్కడనుంచి జనంఅంతా దూరాన

వున్న కళ్ళాలలోకి పోయారు. విజయబుద్ధుని పొలం చాలా పెద్దది. కళ్ళంలో రాత్రికి పోగయినవారు రెండువందలకు పైగావుంటారు. కళ్ళపు పాకల్లో వంటచేసే వారు తమతమపనులలో వున్నారు. ఒక పెద్ద యెద్దును చంపారు. దాని ముడుసులూ, ప్రేవులూ, కొంత మాంసమూ పెద్దపెద్ద డేగిసాలలోవేసి యింకా మూడుగంటల ప్రొద్దుందనగానే పొయ్యికెక్కించేశారు. మిగిలినమాంసం ఒక్కొక్కటి అర్ధశేరు ముక్కలుగా కోసి వుప్పువేసి ఉడకబెడుతున్నారు. ఈ ఇండ్లకు బయట కళ్ళాలకోసం చదునైన మైదానంవుంది. దాని ప్రక్కనే ఒక మంచి నుయ్యి, నీటితోనిండిన ఒక నీళ్ళతొట్టి వున్నాయి. స్త్రీలూ, పురుషులూ అక్కడకెళ్ళి కాళ్ళూ చేతులూ ముఖం కడుక్కున్నారు. వళ్ళు కడుక్కోవాలనుకున్నవారు అదీచేశారు. చీకటి పడుతూండడంతో పాటు పంక్తిగా కూర్చొన్న స్త్రీపురుషులందరి విస్తళ్ళలో రొట్టెలూ, మాంసపు ముక్కలూ, మద్యంతో నింపిన ముంతలూ వడ్డించబడ్డాయి. సుదాసుని మొహమాటాన్ని గుర్తించి అపాలా అతణ్ని తనదగ్గిర కూచోబెట్టుకుంది. దేశాటనం పోయిన తన సోదరుని స్మృతిగురించే ఆమె ధ్యాసంతా. అంతేకాని సుదాసుడు మొహమాటపడతాడనికాదు. భోజనపానాల అనంతరం గానం-నృత్యం ఆరంభమయ్యాయి. వీటిలో సుదాసుడు యీనాడు పాల్గొనకపోయినా తరువాత తరువాత అతడే అందరికన్న సర్వజన ప్రియుడైన గాయకుడుగానూ, నర్తకుడుగాను అయ్యాడు.

పొలాలలో కోతలూ, కట్టిపేతలూ, నూర్పుళ్ళూ, నెలాపదిహేను రోజుల వరకూ సాగాయి. కాని రెండువారాలు గడిచేటప్పటికల్లా సుదాసుడు గుర్తుపట్ట లేనంతగా మారిపోయాడు. నీలివర్ణం కలిగిన అతడి పెద్దపెద్దకళ్ళు కాంతులు వెదజల్లుతున్నాయి. అతని చెక్కిళ్ళకు స్వభావసిద్ధమైన ఎరుపువచ్చింది. అతని శరీరంలో కండపుష్టి ఏర్పడింది. ఒకవారం గడవగానే జేతా అతడికి నూతనవస్త్రాలిచ్చాడు. మాసూళ్లు చాలవరకు పూర్తిఅయ్యాయి. తండ్రీ, కూతురూ, సుదాసుడూ, యింకో నలుగురుముగ్గురుతప్ప మిగతావారంతా తమతమ ధాన్యాలను తీసుకొనివెళ్ళిపోయారు. వీరివద్ద పొలాలు తక్కువగా వున్నాయి. అందుకని తమపంట కోసుకుని వారు జేతా పొలాల్లో పనిచేయడానికి వచ్చారు. ఈ ఒకటిన్నర మాసంలోనూ విజయుడూ అతని కుమార్తె సరళస్వభావుడగు యువకునితో బాగా పరిచితులైపోయారు. సాయంకాల మద్యపానసమయంలో ఒకరోజున విజయబుద్ధుడు సుదాసుతో తూర్పువారి ప్రసక్తి తెచ్చాడు. అపాలాకూడా దగ్గర కూర్చుని వింటూంది. విజయుడు యిట్లాఅన్నాడు.

'సుదా! తూర్పున నేను చాలాదూరం వరకూ వెళ్ళలేదు. కాని పంచాలపురాన్ని (అహిచ్ఛత్రి) చూచాను నగుర్రాన్ని తీసుకొనివెళ్ళాను.'

'పంచాలం (రుహేలఖండం) ఎట్లావుంది మీకు?'

ఆవేశంతో 'లోపంఏమీలేదు. అది మద్రలాంటి ఆరోగ్యకరమైన సముద్రమే కాకుండా అక్కడిపొలాలు ఇక్కడివాటికన్న సారవంతంగా కనుపించాయి కాని....'

'కాని ఏమి?'

'క్షమించాలి సుదా! అక్కడ నివసిస్తున్నది మానవులుకాదు'.

'మానవులు నివసించడంలేదూ? అయితే దేవతలా లేక దానవులా నివసిస్తున్నది?'

'అక్కడ మానవులు నివసించడం లేదనిమాత్రమే నేనంటాను.'

'నాకేమీ కోపంలేదు. ఆర్యవృద్ధా! మీ కీ అభిప్రాయం ఎందుకు కలిగింది?'

'సుదా! నాపొలాల్లోపనిచేసే రెండువందలమంది స్త్రీ పురుషుల్ని చూచావుకదా?'

'ఆ'

'నాపొలంలో పనిచేసేవారు తమజీతాల్ని నావద్దనుంచి తీసుకొనుటలో ఎప్పుడైనా దీనత్వం ప్రకటించడం చూచావా?'

'అట్లా చూడకపోవడమే కాకుండా, వారంతా మీపరివారంలోనివారే నన్నట్లున్నారు.'

'అవును. వీరిని మానవులంటాను. వీరు నాకుటుంబంవారు. అందరూకూడా మాద్రులూ, మాద్రిణులూను. ఇలాంటిసంగతి తూర్పున మచ్చుకైనా కనుపించదు. అక్కడ దాసులూ, లేక స్వాములూ (యజమానులూ) కనుపిస్తారు. మనుష్యులు కనుపించరు. బంధువులు కానరారు.'

'నిజం చెప్పావు ఆర్యవృద్ధా! మానవునివిలువ, నేను శతద్రు (సతలజ్) దాటినతర్వాత - ముఖ్యంగా యీ మద్రభూమికి వచ్చాక చూచాను. మానవులమధ్య వుండడం ఆనందపడాల్సిన సంగతి. గర్వించదగిన సౌభాగ్యవిషయం.'

'నీవు అపార్థం చేసుకోనందుకు నాకు చాలా సంతోషం పుత్రా! అందరికీ తమ జన్మస్థానంపై ప్రేమవుంటుంది.'

'జన్మభూమిపై ప్రేమంటే అర్థం దోషాలనుండి కన్ను మూసుకోవడం కాదు.'

'నేను కురుపాంచాల యాత్రచేస్తున్నప్పుడు చాలా ఆలోచించాను. అక్కడి పండితులతోకూడా చర్చించాను. ఈ దోషానికి కారణం తెలిసింది, కాని విరుగుడు తెలియలేదు.'

'కారణం ఏమి? ఆర్యవృద్ధా!'

'పాంచాలదేశం పంచాలులదని చెప్పుతున్నారు. అంతేకాని అక్కడ నివసించే వారిలో సగంకూడ పంచాలురు లేరు.'

'అవును, వలసవచ్చినవారు చాలామంది వున్నారు.'

'వలసవచ్చినవాళ్ళు కాదు పుత్రా! ఆదిమనివాసులే హెచ్చు. అచ్చటి చేతి పనులవారూ, వ్యాపారులూ, దాసులూ, పాంచాలజనం ఆగడ్డమీద పాదంపెట్టడాని కెంతో ముందునుంచి అక్కడ వున్నారు. వాళ్ళరంగు చూచావుకదా?'

'ఆ, చూచాను. పంచాలజనచ్ఛాయకి పూర్తిగా విరుద్ధమైన నలుపు, చామన చాయ లేక రాగివర్ణం.'

'పంచాలజనపువర్ణం మద్రుల్లా గౌరవర్ణమా?'

'చాలవరకు అంతే.'

'అవును. చాలవరకుమాత్రమే. ఎందుకంటె యితరవర్ణంవారితో కలిస్తే రంగులో తప్పక వికృతి వస్తుంది.'

'ఆర్యవృద్ధా! అసురులని ఎవరిని మన పూర్వులు చెపుతూవచ్చారో ఆ ఆర్య భిన్నులగు వారిలో హెచ్చుతగ్గులూ, దాసులూ, యజమానులూ బహుశా ఆదినుండీ వుంటూవచ్చారులావుంది.'

'అవును. కాని పంచాలురుమాత్రం ఆర్యజనులు. వారందరూ రక్తసంబంధీకులు. ఏక కుటుంబీకులు. తదుపరి అక్కడివారిలో కూడా ఎక్కువతక్కువలనే భావం కనిపిస్తుంది. పాంచాలరాజు దివోదాసు నావద్ద కొన్ని గుఱ్ఱాలను కొన్నాడు. ఆ సందర్భంలో నేనాతనివద్దకు ఒకనాడు పోతిని. అతని బలిష్ఠమైన యౌవనశరీరం బహు అందంగావుంది. కాని అతని శిరస్సుపైన ఎఱ్ఱగానూ, పచ్చగానూ వున్న ఒక బహుమూల్యమైన పెద్ద మకుటం, చీరుకొనిపోయివున్న చెవులకి గుండ్రని బావిళీలు, చేతులకీ మెడకీ యింకా ఏమేమో తమాషావస్తువులన్నీ వున్నాయి. ఇవన్నీ చూచి నాకతనిపై జాలిపుట్టింది. చంద్రుణ్ణి రాహువు మ్రింగివేస్తూన్నట్లుంది. అతని చెంతనే ఆతని భార్యకూడావుంది. ఆమె భద్ర సౌందర్యవతుల కేమాత్రమూ తీసిపోదు. కాని రంగులరాళ్ళ బరువుతో పాపం! కృంగిపోతూవుంది!'

సుదాసుని హృదయం వేగంగా కొట్టుకోవడం మొదలెట్టింది. అతడు తన భావాలు ముఖంలో వెల్లడిఅయిపోకుండా శాయశక్తులా ప్రయత్నించాడు కాని సఫలీకృతుడు కాలేకపోతూండడం గ్రహించి మాటలధోరణి మార్చేసే వుద్దేశ్యంతో యిట్లా అన్నాడు—

'పంచాలరాజు గుఱ్ఱాలను తీసుకున్నాడుకదా ఆర్య వృద్ధా!'

'తీసుకున్నాడు. మంచివెలకూడా యిచ్చాడు. జ్ఞాపకంలేదు ఎంతబంగారం యిచ్చాడో; కాని అక్కడ పంచాలురుకూడా అతనిముందు సాష్టాంగపడి మొక్కడం, దేవుళ్ళాడడం చూచి నాకు వళ్ళు భగ్గునమండిపోయింది. చచ్చినాసరేగాని ఏమద్రుడు కూడా యీ విధంగాచేయడు పుత్రా!'

'నీవు అట్లా చేయవలసి రాలేదుకదా ఆర్యవృద్ధా!'

'ఆవిధంగా నన్నుకూడా చేయమని అక్కడ ఎవరైనా చెప్పివుంటే తగాదా పెట్టియుండేవాణ్ణి. తూర్పునఉండేరాజులు ఆలాచెయ్యాలని మాకు చెప్పరు. యిది పూర్వాన్నుంచీ వస్తున్న సంగతి.'

'ఏం?'

'ఏమంటావా! అదొక పెద్దగాథ. పశ్చిమాన్నుండి ముందుకు సాగుతూ సాగుతూ పంచాలజనం గంగా, యమునా, హిమావాన్‌లమధ్య (ఉత్తర దక్షిణ

పంచాలుర) యొక్క యీ భూమికి వెళ్ళేటప్పటికి వారుసరిగ్గా మద్రులలాగే ఒకే పరివారం ఒకేవంశంగా వుండేవారు. అసురులతో సాంగత్యం హెచ్చింది. వారిని చూచి ఈ ఆర్యపంచాలుర నుండి కొందరు సర్దారులూ, రాజులూ, పురోహితులూ కావడానికి ఉవ్విళ్ళూరడం ప్రారంభించారు.'

'ఉవ్విళ్ళూరడం దేనికి?'

'స్వార్థంకోసం. పాటుబడక్కరలేకుండానే పరుల సంపాదనను మెక్కడానికి. ఈ రాజులూ, పురోహితులే పంచాలురయందు భేదభావాల్ని లేవతీశారు. వారిని మానవుల్లా వుండనియ్యకూడదు.' అని అంటూనే విజయముఖుడు ఏదో పనిమీద లేచి పోయాడు.

---

## 2

మద్రపురం (శాకలా లేక స్యాల్‌కోట్) యందు విజయుని కుటుంబంతో సుదాసుడు నాలుగేండ్లు గడిపేశాడు. విజయుని (జేతా) భార్య చనిపోయింది. వివాహితలగు అతని తోబుట్టువలో కుమార్తెలో ఎవరో ఒకరిద్దరు ఎప్పుడూ అతని యింట్లోవుంటున్నారు. కాని అక్కడ స్థిరనివాసంచేస్తున్న వాళ్ళు విజయుడూ, సుదాసుడూ; అపాలామాత్రమే. అపాలా వయస్సు యిప్పుడు 20 ఏళ్ళు. ఆమెకూ సుదాసుడికీ ఒకరిమీద మరొకరికి చాలా ప్రేమవుందని వారి ప్రవర్తనవల్ల తెలుస్తోంది. అపాలా మద్రపురపు సౌందర్యవతుల్లో ఎన్నతగినది. ఆమెకు అచ్చట అందమైన యువకులకులోపం ఏమాత్రమూలేదు. అదేవిధంగా సుదాసుడికీన్నూడా అక్కడ సౌందర్యవతులగు యువతులకు కొదవలేదు. కాని సుదాసుడు అపాలా ఒకరితో మరొకరు కలసిమాత్రమే నృత్యంచేయడం జనంచూచారు. జేతాకూడా యీసంగతి తెలుసు. సుదాసుడు మద్రపురంలోనే వుండిపోవడానికి అంగీకరించి యుంటే విజయుడు యీ సంబంధాన్ని మెచ్చుకునేవుండేవాడు. కాని సుదాసుడు అప్పుడప్పుడు తనతలిదండ్రులకోసం పలవరించిపోతున్నాడు. అతడు తనతలిదండ్రుల యేకైకపుత్రుడన్నసంగతి జేతాకి తెలుసు.

ఒకరోజున అపాలా సుదాసుట ప్రేమికుల అభిమానపాత్రమైన చంద్రభాగా (చనాబ్)కు స్నానానికివెళ్ళారు. స్నానంచేస్తూన్న సమయంలో ఎన్నోసార్లు సుదాసుడు అపాలా నగ్నమైన లవణకాంతి పూర్ణదేహాన్ని చూచాడు. నేను అనేక నగ్న సౌందర్యవతులమధ్య ఆమె సౌందర్యాన్ని పోల్చిచూచినప్పుడు అపాలాయొక్క సంపూర్ణలావణ్యాన్ని తను నేడే గుర్తింపగలిగాడా అనిపించింది. వెనక్కి మరలి వస్తూన్నప్పుడు అతను మౌనందాల్చి వుండడం చూచి అపాలా 'యివ్వాళ నువ్వు మాట్లాడ్డంలేదే? అలసిపోయావా? చంద్రభాగా ప్రవాహాన్ని రెండుసార్లు ఈదడం శ్రమలోకూడిన పని' అంది.

'అపాలా! నీవుకూడా ఇద్దరినుంచి అద్దరికి ఈదివేసావు.'

'తీరికఉంటే చంద్రభాగను ఎన్నిసార్లైనా యీదగలను.'

'బయటికివచ్చాక నీవక్షం యెంత ఉబికివుందో నేనుచూచాను. నీ దండల కండరాలూ, తొడల కండరాలూ రెండురెట్లు ఎక్కువ లావెక్కిపోయాయి.'

'ఈత గొప్ప వ్యాయామం. ఇది శరీరానికి సత్తువనూ సౌందర్యాన్నీ చేకూరుస్తుంది. కాని నీ సౌందర్యంలో యింకేమి వృద్ధికలగాలి అపాలా! నువ్వు యిప్పటికే త్రిలోకసుందరివి!'

'నీకళ్ళకు అట్లా కనిపిస్తున్నానా సుదాస్?'

'కాని మోహంతో మాత్రంకాదు అపాలా! నీకే తెలుసు'.

'అవును. నానుండి నీవు చుంబనంకూడా ఎన్నడూ ఆశించలేదు. మద్ర యువతులు చుంబనవితరణలో చాలా ఉదారులు'.

'అడక్కుండాకూడా యివ్వడానికి నీవు ఉదారత చూపావు';

'కాని, నాసోదరుడు శ్వేతశ్రవుణ్ణి నీలో చూస్తూంటినప్పటిమాట అది.'

'అయితే యిప్పుడివ్వవా?'

'అడిగితే ముద్దు ఎందుకివ్వను?'

'అయితే, అడిగితే నీవు నావెన—'

'అట్లాఅనకు సుదాసు! నిరాకరించిన నేను దుఃఖపడాల్సివుంటుంది'.

'కాని ఆ దుఃఖాన్ని దరిచేరకుండా చేసుకోవడం నీ చేతిలోనే వుంది'.

'నా చేతిలోలేదు. నీ చేతిలోనేవుంది'.

'అదెట్లా?'

'మరి నీవు నాతండ్రివద్ద శాశ్వతంగా వుండడానికి సిద్ధమేనా?'

కోమలమయిన ఆపెదవులనుంచి కఠోరమైన యీ మాటలు ఎప్పుడో బయట పడతాయని సుదాసుడికి చాలసార్లు భయంకల్గింది. నేడవి పిడుగుల్లాగు యితడిచెవుల్ని బ్రద్దలుకొట్టుకొంటూ పోయి హృదయాన్ని చీల్చివేసాయి. కొంచెంసేపు అతడి మన స్సులో రుపాను లేచినట్లయింది; కాని తన ఆంతర్యాన్ని అపాలా ఎక్కడ గ్రహించి పోతుందోనని ఒతని ఆతురత! కొద్దిసేపట్లోనే నిగ్రహం తెచ్చుకొని 'నేనునిన్నెంత ప్రేమిస్తున్నాను అపాలా?' అన్నాడు.

'అది నాకు తెలుసు. నా విషయంకూడా నీవెరుగుదువు. నేను శాశ్వతంగా నీదాన్ని కావాలని వాంఛిస్తున్నాను. నా తండ్రి కూడా దీనికి సంతసిస్తాడు. కాని పాంచాలదేశాన్ని నీవు పూర్తిగా విసర్జించాలి'.

'పాంచాల బంధనాలనుండి విముక్తుణ్ణికావడంలో కష్టంలేదు; కాని అక్కడ నావృద్ధ తలిదండ్రులున్నారు. వారి ఏకైకపుత్రుణ్ణి నేను. నాతల్లి చనిపోయేలోపున తిరిగి నేనామె ముఖం ఒకసారి చూడాలని నావద్ద ఆమె మాటపుచ్చుకుంది'.

'నీతల్లికి నీవిచ్చిన వాగ్దానాన్ని భంగంచేయించాలని నావుద్దేశ్యంకాదు. నిన్ను నేను శాశ్వతంగా ప్రేమిస్తాను సుదాసూ! నీవు వెళ్ళిపోయిన తర్వాతకూడా జీవి తాంతంవరకూ నేను నీకోసం ఏడుస్తూ వుంటానని నాకు తెలుసు. కాని మనం రెండు వాగ్దానాలను భంగపరచరాదు. నీవు నీతల్లికిచేసిన వాగ్దానం, రెండవది నా హృదయప్రతిజ్ఞ'.

'నీ హృదయప్రతిజ్ఞ ఏమిటి? అపాలా!'

'ఏమంటావా? మానవభూమినుండి అమానుషభూమికిపోనని'.

'అమానుషభూమి: పంచాల జనపదం: (పంజాబు)'

'అవును. అక్కడ మానవునికి విలువలేదు. స్త్రీలకు స్వాతంత్ర్యంలేదు'.

'నీతో నేనేకీభవిస్తున్నాను'.

'నాతో ఏకీభవిస్తున్నందుకు నేను నీకు చుంబనంయిస్తున్నాను'. అని అపాలా కన్నీళ్ళతో తడిసిన చెక్కిళ్ళను సుదాసుని పెదవులపై పెట్టింది. సుదాసుడు ముద్దు పెట్టుకొన్న తర్వాత ఆమె తిరిగి 'నీవు వెళ్ళి ఒకసారి తల్లి దర్శనంచేసిరా: నీకోసం నేను మద్రపురంలో నిరీక్షిస్తూంటాను'. అంది.

మాయామర్మం ఎరుగని అపాలా మాటలువినగానే సుదాసు ఎంతో తనకు తానే అసహ్యపడ్డాడు. దానినెన్నటికీ అతడు తన మనస్సునుండి తొలగించుకోలేక పోయాడు. తలిదండ్రులను చూచి తిరిగివచ్చే షరతుతో సుదాసుడు జేతా (విజయుడు) నుండి ఇంటికి వెళ్లటకు ఆజ్ఞపొందగలిగాడు. విజయుడూ, అపాలాకూడా దాని కంగీ కరించారు. ప్రయాణానికిముందు రోజున అపాలా సుదాసుడితోనే గడిపింది. కమలా ల్లాంటివారిరువురినేత్రాలనుండీ దినమంతా నీలాలు కారుతూనేవున్నాయి. వాటిని కప్పిపుచ్చుకోడానికూడా వారు ప్రయత్నించలేదు. ఇద్దరూ గంటలకొలదీ ఒండొరుల పెదవుల్ని ముద్దాడుతూ, తన్మయులై ఆలింగనాలు చేసుకొంటూ నిర్మలమైన అశ్రు పూరితనేత్రాలతో ఒకరినొకరు చూచుకొంటూనే గడిపారు.

అతడు వెళ్ళిపోతూన్నప్పుడు అపాలా తిరిగి ఆలింగనంచేసి—'సుదాస్: నేను నీకోసం మద్రపురంలో నిరీక్షిస్తూంటాను'. అంది.

అపాలా పలికిన ఈపలుకులు జీవితపర్యంతం సుదాసుని హృదయఫలకంపై హత్తుకుపోయాయి.

---

# 3

సుదాసుడికి తన తల్లి యడల అపారమైన అవ్యాజప్రేమ. సుదాసుని తండ్రి దివోదాసు ధైర్యశాలియగురాజు. ఇతనిని ప్రశంసిస్తూనే వశిష్టుడూ, విశ్వామిత్రుడూ, భరద్వాజుడూ * మొదలగు మహాఋషులు అనేక మంత్రాలు వ్రాశారు. కాని ఋగ్వేదంలో ఉన్న మాత్రమున వాటిలో నిండియున్న ముఖస్తుతి దాగదు. సుదాసుని ప్రేమ కేవలం తన తల్లిపై మాత్రమే. ఆమెలాంటివారు, యెందరో పత్నులు, ఎందరోదాసీలు తన తండ్రికి గలరని అతనికి తెలుసు. పంచాలసింహాసనానికి ఉత్త రాధికారియైన జ్యేష్ఠపుత్రుడైన సుదాసునికి తల్లి అగుటవల్ల దివోదాసు ఆమెను కొంచెం లక్ష్యపెట్టాడేమోగాని, లేకపోతే పట్టాడిపోయిన ఆ ముదుసలిని—సౌందర్య వతులగు యౌవనవతులతో నింపిన తన రాణివాసంలో ఎందుకు లెఖ్కచేస్తాడు? సుదాసుడు తల్లికి ఏకైకపుత్రుడైనను తండ్రికిమాత్రం ఏకైకపుత్రుడుకాడు. ఇతడు లేకుండావుంటే ప్రశర్దనుడు దివోదాసుని వారసుడయ్యేవాడు.

కొన్ని సంవత్సరాలు గడచినమీదట తల్లి తన కుమారుని గురించి నిరాశ జెందిపోయింది. ఏడ్చిఏడ్చి కళ్ళల్లోని జ్యోతిని పోగొట్టుకొంది. ఎవ్వరికీ తెలియ కుండా నిశ్శబ్దంగా సుదాసుడొకనాడు తండ్రిని కూడా కలుసుకోకుండానే తల్లిముందు ప్రత్యక్షమయ్యాడు. నిస్తేజమైన కళ్ళతో ఆమె తనవంక చూస్తూండడం కనిపెట్టి సుదాసుడు అమ్మా! నేను నీసుదాసుణ్ణి!' అన్నాడు.

ఆమె కండ్లు తేజోవంతమయినాయి. అయినప్పటికీ మంచం నుండి కదల కుండానే ఆమె – "నిజంగానే నీవు నా సుదాసుడవయితే అదృశ్యమైపోవడానికి అక్కడెందుకు నుంచున్నావు? వచ్చి నన్నేల కౌగలించుకోవు? నీశిరస్సును నావడిలో ఎందుకుపెట్టవు?' అంది.

సుదాసుడు తన తలను ఆమెవళ్ళోపెట్టాడు. తల్లి చేతితో తడిమింది. గాలిలో అదృశ్యమైపోయేది కాకుండ వాస్తవికమైన శిరస్సే చేతికి తగిలింది. అతడినోటినీ, చెక్కిళ్ళనీ, లలాటాన్నీ, కేశాల్నీ ఆమె ఎన్నోసార్లు ముద్దాడి, కన్నీటిధారతో వాటిని తడిపేసింది. తృప్తితీరా కౌగలించుకుంది. తల్లి అశ్రుధార ఆగేసూచనలు కనపడక సుదాసుడు 'అమ్మా! నేను నీవద్దకొచ్చేశానుగా! ఇంకా ఏడుస్తావెందుకు?'

---

* ఋగ్వేదం 6, 26, 2, 25.

'ఈవేళటికి మాత్రమే నాయనా! నేటి ఘడియలు మాత్రమే బిడ్డా! యిది అంతిమ అశ్రువులు. సుదాస్! ఓనా ఆశాజ్యోతీ!'

అంతఃపురం నుండి యితడొచ్చిన కబురు రాజుకిచేరింది. అతడు పరుగున వచ్చాడు. సుదాసుణ్ణి ఆలింగనం చేసుకుని ఆనందబాష్పాలు రాల్చ మొదలెట్టాడు.

రోజులు మాసాలు గడిచిపోయాయి. మాసాలు రెండు సంవత్సరాలుగా పరిణమించాయి. తలిదండ్రులముందు సుదాసుడు ప్రసన్నవదనుడై వుండడానికి యత్నిస్తున్నాడు. కాని ఏకాంతంలో అతని చెవులకు అపర్ణాచ్ఛేదితధ్వని, 'నేను నీకోసం మద్రపురంలో నిరీక్షిస్తుంటాను' అనేది వినపడుతూంది. కదలుతూన్న ఆ ఎర్రని పెదవులు అతని కళ్ళకుకట్టినట్లు కన్పిస్తూ కప్పేసేంతవరకూ అట్లాగే వుంటున్నాయి. సుదాసునిముందు ద్వివిధరూపంతో ఒకవైపు కృత్రిమరహితమైన అపారప్రేమ; మరొకవైపు వృద్ధమాత వాత్సల్యపూర్ణమైన హృదయం నిలచి ఉన్నాయి.

తల్లి నిస్సహాయహృదయాన్ని చీల్చివేయడం అతనికి అత్యంత నీచమైన స్వార్థాంధతగా తోచింది. ఇందువల్లనే అతడు తల్లి జీవితాంతంవరకు పాంచాల దేశాన్ని విడువనని నిశ్చయించుకొన్నాడు. రాజపుత్రుల భోగవిలాసాలతో కూడిన జీవితాన్ని స్వీకరించడం అతనికి తన సామర్థ్యానికి మించినదిగా తోచింది. తండ్రి యడల గౌరవమూ, అతని ఆజ్ఞాపాలనంలో తత్పరతకూడా అతడు కనపర్చేవాడు.

వృద్ధదివోదాసు ఒకనాడు పుత్రునితో 'వత్సా! సుదాస్! నేను జీవితపు అంతిమతీరానికి చేరుకున్నాను, పాంచాలదేశపు భారాన్ని యిక నేను మోయడం సాధ్యంకాదు.'

'ఆర్యా! అయితే ఈ భారాన్ని పాంచాలదేశవాసులపై ఉంచకూడదా?'

'పాంచాలురపై? నాయనా! నీ అభిప్రాయం?'

'ఆర్యా! ఇంతకీ యీరాజ్యం పాంచాలురది. మన పూర్వులు పాంచాలజనం లోని సామాన్యపురుషులుగా వుండినవాళ్ళు. ఆసమయంలో పాంచాలదేశానికెవ్వడూ రాజేలేడు. ఈనాటికీ మల్లుల్లోనూ, మద్రుల్లోనూగంధారుల్లోనూఅక్కడిజనులే శాసించు కుంటున్నట్లుగానే పాంచాలురుకూడా యావత్తుపరిపాలనాచేసుకుంటూండేవారు. అప్పుడు

మనతాత ప్రధ్యాత్ముని పూర్వీకులెవనికో లోభత్వం-భోగతృష్ణ-ఇతరుల కష్టార్జితాన్ని అపహరించాలనే బుద్ధిత్వం కలిగాయి. అతడు జన-పతి పదవిలోనో, సైన్యాధిపతి పదవిలోనో వుండివుంటాడు. జనంకోసం ఏదోయుద్ధంలో జయించి జనులప్రేమని విశ్వాసాన్ని, సంపత్తినీ పొందియుంటాడు. ఆ బలంతోనే అతడు ప్రజలకి విశ్వాస ఘాతుకం చేశాడు. ప్రజారాజ్యాన్ని తొలగించి అతడు అసురుల్లాగ రాజులరాజ్యాన్ని స్థాపించాడు. అనువదనే వశిష్ఠ విశ్వామిత్రుల పూర్వజుల్లో ఎవరికో వంశంగా పురోహితపదవి యిచ్చాడు. ఆ పురోహితుడు ప్రజల కళ్ళల్లో దుమ్ముకొట్టి—'ఇంద్రుడు అగ్నిదేవుడూ, సోముడూ, వరుణుడూ, విశ్వేదేవులూ ఈ రాజును మీపై రాజ్యం చేయడానికి పంపారు. ఇతని ఆజ్ఞల్ని శిరసావహించండి. దైవద్రోహానికై ఉరితీతకి వసన్నలవుతారు' అని చెప్పడం మొదలెట్టాడు. ఇది పచ్చి నమ్మకద్రోహం, దోపిడి. చంద్రా! ఎవరినుండి అధికారం వచ్చిందో వారిపేరుకూడా మరచిపోవడం, వారిపట్ల కృతజ్ఞతలో కూడిన ఒక్క-శబ్దంకూడా ఉచ్చరించలేకపోవడం!'

'కాదుమిత్రా! ప్రజలే మనల్ని రాజుగా చేసేవారని వప్పుకుంటాం. అభిషేక ప్రతిజ్ఞాసమయంలో వారే మనకు రాజచిహ్నమైన పాలదండమిచ్చేది.'

'అభిషేక ప్రతిజ్ఞ ఇప్పుడొక తమాషాగా తయారయింది. కాని వాస్తవానికి ప్రజలురాజుపై అధికారులు కారు. రాజు తనప్రజల సహపంక్తిలో కూర్చోలేడు. వారితోకలసి భోజనం చేయరాదు. సహాయం అంతకన్నాలేదు. ప్రజలకి రాజుపై యేలాంటి అధికారం లేకుండాపోయిందని చెప్పడానికిది చాలు. మద్రుల్లోగాని గాంధారుల్లోగాని జనపతియిట్లా చేయగల్గుతాడా ?'

'ఇక్కడ మనం వారిలాచేస్తే ఏదోరోజున శత్రువు చంపేస్తాడు. లేక విషం పెట్టిస్తాడు.'

'దొంగకీ అపహరించేవాడికే ఈ భయం వుంటుంది. జనపతులు దొంగలు అపహరించేవాళ్ళుకారు. వస్తుతఃవారు తమను ప్రజల బిడ్డలుగా తలుచుకుంటారు. అట్లాగే ప్రవర్తిస్తారుకూడా. అంచేత వారికి భయంలేదు. రాజులు దొంగలు, ప్రజాధికారాల్ని అపహరించేవారు. ఇందువల్ల ఎల్లప్పుడూ భయంగానేవుంటుంది. రాజుల రాణివాసాలు, రాజుల వెండిబంగారాలు, రత్నాలూ, వారి దాసదాసీజనం, వారి

యావత్తు భోగవిలాసవస్తువులూ స్వయంగా సంపాదించుకొన్నవికావు. ఇవన్నియు అపహరించుటవల్ల వచ్చినవే.'

'పుత్రా! దీనికి నేను నేరస్థుడనంటావా?'

'కానేకాదు. ఆర్యా! ఈపదవి లభిస్తే ఇష్టమున్నా లేకపోయినా నేనుకూడా మీలాగే చేయాల్సివుంటుంది. దీనికి నాతండ్రి దివోదాసుని నేరస్థునిగా నేను ఎంచడం లేదు.'

'రాజ్యం తిరిగి ప్రజలకిచ్చేయాలని నీవంటున్నావు. యిది సాధ్యమా? ప్రజల భోగభాగ్యాల్ని అపహరించేవాడు పాంచాలదేశపురాజు దివోదాసు మాత్రమే కాదు. అపహరించే దొంగసామంతులలో అతడొకడు. అతడు పెద్దవాడుకావచ్చును. కాని వారి సమ్మిళితశక్తిముందు అతడు బలహీనుడు. అనేక ప్రాంతీయరాజులు, రాజ వంశీయులు, సేనాధిపులూ మాత్రమేకాక అందరికన్న బలవంతమైన సామంతుడు పురోహితుడు.'

'అవును. పురోహితుడు శక్తివంతుడు. రాజుయొక్క చిన్నకుమారులు రాజ్యపదవిని పొందజాలరు. అందుకని వారు పురోహిత (బ్రాహ్మణులు) లయి పోతారు. నాతమ్ముడు ప్రతర్దనుడుకూడా అట్లాగే చేస్తాడని అనుకుంటాను. ప్రస్తుతం రాజుకి పురోహితునికి మధ్య, సింహాసనవేదికా యజ్ఞవేదికా భేదంమాత్రమే వుంది. కాని ముందు ముందు క్షత్రియులూ, బ్రాహ్మణులూ విభిన్నశక్తులుగా విభిన్న శ్రేణులుగా తయారవుతారేమో యెవరు చెప్పగలరు!

మద్రగాంధారులలో ఒకఖడ్గం, స్రువా (దర్భ) ఒక్కడే చేబట్ట వచ్చు; కాని పాంచాలపురంలో స్రువా విశ్వామిత్రుని హస్తంలోనూ, ఖడ్గం వ్రధ్యశ్వుని చేతిలోనూ వుంటాయి. ఇక్కడి ప్రజల పంపకం మూడు భాగాలుగా అయిపోయింది. సామంతులుగా, ప్రజల భోగభాగ్యాలను అపహరించేవారుగా, ఆవాహ - వివాహ సంబంధంగా, తలిదండ్రుల సంబంధంగా, రాజులూ, పురోహితులూ ఒకటేకావచ్చు గాని యిర్వురిపేర్లూ క్షత్రియులూ, బ్రాహ్మణులూ యిప్పటినుండీ వేరువేరు శ్రేణులుగా ఎన్నబడుతున్నారు. ఇరువురు స్వార్థులు. వీరిలోస్పర్థలు ప్రారంభ మయాయి. ఇందువల్లనే బ్రహ్మక్షత్రియ శక్తులమధ్య మైత్రి పునస్థాపన చేయడానికి తీవ్రప్రయత్నాలు చేయబడుతున్నాయి. ఒక కులానికి చెందిన యీ ఉభయవర్గాలకు

బయటిజనం అధికసంఖ్యాకులుగా వున్నారు. యిదిమూడో వర్గం. నేడు యీ మహా జనపునామం మార్చి ప్రజయని పేరుపెట్టారు. ఎంత దుఃఖకరమైన విషయమిది. జన (తండ్రి)గావున్నవారిని ప్రజ (పుత్రులి)గా పిలవబడుతోంది. యిది గొప్ప మోసంకాక ఏమిటి ఆర్యా!'

'పుత్రా! నీవింకొక పెద్దసంఖ్యను లెక్కించలేదు.'

'అవును. ఆర్యజనులుకాని ప్రజ శిల్పులూ, వ్యాపారులూ, దాసదాసీలు బహుశా వీరిమూలాన్నే జనాన్ని అధికారాన్నుండి వంచించడంతో సామంతులు సఫలీకృతులయ్యారు. తమను శాసించే జనం తమలాగే యితరులద్వారా పరతంత్రులు కావడంచూచి ఆర్యులుకాని ప్రజకు సంతోషం కలిగింది. దీనికే రాజు తన న్యాయ మన్నాడు.'

'బహుశా నీవు చెప్పేది తప్పుకాదేమో పుత్రా! అయితే—రాజ్యాన్ని తిరిగి ఎవరికి ఇచ్చివెయ్యాలో చెప్పు. చోరుల్నీ అపచారుల్నీ సామంతుల్నీ వ్యాపారుల్నీ కూడా కలుపుకుని తీసేస్తే, ఆర్యజనం అనార్యప్రజా, అందరికన్నా అధికసంఖ్యలో వున్నారు. ఇక్కడ ధర్మసామంతులూ రాజసామంతులూ అనే గ్రద్దలు, నేను విడిచి పెట్టెయ్యగానే ప్రజని పొడుచుకుతినేయడానికి సిద్ధంగావున్నాయి. కురుపాంచాల దేశంలో జనులచేతినుంచి రాజ్యం లాక్కొబడి ఆరేడుతరాలు మాత్రమే గడిచాయి. గనుక మనం జనపాలన కాలాన్ని మించిపోలేదు. ఆకాలంలో యీభూమిని దివో దాసుని రాజ్యమని పిలచేవారుకాదు. పంచాలా (యావత్తు పాంచాలవాసులు) అని పిలుస్తూ తలుస్తూండేవారు. కాని నేడు మరల అక్కడికి వెళ్ళిపోయేమార్గం నాకు కనబడ్డంలేదు.'

'అవును. మార్గంలో వశిష్ఠ విశ్వామిత్రుల్లాంటి మొసళ్లు కాచుకూర్చొన్నాయి గదా మరి?'

'దీనినిమనం వివశత్వంగా పరవశత్వంగా తలచాలి. మనం కాలాన్ని త్రిప్ప లేం. రేపెక్కడికి చేరతామో చెప్పలేం. సుదాసునివంటి పుత్రుడు లభించినందుకు మాత్రం నాకు సంతృప్తిగావుంది. నేనుకూడా ఒకానొకప్పుడు యువకుణ్ణే. ఆనాటికి యింకా, వశిష్టవిశ్వామిత్రుల కవిత్వాలూ, ప్రజలబుద్ధిని హరింపచేసేవారి ధర్మకర్మల మాయాజాలం అంతగా వ్యాపించలేదు. రాజుయొక్క ఈ చోరవృత్తిని కొంతవర

కైనా తగ్గించాలని నేను యోచించాను. కాని విఫలుడనయ్యాను. ఆ కాలంలో సీతల్లే నాకు సర్వస్వమూను. కాని తర్వాత నేను నిరాశుడనై భగ్నమనోరథుడనై పోగానే యీ పురోహితులు నన్ను తమ కవిత్వాలవలల్లోనేగాక కన్యల వలల్లోకూడా ఇరికించేశారు. ఇంద్రాణి దాసీల ఉపమాలంకారాలు తెచ్చిపెట్టి వందలాది దాసీలతో రాణివాసం నింపేశారు. నా యీ పతనంనుంచి నీవు గుణపాఠం నేర్చుకొని జాగ్రత్త పడు. ప్రయత్నించు ఏదైనా దారి దొరకవచ్చు. దొంగవృత్తి తొలగిపోవచ్చు. కాని సుదాసులాంటి సహృదయుడైన తస్కరుణ్ణి తొలగించి ప్రతర్దనునివంటి హృదయ హీనుడైన వంచకచోరుని చేతిలో పాంచాలదేశాన్ని ఉంచడం మంచిదికాదు. నేను పితృలోకాన్నుంచి నీ ప్రయత్నాల్ని అత్యంత సంతోషముతో చూస్తూవుంటాను. బిడ్డా! ఇవే నా ఆశీస్సులు.'

---

## 4

దివోదాసుడు దేవలోకానికి వెళ్ళిపోయాడు. ఇక యిప్పుడు సుదాసుడు పాంచాలురకు రాజయ్యాడు. ఋషి మండలి యిప్పుడు అతనిచుట్టూ తిరుగుతోంది. ఇంద్రుడూ, వరుణుడూ, అగ్ని, సోముల పేర్లతో యీ తెల్లగడ్డాలు ప్రజల్ని యెంత గుడ్డివారిగా చేశాయో యిప్పుడు సుదాసుడికి మరింత బాగా తెలిసివచ్చింది. వారి బలమైన ఉచ్చులో చిక్కుకుపోయినట్లు భావిస్తున్నాడు. ఏ ప్రజకోసం అయితే తనేదైనా కొంత మేలుచేయాలని కోరుతున్నాడో వారే అతని భావాల్ని అపార్థంచేసుకోడానికీ, అతణ్ణి పాపానికొడిగట్టుకొన్న రాజుగా పాటించడానికి సిద్ధంగా వున్నారు. వట్టికాళ్ళతో, చింపిరిగుడ్డలతో, అజ్ఞాతదేశాల్లో అతడు తిరుగుతూండిన ఆరోజులు సుదాసుడికి జ్ఞప్తికొస్తున్నాయి. ఆరోజుల్లో అతడు ఎక్కువ స్వతంత్రుడుగా వున్నాడు. ఇప్పుడు అతని హృదయవేదనను అర్థంచేసుకొనేవాడూ, వానిపట్ల సానుభూతి చూపేవాడూ అక్కడ ఒక్కడుకూడా లేడు. పురోహితులూ, ఋషులూ, రమ మనుమరాండ్రైన పడుచుల్ని, పసల మనుమరాండ్రయిన యువతుల్నికూడా అతనిచెంతకి పంపుతున్నారు. రాజన్యులూ, ప్రాంతీయ సామంతులూ రమ కుమార్తెలను పంపుతున్నారు. కాని సుదాసు తాను నిష్పంటుకొన్న యిండ్లో

వున్నట్లు భావిస్తున్నాడు. చంద్రభాగాతీరంలో నిరీక్షిస్తూన్న ఆ నీలనేత్రాల్ని మరువ జాలకున్నాడు.

సుదాసుడు ప్రజలందరకూ ఆర్య-అనార్యులనే భేదంలేకుండా సేవచేయడానికి నిశ్చయించుకున్నాడు. కాని యిందుకు దేవతల అడుసులో ఆపాదమస్తకం మునిగి యున్నజనానికి సుదాసునిపై దేవతల కృపవున్నదని నమ్మకం కలిగించాల్సివుంది. అట్లా కృప వున్నదనేదానికి ఋజువు ఋషులూ, బ్రాహ్మణులూ అతనిని ప్రశం సించడం తప్పితే వేరేమార్గంలేదు. చివరికి ఋషుల ప్రశంసలు పొందడానికి బంగారము, గోధాన్యాలను, దాసదాసీలను దానాలివ్వడంతప్ప వేరేదారి అతడికి దొరక లేదు. బలిసిన ఆవుదూడల మాంసాలతోనూ, మధురమైన సోమరసంతోనూ, బొజ్జలుపెంచుకొన్న యీ ఋషుల అభిప్రాయంలో ఇప్పుడు అతడు నిజమైన సుదాసు (బాగా దానం యిచ్చువాడు) అయ్యాడు. ముఖస్తుతులుచేసే యీ ఋషుల చేత చేయబడిన సుదాసుని దానస్తుతులు ఎన్నో యిప్పటికీ ఋగ్వేదంలో వున్నాయి. సుదాసు యీ దానస్తోత్రములను విని వాటిని రచించిన కవుల్ని యెంత అసహ్యపు దృష్టితో చూచేవాడో యెవరికి తెలుసు?

సుదాసుని యశోగానం యావత్తు ఉత్తర పాంచాలం (రుహేలఖండం)లో మాత్రమేకాక దూరదూర దేశాలకుకూడా ప్రాకసాగింది. తన భోగశూన్య జీవితం నుండి సాధ్యమయినంతవరకు విశ్వజనానికి హితం చేకూరుస్తూండేవాడు.

తండ్రి గతించిన కొన్నేండ్లకు సుదాసునితల్లి చనిపోయింది. అనేక సంవత్స రాలుగా ఆతనిని బాధపెడుతూ హృదయావేదనకరంగా ఉండిన గాయం యిప్పుడు ఒక రాచకురుపు రూపందాల్చింది. అపాలా ప్రతిక్షణం తనముందు నిలుచున్నట్లు, కళ్ళ నీళ్ళు గ్రుక్కుకుని కంపిత అధరాలలో 'నేను నీకొరకై మద్రపురంలో నిరీ క్షిస్తుంటాను' అంటున్నట్లు అతనికి అనిపిస్తోంది. ఆ వ్యథాగ్నిని కన్నీటితో సుదా సుడు ఆర్పజాలకున్నాడు.

హిమాలయాల్లో వేటాడడానికనే మిషమీద సుదాసుడు ఒకనాడు పాంచాల పురం (అహిచ్ఛత్రం) విడిచి బయదేరిపోయాడు.

అపాలా ప్రేమ ఇతనికి ప్రాప్తించిన యిల్లు మద్రపురం (స్యాల్‌కోట్)లో వుంది. కాని పాపం ఇప్పుడక్కడ విజయుడూ (జేతా) లేడు, అతని ప్రేయసి

అపాలాకూడా లేదు. ఇద్దరూ గతించారు. అపాలా మాత్రం ఒక్క సంవత్సరం క్రితమే మృత్యువాత పడింది. ఇప్పుడాయింట్లో కనపడకుండాపోయిన అపాలా సోదరుడూ అతని కుటుంబమూ వుంటున్నారు. ఆ యింటితో యింక స్నేహాన్ని అభివృద్ధి చేసుకోవడానికి మనవాడికి సాహసం చాలలేదు. అపాలా చెలికత్తె నొకామెను అతను కలుసుకొన్నాడు. ఆమె అపాలాకు చెందిన రంగురంగుల నూతనవస్త్రాలూ, గౌనూ, పమిటచెల్లా, రవికా, ఉత్తరీయం వగైరాలు తెచ్చి ముందు పెట్టి కళ్ళల్లో నీళ్ళునింపుకొని యిల్లాఅంది. 'నాసఖి యీ వస్త్రాలను చివరిఘడియల్లో ధరించింది. ఆమె పెదవులనుండి జారిన చివరిమాటలివి : సోదరీ! 'నేను నీకోసం మద్రపురంలో నిరీక్షిస్తూవుంటాను' అని నేను సుదాసుడికి మాటయిచ్చాను.'

సుదాసుడు ఆవస్త్రాలను తీసికొని హృదయానికీ కళ్ళకూ అద్దుకొన్నాడు. ఆవస్త్రాలు యింకా అపాలా శరీరసుగంధాన్ని వెదజల్లుతున్నాయి. *

---

* ఇది నేటికి 144 తరాలకు ముందునాటి ఆర్యజనుల కథ. యిదేకాలంలో పూర్వకాలపు ఋషులు వశిష్ఠుడూ, విశ్వామిత్రుడూ, భరద్వాజుడూ, ఋగ్వేదమంత్రాలు రచిస్తున్నారు. యిదేకాలంలో ఆర్యపురోహితుల సహాయంతో కురుపాంచాలుర ఆర్య సామంతులు ప్రజల అధికారాలపైన అన్నిటికన్న బలీయమైన ఆఖరిదెబ్బ కొట్టారు.

# "ప్రవాహణుడు"

## (ఎనిమిదవ కథ)

[స్థానం-పంచాలదేశం (యుక్తప్రాంతం);
కాలం - క్రీస్తుకు 700 సంవత్సరాలకు పూర్వం.]

'ఒకవైపున పండిన పాకఫలములతో కూడిన పచ్చపచ్చని వనము, ఫలముల సువాసన, పక్షుల మధురధ్వనులూ; మరొకవైపున ప్రవహిస్తున్న గంగానదీ నిర్మల ధార. దాని వడ్డున దిగువప్రదేశంలో మేస్తున్న వేలాది నల్లని తెల్లని ఆవులు. వాటి మధ్య రంకెవేస్తూ మెడలు తిరుగకుండా బలిసియున్న వృషభాలూ - అప్పుడప్పుడు యీ దృశ్యాలతోకూడా కళ్ళను తృప్తిపరచుకోవాలి ప్రవాహణ్! నీవెప్పుడు చూచినా ఉద్గీథ (సామ) గానంలోనే నిమగ్నుడవై యుంటావు లేక వశిష్ఠ విశ్వామిత్రుల మంత్రాభ్యాసంలో మునిగియుంటావు.'

'లోపా! నీవు ఆదృశ్యాలను చూస్తుంటే నేను నీనేత్రాలను చూచి తృప్తి పడుతుంటాను.'

'అహా! నువ్వా! మాటలకి మొనగాడివి! కాని నువ్వు నీ సహాధ్యాయులతో పాటు శునకస్వరంతో ఆపాతపాటల్ని పఠిస్తూండగా చూచినప్పుడు మాత్రం నా ప్రవాహణుడు జీవితమంతా పాలుత్రాగే బిడ్డవలె వుండిపోతాడని అనిపిస్తుంది.'

'నిజంగా! ప్రవాహణ్ని గూర్చి నీ యభిప్రాయమిదేనా?'

'అభిప్రాయం ఎప్పైనా మారవచ్చును; దానితోపాటు ఒక దృఢాభిప్రాయంకూడా వుంది. ప్రవాహణుడు శాశ్వతంగా నావాడని.'

'లోపా! ఆశ, విశ్వాసము, ప్రీతివలననే నాకు కష్టించుటకు తగిన బలం విద్య లభిస్తోంది. నేను బలీయమైన మనోనిగ్రహాన్ని అలవరచుకొన్నాను. లేకపోతే ఎన్నోసార్లు నామనస్సు యీపుక్కిటి పురాణాల్నించీ, పురాతన మంత్రాల నుండీ వేదాభ్యాసంనుండీ పారిపోవాలనే చూసింది. పరిశ్రమవల్ల మనస్సు అలసిపోయి

నప్పుడు సమస్తమూ విడచి వూరక కూర్చోవాలనిపించినప్పుడు లోపాప్రక్కన గడప డానికి కొద్దిక్షణాలు లభించడంతప్ప నాకు వేరేదారి తోచదు.'

'దానికి నేనెప్పుడూ సిద్ధమే.'

లోపా కృష్ణవర్ణనేత్రాలు ఎక్కడికో అనంతంలోకి చూస్తున్నాయి. ఆమె రాగివర్ణపు కోమలకేశాలు ప్రాంతఃకాలపు పిల్లవాయువులకు అటూయిటూ కదులు తున్నాయి. లోపా అక్కడ లేనేలేదా అనిపిస్తోంది. ఆమెకురుల్ని తన వ్రేళ్ళతో సరిదిద్దుతూ ప్రవాహణుడు 'లోపా నీముందు నేను అల్పుడనని భావిస్తాను.'

'అల్పుడవా! కాదు. నాప్రవాహణా' అంటూ అతనిని తనచెక్కిళ్ళకు చేర్చుకుంటూ ఆమె 'నిన్ను చూచుకొని నేను గర్వపడుతున్నాను. నామేనత్తతో వచ్చిన యెనిమిదేండ్ల ప్రాయముగల ఆశిశువును సాశిశుతర నేత్రాలతో చూచినప్పటి ఆరోజు నాకు ఇంకా జ్ఞాపకం వుంది. అప్పటికి నేను నాలుగు మూడేండ్లదానిని. అయినప్పటికీ ఆదాలచిత్రాన్ని నామనోఫలకంపై హఠాత్తుగా నాస్మృతి పొరబడలేదు. రాగివర్ణంకలిగి ఉంగరాలు చుట్టుకొన్న ఆ జుట్టూ, చిలకముక్కులాంటి ఆ ముక్కూ, పల్చని ఆ యెఱ్ఱటి పెదవులూ, మెరిసిపోతూండిన నల్లని ఆపెద్దపెద్ద కండ్లూ, మేలిమి బంగారువంటి ఆ శరీరం నాకు బాగాజ్ఞాపకం. ఇంతేకాక మా అమ్మనాతో అప్పుడు చెప్పిన మాటలుకూడా జ్ఞాపకం ఉన్నాయి. 'పుత్రీ లోపా, యితడు సోదరుడు' అంది. నేను అప్పుడు సిగ్గుపడిపోయాను. కాని మా అమ్మ నీముఖాన్ని ముద్దాడి — 'పుత్రా ప్రవాహణ్! నీ మేనమామకూతురు యీలోపా సిగ్గుపడుతోంది. దీని సిగ్గును వదలించు' అంది.

'నేను నీదగ్గరగా వచ్చాను. నువ్వు అత్తయ్య (లోపా తల్లి) సుగంధిత తరుణకేశాల్లో ముఖం దాచుకొన్నావు. కాని అప్పుడుకూడా నేనే చాటుగా చూపులు చూశాను. నువ్వేంచేస్తావోనని నేను చూస్తూనేవున్నా. అమ్మా, దాసీలూ, వారిపిల్లలూ తప్ప అక్కడ యింకెవ్వరూలేరూ. పితృ ఆచార్యకులం యింకా పుట్టలేదు. ఈయింట్లో నేనొంటరితనాన్ని పొందేవాడిని. ఇందుచేతనే నిన్నుచూచి లోలోపల చాలా సంతోషం కలిగింది.'

'ఆడుకోడానికి. అందుకా నీవు దాగున్నది? నేను నీతెల్లని నగ్నశరీరాన్ని, చంద్రబింబంలాంటి ముఖాన్నీ చూచాను. నా శిశునేత్రాలకి అవెంతో నచ్చాయి.

నేను నీదగ్గరకొచ్చి నీ భుజంపై చేయి వేశాను. అప్పుడు అమ్మా, అత్తయ్యా యేం చేశారో తెలుసా నీకు? యిద్దరూ ముసిముసినవ్వులు నవ్వుకొని, 'బ్రహ్మ మన వాంఛల్ని పూర్తిచేయుగాక!' అనుకున్నారు. అప్పుడు వారివాంఛలేమో నాకు బోధపడలేదు.'

'నాకది జ్ఞాపకంలేదు ప్రవాహణ్! నీ కోమల హస్తస్పర్శనాకు కలగడమే నాకు ఒక గొప్పవిషయం.'

'నువ్వు సిగ్గుతో ముడుచుకుపోయావు.'

'నువ్వు నాచేతిని నీచేతుల్లోకి తీసుకున్నావు; కాని నీపెదవులు కుట్టేసినట్లయి పోయాయి. అప్పుడు అమ్మ ఏమంది?'

'అత్తయ్యా ప్రతిమాట నాకు జ్ఞాపకముంది. ఆమెను మరవగలనా? మాఅమ్మ నన్ను గార్గ్యాయనువద్ద విడిచి యింటికి వెళ్ళిపోయింది; అత్తయ్య ప్రేమ నన్ను అమ్మను మరచిపోయేటట్లుచేసింది.' ప్రవాహణుకి కళ్ళల్లోనీళ్లుగిర్రునతిరిగాయి. అతడు లోపా పెదవుల్ని ముద్దాడి యిట్లా అన్నాడు. 'అత్తయ్యముఖం అచ్చంగా యిల్లాగే వుండేది. లోపా! మనం యిద్దరం ఒకేచోట పడుకొనివుండేవాళ్ళం. నీవు నిద్రపోయా వుండినా, నా కళ్ళు ఎన్నిసార్లో తెరుచుకొనేవుండేవి; కాని అత్తయ్యరావడం చూడగానే నేను కళ్ళుమూసేసుకొనేవాణ్ణి. అప్పుడు ఆమె మందనిశ్వాసంతో తన పెదవుల్ని నాబుగ్గలపై వత్తడం చూచేవాడిని. కళ్ళు తెరచేసరికి అత్తయ్య - 'బిడ్డా! లే!' అంటూ నీముఖాన్ని ముద్దెట్టుకొనేది; కాని నీవు వళ్ళు తెలియకుండా నిద్ర పోతూండేదానివి.'

లోపా కళ్ళల్లోకూడ కన్నీటిబిందువులు దొర్లాయి. ఆమె ఖిన్నురాలై 'అమ్మను నేను చాలా తక్కువ చూడగలిగాను!' అంది.

'అవును. ఆసమయంలో నీదగ్గర నేను మౌనముద్రవహించి నిలచియుండడం చూచి అత్తయ్య— 'యిది నీచెల్లెలురా, అబ్బాయీ! దీనిపెదవుల్ని ముద్దెట్టుకుని, గుజ్జం గుజ్జంఆట ఆడుకుందాం రా అనిపిలు' అంది.'

'అవును, అప్పుడు నీవు నాపెదవుల్ని ముద్దెట్టుకున్నావు. గుజ్జం గుజ్జం ఆట

ఆడుకుందాం రమ్మని పిలిచావు. నేను అమ్మతల వెనకనుంచి నాముఖాన్ని బయటికి తీశాను. నీవు అక్కడే గుజ్జానివయిపోయావు. నేను నీ వీపుమీద ఎక్కాను.'

'నేను అప్పుడే నిన్ను బయటికి తీసుకుపోయాను.'

'నేనెంత దుష్టురాల్ని!'

'నీవెల్లప్పుడూ నిర్భయురాలవు లోపా! అంతేకాదు నీవు నాకు సర్వస్వమూను. మామయ్య భయంవల్ల నేను ఎప్పుడూ పాఠాలు కంఠస్తంచేయడంలోనే నిమగ్నుడనై వుండేవాణ్ణి. అలసిపోయినప్పుడు నీదగ్గరికి వచ్చేసేవాణ్ణి.'

'నీకొరకే నేను ఎప్పుడూ నీదగ్గరే కూర్చోడం మొదలెట్టాను.'

'నీవు నేను చేసినదానిలో సగమాత్రం పరిశ్రమచేసినా మామయ్య శిష్యులలో అందరికన్న నీవు ముందుండే దానవని నేను తలుస్తా లోపా!'

'కాని నీకంటె ముందుమాత్రంకాదు.' అంటూ లోపా ప్రవాహణుడి కళ్ళను ఒకసారి దాగా ఏకాగ్రతతో చూచి 'నేను నీకన్న ముందుపోవడానికి వాంఛించను.'

'కాని నాకు ఆనందంకలిగి యుండేది.'

'ఎందుకంటే మనకు ఒకరిని విడిచి యింకొకరికి వేరు ఆత్మాభిమానం లేదు కనుక.'

'లోపా, నీవు నామనస్సుకు ఉత్సాహంమాత్రమే కాక శరీరానికి బలంకూడా యిచ్చావు. రాత్రిళ్ళు నేనెంత తక్కువ నిద్రించేవాణ్ణి! స్వంతంగా పాఠాలు వల్లె వేయడంలోనూ, యితరులచేత వల్లెవేయించడంలోనూ, నిద్రాహారాలు మరిచిపోతుండేవాణ్ణి. నీవు నన్ను స్వాధ్యాయగృహపు అంధకారంలోనుంచి బయటికిలాగి బలవంతంగా ఒకప్పుడు వనాలకు, యింకొప్పుడు ఉద్యానవనానికీ మరోఅప్పుడు గంగానదీప్రవాహంచెంతకీ తీసుకుపోతుండేదానివి. ఇవన్నీ నాకు చాల మనోహరంగా వుంటాయి లోపా! కాని దీనితోపాటు, మూడు వేదాల్ని బ్రాహ్మణుల యావత్తు విద్యల్నీ బహు శీఘ్రంగా ముగించుకోవాలని కోరుతున్నాను.'

'ముగింపుకొచ్చేశావు. ప్రవాహణుడు నాతో సమానమైన వాదయ్యాడని నాన్న అంటున్నారు.'

'నేనుకూడా అల్లాగే తలుస్తాను. బ్రాహ్మణవిద్య చదువుటకు అంతగాలేదు; కాని విద్య అనేది బ్రాహ్మణులవరకూ మాత్రమే వెళ్ళి అంతతో ఆగిపోదు.'

'అదే నేను నీతో చెప్పాలనుకొన్నాను. కాని నీ ఈ పాలాశదండం, జడల జుట్టూ యింకా యిల్లాగే వుంటాయా?'

'దీన్నిగూర్చి విచారపడకు లోపా! పాలాశదండం త్వరలో పోబోతోంది. పదహారేండ్లుగా ఎండుతూన్న ఈకేశాల్లో సుగంధితతైలం రాయడానికి నీకు స్వతంత్రం వస్తుంది.'

'ప్రవాహణ్, సంస్కార రహితమైన యీ కేశాల్ని గూర్చి యింతపట్టింపు యెందుకో నాకు తెలియడంలేదు. నా ఈ అధరాల్ని ముద్దెట్టుకోవడం నీవెన్నడూ మానవేలేదాయె.'

'చిన్ననాటి అలవాటుకదా!'

'అయితే యితర ఆచార్య కులానికిచెందిన శిష్యులు యీ కఠోరవ్రతాన్ని పాలిస్తున్నారా?'

'వివశులైనమీదట. లోపా! యిదంతా గౌరవ ప్రతిష్ఠలకోసం చేయబడుతోంది. ప్రజలు దీన్ని బ్రాహ్మణకుమారుల కఠినతపస్సుగా భావిస్తున్నారు.'

'కురురాజు తండ్రిగారికి గ్రామాలూ, హిరణ్య సువర్ణాలూ, దాసదాసీలూ, ఆడగుఱ్ఱపు రథాలూ యిస్తున్నారు. మాయింట్లో మొదటినుంచీ తగినంతమంది దాసీలున్నారు. ఈమధ్యనే కురురాజు యింకా ముగ్గుర్ని పంపారు. వారికి యిక్కడ పనేలేదు.'

'వారిని అమ్మివెయ్యి. లోపా! యువతులు కనుక ఒక్కొక్కామెకు మూడు మూడు నాణాలు వస్తాయి.'

'విషాదకరం! మనం బ్రాహ్మణులం. మనం యితరులకంటే ఎక్కువ చదువు కున్నవాళ్ళం, జ్ఞానులమూను. ఇందుకు మనకు అవకాశాలెక్కువున్నాయి. కాని యీ దాసీల దుర్భరజీవితాల్ని చూచినప్పుడు నాకు బ్రహ్మ, ఇంద్రుడు, వరుణుడు, ఇంకా యితరయావత్తు మన దేవతలూ, వశిష్ఠుడు, భరద్వాజుడూ, భృగుడూ, అంగిరా మొద లయిన యావన్మంది ఋషులపైననే కాకుండా, నాతండ్రిలాంటి నేటి శ్రోత్రియ బ్రాహ్మణ మహాపురుషులపైన కూడా చాలా అసహ్యం గలుగుతోంది. సర్వత్రా వ్యాపారం, బేరం, లాభం లోభం, మొదలయినవే కనిపిస్తున్నాయి. ఆ మధ్య ఒక నాడు కాలీదాసీభర్తని తండ్రిగారు కోసలదేశపు ఆ కోమటికి యాభై నిష్కా (నాణెము)లకు అమ్మేశాడు. కాలి నాదగ్గిర ఏడ్చి మొత్తుకుంది. నేను నాన్నగారితో ఎంతో చెప్పిచూచాను; కాని దాసులందరినీ యింట్లో పెట్టుకూర్చోంటే చోటుచాలదు. పోనీ వుంచినా, ఆధనం యెందుకు పనికొచ్చినట్లు? అన్నాడు. పాపం వాళ్ళిద్దరూ విడిపోయేనాటి ముందురాత్రంతా యెంతయేడ్చారు? వాళ్ళ ఆ రెండేళ్ళ చంటిబిడ్డ— దాని ముఖం తండ్రి ముఖం అని అంటా అంటారు. అది తెల్లారి లేచి ఎంతగోలెట్టింది పాపం! ఏమైనా కాలీభర్త అమ్మివేయబడ్డాడు. అతడు మానవుడే కానట్టు, పశు వైనట్టూ. బ్రహ్మ అతణ్ణి, అతని వంటలాది తరాల్ని యిందుకే సృష్టించినట్లూను! దీన్ని నేనంగీకరించలేను ప్రవాహణ్. నీయంతగా నేను మూడు వేదాల్నీ కంఠస్థం చేయలేదు. కాని వాటిని చదువుతుంటే విన్నాను. అక్కడ కేవలం కండ్లకు కనబడని వస్తువుల, లోకాల, శక్తుల లసక్తిలేక భయంమాత్రం చూపించబడ్డాయి.'

ప్రవాహణుడు లోపా ఎర్రటి చెక్కిళ్ళను తన కళ్ళకు హత్తుకొని 'మనప్రేమ అభిప్రాయభేదాలను కలిగియుండుటకే ఉద్భవించింది' అన్నాడు.

'అభిప్రాయభేదం మనప్రేమను మరింత దృఢపరుస్తుంది.'

'బాగా అన్నావు లోపా! యీ మాటలన్నీ యితరులెవరైనా అంటే నేనెంత కోపించేవాణ్ణి; కాని యిక్కడ నీ ఈ పెదవులనుండి మనదేవతలందరిపైనా తీవ్ర బాణాలు విడుస్తూండడం చూస్తూన్నప్పుడు మాటిమాటికీ వీటిని (అధరాల్ని) ముద్దాడ లనే వాంఛ కలుగుతోంది. ఎందువల్ల?'

'ఎందుకంటే, మనలోపలకూడా ద్వివిధాభిప్రాయాల సంఘర్షణ జరుగుతూనే వుంటుంది. దానిపట్ల మనం సహిష్ణుత చూపిస్తాం. అవి మన అభిన్న అంగాలు కావడం వల్లనే'.

'నీవుకూడా ఆ అభిన్న అంగానివే లోపా!'

---

## 2

'నీవు ఈ 'శివి' శాలువల్నీ ఎప్పుడూ కప్పుకోలేదు. కాశీచందనంతోనూ, సాగర ముత్యాలతోనూ నువ్వెప్పుడూ ముస్తాబుకాలేదు. ప్రేయసీ వీటిపై నీకింత ఉపేక్షాభావం ఎందుకు ?'

'వీటివల్ల నే నెక్కువ అందంగా వుంటానా?'

'నాకు నీవెప్పుడూ సుందరివే.'

'మరి యీబపువుల్ని వేసికట్టి శరీరానికి కష్టంయివ్వడంవల్ల ఏమిలాభం ? నిజం చెబుతున్నాను, ప్రియా ! నీవా పెద్దబపువును మకుటం అనే పేరుతో నెత్తి నెట్టుకొన్నప్పుడు నాకు చాలా అసహ్యంవేస్తుంది.'

'కాని ఉత్తరస్త్రీలంతా వస్త్రాభరణాలకోసం చెవికోసుకుంటారు.'

'నేనలాంటి దాన్నికాను.'

'నీవు పంచాలరాజు హృదయరాణివి.'

'ప్రవాహణుని స్త్రీని. పంచాలుర రాణినికాదు.'

'అవును. ప్రేయసీ ! యీరోజు వస్తుందని మనం ఎప్పుడూహించాం ? నేను పంచాలరాజు పుత్రుణ్నన్న సంగతి మామయ్య మనకు తెలియకుండా దాచివుంచాడు.'

'అప్పుడు నాన్న యింకేమి చేయగలిగేవారు ? పంచాలరాజు వందలాది రాణుల్లో నా మేనత్తకూడా ఒకర్తె. పంచాలరాజు పుత్రులు పదిమందీ నీకంటె పెద్ద వాళ్ళాయె. కనుక నీవు ఒకప్పుడు పంచాల రాజ్యసింహాసనాధికారి వవుతావని అప్పు డెవరికి తెలుసు ?'

'సరే, కాని నీకు యీ రాజభవనం ఎందుకు మనస్కరించడం లేదు లోపా ?'

'ఎందుకా, నేను గార్గ్యబ్రాహ్మణ మహాశాలుని భవంతులతోనే విసిగి పోయాను. మాకది భవంతే – కాని అక్కడి దాసదాసీలకో ! యిక ఈ రాజభవనం ఆ మహాశాలుని భవనంకన్న వేలాదిరెట్లు మించివుంది. ఇక్కడ నేనూ నువ్వూతప్ప మిగతావారంతా దాసదాసీలే. యిద్దరు స్వతంత్రుల కారణంగా దాసులతో నిండివున్న యీ భవనం స్వతంత్రుల భవనం కాజాలదు. నాకు ఆశ్చర్యం వేస్తూంది. ప్రవాహణ్, నీహృదయం ఎంత కఠినమైంది !'

'అంచేతేగదా నా హృదయం కఠోరవాగ్బాణాల్ని సహించగల్గుతోంది !'

'కాదు. మానవుడు యిట్లాకాకూడదు.'

'నేను మానవుణ్ని కావడానికికాక యోగ్యుణ్ని కావడానికి ప్రయత్నించాను. ప్రేయసీ ! కాని ఆ యోగ్యతను ఆర్జించేసమయంలో ఈ రాజమహల్లోకి ఒకనాడు నేను రావల్సివుంటుందని నాకు తెలియదు.'

'నన్ను ప్రేమించినందుకు నీవు పశ్చాత్తాపపడ్డంలేదుకదా ? ప్రవాహణ్ !'

'నేను నీ ప్రేమను మాతృక్షీరంలాగ అనాయాసంగాపొందాను. అది నా ఆత్మీయతలో ఒక అంగంగా తయారయిపోయింది. లోపా ! నేను లౌకికుణ్ని అయినా నీప్రేమ మూల్యాన్ని ఎరుగుదును. మానసికగలి ఎల్లప్పుడూ ఒకేలాగుండదు. మనస్సుకు విషాదం సంభవించినప్పుడల్లా జీవితం దుర్భరమైపోతూ వుంటుంది. అల్లాంటప్పుడు నీ ప్రేమా, నీ సద్భావాలూ నా కాధారభూతా లవుతుంటాయి.'

'కాని నేను నీకెంత ఆధారం కావాలని కోరుకున్నానో అంతగా కాలేక పోతున్నా నని నాకు చాలా విచారంగావుంది. ప్రవాహణ్ !'

'ఎందుకంటే నేను రాజ్యం చేయడానికి సృష్టింపబడ్డాను.'

'ఒకప్పుడు నీవు మహాబ్రాహ్మణుడవు కావాలనే ఉత్కంఠంలో వున్నావు.'

'నేను పంచాలపుర (కనౌజ్) రాజభవనానికి అధికారినని అప్పటినాకు తెలియదుగా.'

'కాని, రాచకార్యాలకి బయటి సంగతుల్లో ఎందుకు జోక్యం పెట్టు కుంటున్నావు?'

'కాని లోపా! యిది రాచకార్యాలనుండి వేరుకాదు. రాజ్యానికి బలమివ్వ డానికే మన పూర్వజులైన రాజులు వశిష్ఠుణ్ణీ, విశ్వామిత్రుణ్ణీ ఎంతగానో సన్మా నించారు. ఆ ఋషులు ఇంద్ర, అగ్ని, వరుణుల పేరుమీద ప్రజల్ని రాజాజ్ఞల్ని పాటించడానికి ప్రేరేపిస్తూండేవారు. ఆనాటి రాజులు జనుల విశ్వాసాన్ని చూరగొన డానికి ఈ దేవతలపేరుతో పెద్దపెద్ద ఖర్చులతో యజ్ఞాలు చేస్తూండేవారు. నేడుకూడా మనం యజ్ఞాలు చేస్తున్నాం. బ్రాహ్మణులకు దాన-దక్షిణలు యిస్తున్నాం. ఇవి ఎందుకు? జనం దేవతల దివ్యశక్తిని విశ్వసించాలనీ, ఈ గంధశాలీ అన్నం, ఆవు దూడల మాంసపు పులుసూ, సున్నిత వస్త్రాలూ, మణి-ముక్తామయ ఆభూషణాల వుపయోగమూ యివన్నీ దేవతలకృపవల్లనే కలిగాయని జనం అనుకోవాలని ఉద్దేశ్యం.'

'ఈ పాత దేవతలు చాలుగా! ఇంకా యీనూతన బ్రహ్మ అవసరమేమి?'

'చిరకాలాలనుంచి ఎవరూ ఇంద్రుణ్ణీ, వరుణ్ణీ, బ్రహ్మనీ చూడలేదు. అందుచేత ప్రజల మనసుల్లో సందేహాలారంభం అయ్యాయి'.

'అయితే, బ్రహ్మలో మాత్రం సందేహాలు రావా?'

'బ్రహ్మస్వరూపం నేనెట్లాచెప్పానంటే, ఎవరూ అతన్ని చూడాలనేకోర్కనే ప్రకటించరు. ఆకాశంలాగున చూచేదీ, వినేదీ, కానప్పుడు ఏదయితే ఇక్కడ అక్కడ ఎల్లెడలావుందో అటువంటిదాన్ని చూడాలనే ప్రశ్న ఎట్లావస్తుంది? సాకార దేముళ్ళ విషయంలోనే ఆ ప్రశ్నవచ్చేది'.

'నువ్వు ఆకాశం ఆకాశం అంటూ అసామాన్యుడు ఉద్దండుడు ఐన అరుణి లాంటి బ్రాహ్మణుల్నికూడా భ్రమింప చేస్తున్నావు. ఇదంతా ప్రజల్ని భ్రమలోపెట్టి వుంచడానికేనా?'

'లోపా! నీవు నన్నెరుగుదువు. నీనుండి నేనేం దాచగలను? ఈ రాజ భోగాన్ని చేతిలో వుంచుకోడానికీ, సందేహాల్ని కలిగించేవాళ్ళ బుద్ధి మొక్కపోయే

టట్టు చేయడం చాలా అవసరం. ఎందుకంటే దేవతలపట్లా, వారి పూజాయజ్ఞాల పట్లా సందేహాలు కలిగించేవారే మనకు పరమశత్రువులు'.

'కాని నువ్వు బ్రహ్మయొక్క ఉనికి, అతని దర్శనంసంగతికూడా మాట్లాడుతున్నావే?'

'ఉనికివుంది, దర్శనంకూడా కావాలి. కాని బాహ్యేంద్రియాలకు కాదు. ఏమంటే, దర్శనమయ్యే సంగతి చెబితే, సందేహవాదులు అతణ్ని చూపించమంటారు. అంచేత అతడిదర్శనానికి యింకొక సూక్ష్మ ఇంద్రియముందని నేనంటాను. ఆ ఇంద్రియాన్ని సృష్టించడానికి ప్రజలు యాభై ఆరు తరాలవరకూ శ్రోత్రవతప్పి తిరుగుతూండేట్లూ, విశ్వాసాన్ని కోల్పోకుండావుండేట్లూ, వుండే సాధనాలు చెబుతున్నాను. నేను పురోహితుల స్థూల ఆయుధాన్ని వ్యర్థం అని తలచి ఈ సూక్ష్మ ఆయుధాన్ని కనిపెట్టాను. నీవు శబరులవద్ద రాతిఆయుధాల్నీ, రాగిఆయుధాల్నీ చూచావా? లోపా!'

'నేను నీతో దక్షిణారణ్యాలకు వచ్చినప్పుడు చూచా'.

'అవును. యమునానది అవతలి ఒడ్డుకు వెళ్ళాం. శబరుల ఆ రాతి, రాగి ఆయుధాలు యిప్పటికి మన ఇనుపఆయుధాల ముందు నిలవగలవా?'

'నిలువలేవు'.

'ఇదేవిధంగా వశిష్ఠవిశ్వామిత్రుల యీ పురాతన దేవతలూ, యజ్ఞాలూ, శబరులకున్నంత బుద్ధిగలవాళ్ళను మాత్రమే సంతుష్టిపరచగలవు. కాని బుద్ధిమంతులైన ఈ సందేహవాదుల తీక్ష్ణబుద్ధి ముందు అవి వ్యర్థం'.

'వీరిముందు ఈ నీ బ్రహ్మకూడా శూన్యమే. నువ్వు బ్రాహ్మణజ్ఞానులను నీశిష్యులుగా చేసుకొని బ్రహ్మజ్ఞానాన్ని బోధిస్తూ తిరుగుతున్నావు. నేను నీయింట్లోనే నీమాటల్ని శుద్ధ పచ్చిఅబద్ధాలుగానూ మోసంగానూ తలుస్తున్నాను.'

'ఎందువల్లనంటే, నీవు అసలు రహస్యాన్ని (ఉపనిషత్) తెలుసుకున్నావు.'

'బ్రాహ్మణులు తెలివైన వాళ్ళయితే నీరహస్యాన్ని తెలుసుకోలేరా?'

'అదికూడా నువ్వే చూస్తున్నావు. బ్రాహ్మణులు నా ఈ ఆయుధాన్ని (ఉపనిషత్) తమకుకూడా చాల ఉపయోగకారిగా తలుస్తున్నారు. వారి పౌరోహిత్యం

పైనా, గురుత్వంపైనా ప్రజలకు అవిశ్వాసం పుట్టింది. నా రహస్యాయుధం చేబట్టక పోతే వారి (పురోహితుల) వాహనాలకు, ఆడగుర్రాల రథాలకు, తిండికి, ఉత్తమ ఆహారపదార్థాలకు, నివసించటానికి సుందరభవనాలు, భోగించటానికి అందకత్తెలైన దాసీలు తుదకు దానదక్షిణ లన్నిటినుంచీ వంచితులు కావలసివచ్చేది.'

'ఇది వ్యాపారమయింది!'

'వ్యాపారం. ఎల్లాంటి వ్యాపారమంటే నష్టంకలుగుతుందనే భయంలేని వ్యాపారం. ఇందువల్ల ఉద్దాలకునిలాంటి బుద్ధిమంతులైన బ్రాహ్మలు నాదగ్గరికి చేంతో సమిధ తీసుకొని శిష్యులవడానికీ వస్తున్నారు. నేను బ్రాహ్మణులపట్ల గౌరవాన్ని ప్రదర్శిస్తూ ఉపనయనం కాకుండానే విధివత్ గురువు అవకుండానే వారికి బ్రహ్మ జ్ఞానం ప్రసాదిస్తున్నాను.'

'ఇదిచాలా నికృష్టమైన తలంపు. ప్రవాహణ్ !'

'ఒప్పుకుంటాను, కాని మన ఆశయానికిది అన్నింటికన్న ఉపయోగకరమైన సాధనం. వశిష్ఠవిశ్వామిత్రుల నావ వెయ్యేండ్లయినా పనిచేయలేదు. కాని ప్రవాహణుడు తయారు చేస్తూన్న నావ రెండువేల సంవత్సరాలకు మించి రాజుల్నీ, సామంతుల్నీ, పరధనభోగుల్నీ ఉద్ధరిస్తూ వుంటుంది. యజ్ఞం అనేనావను లోపా ! నేను బలహీనంగా తలచాను. ఇందుచేతనే ఈబలీయమైన నావను తయారుచేశాను. దీన్ని బ్రాహ్మణులూ, క్షత్రియులూ కలసి సరిగా వుపయోగిస్తూ ఐశ్వర్యాన్ని అనుభవిస్తూవుంటారు. ఈ ఆకాశం లేక బ్రహ్మకంటేనూకూడా మించినది నాదింకొక ఆవిష్కారం వుంది.'

'అదేమి?'

'చచ్చి తిరిగి యీలోకంలోకేరావడం – పునర్జన్మ.'

'ఇది అన్నింటికన్న పెద్ద మాయాజాలం.'

'అన్నిటికన్న ప్రయోజనకారి కూడాను. మనసామంతులపద్దా, బ్రాహ్మణుల వెంటా, వైశ్యులదగ్గరా, ఎంతపరిణామంలో అపారమైన భోగరాశి ఏకత్రితమైందో ఆదేపరిమాణంలో సామాన్యప్రజలు నిర్ధనులవుతూపోయారు. ఈనిర్ధనుల్నీ, శిల్పుల్నీ రైతుల్నీ, దాసదాసీలనీ రెచ్చగొట్టేవాళ్ళు పుట్టుకొచ్చారు. వీళ్ళు వారందరికీ యిట్లా

చెబుతున్నారు.— 'మీరు మీ సంపాదనను యితరులకిచ్చి కష్టాలనుభవిస్తున్నారు. మిమ్మలను మోసపుచ్చడానికి మిమ్మలను దోచుకునేవాళ్ళు మీరుకష్టపడి త్యాగంచేసి, దానంచేసినందుకు చచ్చి స్వర్గాని కెళతారు' అని మీకు మోసంగా విశ్వాసాన్ని కలిగిస్తున్నారు. ఇంతవరకూ ఎవ్వడూ మృతజీవుల భోగాల్ని ఎన్నడూ చూడలేదు. దీనికే జవాబు : యిక్కడ యీ ప్రపంచంలో నీచ-ఉచ్చభావం, చిన్న పెద్ద జాతు లనేదీ, నిర్ధనులూ ధనికులు మొదలగు భేదాలన్నీ చూస్తున్నాం. యివన్ని పూర్వ జన్మ కర్మల ఫలితమే ! మనం ఈ ప్రకారంగా పూర్వసుకర్మ దుష్కర్మఫలాన్ని ప్రత్యక్షంగా చూపిస్తున్నాం.'

'ఇల్లాగు దొంగలుకూడా తమ దొంగసొత్తు పూర్వజన్మ సంపాదనని చెప్ప వచ్చునా ?'

'కాని దానికి మనం మొదటినుండీ దేవతలయొక్క, ఋషులయొక్క, జన విశ్వాసాలయొక్క సహాయాన్ని పొందిఉన్నాం. వాటి కారణంగా దొంగసొత్తు పూర్వజన్మసంపాదనగా ఒప్పుకోబడదు. ఈజన్మలో కష్టపడకుండా పొందినధనాన్ని దేవతల కృపవల్ల వచ్చిందని చెబుతూండేవాళ్ళం. కాని దేవతలపైనా వారికృపపైనా సందేహం ఆరంభమయినప్పుడు ఎదైనా మరొక ఉపాయం ఆలోచించవలసిన వాళ్ళ మయ్యాం. బ్రాహ్మల్లో దీనికితగిన ఆలోచనాశక్తిలేకుండా పోయింది. పురాతన ఋషుల మంత్రాల్నీ ప్రవచనాల్నీ వల్లెవేయడంతోనే వారు నలభైఅయిదేళ్ళ గడి పేస్తున్నారు. అట్లాంటప్పుడు వారు గంభీరమైన కొత్తవిషయాన్ని ఎట్లా ఆలోచించి కనిపెట్టగలరు?'

'కాని, ప్రవాహణ్ ! నీవుకూడా వల్లెవేయడంలో చాలాకాలం వినియోగించావు గదా!'

'పదహారు సంవత్సరాలుమాత్రం. యిరవైనాలుగు సంవత్సరాల వయస్సు గడిచినతర్వాత నేను బ్రాహ్మణవిద్యలనుదాటి బయటి ప్రపంచంలోకి వచ్చేశాను. యిక్కడ నాకు చదువుకోవడానికి ఎక్కువ లభించింది. నేను రాజశాసనపు సూక్ష్మ తల్లో ప్రవేశించినతర్వాత, బ్రాహ్మణులచేత చేయబడిన పాతనావ ప్రస్తుతానికి జీర్ణ మైనదని కనిపెట్టాను.'

'యిందువల్లేనా దృఢమైన నావను తయారుచేశావు?'

'సత్యాసత్యాలతో నాకు పనిలేదు. ఇది ప్రయోజనకారియా కాదా? అనేదే నా సమస్య. లోపా! ప్రపంచంలో పునర్జన్మసంగతి నేడు కొత్తగా కనుపిస్తోంది. దానిలో దాగివున్న స్వార్థంకూడా నీకు తెలుసును. కాని నా బ్రాహ్మణ శిష్యులు దాన్ని ఎత్తి మోసుకుపోతున్నారు. పితరుల దేవతల మార్గాన్ని (పితృయానం, దేవయానం) తెలుసుకోడానికి యిప్పుడే జనం పన్నెండేళ్ళకూడా అవుల్ని మేపడానికి సిద్ధంగా వున్నారు. లోపా! నువ్వూ నేనూ వుండం; కాని యావత్తు దరిద్రప్రజా పునర్జన్మ అనే నమ్మకంచేత యావజ్జీవపు కఠినత్వాన్నీ, కష్టాల్నీ, అన్యాయాల్నీ సహించడానికి తయారవుతుంది. స్వర్గ నరకాల్ని విప్పిచెప్పడానికి యెంతటి సూటియయిన ఉపాయం కనిపెట్టాను లోపా?'

'కాని యిది స్వార్థంకోసం ఇతరులను నాశనంచేయటం.'

'వశిష్ఠ విశ్వామిత్రులుకూడా పొట్టకోసమే వేదాలు రచించారు; ఉత్తరపంచాల (రుహేల్ ఖండం) రాజు దివోదాసు కొన్ని శబరదుర్గాలను జయించినప్పుడు కవిత్వాల మీద కవిత్వాలు చేశారు. * మనం మన పొట్టకోసం ఏర్పాటుచేసుకోవడంతో పాటు వేయేండ్లకు సరిపడి మనబిడ్డలు, మనుమలు, బంధువులకూడా ఏర్పాట్లుచేసినప్పుడే మనం శాశ్వత యశఃకీర్తులకు భాగస్వాములమవుతాము. పూర్వజులైన ఋషులూ, ధర్మపిండాలు తినే బ్రాహ్మణులుకూడా చేయజాలకపోయిన ఆకార్యాన్ని ప్రవాహణుడు చేస్తున్నాడు.'

'నువ్వు మహాకఠినుడవోయి, ప్రవాహణ్.'

'కాని నేను నాకార్యాన్ని యోగ్యతాపూర్వకంగా సాధించాను.'

---

* త్వం తదుక్థమింద్ర వర్హణాకః ప్రయచ్ఛతా సహసా శూర్యదర్శి అవగిరేర్దాసం శంబరం హన్ ప్రావో దివోదాసం చిత్రాభిరూతీ.

ఋగ్వేదం ; 6, 26, 25

# 3

ప్రవాహణుడు గతించాడు. అతని బ్రహ్మవాదమూ అతని పునర్జన్మ లేక పితృయానవాదాల విజయదుందుభి సింధునుండి సదానీరా (గండక్) ఒడ్డువరకూ మోగిపోతోంది. యజ్ఞాలప్రచారం యిప్పటికీకూడా తగ్గలేదు. ఎందుచేతనంటే బ్రహ్మజ్ఞానులు వాటిని చేయడంలో ఒక ప్రాముఖ్యమైన పద్ధతిలో ప్రోత్సాహాన్ని ప్రదర్శిస్తున్నారు. క్షత్రియ ప్రవాహణుడు కనిపెట్టిన బ్రహ్మవాదంలో బ్రాహ్మణులు బాగా దక్షులై పోయారు. దీనితో కురుయాజ్ఞవల్క్యుని కెక్కువ ఖ్యాతి వచ్చింది. ఒకానొకప్పుడు మంత్రకర్తలూ, యజ్ఞ ప్రతిష్ఠాపకులూ అయిన వశిష్ఠ, విశ్వామిత్ర, భరద్వాజులు జన్మించిన కురుపాంచాలంలో యాజ్ఞవల్క్యునీ, అతని సహచరులైన బ్రహ్మవాద బ్రహ్మవాదినుల కోలాహలం హెచ్చుగా వుంది. బ్రహ్మవాదులకు పరిషత్తుల సృష్టించడంలో యజ్ఞాలకంటె యెక్కువ పేరుప్రతిష్ఠలొస్తున్నాయి. ఇందు వల్లనే రాజులు రాజసూయాది యజ్ఞాలతోపాటు యింకోరకమైన పరిషత్తులు నడుపుతూండేవారు. వాటి వాగ్వాదాలలో జయించినవారికి వేలకొలదీ గోవుల్ని, గుర్రాల్ని, దాసదాసీలనీ (ముఖ్యంగా దాసీలనే-ఎందుకంటే రాజుల అంతఃపురాల్లో పెరిగిన దాసీలను బ్రహ్మవాదులు చాలా విశేషంగా వాంఛించేవారు.) బహుమతులుగా యిచ్చేవారు.

యాజ్ఞవల్క్యుడు ఎన్నోపరిషత్తులలో జయించాడు. ఈసారి యితడు విదేహ (తిర్హుత్) జనకుని పరిషత్తులో గొప్పవిజయాన్ని పొందాడు. అతని శిష్యుడైన సోమశ్రవుడు వెయ్యి ఆవుల్ని చుట్టేశాడు. యాజ్ఞవల్క్యుడు విదేహానుంచి కురు వరకూ ఆ ఆవుల్ని తోలితెచ్చుకునే కష్టం యెందుకుపడతాడు? అతడు వాటిని అక్కడే బ్రాహ్మణులకు పంచిపెట్టేశాడు. బ్రహ్మవాదియగు యాజ్ఞవల్క్యునికి గొప్పకీర్తి వచ్చింది. కాని హిరణ్యం (నాణాలు), సువర్ణం, దాసదాసీలు, సంకర గుఱ్ఱపురథాలు మొదలయినవాటినన్నింటినీ తనవెంట అనేక పడవల్లో నింపుకొని కురుదేశం తెచ్చుకున్నాడు.

ప్రవాహణుడు గతించి అరవైయేండ్లు గడిచాయి. అప్పటికి యాజ్ఞవల్క్యుడు పుట్టనేలేదు. కాని నూరేండ్లు నిండిన లోపా యిప్పటికీ పాంచాల (కన్నౌజ్) పురానికి బయటనున్న రాజోద్యానంలో వుంటూంది. అంచలి మామిడి, లకుచ, నేరేడు చెట్లనీడలో వుండడం ఆమెకు చాలామనోహరంగావుంది. జీవితపర్యంతం ఆమె

ప్రవాహణుడి మాటల్ని ఎదుర్కొంటూనే వుంది; కాని ఇప్పుడు ఈ అరవై సంవత్సరాల్లోనూ ఆమె ప్రవాహణుడి దోషాల్ని మరచిపోయింది. ఆమెకు జ్ఞాపకమున్నదల్లా ప్రవాహణుని జీవితపర్యంతపు ప్రేమమాత్రం. ఇప్పటికీ వృద్ధురాలి కండ్లలో జ్యోతి వుంది. ఇప్పటికీ ఆమెకు పూర్తిగా బుద్ధిమాంద్యము కలుగలేదు. బ్రహ్మవాదులపై ఆమె యిప్పటికీకూడా మండిపడుతోంది. ఆమధ్య ఒకరోజున బ్రహ్మవాదినియయిన గార్గీ వాచక్నవీ పంచాలపురంలో దిగింది. రాజోద్యానం దగ్గరే ఒక ఉద్యానంలో గార్గీని గొప్ప సన్మానంతో విడిది చేయించారు. జనకపరిషత్తులో యాజ్ఞవల్క్యుడు మోసంగా తనను ఓడించిన సంగతి ఆమె మరువలేకుండావుంది. 'నీతల క్రింద కూలిపోతుంది. గార్గీ! ఇకముందు ప్రశ్న వేశావంటే. ఇదేమీ చర్చకు పద్ధతికాదు. రక్తంతో చేతులకు రంగువేసుకొనేవాళ్ల (హంతకులు) మాత్రమే యిట్లా చేయగలుగుతారు.' అని గార్గి ఆలోచిస్తూంది.

గార్గి లోపాముద్రకు పితృకులానికిచెందిన కన్య. బ్రహ్మవాద సంబంధంలో ఆమెతో పూర్తిగా అంగీకరించకపోయినా లోపా గార్గీని బాగా ఎరుగును. ఈసారి యాజ్ఞవల్క్యుడు తనపైన నీచమైన ఆయుధం వుపయోగించడంవల్ల గార్గి చాలా కుపితురాలై వుంది. ఇందుచేత తన ముసలిపేనత్తవద్దకెళ్ళినప్పుడు ఆమె భావాల్లో తప్పక కొంత పరివర్తనం కలిగింది. లోపా తన చెంతకొచ్చిన గార్గి లలాటాన్నీ, కళ్ళనీ ముద్దాడి కౌగలించుకుంది. కుశలప్రశ్నలు పిదప గార్గి—'నేను విదేహనుంచి వస్తున్నాను అత్తయ్యా!' అంది.

'మల్లయుద్ధం చేయడానికి వెళ్ళావా అమ్మా!'

'అవును, మల్లయుద్ధమే అయింది. అత్తా! యీ బ్రహ్మవాదుల పరిషత్తులో మల్లయుద్ధంకంటే మరేమీలేదు. మల్లులవలెనే వీరిలో ప్రతిద్వందిని మోసంచే బోల్తా కొట్టించే నీతి వుంటుంది.'

'అయితే కురుపంచాలానికిచెందిన అనేక బ్రహ్మవాదులు యుద్ధరంగంలోకి దూకివుంటారు.'

'కురుపంచాలదేశం యిప్పుడు బ్రహ్మవాదులకోట అయిపోయింది.'

'నా కళ్ళముందే ఈ బ్రహ్మవాదపు చిన్న అగ్నికణం—అదయినా సదుద్దేశ్యంతోకాదు- నా ప్రవాహణుడు విడిచాడు. అది అరణ్యపు అగ్ని అయి యావత్తు కురుపంచాలాన్నీ భస్మంచేసి యిప్పుడు విదేహ ప్రాంతంవరకూ ప్రాకిపోతూంది.'

'అత్తా, నీమాటలలోని సత్యాన్ని యిప్పుడిప్పుడే నేను గ్రహించడం మొదలెట్టాను. ఇది భోగార్జనుని గొప్పమార్గం. విదేహదేశంలో యాజ్ఞవల్క్యునికి లక్షలాది సంపత్తి లభించింది. ఇతర బ్రాహ్మణులకూ్కూడా కావలసినంత ధనం ప్రాప్తించింది.'

'ఇది యజ్ఞంకంటెకూడా ఎక్కువ లాభకారియయిన వ్యాపారం. అమ్మాయీ! నాభర్త దీనిని రాజులకు, బ్రాహ్మణులకు భోగాన్ని ప్రాప్తిచేసే దృఢమైన నౌకయని అంటూండేవారు. చివరకు యాజ్ఞవల్క్యుడు జనకుని పరిషత్తులో జయంపొందినవాడయ్యాడు. నీవేమయినా మాట్లాడావా లేదా?'

'మాట్లాడ్డానికి కాకపోతే అంతదూరంవరకూ గంగానదిలో పడవని పరుగెత్తించవలసిన అవసరం ఏముంది ?'

'పడవలో దొంగలూ, దోపిడిగాండ్రూ తటస్థపడలేదుకదా?'

'లేదు అత్తా ! వ్యాపారస్థులైన ప్రయాణీకుల గుంపులో భటుల ఏర్పాటు వుంటుంది. ఒంటరొంటరిగా తిరిగి ప్రాణాల్ని ప్రమాదంలో పెట్టుకొనేంత మూర్ఖులం కాదు! బ్రహ్మవాదులం.'

'మరి యాజ్ఞవల్క్యుడు అందరినీ ఓడించేశాడే.'

'దానిని ఓడించడం అని అనకూడదు.'

'అదెట్లా?'

'ఎట్లా అంటావా, ప్రశ్నించేవాళ్ళంతా యాజ్ఞవల్క్యుని జవాబు విని కిక్కురుమనకుండా ఊరుకున్నారు.'

'నువ్వుకూడానా?'

'నేనుకూడాను; కాని నన్నతడు వాదంవల్లకాక వ్యర్థప్రలాపంవల్ల నోరు కట్టాడు.'

'వ్యర్థప్రలాపంవల్లనా?'

'అవును. నేను బ్రహ్మనుగూర్చి ప్రశ్నిస్తూంటిని. అతడికి తప్పించుకోడానికి మార్గంలేకుండా ముట్టడించేశాను. ఇంతలో యాజ్ఞవల్క్యుడు, అతనినుండి నేనాశించ నంతటి మాటనేశాడు.'

'ఏమిటది బిడ్డా?'

'గార్గీ! నీశిరస్సు నేలకూలిపోతుంది, యికముందు ప్రశ్నించావంటే!' అని అతడు నేనిక ప్రశ్నకి సమాధానం అడగకుండా నన్నాపేశాడు.'

'ఇట్లా అవుతుందని నువ్వు ముందనుకోలేదా! కాని నేనయితే ఏమయినా జరగవచ్చునని తలచేదాన్ని. గార్గీ! యాజ్ఞవల్క్యుడు ప్రవాహణుని పక్కా-శిష్యుడని ఋజువైంది. ప్రవాహణుని మిధ్యావాదాన్ని ఇతడు పూర్ణత్వానికి తీసుకెళ్ళాడు. నీవు మరి ప్రశ్నించకపోవడం మంచిదే అయింది గార్గీ!'

'నీకెట్లా తెలిసింది, అత్తా?'

'నీభుజాలపై నీతలను ప్రస్తుతం నేను చూస్తూండడం వల్లనే తెలిసింది.'

'అయితే ఒకవేళ నేను యింకా ప్రశ్నించివుంటే నాతల రాలిపోయేదని నీవు విశ్వసిస్తావా అత్తా!'

'అవశ్యం! కాని యాజ్ఞవల్క్యుని బ్రహ్మబలంచేతకాదు. ఇతరుల తలలు రాలి పోతూండడం మనం చూస్తున్నట్లే నీ తలాను....'

'కాదు, అత్తా!'

'నువ్వింకా పసిదానవు గార్గీ! ఈ బ్రహ్మవాదం కేవలం మానసిక కల్పనా, కుప్పిగంతులూనని నీవనుకుంటున్నావు. అంతేకాదు గార్గీ! దీనివెనుక బ్రహ్మక్షత్రి యుల గొప్ప స్వార్థం దాగివుంది. ఈ బ్రహ్మవాదం జన్మించిన కాలంలో దీని జన్మ

దాత నాప్రక్కలో పడుకుంటూండేవాడు. ఇది రాజశక్తినీ, బ్రాహ్మణశక్తినీ దృఢ పరచడానికి బలీయమైన సాధనం. ఇనుపఖడ్గం, రక్తసిక్తహస్తుడగు భటుడు ఎల్లాంటి సాధనాలో, యిది అల్లాంటిసాధనమే.'

'అత్తా! నేనట్లా అనుకోలేదు.'

'చాలామంది అలా అనుకోడంలేదు. ఒనకవిదేహుడుకూడా ఈరహస్యాన్ని (ఉపనిషత్తు) ఎరగడేమోనని తలుస్తాను. కాని యాజ్ఞవల్క్యుడికి నాపతి ప్రవాహణు నికి తెలిసినట్లుగనే తెలుసును. ప్రవాహణునికి ఏదేవునిలోనూ, దేవలోకంలోనూ, పితృలోకంలోనూ, యజ్ఞంలోనూ, బ్రహ్మవాదంలోనుకూడా నమ్మకంలేదు. అతడికి కేవలం భోగంలోనే నమ్మకం వుంది. అతడు తన జీవితపు ప్రతిక్షణాన్నీ ఆ భోగానికే అర్పించాడు. మరణానికి మూడురోజులకు ముందు విశ్వామిత్ర సువంశ పురోహితుని సువర్ణకేశియగు కన్య అతని రాణివాసంలోకి వచ్చింది. బ్రతికే ఆశ లేకుండినప్పటికీ అతడు ఆ యిరువదేండ్ల సుందరితో సరస సల్లాపాలాడుతూవున్నాడు.'

'ఆవుల్ని దానంచేసి, విదేహరాజు యిచ్చిన సుందర దాసీలను యాజ్ఞ వల్క్యుడు తనతో తెచ్చుకొన్నాడు, అత్తా!'

'అతడు ప్రవాహణుని శిష్యాగ్రగణ్యుడని యిప్పుడే చెప్పానుకదా. అతడి బ్రహ్మవాదం చూచావుగా? ఇది నీవు దూరాన్నుంచి చూచావు. దగ్గిరనుంచి చూచే దానికి నీకవకాశం చిక్కివుంటే చూచేదానివి బిడ్డా!'

'అయితే అత్తా, నేనింకా ప్రశ్నించివుంటే నాతల తెగి పడిపోయేదని నీవు నిజంగానే తలుస్తావా?'

'నిస్సందేహంగా; కాని యాజ్ఞవల్క్యుని బ్రహ్మతేజస్సువల్ల కాదు బిడ్డా! ప్రపంచంలో యెందరితలలు నిశ్శబ్దంగా మొండెంనుంచి వేరుచేయబడటంలేదు?'

'నాతల తిరిగిపోతోంది అత్తా!'

'ఇవ్వాళా! నాకు తెలివివచ్చినప్పటినుంచీ నాతల తిరుగుతోంది. అంతా బూటకం, మోసం! ప్రజల కష్టాన్ని తేరగా తినేపద్ధతే ఈ రాజవాదం, బ్రహ్మ వాదం, యజ్ఞవాదమూను. ప్రజలు స్వయంగా చైతన్యం పొందేంతవరకూ వారిని

ఈ ఉచ్చునుండి ఎవడూ తప్పించలేడు. ప్రజలు చైతన్య పొందడం ఈ స్వార్థపరులకు మనస్కరించదు.'

'ఈ మోసాన్ని ద్వేషించడానికి మానవహృదయం మనకిక ప్రోత్సాహమివ్వదా?'

'ఇస్తుందమ్మా! అదే నాకున్న ఆశల్లా.'*

---

* ఇది నేటికి 108 తరాలకు ముందునాటికథ. ఆకాలంలో ఉన్నత అంత ర్వేదంలో ఉపనిషత్తుయొక్క బ్రహ్మజ్ఞానపు సృష్టి ప్రారంభమయింది. అప్పటికే భారతదేశంలో 'ఉద్యాన్' అసలు యిసుమూ ప్రచారంలోకి వచ్చేశాయి.

# "బంధులమల్లు"

## (తామ్రదవ కథ)

[ కాలం-క్రీస్తుకు 490 సంవత్సరాలకు పూర్వం. ]

అది వసంతకాలపు యౌవనం. వృక్షాలు ఆకులురాల్చి కొత్తవి తొడిగాయి. శాల (టేకు) తన తెల్లటి పుష్పాలతో వనాన్ని సుగంధితం చేస్తూంది. సూర్య కిరణాలు తీవ్రంకావడానికింకా ఆలస్యం వుంది. దట్టమైన శాలవనంలో ఎండిన ఆకులపైన మనుష్యులు నడుస్తూన్న పదధ్వని వినవస్తోంది. ఒకపెద్ద చెదలపుట్టవద్ద నిలబడి యిద్దరు యువతీయువకులు దాన్ని చూస్తున్నారు. యువతియొక్క యెర్రని గౌరవర్ణపు ముఖంమీద దీర్ఘపు నల్లని వుంగారాలుతిరిగిన ముంగురులు నిర్లక్ష్యంగా గంతులేస్తూ ఆమె సౌందర్యాన్ని యినుమడింప చేస్తున్నాయి. యువకుడు తన బలిష్ఠ బాహువును యువతి భుజంపై వైచి యిట్లా అన్నాడు—'మల్లికా! యీ పుట్టను చూడడంలో యింత తన్మయురాలవై పోయినావే?'

'చూడు, యిది రెండతస్తులది.'

'అవును. మామూలు పుట్టలకన్న పెద్దది. కాని దీనికంటె కూడా పెద్ద పుట్ట లుంటాయి. వర్షంకురిసినమీదట దీనినుండి నిజంగానే నిప్పు, పొగా వస్తాయా అని నీవాలోచిస్తూండవచ్చు'.

'కాదు. అది బహుశా వట్టి పుక్కిటిపురాణంకావచ్చు; కాని చీమలలాంటి ఈ చిన్నచిన్న చీమలకన్న కోమలమైన రక్తముఖం కలిగిన ఈ తెల్లటి పురుగులు ఇంత పెద్ద వల్మీకాన్ని ఎట్లా నిర్మించుకుంటున్నాయి!'

'మనుష్యులు నిర్మించిన భవనాల్ని మానవుడి శరీర పరిమాణంతో పోల్చి కొలిచిచూస్తే ఆ భవనాలు ఎన్నోరెట్లు పెద్దవిగా కన్పడుతాయి. యిది ఒక చెద పురుగుపని కాదు. శతసహస్ర చెదపురుగులు కలిసి దీనిని నిర్మించాయి. మానవుడు కూడా యిదేవిధంగా కలసి తన పనుల్ని చేస్తున్నాడు'.

'ఇందుచేతనే నేనుకూడా తహతహతో దీన్ని చూస్తున్నాను. వీటిలో ఎంత మైత్రి వుందోచూడు. ఇవి అతి క్షుద్రప్రాణులుగా ఎంచబడుతున్నాయి. శత-సహస్రాలు ఒకటిగా కలిసివుండి యింత పెద్దభవంతుల్ని కడుతున్నాయి. మనమల్లులు యీ చదపురుగుల నుండి ఏమీ నేర్చుకొనక పోతున్నందుకు నాకు చాలా విచారంగా వుంది'.

'మానవుడుకూడా మైత్రితో కలసివుండడంలో ఎవరికీ తీసిపోడు; అంతే కాదు మానవుడు నేడు శ్రేష్ఠప్రాణిగా తయారయినాడంటే దానికి మైత్రితో కలిసి యుండడమే కారణం. అంచేతనే అతడు ఇంత పెద్దపెద్ద నగరాల్నీ, పేటల్నీ, గ్రామాల్నీ, సృష్టించడంలో సఫలీకృతుడయ్యాడు. అందువల్లనే అతని నావలు అపారసాగరాన్ని దాటివెళ్ళి ద్వీప ద్వీపాంతరాల నిధుల్ని ప్రోగుచేస్తున్నాయి. అందుచేతనే అతనిముందు ఏనుగులూ, ఖడ్గమృగాలూ, సింహాయాహూడా తలవంచుకు నిలబడుతున్నాయి.'

'కాని, అతడికి ఈర్ష్య! లేకుంటావుంటే బాగుండేది!'

'నీకు మల్లుల ఈర్ష్య జ్ఞాపకొస్తుందా?'

'అవును. వాళ్ళు నిన్ను ఎందుకు ద్వేషిస్తున్నారు? నువ్వు ఎవరినైనా నిందించడంగాని, అపహారం చెయ్యడంగాని నేను చూడలేదు, వినలేదు. అంతేకాదు నీ ఋజువర్తనకు దాసులూ—పనివారు యెంత సంతోషిస్తున్నారో అందరికీ తెలుసు. అయినప్పటికీ ఎందరో గౌరవనీయులగు మల్లులు నిన్ను యింతగా ద్వేషిస్తున్నారు!'

'ఎందుకంటే, నేను బహుజన ప్రియుడను కావడం వారుచూస్తున్నారు; ప్రజాతంత్రంలో బహుజనప్రియుణ్ణి ద్వేషించేవాళ్ళుకూడా ఎక్కువ ఉండడం చూస్తున్నాం. ఇందువల్లనే యిక్కడ పురుషుడు ప్రజాతంత్ర ప్రముఖుడవుతాడు'.

'కాని, వారు నీ గుణాల్నిచూచి సంతోషించి వుండాల్సింది. మల్లుల్లో నేటి వరకూ తక్షశిలయందు యే ఒక్కనికీకూడా యింతటి గౌరవం ప్రాప్తించివున్నట్లు వినలేదు. నేటికికూడా, కోసలరాజు ప్రసేనజిత్తునుంచి నీకు ఆహ్వానాలొస్తున్నాయని వారికి తెలియదా!'

'మేమిద్దరం తక్షశిలలో పదిసంవత్సరాలవరకూ కలిసి చదువుకున్నాం. అందువల్ల అతనికి నా గుణాలు బాగా తెలుసు.'

'కుసీనారాకు చెందిన మల్లులకు నీ గుణాలు తెలియవని నేనొప్పుకోను. మహాలిచ్ఛవి యిక్కడికివచ్చి నీదగ్గర బసచేసినప్పుడు అతడే స్వయంగా నిన్ను ప్రశంసించడం చాలామంది కుసీనారావాసులు విన్నారు'.

'కాని మల్లికా! నన్ను ద్వేషించేవాళ్ళు నా గుణాల నెరుగుండే అట్లా చేస్తున్నారు. గుణవంతుడూ, బహుజన ప్రియుడూకావడం ప్రజాతంత్రంలో ఈర్ష్యకు ప్రధాన కారణం'.

'నాకు స్వవిషయంలో అంత చింతలేదు. నేను మల్లలసేవ నిమిత్తం తక్షశిలలో అంత పరిశ్రమతో శస్త్రవిద్య నేర్చుకున్నానే అనేదే విచారం. నేడు, వైశాలీ లిచ్ఛవుల్ని కోసలదేశీయులూ మగధదేశీయులూ తమతో సమానులుగా యెంచుతున్నారు. కాని కుసీనారా కోసలరాజ్యాన్ని తనకు మిన్నగ యెంచుతోంది. పావా, అనూపియా, కుసీనారా మొదలగు మన తొమ్మిది మల్లజాతుల్నీ స్నేహబంధనంలోనికితెచ్చి లిచ్ఛవులవలె మన తొమ్మిది మల్లసమూహాల్నీ ఒకే సమ్మిళిత సుదృఢగణంగా చేద్దామని నేను తలచాను. వీరు కలసిపోతే ప్రసేనజిత్తు మనవైపు కన్నెత్తైనా చూడలేడు.'

బంధులమల్లు గౌరవర్ణముఖంలోని కాంతి వెలవెల బోవడం కనిపెట్టి మల్లికకు దుఃఖంవచ్చింది. అందువల్ల ఆమె మాటలధోరణి మారుస్తూ అంది—

'నీసఖులు వేటకు సిద్ధంగా వుంటారు. ప్రియా! నాకుకూడా రావాలని ఉంది; గుఱ్ఱంమీదనా, లేక కాలినడకనా?' అంది.

'గవయ్‌ని (కృష్ణమృగం అడవుల్లోవుండే లేడి, ఆవు రెంటిని పోలియుండు ఒక మృగవిశేషం) గుఱ్ఱంమీదనుండి వేటాడ్డం సాధ్యంకాదు మల్లికా! మోకాళ్ళ వరకూ వ్రేళ్ళాడుతూన్న ఈ లంగాతోను మూడు బారలదూరం గాలికి ఎగురుతూన్న పమిటచెల్లాతోను ఈ చెల్లాచెదరైన కురుల్ని నల్లత్రాచుల్లా గాలిలో ఎగరేసుకుంటూనా వేటకి వెళ్ళటం?'

'యివి నీకు చెడ్డగా తోస్తున్నాయా?'

'చెడ్డగా! మల్లిక యెంత్రటి పెదవుల్నాతడు ముద్దాడి 'మల్లిక పేరుతోనైనా సంబంధముండేదేదీకూడా నాకు చెడ్డగాతోచదు. కాని పేటలో అడవిపొదల్లో పడు గెట్టాల్సివస్తుంది.'

'వీటిని నీముందే కట్టేస్తున్నాను.' అని మల్లిక తన లంగా బిగించి కట్టేసుకుంది. కురుల్ని సర్దుకొని తలపైన ముడివేసుకొని-'నా పమిటచెల్లాను నాకు పాగా చుట్టు బంధుల్!' అంది.

పాగాచుట్టి, రవికలోనుండి ముందుకు పొడుచుకొచ్చి, చిన్న మారేడు పండ్లలో పోటచేయతగియున్న ఆమె స్థనాలను అతడు అర్ధాలింగనంచేస్తూ—'మరి నీ యీ స్థనాలో?' అన్నాడు.

'స్తనాలు మల్లకన్యలందరికీ సహజంగా వుంటాయి.'

'కాని, యివి ఎంత అందంగా వున్నాయి?'

'అయితేమాత్రం, వీటినెవడయినా ఎత్తుకుపోతాడా ఏమిటి?'

'యువకుల దృష్టిదోషం తగుల్తుంది.'

'యివి బంధులమల్లివని వారికి తెలుసు.'

'అల్లాకాదు, నీ కభ్యంతరంలేని పక్షంలో, మల్లికా! నా అంగవస్త్రంలో వీటిని దాచి కట్టివేస్తాను.'

'బట్టలచాటునుండే నీకు తృప్తికలగడంలేదు.' అని మల్లిక చిరునవ్వునవ్వి బంధుల్ ముఖాన్ని ముద్దుపెట్టుకుంటూ అంది.

బంధుల్ ఆమెరవికను తొలగించి, స్వచ్ఛ స్ఫటిక–శిలాసదృశవక్షంపై రక్త వర్ణముగల్గియున్న ఆ గుండ్రని స్తనాలను అంగవస్త్రంతో కట్టివేశాడు. మల్లిక తిరిగి తనకంచుకాన్ని (రవికెను) తొడుక్కొని 'యిక నీవనుకున్న ప్రమాదం తప్పిపోయిందికదా, బంధుల్!' అంది.

'నాఆస్తికి యిక ప్రమాదంలేదు ప్రేయసీ! యిక పసుగొత్తడంలో కూడా యివి బాధకరంగావుండవు.

యావన్మంది మల్లులూ మల్లస్త్రీలూ వేటదుస్తులుధరించి వీరికోసం నిరీక్షిస్తు న్నారు. వీరురాగానే ధనుస్సులూ, ఖడ్గాలూ, బల్లేలూ సంబాళించుకొని ఒక్కుమ్మడిగా బయల్దేరారు. వారు తమలో కృష్ణమృగాల మధ్యాహ్న విశ్రామస్థలం తెలిసినవాని ననుసరించి వెళ్ళారు. పెద్దవృక్షాల అల్పతృణచ్ఛాయక్రింద కృష్ణమృగాల గుంపు పండుకొని నెమరువేస్తూంది. గుంపుకధిపతియైన ఒక మగకృష్ణమృగం నిలచి చెవుల్ని ముందుకీ వెనక్కీ నిగిడిస్తూ పహరాయిస్తోంది. మల్లులు రెండు భాగాలుగా విడి పోయారు. ఒకభాగం అస్త్రశస్త్రాలు సంబాళించుకొని ఒకవైపు వృక్షాలచాటున కూర్చొంది; రెండోభాగం వెనుకనుంచి ముట్టడించడానికి రెండుభాగాలుగా చీలి వెళ్ళింది. ఈ రెండుదళాలూ ఎక్కడ కలుసుకోబోతున్నాయో ఆవేపునుంచేగాలి వీస్తోంది. కృష్ణమృగం యింకా లేడిలోకవంటి తన చిన్నతోకను ఆడిస్తోనేవుంది. రెండుదళాలూ కలుసుకునేందుకుముందే మిగతా కృష్ణమృగాలుకూడా లేచి నిలబడి ముక్కురంధ్రాలను ఉబికిస్తూ చెవుల్ని ముందుకు నిగిడిస్తూ ఆవైపుకే తదేక ధ్యానంతో చూడనారంభించాయి. క్షణమాత్రంలోనే తెలిసిపోయింది. వాటికి ప్రమాదం అర్థమయింది. గుంపు కధిపతియైన కృష్ణమృగంవెంట గాలిపీస్తున్న వైపుకు పరుగుచ్చుకొన్నాయి. ఇంకా అవి ప్రమాదాన్ని కళ్ళతో చూడలేదు. కనుక మధ్యమధ్యనిలుస్తూ వెనుతిరిగి చూస్తున్నాయి. దాగియున్న వేటగాండ్ర దగ్గరకొచ్చి మరొకసారు అవి వెనుతిరిగి చూడనారంభించాయి. ఇదేసమయంలో అనేకధనస్సుల వింటినారెలు ధ్వనించాయి. కృష్ణమృగపు గుండెను తేరిపారిజూచి బంధుల్ సూటిగా గురిపెట్టాడు. ఆమృగంమీదనే మల్లిక మరింకెందరో కూడా గురిపెట్టారు, కాని బంధుల్ బాణం తప్పిపోయివుంటే మృగం లభ్యమయ్యేది కాదనుట నిశ్చయం. కృష్ణ మృగం అక్కడే కూలిపోయింది. గుంపుకుచెందిన యితరపశువులు చిందరవందరై పరుగెత్తాయి. బంధుల్ దరిచేరి చూచేసరికి మృగంప్రాణాన్ని విడుస్తోంది. రెండు కృష్ణమృగాల రక్తపు చుక్కల ననుసరిస్తూ వేటగాండ్రు ఒకకోసెడు దూరంవెళ్ళి ఒక మృగం భూమిపై కూలియుండగా చూచారు. ఈ సాఫల్యంతోపాటు నేటి వన భోజనంలో ఆనందం తాండవమాడింది.

కొందరు కర్రలతో పెద్దపెద్ద నిప్పును తయారు చేయసాగారు. కొందరు పురుషులు కృష్ణమృగపు చర్మాన్ని వొలిచి మాంసపుముక్కల్ని కోయనారంభించారు.

అన్నిటికన్న ముందు అగ్నిలోవేసిన గుండెకాయా, సురాపానపు గిన్నెలూ జనం ముందు కొచ్చాయి. మాంసపు ముక్కల్ని కోయడంలో బంధుల్ రెండుచేతులూ పూనుకొనివున్నాయి. అందువల్ల మల్లిక తనచేతితో వేసిన గుండెకాయముక్కనీ, సురాపానపుగిన్నెనూ అతని నోటికందించింది.

మాంసం ఉడికి తయారవకముందే చీకటి పడిపోయింది. భగభగ మండే కట్టెలనిప్పుయొక్క ఎర్రనికాంతులు తగినంతగావున్నాయి. ఆ వెలుతురులోనే మల్లుల నృత్యగానాలు ఆరంభమయ్యాయి. మల్లిక కుసీనారావాసులందరిలోకీ సుందరతమ తరుణి. పేటదుస్తుల్లో తన నృత్యకౌశల్యాన్ని అత్యద్భుతంగా ప్రదర్శించింది. అఖిల జంబూద్వీపపు అత్యంత విలువైన ఈనారీరత్నానికి అధికారియైనందుకు బంధుల మల్లు సహచరులు అతడి అదృష్టాన్ని వేనోళ్ళ ప్రశంసిస్తున్నారు.

---

## 2

కుసీనారా యొక్క సంస్థాగారం (ప్రజాతంత్రభవనం)లో యీవేళ జనం గుమిగూడివున్నారు. గణసంస్థయొక్క యావన్మందిసభ్యులూ శాలలో ఆసీనులై వున్నారు. ఎందరో ప్రేక్షకులూ, ప్రేక్షకురాండ్రూ బయట మైదానంలో నిలబడి వున్నారు. శాలలో ప్రత్యేక స్థానంలో గణపతి (సభాపతి) కూర్చొనిఉన్నాడు. ఆయన సభ్యులవైపు ధ్యానంతోచూచి నిలబడి యిట్లా అన్నాడు—

'పూజ్యసభ్యులారా! నేడీసమావేశంయొక్క ఉద్దేశం తెలుపుతాను. చిరంజీవి బంధుల్ తక్షశిలనుండి యుద్ధశిక్షణపొంది మల్లుల గౌరవాన్ని పెంపొందిస్తూ తిరిగి వచ్చాడు. అతడి శస్త్రనైపుణ్యం కుసీనారా బయటి జనానికికూడా తెలుసును. అత డిప్పటికివచ్చి నాలుగేండ్లు గడిచాయి. నేను మనసమూహపు చిన్న పెద్దపనులు నాసమ్మతితో అతనికి వప్పగించాను. అతడు ప్రతిపనినీ చాలా తత్పరతతోనూ, సాఫల్యంతోనూ పూర్తిచేశాడు. ఇప్పుడు గణసంస్థ (పార్లమెంటు) అతనికి స్థిరమగు ఉపసేనాపతి పదవి యివ్వాలి. ఇదినా విజ్ఞప్తి.

'పూజ్యసదస్యులారా! గణసంస్థ (పార్లమెంటు) చిరంజీవి బంధుల్‌ని ఉపసేనాపతిగా నియమిస్తోంది. ఇది అంగీకారమున్న చిరంజీవి ఊరకుండుగాక. అనంగీకారమైన అతడు మాట్లాడునుగాక.' అని ముమ్మారు చదివాడు.

ఈసమయంలో ఒకసభ్యుడు— రోజ్‌మల్లు ఉత్తరీయాన్ని తొలగించి కుడిభుజాన్ని దిసగావుంచి మాట్లాడ నిలబడ్డాడు.

రోజ్‌మల్లు— 'పూజ్యసభ్యులారా! నేను చిరంజీవి బంధుల్‌మల్లు యోగ్యత విషయంలో సందేహించడంలేదు. అతడు ఉపసేనాపతిగా నియమించబడ్డానికి ముందాతనిని మన సంప్రదాయానన్నుసరించి పరీక్షించుట ముఖ్యం. సంఘగౌరవాన్ని ఇనుమడింపచేయుట— ఆచారాన్ని గుర్తుచెచ్చుట నావిధి.' అని చెప్పాడు సభాపతి అనుమతిపై.

ఆపై యిద్దరు ముగ్గురు సభ్యులుకూడా యిదేవిషయం చెప్పారు. కొందరు సభ్యులు పరీక్ష అవసరంలేదనే విషయం నొక్కివక్కాణించారు. తుదకు సభాపతి యిట్లు అన్నాడు. 'పూజ్యసభ్యులారా! చిరంజీవి బంధుల్‌ను ఉపసేనాపతిగా నియమించడంలో సంస్థకు కొద్దిగా అభిప్రాయభేదంవుంది. ఇందుచేత సమ్మతి (ఓటు) తీసుకోవలసిన అవసరం ఏర్పడింది. చువ్వలను పంచువారు వోట్లున్న కర్రచువ్వలను తీసుకొని మీవద్దకు వస్తున్నారు. వారి ఒకచేతిసంచిలో ఎరుపుచువ్వలున్నాయి. రెండవ చేతిసంచిలో నలుపువి ఉన్నాయి. మూలతీర్మానాన్ని ఎవరు అంగీకరించకుండా వున్నారో వారు నలుపుచువ్వలను తీసుకోవాలి. మూలతీర్మానాన్ని సమర్థించేవాడు ఎరుపుని తీసుకోవాలి.'

చువ్వలను పంచువారు వోట్లుపోసున్న చువ్వలను తీసుకొని ఒక్కొక్క సభ్యునిచెంతకూ వెళ్ళారు. అందరూ తమతమ ఇచ్ఛానుసారం ఒక్కొక్క చువ్వను తీసుకొన్నారు. పంచినవారు తిరిగిరాగానే సంచుల్లో యింకా మిగిలినచువ్వలను సభాపతి లెక్కించాడు. ఎరుపువి ఎక్కువున్నాయి, నలుపువి తక్కువ; నల్లవాటినే సభ్యులు ఎక్కువగా తీసుకున్నారని దీనిఅర్థం. సభాపతి ఇట్లు ప్రకటించాడు. 'పూజ్యసభ్యులారా! వినండి. నలుపుఓటు చువ్వలు ఎక్కువగా తీసుకోబడ్డాయి. ఇందుచేత గణసంస్థ చిరంజీవి రోజ్‌మల్లుతో ఏకీభవిస్తోందని ఇప్పుడు చిరంజీవి బంధుర్ నుండి ఎట్లాంటిపరీక్ష పుచ్చుకోవాలో సమూహం (గణసంస్థ) నిశ్చయించునుగాక!!

దీర్ఘకాలంవరకూ వాదవివాదాలూ ఓట్లు తీసుకోవడం అయిన పిమ్మట, బంధుల్ మల్లు ఎనిమిది కర్రగుంజలను (గూటాల్ని) ఒక్కశ్వాసలో ఖడ్గంతో నరికివెయ్యాలని నిశ్చయమయింది. సభను వారం రోజులనాటికి వాయిదావేసారు. ఏడవరోజున కుసీనారా మైదానంలో స్త్రీపురుషులతో కూడిన బ్రహ్మాండమైన సమూహం చేరిపోయింది. మల్లికకూడ అక్కడ హాజరయింది. కొంచెంకొంచెం ఎడంగా బలిష్ఠమైన ఏడు కర్రగుంజలు పాతబడ్డాయి.

సభాపతి ఆజ్ఞానుసారం బంధుల్ తన ఖడ్గాన్ని సరిచేసుకున్నాడు. యావత్తు జనసమూహం శ్వాసనిలిపి చూడనారంభించారు. బంధుల్‌మల్లు దృఢబాహువుల్లో ఆ పొడుగయిన నిడుపాటి ఖడ్గాన్నిచూచి ప్రజలు బంధుల్ సాఫల్యంలో సందేహంలేని వారుగా వున్నారు. బంధుల్ యొక్క మెరుపులామెరుస్తున్న ఖడ్గం పైకిలేస్తూ వాల్తాందడం చూచారు. మొదటిగుంజ తెగింది, రెండవది, మూడవది ఆరోది తెగుతూన్నప్పుడు బంధుల్ చెవుల్లో ఖంగుమనేశబ్దం వచ్చిపడింది. అతని లలాటంలో ముడతలొచ్చాయి. ఉత్సాహం నీరయిపోయింది. బంధుల్ ఖడ్గం ఏడవగుంజ ఆకొనకంటా తెగేందుకు కొంచెముందే ఆగిపోయింది. బంధుల్ త్వరగా అన్ని గుంజలకొనల్నీ ఒక్కసారి చూచేశాడు. అతనిశరీరం కంపించిపోతోంది, ముఖం కోపంవల్ల ఎర్రబారివుంది. అయినప్పటికీ అతను పరిపూర్ణమైన మౌనముద్ర నవలంబించాడు. 'ఏడవగుంజ పూర్తిగా వేరుకాలేదు' అని సభాపతి ప్రకటించాడు. ప్రజల సానుభూతి బంధుల్‌మల్లుపట్ల వుంది.

ఇల్లుచేరి మల్లిక బంధుల్‌యొక్క ఎర్రబారివున్న గంభీరవదనాన్ని చూచి తన దుఃఖాన్ని మరచి అతనికి ధైర్యవచనాలు చెప్పగోరింది.

'మల్లికా! నన్ను చాలా మోసం అన్యాయం చేశారు. ఇట్లా జరుగుతుందని నేను తలచలేదు' అన్నాడు బంధుల్.

'ఏమిటా మోసం!'

'ఒక్కొక్క గుంజలోనూ ఇనుపమేకులు దిగవేసివున్నవి. అయిదవగుంజ వరకూ నాకేమీ జాడ తెలియలేదు. ఆరవది తెగినమీదట నాకు ఖంగుమనేశబ్దం స్పష్టంగా వినిపించింది. నేను మోసాన్ని అర్థంచేసుకున్నాను. శబ్దాన్ని గనుక నేను వినివుండకపోయినట్లయితే ఏడవగుంజనుకూడా పూర్తిగా కొట్టివేసివుండేవాణ్ని, కాని నా మనస్సు చలించిపోయింది.'

'యిలాంటి మోసమా ! ఇది ఘోరనీచత్వం.'

'ఎవరుచేశారనేది మనం ఎఱుగం. రోజ్‌మల్లుపై యేమాత్రం కోపంలేదు. అతను ఉచితంగానే మాట్లాడాడు. నిజానికి అతని అభిప్రాయంతో గణసంస్థలోని అధికసంఖ్యాకులు ఏకీభవించారు. కుసీనారాలో నేనంటేగల ఈ సద్భావం నాకు మనోవేదనగానూ కోపంగానూ వుంది.'

'అయితే బంధుల్‌మల్లు కుసీనారాపై కోపిస్తున్నాడా ?'

'కుసీనారా నన్ను కన్నతల్లి. ఈమె నన్ను పెంచి పెద్దచేసింది. అయినా నేనిప్పుడు కుసీనారాలో వుండను.'

'కుసీనారాను విడిచిపెట్టి పోవాలనుకుంటున్నావా ?'

'కుసీనారాకు బంధుల్‌మల్లుని అవసరం ఏమీలేదుకనుక.'

'ఎక్కడికిపోతావు ?'

'మల్లికా ! నీవు నాతోవుంటావా ?' అని వికసితవదనుడై బంధుల్ అడిగాడు.

'నీడవలె నీతోనేవుంటాను బంధుల్ !' అంటూ మల్లిక అతని ఎఱ్ఱనికళ్ళను ముద్దెట్టుకుంది. దానితో వాటి కఠినత్వం పోయింది.

'మల్లికా : నీచేతుల్నిట్లాఇయ్యి.' మల్లిక చేతుల్ని తనచేతుల్లోకి తీసుకుని బంధుల్ అన్నాడు – 'ఈ నీచేతులు నాకు శక్తిని ధారపోసేవి; వీటినిపోంది బంధుల్ ఎక్కడయినాసరే నిర్భయంగా విహరించగలడు.'

'అయితే, ప్రియా ! ఎక్కడికివెళ్ళడానికి నిశ్చయిస్తున్నావు ? ఎప్పుడు?'

'ఏమాత్రం ఆలస్యం చేయకుండానే, ఎందుకంటే గుంజలలోని మేకుల సమాచారప్రజాడ గణపతికెట్లాగూ తెలిసిపోతుంది. దానితో ఆయన తిరిగి పరీక్ష దినం నిర్ణయిస్తాడు. ప్రజలు పట్టుబట్టటానికిముందే మనం వెళ్ళిపోవాలి.'

'అన్యాయాన్ని యెందుకు తుడిచివేయనీయవు ?'

'కుసీనారా నా విషయంలో తన యభిప్రాయాన్నిచ్చేసింది. మల్లికే! ప్రస్తుతానికి నాకిక్కడ పనిలేదు. బంధుల్ అవసరం కుసీనారాకు కలిగినప్పుడు అతడిక్కడికి వచ్చి హాజరవుతాడు.'

వీలయిన వస్తువుల్ని కూడా తీసుకొని ఆ రాత్రే మల్లిక, బంధుల్ కుసీనారాను వదలిపోయారు. రెండవరోజున అచిరవతి (రాపతి) ఒడ్డునున్న అవస్థిత బ్రాహ్మణుల గ్రామమగు మల్లగ్రామా (మలావ్, గోరఖ్‌పుర్)కి చేరుకున్నారు. మల్లుల జనపదంలో మల్లగ్రామపు సాంకృత్యులు తమ యుద్ధవీరత్వానికి ప్రసిద్ధికెక్కినవారు. అక్కడ బంధుల్ మిత్రులుకూడా వున్నారు. కాని బంధుల్ మిత్రుల్ని కలుసుకోడానికి పోలేదు. అక్కడినుంచి నావమీద శ్రావస్తీ (సహేట్ - మహేట్) వెళ్ళాలి. మల్లగ్రామంలో సుదత్తశ్రేష్ఠి మనుష్యులుండేవారు. వారిద్వారా నావలు పొందడం తేలికగా వుండేది. సాంకృత్య బ్రాహ్మణులు తమ కులాచారన్ననుసరించి తమ యింటిముందు ఒక పందిపిల్లను చంపి తమచేతులతోనే వండి బంధుల్‌మల్లుకూ మల్లికకూ ఆ మృదువైన పందిమాంసంతో విందుచేశారు.

---

## 3

శ్రావస్తీ రాజధానిలో కోసలరాజు ప్రసేనజిత్తుడు తన సహాధ్యాయి మిత్రుడగు బంధుల్‌మల్లుకు బ్రహ్మాండమైన స్వాగతం ఇచ్చాడు. తక్షశిలలో చదువుకుంటూన్నప్పుడే 'నేను రాజయినతర్వాత నీవు నాకు సేనాపతి కావలసివుంటుంది' అని ప్రసేనజిత్తుడు తనకోర్కెను బంధుల్‌కి వెల్లడించాడు. రాజయినతర్వాతకూడా యీ విషయంలో చాలాసార్లు వ్రాశాడు. కాని ఆకాలంలో అన్నిటికన్న సంపన్నమయిన కోసల కాశీలాంటి విశాలరాజ్యానికి సర్వసేనాని అయ్యేదానికంటె బంధుల్ తన కుసీనారాలోని ఒక సామాన్యగణానికి ఉపసేనాపతిగా వుండడాన్నే యెక్కువగా వాంఛిస్తూండేవాడు. కాని యిప్పుడు కుసీనారా అతణ్ని తృణీకరించేసింది. యిందువల్ల ప్రసేనజిత్తు ప్రస్తావించినమీదట బంధుల్ ఓషరతుపెట్టాడు—

'నీమాటను నేను అంగీకరిస్తాను మిత్రమా! కాని దీనితోపాటు ఒక షరతు వుంది.'

'ఇంతకంటేనా? సంతోషంగాచెప్పు, మిత్రమా!'

'నేను మల్లపుత్రుణ్ని.'

'అవును నాకు తెలుసు. మల్లులకు విరుద్ధంగా వెళ్ళమని నేను నిన్నెన్నటికీ ఆజ్ఞాపించను.'

'నాకు కావల్సిందంతే.'

'మిత్రమా! మల్లులతో ఎల్లాంటిసంబంధం ఇప్పుడుందో అదే ముందుకూడా స్థిరంగా వుంచుకోవాలని నేను కోరుతున్నాను. నాకు రాజ్యవిస్తరణకాంక్ష లేదని నీకు తెలుసు. ఒకవేళ యేకారణంచేతనైనా నేను మల్లులను వ్యతిరేకించాల్సివస్తే, నీవు నీయిష్టంవచ్చినపక్షం వహించడానికి నీకు స్వతంత్రం వుంటుంది. నా ప్రియ మిత్రునకు నేనింకేమయినా చేయాల్సివుందా!'

'లేదు. మహారాజా! యింతేచాలు.'

---

# 4

ప్రసేనజిత్తునివంటి మెత్తని ఉత్సాహహీనుడైన రాజుకు బంధుల్ మల్లు లాంటి యోగ్యుడగు సేనాధిపతి వుండకపోతే బహుశా మగధులూ, వత్సులూ కోసల రాజ్యభాగాలెన్నిటినో కాజేసి వుండేవారు. శ్రావస్తీకి చేరిన కొంతకాలానికి మల్లికకు గర్భిణీసూచనలు కన్పించాయి. బంధుల్‌మల్లు ఒకరోజున 'ప్రేయసీ! నీకే వస్తువుపైన అయినా కోరిక వుంటేచెప్పు.'

'కోరికవుంది ప్రియా! కాని చాలాదుష్కరం.'

'నాకు దుష్కరం కాజాలదు. మల్లికా ఏమిటది?'

'అభిషేకపుష్కరిణిలో స్నానం.'

'మల్లుల పుష్కరిణిలోనా?'

'కాదు. వైశాలీయందు లిచ్ఛవులయొక్క పుష్కరిణి.'

'నీవు చెప్పినది సరే మల్లికా! నీకోరిక దుష్కరమే. అయినప్పటికీ బంధుల్ మల్లు దాన్ని పూర్తిచేస్తాడు. రథంపై రేపే మనప్రయాణం.'

రెండవరోజున కావల్సిన ఆహారసామగ్రి తీసుకుని ఖడ్గాలూ, ధనస్సులతో ఇద్దరూ రథంమీద ప్రయాణం అయ్యారు.

అనేకవారాలు ప్రయాణంచేసి దూరదూరపు మజిలీలెన్నోదాటి బంధుల్‌రథం వైశాలీలో తన సహపాఠి మహాలి అధ్యక్షుడుగావున్న ద్వారంగుండా ప్రవేశించింది. కొందరు లిచ్ఛవులపై యీ మహాలి ఈర్ష్యాంధుడై వున్నాడు.

మహాలిని ఒకసారి కలుసుకుందామాఅని బంధుల్‌కి వాంఛ కలిగింది, కాని 'కోరిక' చెల్లించే యత్నంలో విఘ్నంవచ్చే ప్రమాదాన్ని గుర్తించి అతడు తన సంకల్పాన్ని విసర్జించాడు. అభిషేక పుష్కరిణీ ఘట్టాలవద్ద పహరావుంది. అక్కడ జీవితంలో ఒక్కసారిమాత్రం ఏ ఒక్క లిచ్ఛవిపుత్రునకోస్నానంచేసే (అభిషేకం పొందే) సౌభాగ్యం కలుగుతోంది. అదయినా అతడు, లిచ్ఛవి గణసంస్థలోని 999 సభ్యస్థానాల్లో ఖాళీపడిన స్థానమునకు ఎన్నుకొనబడినప్పుడు మాత్రమే. రక్షకభటులు అడ్డుపెట్టగా బంధుల్‌మల్లు వారిని కొరడాలతోబాది తరిమేశాడు. మల్లికను స్నానం చేయించి రథం యెక్కించి తక్షణం వైశాలీనుండి బయలుదేరాడు. రక్షకభటులవల్ల సంగతి తెలిసికొని అయిదువందలమంది లిచ్ఛవి రథులు బంధుల్‌ని వెంటాడారు. మహాలి ఇది విని వారిని వారించాడు; కాని అహంకారులైన లిచ్ఛవు లెక్కడ వింటారు? దూరాన్నుండి రథచక్రాలధ్వని విని వెనుకకుచూచి మల్లిక-

'ప్రియా! ఎన్నో రథాలొస్తున్నాయి.'

'అయితే ప్రేయసీ! రథములన్ని వరుసగా ఒకే పంక్తిలోనున్నప్పుడు నాకు చెప్పు.'

మల్లిక అట్లాంటి సమయాన్నిచూచి చెప్పింది. బంధుల్ లాగి ఒక బాణాన్ని తీక్షణంగా వదిలాడనీ, అది అయిదువందల లిచ్ఛవుల నడుము పటకాంలోనుండి దూసుకపోయిందనీ పురాతన చరిత్రకారులంటారు. లిచ్ఛవులు దగ్గిరకొచ్చి పోరాటానికి రమ్మని గద్దించారు. బంధుల్ సరళంగా అన్నాడు.

'నేను మీలాంటి చచ్చినవాళ్ళతో పోరాడను.'

'చూడవయ్యా! మేము చావడం ఏమిటి?'

'నేను రెండోబాణం ఖర్చుచేయను. ప్రియురాండ్రనూ బంధువులనూ ముందు కలుసుకోండి, తరువాత పటకాలు విప్పండి.' అని బంధుల్ మల్లికచేతిలోనుంచి కళ్ళెం తీసేసుకుని, రనిథ్నా వేగంగాతోలి కనుచూపునుండి మాయమైపోయాడు. పటకాలువిప్పినమీదట నిజంగానే అయిదువందల లిచ్ఛవులూ చచ్చి పడిపోయారు.

---

# 5

శ్రావస్తి (నేటి నిర్మానుష్య సహేట్—మహేట్) ఆరోజుల్లో జంబూ ద్వీపానికి చెందిన అన్ని పట్టణాలకన్న పెద్దనగరంగా వుండేది. ప్రసేనజిత్తు రాజ్యంలో శ్రావస్తికాక మరిరెండు మహానగరాలుండేవి. అవేసాకేతమూ (అయోధ్య) వారణాసీ (కాశీ). శ్రావస్తికిచెందిన సుదత్తుడూ (అనాథ-పిండకులు) మృగారుడూ, సాకేతానికిచెందిన అర్జునుడులాంటి ఎందరో కోటీశ్వరులైన షావుకార్లు, కాశీ-కోసల సమ్మిళిత రాజ్యంలో నివసిస్తూండేవారు. వీరి ప్రమాణికుల గుంపులు జంబుద్వీపంలో మాత్రమేకాక త్రామిలిప్తంగుండా, తూర్పుసముద్రంగుండా (బంగాళాఖాతం) భరు కచ్ఛం (భడౌన్స్) సుపారక్ (సోపారా) గుండానూ పశ్చిమసముద్రం (అరబ్బు సముద్రం) ద్వారా దూర దూరాలలోవున్న ద్వీపాలవరకూ వెళ్తుండేవారు. బ్రాహ్మణ సామంతులతోనూ (మహాశాలుర) క్షత్రియసామంతులతోనూ సరిసమానమైన స్థానం వీరిదికాకపోయినా, వీరు సమాజంలో ఉన్నతస్థానం కలిగివుండేవారు. వీరిముందు ధనవిషయంలో సామంతులు తృణప్రాయులు. సుదత్తుడు జేతరాజకుమారుని ఉద్యాన జేతవనాన్ని నాణేలుపరచి కొన్నాడు. గౌతమబుద్ధునికోసం అతక్కడ జేతవన — మఠం నిర్మించారు. మృగారుని పుత్రుడు పుండవర్ధుని ప్రసేనజిత్తు పెండ్లికి స్వయంగా పరివారసైన్య సమేతంగా సాకేతకువెళ్ళి కన్యాదాతయగు అర్జునశ్రేష్ఠికి అతిథిగా వున్నాడు. అర్జునుని పుత్రిక, మృగారుని కోడలూ అయిన విశాఖ తన కంఠహారపు వెలవెచ్చించి వేయిగదులు కలిగిన ఏడంతస్తుల విశాలమఠాన్ని కట్టించింది. దానికి

'పూర్వారామ మృగారమాతా-ప్రసాద' మని నామకరణం చేసింది. దేశదేశాంతరాల ధనం యీ శ్రేష్ఠులదగ్గరికి పిండబడి వచ్చేస్తోంది. ఇక వారి అపారసంపత్తి వేరే అడగాలా ?

జైవలి, ఉద్దాలక, యాజ్ఞవల్క్యులు యజ్ఞవాదానికి గౌణ – ద్వితీయ – స్థాన మిస్తూ, వాస్తవిక ముక్తికొరకు బ్రహ్మవాదపు దృఢ నౌకానిర్మాణంచేసారు. జనకుడు లాంటి రాజులు గొప్ప గొప్ప బహుమతులు ప్రకటించి బ్రహ్మసంబంధమైన శాస్త్రార్థ పరిషత్తులు ఏర్పాటు చేయడం ప్రారంభించారు. వాటివల్ల వేదాలనుమించి వూహించ డానికి మార్గం లభించింది. ఆకాలం ఎట్లాంటిదంటే, దేశంలో స్వతంత్రాలోచన వెల్లువలు లేచాయి. సమాలోచకులు తమతమ అభిప్రాయాలను సామాన్యసభలలో ప్రజలముందు పెట్టేవారు. కొన్నిచోట్ల ఉపదేశం (అపవాదం, సూక్తం)గా యిది రూపం దాల్చేది. మరికొన్నిచోట్ల కొందరు వాదాన్ని ఆహ్వానిస్తూ (సవాల్‌చేస్తూ) ప్రకటన రూపకంగా జంబూ (నేరేడు) శాఖలను పాతుతూ తిరిగేవారు. ప్రవాహణుడు ఏదైఆపితరాల్ని మోసుపుచ్చడానికై బ్రహ్మ-సాక్షాత్కారానికి చాలా ఉపాయాలు తెలిపాడు. వాటిలో, ప్రబ్రజ్యా(సన్యాసం)ధ్యానం, తపస్సు మొదలయినవి వున్నాయి.

ఇప్పుడు ఉపనిషత్ విద్యకుమించిన ఆచార్యులుకూడ తమ స్వతంత్రభావము లతో పాటు ప్రబ్రజ్యా (సన్యాసం) బ్రహ్మచర్యం సపలంవించాలని నొక్కి వక్కాణిస్తున్నారు. అజిత్ కేశకంబల్, సంపూర్ణమైన భౌతికవాది. అతడు భౌతిక పదార్థాలను తప్ప, ఆత్మనుగాని, ఈశ్వరభక్తినిగాని, నిత్యతత్వాన్నిగాని, లేక స్వర్గ-నరక-పునర్జన్మల్నిగాని ఒప్పుకొనిన వాడయినప్పటికీ స్వయంగా తాను గృహ త్యాగియైన బ్రహ్మచారి. ఆకాలంలో అధికారులై వున్న వారి సానుభూతిని పొంద డానికి మాత్రమేకాక, వారి కోపంనుండి తప్పించుకోడానికికూడా, తమ భౌతికవాదానికి మతస్వరూపం యివ్వడం అవసరమయింది. లౌహిత్య బ్రాహ్మణ సామంతులూ, పాయసీవంటి రాజన్య సామంతులూ భౌతికవాదులు. వారి భావాలకారణంగా వారు ప్రజల్లో ఎంత ప్రసిద్ధికెక్కారంటే, భౌతికవాదాన్ని త్యజించడం తమకు సిగ్గుచేటుగా భావించేవారు. అయినప్పటికీ వారి భౌతికవాదం సమాజానికి ప్రమాదకరంగా లేదు.

భౌతిక వాదప్రచారం కనబడుతూనే ఉండేది. కాని బ్రాహ్మణ – క్షత్రియ సామంతుల, యీ కుబేరులైన వ్యాపారుల అధికశ్రద్ధ గౌతమబుద్ధుని అనాత్మవాదం వైపు వుండేది; ముఖ్యంగా కోసలదేశంలో. గౌతముడు కోసలదేశపు అంతర్గత

శాక్యజాతి నివాసి కావడంకూడా దీనికొక కారణం. గౌతముడు భౌతికవాదులవలెనే ఇట్లనేవాడు— 'ఆత్మ, ఈశ్వరుడూ మొదలయిన నిత్యపదార్థాలేమీ విశ్వంలోలేవు. సర్వపదార్థాలూ ఉత్పన్నమయి, శీఘ్రంగా విలీనమై పోతాయి. ప్రపంచం జడపదార్థాల సముచ్ఛయంకాదు. అది ఘటనాప్రవాహం.' బుద్ధిమంతులగు మనుష్యుల కీ భావాలు చాలా యుక్తిసంగతంగానూ మనస్సుకు నాటేట్లుగానూ కనుపడేవి. కాని, ఈలాంటి అనిత్యవాదంవల్ల ప్రజా—కట్టుబాట్లకీ, పేద—భాగ్యవంతులనే భేదానికీ, బానిసలూ—యజమానులూ అనే భేదానికి ముప్పువచ్చే అవకాశం ఉంది. అందుకనే అజిత్ భౌతికవాదం సామంత, వ్యాపారులవర్గంలో సర్వప్రియం కాలేకపోయింది. గౌతమ బుద్ధుడు తన అనాత్మవాదం—భౌతికవాదం—లో మరికొన్ని సంగతుల్నిచేర్చి దాని చెడుగును తీసేశాడు. ఆయనకథన మేమంటే— 'నిత్య ఆత్మ నేదొకటి లేకపోయినా చేతనా—ప్రవాహం స్వర్గంలేక నరకం మొదలయిన లోకాలలోనికి ఒకశరీరం నుండి మరొకశరీరం లోనికి—ఒకశరీర ప్రవాహంనుంచి మరొక శరీర ప్రవాహంలోనికి మారుతూంటుంది.' ఈ అభిప్రాయంలో ప్రవాహణరాజుచేత కనిపెట్టబడిన 'పునర్జన్మ' అనే ఆయుధానికి కూడా తావుంది. గౌతమబుద్ధుడు గనుక శుద్ధభౌతిక వాదాన్నే ప్రచారం చేసియుంటే, శ్రావస్తి, సాకేత, కౌశంబీ, రాజగృహ భద్రికాలకు చెందిన రాజన్యులు నిశ్చయంగా తమ సంచుల్ని గుమ్మరించేవారుకారు. అంతేకాదు, బ్రాహ్మణ క్షత్రియ సామంతులూ, రాజులూ, బుద్ధునిచరణాల్లో తమ శిరస్సుల నుంచేందుకు సాహసించేవారుకారు.

శ్రావస్తికిచెందిన ఉన్నతస్త్రీలకు గౌతమబుద్ధునిమతంలో అత్యంత శ్రద్ధ వుండేది. ప్రసేనజిత్తుని పట్టపురాణి మల్లికాదేవి బౌద్ధమతమందు చాలా ఆసక్తికలది. ఆమె నగరంలోని గొప్ప వ్యాపారస్థుని కోడలూ, ఆమె సఖి విశాఖయూ తమ భక్తి రూపంగా పూర్వారామంలాంటి ఒక గొప్ప మఠాన్ని నిర్మించి బుద్ధునికి దానంచేశారు. సేనాధిపతి బంధుల్ మల్లుని భార్య మల్లిక, పట్టపురాణియైన మల్లికకు చాలాప్రియమైన సఖురాలు. ఆమెచే ప్రేరేపింపబడి మల్లిక బుద్ధుని ఉపదేశాల్లోనికి పోసాగింది. కొంత కాలం తర్వాత పూర్తిగా బుద్ధోపాసిక అయిపోయింది.

మల్లిక గృహం యిప్పుడు బహుజన సమృద్ధంగావుంది. కోసలదేశంలాంటి పెద్దరాజ్యపు సేనాధిపతి గృహం సమృద్ధం కావలసిందేకదా ! మరి ?

మల్లికకు పదిమంది వీరపుత్రులు ఉద్భవించారు. వారంతా రాజసేనయందు ఉన్నతపదవుల్లో వున్నారు; బంధుల్ మల్లు రాజుపైన ఒక యుగంవరకూ తన పలుకు

బిరిని నిలుపుకున్నాడు. ఈ కాలంలోనే అతడికెందరో శత్రువులు తయారయ్యారు. మరొక జనపదానికి చెందినవాడిని యింత ఉన్నతపదవిలో చూడటం వారికిష్టంలేక పోయింది. ఈర్ష్యాపరులు రాజుకు చాడీలుచెప్పడం ఆరంభించారు. అసలే రాజు మందబుద్ధిగలవాడు. 'బంధులమల్లు మహారాజును బుద్ధిహీనుడంటున్నాడు' అని రాజుకు చెప్పి రెచ్చగొట్టేరు. చివరకి సేనాధిపతి రాజ్యాన్ని లాక్కోవాలని చూస్తున్నాడన్నంతవరకూ చెప్పారు. ప్రసేనజిత్తు మనస్సుకీమాటలు బాగా పట్టిపోయాయి. అతడు, బంధులమల్లుకీ తనకీకూడా శత్రువులైన వారి చేతుల్లో ఆడడం మొదలెట్టాడు. బంధులమల్లు ఖిన్నుడై వుండడం చూచి ఒకరోజున మల్లిక:

'ప్రియా! నీవు ఎందుకింత వ్యాకులంగా వున్నావు?'

'రాజు నన్ను సందేహించ నారంభించాడు'.

'అయితే సేనాపతిస్థానాన్ని త్యజించి మనం కుసీనారాకెందుకు వెళ్ళిపోకూడదు? అక్కడ మన జీవనోపాధికి తగినంత వ్యవసాయం మనకు వుంది.'

'దాని అర్థం, రాజును అతని శత్రువులచేతుల్లో వదిలివేయడం అవుతుంది. చూడ్డంలేదూ, మల్లికా! మగధరాజైన అజాతశత్రువు ఎన్నోసార్లు కాశీపైన దాడి చేశాడు. ఒకసారి మనం అతణ్ణి ఖైదీగా పట్టుకున్నాం. మహారాజు ఉదారత చూపిస్తూ, రాజపుత్రి వజ్రాను పెండ్లాడి అతన్ని విడిచేశాడు. కాని అజాతశత్రువు యావజ్జంబూద్వీపానికి చక్రవర్తి కావాలని కోరుకున్నాడు. మల్లికా! అతడు యీ వివాహంలో ఊరుకొనే వాడుకాడు. అతడి గూఢచారులు రాజధానీ నగరం నిండి వున్నారు. అవంతిరాజు అల్లుడు వత్సరాజు ఉదయనుని నడతకూడా సరిగాలేదు. అతడుకూడా సరిహద్దు సన్నాహాలు చేస్తున్నాడు. ఈస్థితిలో శ్రావస్తిని విడిచి పారిపోవడం పిరికితనం అనిపించుకుంటుంది'.

'మిత్రద్రోహం కూడానూ'.

'స్వవిషయంలో నాకేమీ విచారంలేదు మల్లికా! యుద్ధాల్లో యెన్నోసార్లు నేను మృత్యుముఖంలోంచి బయటపడ్డాను. కనుక ఏ సమయంలోనైనా మృత్యువు నన్ను తనపొట్టబెట్టుకోవచ్చు. అదొక పెద్ద సంగతికాదు. ఒక సామాన్యపు పనివాడైన తోటమాలికుమార్తె మల్లిక తన సద్గుణాలకారణంగా ప్రసేనజిత్తుకు పట్టపు

రాణీ అయింది. ఆమె గతించిపోయింది. లేకుంటే రాజుచెవుల్ని ప్రజలు ఇంతపెద్ద మాటలతో నింపగలిగేవారుకారు. ఒకరోజున రాజు సరిహద్దులో తిరుగుబాటని చెప్పి బంధుల్‌మల్లు పుత్రుల్నక్కడికి పంపేశాడు. వారక్కడ సఫలీకృతులై తిరిగి వస్తూన్నప్పుడు వారికెదురుగానే బంధుల్‌మల్లును మోసంచేసి పంపాడు. ఈ విధంగా తండ్రీ పదిమంది పుత్రులూ ఒకేచోట హతులైనారు. ఈ సంఘటనకు సంబంధించిన ఉత్తరం మల్లికకుచేరిన సమయానికి ఆమె బుద్ధునికీ ఆయన భిక్షుసంఘానికీ విందు చేయడానికి వెళ్తూంది. యువతులగు ఆమె పదుగురు కోడండ్రూ చాలాప్రేమతో అనేకరకాలయిన పిండివంటలు తయారుచేశారు. మల్లిక ఉత్తరం చదువుకుంది. ఆమెహృదయంలో భగ్గున నిప్పంటుకొంది. కాని ఆసమయంలో కంటతడిబెట్టలేదు. సరికదా ముఖంతో మాలిన్యచిహ్నాల నయినా రానివ్వనంతగా ఆమెతన్ను తాను వశంలో వుంచుకుంది. పుత్తరాన్ని కొంగునకు ముడివేసుకొని ఆమె యావత్సంఘానికి భోజనాలుపెట్టించింది. భోజనానంతరం బుద్ధుని వుపదేశం శ్రద్ధతోవింది. అప్పుడు ఎవరికి వుత్తరం చదివి వినిపించింది. బంధుల్ కుటుంబంపైన పిడుగుపడిపోయింది. మల్లికకు తగినంత ధైర్యవుంది. కాని వింతంపవులు అయిపోయిన ఆ యువతులను ఓదార్చడం బుద్ధుడికి కూడా కష్టతరమైంది.

ప్రసేనజిత్తుకు నిజం నిలకడమీద తెలిసింది. అతనికి చాలా దుఃఖంకలిగింది. కాని అప్పుడు ఏమిచేయడానికి సాధ్యం? ప్రసేనజిత్తు తన మనశ్శాంతికోసం బంధుల్ మేనల్లుడయిన దీర్ఘకారాయణుణ్ని తనసేనాపతిగా చేసుకొన్నాడు.

——

# 6

అది చలికాలం. కపిలవస్తుకు చుట్టుప్రక్కల పొలాలు సస్యశ్యామలంగా వున్నాయి. గోధుమలూ, యవలూ, పుష్పించి పసుపుపచ్చగా వున్న ఆవాలచేలు కనులపండువుగా వున్నాయి. నేడు నగరం చక్కగా అలంకరింపబడి అంతటా తోరణాలతో కలకలలాడుతోంది. ప్రజాతంత్రభవనం ప్రత్యేకంగా తీర్చిదిద్దబడింది. మూడురోజులు రెక్కలుముక్కలయ్యేట్లు కష్టపడ్డ తర్వాత నేడు కొంచెం నడుంవాల్చ

డానికి అవకాశంపొంది కొందరు బానిసలు ఏవో ఒక ఇంటిమూలలో కూర్చుని వున్నారు. కాక్ అనేవా డన్నాడు—

'మన బానిసలదికూడా ఒక బ్రతుకేనా? మనుష్యులయి పుట్టేదానికి బసులు గొడ్లయి పుట్టివుంటే బాగుండేది. అప్పుడు మనకి మనుష్యునికుండేజ్ఞానం లేకుండా వుండేది'.

'బాగాచెప్పావు కాకూ! నిన్న నాయజమాని దండపాణి ఇనుపముక్క కాలేసి నా భార్యకు వాతపెట్టాడు'.

'ఎందుకు రాకా?'

'ఎందుకని వీరినడిగేదెవడు? వీరు బానిసల యొక్క పతిపత్నీ సంబంధాన్ని కూడా మన్నించరు. పైగా యీ దండపాణి తను జైనుడని చెప్పుకుంటాడు. జైనులు నేలపై వుండేపురుగుల్ని ఒత్తిగించడానికని తమవద్ద నెమలి కుంచలను ఉంచు కుంటారు. ఎన్నాళ్ళగానో తీవ్రరోగంచేత పీడింపబడుతూన్న నాబిడ్డ వళ్ళు తెలియ కుండా ఉన్నస్థితినిగూర్చి నాకు కబురుచెప్పడానికి నా భార్య నా వద్దకురావడమే ఆమెచేసిన మహాపరాధం. చివరికి నాబిడ్డ బ్రతకనూలేదు. చచ్చిపోవడంకూడా మంచిదే అయిందిలే. లేకపోతే మనలాగే అదికూడా జీవితం గడపాల్సివచ్చేది. నిజంకాకూ! దాసులమైన మనకు జీవితమనేదే ఒకటిలేదు. ఇంతేకాదు, యీ ఆనంద కోలాహలం అయిపోయిన వెంటనే నా భార్యను తను అమ్మేస్తానని మా కసాయి వాడు – నా యజమాని అంటున్నాడు'.

'అయితే ఆ కసాయిదండపాణికి ఇనుంలో కాల్చివాతపెట్టినా కూడా యింకా తృప్తికలగలేదా?'

'లేదన్నా! పన్నెండుసంవత్సరాలు పోయాక ఆపిల్లనమ్మి యాభైనాణాలు పొందివుండేవాణ్ణి అంటున్నాడాయన. మేము కావాలని అతని యాభైనాణాలూ నాశనంచేసినట్లుగా మాట్లాడుతున్నాడు'.

'అంటే బానిసలమైన మనకు తలిదండ్రులకుండే హృదయంలేదని'.

ముదుసలైన ఒక మూడవబానిస 'యీస్వాగతాట్టహాసం కూడా ఒక దాసీ పుత్రుని కొరకే.'

'ఎవడు తాతా?'

'వీడే! యీ కోసలరాజకుమారుడైన విదృథభుడు'.

'దాసీపుత్రుడా?'

'ఆ. మహానామశాక్యుని ఆ ముసలిదాసీ దాన్నెరుగవూ? మనలాగు నల్లగా వుండదు. ఏ శాక్యుని వీర్యానికో పుట్టివుంటుంది'.

'మరి దాసీలలో ఆమెకేం లోపం తాతా?'

'అవును, ఆదాసీకే మహానామ అనే ఒక కూతురుపుట్టింది. చాలా తెల్లగా చాలా సౌందర్యంగా, చూడ్డానికి శాక్యాణివలె ఉండేది'.

'ఎందుకుండదు? సౌందర్యవతులగు ఆడపిల్లల్ని – వాళ్ళు దాసీపుత్రికలయినా సరే, యజమానులు బహు అనురాగంతో పెంచి పోషిస్తారు.

'కోసలరాజు ప్రసేనజిత్తు ఎవరో ఒక శాక్యకుమారిని పెండ్లాడకోరాడు, కాని శాక్యుడెవడూ తనకన్యను ఇవ్వడానికి సిద్ధపడలేదు. శాక్యులు తాము మూడులోకాల్లోకల్లా పవిత్రకులంవారమని తలుస్తారుకదూ! కాని స్పష్టంగా తిరస్కరిస్తే కోసలరాజు శాక్యజాతిపైన కుపితుడై యుండేవాడు. ఇందుకనే మహానాముడు తన యీ దాసీ పుత్రికనే శాక్యకుమారియని చెప్పి ప్రసేనజిత్తుకిచ్చేశాడు. ఆ పిల్ల వార్షభ క్షత్రియారు పుట్టినకొడుకే యీ విడూడభరాజకుమారుడు'.

'కాని, ఇప్పుడు వీడుకూడా శాక్యులలాగే మన రక్తపిపాసి.'

దాజాలు ప్రారంభం అయ్యాయి. లోలోపల దాసీపుత్రుడని అందరూ అతడి నసహ్యించుకుంటున్నప్పటికీ శాక్యులు కోసలరాకుమారునికి స్వాగతంయిచ్చి ప్రజాతంత్ర భవనానికి మహావైభవంగా ఆహ్వానించుకొచ్చారు.

విడూడభుడు తనమేనమామ వంశంవారి స్వాగతం అందుకొని మాతామహుడగు మహానాముని ఆశీర్వాదాలుపొంది పరమానందంగా కపిలవస్తు నుండి శలవు తీసుకున్నాడు. దాసీపుత్రుని పాదాలవల్ల ప్రజాతంత్రభవనం అపవిత్రమైపోయింది. అందుకని దాన్ని శుద్ధిపరచడం అవసరం. ఎందరో దాసదాసీలు పీఠాల్ని ధూళి లేకుండా శుభ్రపరచడంలో నిమగ్నులైవున్నారు. ఒక అధికప్రసంగియైన దాసీది పీఠాల్ని శుభ్రంచేస్తూ, దాసీపుత్రుడైన విడూడభుణ్ణి దుమ్మెత్తిపోస్తోంది. విడూడభుని సైన్యంలోని ఒకడు ప్రజాతంత్రభవనంలో తనబల్లాన్ని మరచివచ్చి తీసుకొనేటప్పుడు దాసీవానితిట్లను శ్రద్ధగావిన్నాడు. మెల్లిమెల్లిగా ఈ సంగతిసందర్భాల జాడంతా

విడూడభునికి తెలిసింది. కపిలవస్తులో శాక్య లనేవాళ్ళు లేకుండా తుడిచివెయ్యాలని అతడు సంకల్పించుకొన్నాడు. దీన్నికొంతకాలానికి అతడు చేసిచూపాడు. తనను ఒక దాసీగర్భాన పుట్టించినందుకు అతడి క్రోధానికి రెండవగురి ప్రసేనజిత్తు దయ్యాడు.

దీర్ఘకారాయణుడు తన మేనమామ, మేనమామ కుమారుల హత్యల్ని మరువ లేక పోయాడు. అక్కడ ముసలితనంలో తనయావత్తు పొరబాట్లకీ పశ్చాత్తాపపడుతూ ప్రసేనజిత్తు అత్యంత విశ్వాసం, మృదుత్వం చూపాలని కోరుతున్నాడు. ఒకరోజున మధ్యాహ్న భోజనానంతరం అతడికి బుద్ధునిసంగతి జ్ఞాపకంవచ్చింది. కొద్దియోజనాల్లో ఏదోఒక శాక్యగ్రామంలో విడిసి వున్నాడని విని, కారాయణుణ్నీ యింకా కొందరు సైనికుల్నీ వెంటబెట్టుకొని బయలుదేరాడు. అతడు బుద్ధ నివాస గృహంలో ప్రవేశిస్తున్నప్పుడు ముకుటం, ఖడ్గం ఆదిగాగల రాజచిహ్నాలను కారాయణుని చేతికిచ్చేశాడు. కారాయణుడు యిదివరకే విడూడభునితో చేరివున్నాడు. అతడు పట్టపురాణిని అక్కడ వదిలేసి, విడూడభుణ్ని రాజుగాప్రకటించి శ్రావస్తీకి దారిపుచ్చుకున్నాడు.

ఎంతోసేపటివరకూ ఉపదేశంవిని ప్రసేనజిత్తు బయటికొచ్చేసరికి రాణి విలపించి విలపించి సంగతంతా తెలిపింది. అక్కడనుంచి ప్రసేనజిత్తు తన మేనల్లుడు మగధరాజుకు అజాతశత్రునుంచి సహాయం పొందనుద్దేశించి రాజగృహంవైపు బయలుదేరాడు. వృద్ధాప్యంలో ఎన్నోవారాలు కాలినడకను ప్రయాణం చేయడంవల్ల అతని శరీరం శిథిలమైపోయింది, సాయంకాలం రాజగృహం చేరేటప్పటికే నగర ద్వారం బందైపోయింది. ద్వారంబయట ఆరాత్రి ఒక కుటీరంలో ప్రసేనజిత్తు చనిపోయాడు. రాణి విలాపంవిని ప్రొద్దున్న అజాతశత్రూ, వజ్రా పరుగున వచ్చారు. కాని ఆ కట్టని అట్టహాసంతో కాల్చడంతప్ప యిక వారు చేయగలిగేదేమున్నది ?

బంధుర్ హత్యకిది ప్రత్యామ్నాయం. దాసత్వ దుష్కర్మలకిది పరిణామం.*

---

* ఇది నేటికి నూరుతరాలకు వెనుకటి చరిత్రాత్మక కథ. ఆనాటికే సామాజిక కష్టాలు చాలా హెచ్చిపోయాయి. ధనిక వ్యాపారవర్గం సమాజంలో ఒక గొప్ప స్థానాన్ని చేబట్టింది. పరలోకానికి దారిచూపేవాళ్ళూ నరకంనుండి ఉద్ధరించేవాళ్ళూ, ఎందరో మార్గదర్శకు లుద్భవించారు. కాని గ్రామగ్రామాన దాసత్వనరకం వెలిగి పోతూండడం చూచికూడా అందరికండ్లూ మూతపడివున్నాయి.

# "నాగదత్తుడు"

## (పదియవ కథ)

[దేశం - ఉత్తరహిందూస్థానం; కాలం - క్రీస్తుకు 335 సంవత్సరాలకు పూర్వం.]

'ఔచిత్యాన్ని మనం కొంచెం లక్ష్యపెట్టాలి, విష్ణుగుప్తా! మనుష్యులం గనుక మనకు కొన్ని కర్తవ్యాలున్నాయి. ఇందువల్ల మనం ఔచిత్యాన్ని జ్ఞాపకం వుంచుకోవాలి.'

'కర్తవ్యం మతమేకదా?'

'నేను మతాన్ని మోసమని తలుస్తాను. మతం కేవలం పరధనాన్ని అపహరించేవాళ్ళకు, శాంతితో పరధనాన్ని భోగించడానికి అవకాశాన్నివ్వడానికి మాత్రమే. మతం ఎప్పుడైనా పేదల్నీ, బలహీనుల్నీ స్మరించిందా? మతాన్ని ఒప్పుకోని జాతి ప్రపంచం మొత్తంమీద ఒకటీలేదు. కాని మతం ఎప్పుడైనా దాసులు కూడా మానవులని తలచిందా? దాసులసంగతి అటుంచి, దాసులుకాని స్త్రీల సంగతో- మతం వారికి ఎప్పుడైనా న్యాయంచేసిందా? డబ్బుకావాలీ అంటే, నీవు యిద్దరూ, ముగ్గురూ, పదుగురూ, వందమంది స్త్రీలనుకూడా వివాహితలుగా చెయ్యొచ్చు. వారు దాసీలకన్న ఏవిధంగానూ మంచిస్థితిలో వుండరు. మతం దీన్ని ఒప్పుకొంటుంది. నా ఔచిత్యఅర్థం మతరూపేణా ఔచిత్యంకాదు, మీదుమిక్కిలి స్వస్థ మానవుని మనస్సు ఉచితమని తలచే ఔచిత్యం సంగతి నేను చెపుతున్నది.'

'అయితే, యేది అవసరమో అదే ఉచితమని నేనంటాను.'

'అప్పుడు ఔచిత్యాలకు భేదమే లేకుండా పోతుంది.'

'భేదం ఉంటుంది మిత్రమా! అవసరానికి అర్థం నేను ఏ ఒక్కనికో అవసరం అయ్యేదాన్ని తీసుకోను.'

'కొంచెం విప్పిచెప్పు విష్ణుగుప్తా!'

'మన తక్షశిలా - గంధారాన్ని తీసుకో. మనకి మన స్వతంత్రం యెంత ప్రియమూ, ఉచితమూ అయినప్పటికీ యిది ఒక పెద్దశత్రువుని ఎదిరించలేనంత చిన్నదేశం. మద్రులూ, పశ్చిమగంధారులవంటి చిన్నచిన్న జాతులు మనకు పొరుగు వారుగా వున్నంతవరకూ సుఖంగా వున్నాం. అప్పుడప్పుడు పోరాటాలు జరుగు తూండినా దాని పరిణామం కొద్దిమంది వ్యక్తులు బలి అవడంమాత్రంగానే వుండేది. మన స్వాతంత్రాపహరణం మట్టుకు జరగలేదు. ఎందువల్లనంటే తక్షశిలలోని కష్ట తరమైన అహారాన్ని జీర్ణంచేసుకోవడము ఎవరికీ సులభసాధ్యంగాలేదు. కాని పార్శ్వులు (ఈరానీయులు) మన పడమటిపొరుగువారు కాగానే మన స్వాతంత్ర్యం వారి కృపాకటాక్షలపై ఆధారపడిపోయింది. మన స్వాతంత్ర్యానికి మనం పార్శ్వు లంత బలవంతులంకావాలి.'

'బలవంతులం కావడానికి ఏమిచెయ్యాలి?'

'చిన్న జాతివల్ల పనిజరుగదు. చిన్నచిన్న జాతులకుబదులు మనం విశాల రాజ్యం స్థాపించాలి.'

'ఆ విశాలరాజ్యంలో చిన్నచిన్న జాతుల కెలాంటి స్థానముంటుంది?'

'ఆత్మీయత అనే భావం.'

'యిది చాలా అస్పష్టమైన శబ్దం విష్ణుగుప్తా! దాసుడెప్పుడైనా యజమాని దగ్గర ఆత్మీయతను కలిగివుండగలడా!'

'అయితే మిత్రమా నాగదత్తా! ఆత్మీయత పొందడమనేది ఇష్టంపైనా అభిప్రాయంపైనా ఆధారపడియుండదు. అది ఆధారపడేది అర్హతపైన; తక్షశిలా గంధారులో అర్హతవుంటే, అది ఆ విశాలరాజ్యంలో ఉన్నతస్థానాన్ని పొందుతుంది లేకపోతే సామాన్య స్థానమే.'

'దానిస స్థానమా?'

'మిత్రమా! పశ్చిమగంధారుకు దరయస్ రాజ్యంలో లభించిన దానికంటే, యీ దానిస స్థానం ఎంతో మంచిదిగా వుంటుంది. పోనీ నా ఆలోచనసంగతి అలా

ఉంచి, మన జాతి అస్తిత్వాన్ని ఒక చిన్న జాతిగా స్థిరంగా వుంచుకోలేమన్నది నిశ్చయమైనప్పుడు, మన స్వాతంత్ర్యాన్ని స్థాపించుకోవడానికి మనం ఏంచెయ్యాలో నీవే చెప్పు.'

'విష్ణుగుప్తా! మనం స్వజాతి స్వాతంత్ర్యాన్ని స్థిరపరచుకోవాలి. ఏ రాజుకీ అధీనులం కారాదు. మనం ఒక చిన్న జాతిగా, మన స్వాతంత్ర్యాన్ని నిలుపుకో లేమనీ అందువల్ల మనం సంపూర్ణంగా ఉత్తరాపథంలోని (పంజాబు) జాతుల్ని కలిపి ఒక సంఘంగా సంఘటిత పరచాలనీ ఒప్పుకుంటాను.'

'ఆ సంఘంలో, ప్రతిజాతి స్వతంత్రంగా వుంటుందా లేక ఆ సంఘమే అన్నిటిపైనా వుంటుందా?'

'ఏవిధంగా వ్యక్తులకంటె రాజ్యం గొప్పదని అంగీకరిస్తామో అదేవిధంగా గంధార్, మద్ర, మల్ల, శివి మొదలుగాగల జాతులన్నింటిపైనా సంఘాన్ని ఒప్పు కోవాలి.'

'దీన్నెట్లా ఒప్పించడం? ఇంతకీ జాతిని బయటి శత్రువులనుండి రక్షించ డానికైనా మనం సేన నుంచుకోవాలిగదా! దానికి పన్ను పుచ్చుకోక తప్పదు.'

'ఏవిధంగాఅయితే మనం రాజ్యంలోని ప్రజలచేత చేయిస్తున్నామో అదే విధంగా సంఘంలోని జాతులచేత చేయించగలుగుతాం.'

'జాతి లోపల ఆదినుండీ వస్తున్న మన ఒకే సమూహం, రక్తసంబంధంవున్న ఒకే పరివారమూ వుంది. అనాదికాలంనుంచీ ఈ పరివారానికి జాతి-నియమాలను పాటించే అలవాట్లు ఏర్పడివున్నాయి. మరి యీ జాతులతోకూడిన సంఘం ఒక నూతనమైందిగా వుంటుంది. యిక్కడ రక్తసంబంధం లేకపోగా మీదుమిక్కిలి రక్తవైరుధ్యం, ప్రతిద్వంద్వతా అనాదికాలాన్నుంచీ వస్తున్నాయి. అట్లాంటప్పుడు ఎట్లా మనం సంఘనియమాల్ని పాటించేటట్లు చేయగలం? మిత్రమా! దీనివిషయంలో నీవు ఆచరణీయ దృష్టితో ఆలోచించివుంటే, అట్లాంటి సంఘస్థాపన కనుకూలంగా చెప్పివుండవు. ఒప్పించడానికి బలవంతపెట్టిననాడే జాతులు సంఘంమాట వింటాయి. అలా బలవంతపెట్టే శక్తి ఎక్కడనుంచి వస్తుంది?'

'లోనుంచే. అట్లాంటి శక్తిని మనం సృష్టించాలని నేను భావిస్తున్నాను.'

'మనలోనే శక్తి పుట్టివుంటే మంచిదే, కాని పెర్షియనుల దెబ్బల్ని అనేకసార్లు సహించి, అది లోపలనుండి సృష్టించబడజాలదని మనం చూచాం. ఇందువల్ల పీలైన విధంగా మనం దాన్ని సృష్టించాలి.'

'రాజత్వాన్ని స్వీకరించియైనాసరేనా?'

'తక్షశిలకు మాత్రమేకాదు. తక్షశిల, గాంధారము మొదలైన జనపదములకు రాజు — చక్రవర్తి అనికూడ ఒప్పుకోవలసినా అభ్యంతరంలేదు.'

'అలాగైతే మనం పర్షియారాజు డరయస్‌నే ఎందుకు మన పాలకునిగా అంగీకరించకూడదు?'

'అతడు పరాయిజాతివాడు. మనం భారతీయులం.'

'అలాగైతే నందుడో?'

'మనంగనుక ఉత్తరసంస్థానాలనన్నింటిని ఒక సమాఖ్యగా ఏర్పరచలేకపోతే మనం నందుని పరిపాలనను నిరాకరించరాదు. పడమర గాంధారుడైన డెరయస్‌చేత పరిపాలించబడటమా లేక స్వజాతీయుడైన భారతీయుని ఏకాధిపత్యంక్రింద వుండటమా? ఏది మంచిది?'

'ఓ విష్ణుగుప్తా! నిరంకుశప్రభువు పాలించిన దేశాన్ని నేనుచూడలేదు. అక్కడ సామాన్యజనులు కేవలం బానిసలేనని నీకు తెలియగలదు. రాజుచే పరిపాలింపబడుచున్న పశ్చిమగాంధారం తప్ప నేను మరి ఏ దేశంలోను కాలుపెట్టలేదని ఒప్పుకుంటా. అనేక దేశాలను చూడాలని నా హృదయం పరితపిస్తోంది. ఇంటిలో గుడిపాములా వుండుటకంటె నా చదువు పూర్తి అయినతరువాత పర్యటన చేయాలని కోరుతున్నా. ఇందువల్ల అవమానకరమైన పరదేశీయుల బానిసత్వాన్నుంచి బయటపడాలంటే మనలోగల చిన్నచిన్న విభేదాలను మనం విస్మరించాలనే నా దృఢవిశ్వాసం మారదు. సైరస్, డరయస్‌లు ఏ యుక్తిచే విజయాన్ని సాధించారో అదే మనం అనుసరించాలి.'

'వాళ్ళు ఎంతవరకు విజయులయ్యారో దగ్గరకువెళ్ళి చూడాలి.'

'దగ్గరకువెళ్ళా!'

'అవును. తూర్పున మగధవరకువెళ్ళా. నందుని రాజ్యాన్ని చూచా. మన పశ్చిమగాంధారంతో పోలిస్తే అది ఒక యమపురి. అది నిశ్చయంగా బలవత్తర మైనదే! బీదప్రజల్ని అణచివేయటంలో మాత్రమే. రైతులు, శ్రామికులు, బానిసలు మొదలగువారి బాధలు వర్ణనాతీతం.'

'ఇదంతా నందుని రాజ్యంలో ఆత్మస్వాతంత్ర్యం స్వతంత్రపిపాస గలిగిన తక్షశిలవంటి ప్రదేశం లేకపోవడమువల్ల నే.'

'ఆ. కాదు. విష్ణుగుప్తా! లిచ్ఛవిప్రజాస్వామ్యం. మన గాంధారంకంటె యుద్ధాన్ని ప్రేమిస్తుంది. అయినా వైశాలి మగధకు బానిసరాజ్యం. లిచ్ఛవులు వారి యజమానులకు వేటకుక్కలలాంటివారు. వైశాలికి వెళ్ళిచూడు అంతా విధ్వంసన. జనసంఖ్య ఒకటిన్నర శతాబ్దములక్రితం ఉన్నదాంట్లో నేడు మూడవవంతు మాత్రమే! అనేకవందల సంవత్సరాల ఫలితంగా నిర్మింపబడిన స్వతంత్రం, ఆత్మగౌరవం నేడు మగధరాజుకు సైనికులను సమీకరించుటకే! ఎక్కడైనా ఒక దేశప్రజలు సామ్రాజ్యపు దంష్ట్రిలలో చిక్కుకుంటే వారు విడివడుట అసాధ్యం.'

'మిత్రమా! నాగదత్తా! ఒకప్పుడు నేనుకూడా నీలాగే అనుకునేవాడిని. కాని చిన్న రాజ్యాలరోజులు గడచిపోయాయి. ఒక పెద్ద ప్రజాస్వామ్యాన్ని లేక సమాఖ్యను నిర్మించుట ఒక కలయే అని గుర్తించా! అందువల్ల కాలానికే నేను లొంగి పోతా. కాని నీవు పశ్చిమానికి ప్రయాణసన్నాహాలు చేస్తున్నావన్నమాటేనా?'

'ఆ! మొదట పెర్షియనుల దేశాన్ని, తరువాత వీరైతే గ్రీకు రిపబ్లిక్‌ను చూడాలి. దరయస్ చక్రవర్తియొక్క, అతని వంశీకుల ఆశల్ని వారు ఏవిధంగా విచ్ఛిన్నం చేయగలిగారో స్వయంగా తెలుసుకోవలెనని కోరుతున్నా.'

'మిత్రమా! నేనుకూడా వెడుతున్నాను. తూర్పుదేశాలలో సంచరించి భారత దేశాన్ని సమైక్యపరచేశక్తి మగధకు ఉన్నదేమో నన్నుకూడా తెలుసుకోనివ్వు. మన చదువులు ముగిసినతరువాత మనమీ పనిచెయ్యాలి. నీవలె విద్యాభ్యాసంతోపాటు వైద్యాన్ని నేను నేర్చుకోలేదని విచారిస్తున్నాను.'

'కాని నీవు లాభదాయకమైన జ్యోతిషం, అదృష్టజాతకంవంటి విచిత్ర విద్యలు నేర్చుకున్నావు.'

'అవి కేవలం చిట్కాలు మాత్రమే అని నాకు బాగా తెల్సు.'

'సత్యాసత్యాలతో విష్ణుగుప్తచక్రవర్తికి సంబంధమేముంది? నాకంటావా ఏది అవసరమో అది న్యాయము.'

నాగదత్ కపయుడు, విష్ణుగుప్తచాణక్యుడు వారి విద్యాభ్యాస కాలాన్ని ముగించి వచ్చారు. తక్షశిలవాసులై చిన్నతనంనుంచి కలసిమెలసి తిరిగిన వీరి ఆఖరు సంభాషణ యిది. అనేక పెర్షియనుల దాడులకు గురియైన తమ తక్షశిల స్వాతంత్ర్య రక్షణకొరకు ఎవరికిలోచిసరీతిని ఎవరి ఆశయముల కనుగుణముగా వారు బయల్దేరారు.

---

## 2

అన్నివైపులా చిన్నచిన్న పర్వతాలున్నాయి. కళ్ల చిల్లులుపడేటట్లు చూచినా వాటిపై చెట్టుచేమలు లేనందువల్ల పచ్చదనమే కనిపించదు. వాటిమధ్య సన్నని లోయలున్నాయి. వాటిలో సెలయేళ్ళు, పచ్చిక ఉండవచ్చును. ఈలోయ యెడారి మార్గంతో కలసిపోతుంది. ప్రయాణీకులు తరచు పోతూనేఉంటారు. వారు తమ జంతువులతో మజిలీచేయడానికి విశ్రాంతిగృహాలు నిర్మింపబడి ఉన్నాయి. పరిసరము లనుబట్టి చూస్తే అంత సౌఖ్యమూ, అన్ని సౌకర్యాలు ఆ ఎడారిలోని వసతిగృహాల్లో ఏవిధంగా కలుగజేయబడ్డాయో దురూహ్యంగా వుంది. మకాంలలో ఈ విశ్రాంతి గృహాలు అనేకరకాలు – కొన్ని ప్రభుత్వ ఉద్యోగులకు లేక సైనికులకు, కొన్ని వర్తకులకు ఉన్నాయి. ఇవిగాక ప్రతి ఒక మజిలీలో రాజు, అతని అనునాయులు విడిది చేయటానికి ఒక రాజభవనం నిర్మించబడింది. ఈరోజున యీ మకాంలోని రాజభవనంలో ఎవరో విడిసిఉన్నారు. గుర్రపుసాలలో గుర్రాలను, ఆరుబయట

సేవకుల్ని చూడవచ్చును. అందరిముఖాలు వాలిపోయివున్నాయి. అక్కడవారంతా మౌనందాల్చి వున్నారు.

గుమ్మంలోనుంచి బయటకువచ్చి విశ్రాంతిగృహాలవైపు ఆతృతతో ముగ్గురు ఉద్యోగస్థులు ప్రవేశించారు. వారి విలువైన దుస్తులు ఆకర్షణీయమైన ఆకృతులు చూచి అక్కడి బాటసారులు గౌరవసూచకంగా ప్రక్కకు తొలగి నిలబడ్డారు. అక్కడ ఎవరైనా వైద్యులు వున్నారేమోనని వాళ్ళు తెలుసుకొనగోరారు. చివరకు వారు అక్కడ ఒక హిందూవైద్యుడు వున్నాడని తెలుసుకున్నారు. అక్కడ వర్షములు చాలాతక్కువ అయినా వర్షఋతువు గడచిపోయి చాలారోజులైంది.

ద్రాక్ష, యాపిల్సు, ఖర్బూజా మొదలైనవి అక్కడ చాలా చౌక. అవి ఆ సత్రంలో అమ్మకానికి దొరుకుతాయి. వారిలో ఒక ఉద్యోగి ఆ వైద్యునితో ముఖాముఖిని తటస్థపడేసరికి పెద్ద ఖర్బూజాను ముక్కలుచేసి అతడు తింటున్నాడు. అతని చుట్టు ముష్టివాళ్ళవలె చిరిగినబట్టలు ధరించి అనేకమంది ప్రెషియనులు కూర్చొని తింటున్నారు. ఆ ఉద్యోగిని చూడగానే వాళ్ళు భయంతో ఒకగంతువేసి నాలుగు వైపులకూ చెదరిపోయారు. అందులో ఎవరో ఒకరు మధ్యన నిలిచివున్న మనిషిని చూపిస్తూ —

'అయ్యా ! ఈయనే హిందూవైద్యుడు.'

అసహ్యంతో ముందుగా కర్మచారి అతని మురికిబట్టలవైపు దృష్టిని ప్రసరించి తరువాత మనిషిని చూచాడు. అట్టి చిరుగుబట్టలు ధరించేవాని ముఖం ఉండవలసిన రీతిగా అతడు తోచలేదు. అతని ముఖంలో భయభక్తులు కానరాలేదు. అతనికళ్ళలో ఏదో కాంతిఉంది. అందువల్ల ఉద్యోగివైఖరి మారిపోయింది. కొంత గౌరవాన్ని ప్రదర్శిస్తూ : 'నీవు వైద్యుడవా ?'

'ఔను.'

'ఎక్కడనుంచి —'

'తక్షశిల.'

తక్షశిలపేరువినగానే ఆ ఉద్యోగి మరింత గౌరవభావాన్ని పెంపొందించుకొని 'అక్సియానా, సాగ్డియానా రాష్ట్రములరాజగు సత్రప్ భార్యకు చాలా జబ్బుగావుంది. ఆమె ఒక రాజాధిరాజుచెల్లెలు. ఆమెకు ఏమైనా వైద్యం చేయగలవా ?'

'నేను వైద్యుణ్ణికదా। ఎందుకు చెయ్యలేను?

'అబ్బ। నీబట్టలు ఎంత అసహ్యంగావున్నాయి।'

'వైద్యంచేసేది నేనుకాని నా బట్టలుకాదు.'

'కాని అవి చాలా మురికిగా వున్నాయి.'

'నేను వాటిని యివాళ మార్చబోతున్నా, ఒక నిమిషం ఆగండి' అంటూ ఆతడు కొంచెం సంభ్రమముగావున్న ఉన్నబట్టలు తొడుక్కొని అనేకమందులు కుక్కిన తోలు సంచితో ఆ ఉద్యోగి వెంబడి బయలుదేరాడు.

ఆ రాజభవనం ఒక విశ్రాంతిగృహం. అక్కడ గాపిదలబద్దెలు, ముష్టివాళ్ళ బిచానాలు వుండవు. ఆవరణమంతా పరిశుభ్రంగా వుంది. మేడమెట్లపై రంగు రంగుల చేతిపనులతో అలరారే తివాసీలు పరచబడ్డాయి. ప్రతి గదిలోనూ నేలపై విలువగల తివాసీలు పరచబడ్డాయి. మెత్తని సిల్కు తెరలు గుమ్మములకు తగిలించబడ్డాయి. ద్వారములవద్ద అందమైన స్త్రీలు చలనరహితంగా పాలరాతి శిలావిగ్రహముల వలె నిలిచివున్నారు.

ఆ ఉద్యోగి గదిగుమ్మందగ్గరకు వచ్చి వైద్యుని కొలదిసేపు నిరీక్షించమని సౌంజ్ఞచేసి, ఆ గుమ్మంలో వేచియున్న యువతిచెవిలో ఏదో వూదాడు. ఆమె చడీ చప్పుడు లేకుండా తలుపు తెరిచింది. వ్రేలాడుతున్న తెరగుండా లోపలిదేమీ కనిపించదు. ఆయువతి లోపలనుంచి రెండు నిమిషాల్లో తిరిగివచ్చి, వైద్యుని లోపలకు పిలిచింది. గదిలో ప్రవేశించగానే ఆతడు గదంతా సువాసనతోకూడి వున్నట్లు గ్రహించాడు. తరువాత గదంతా ఒకసారి కలయచూశాడు. ఆ గదిని అలంకరించుటలో అత్యద్భుతాన్ని ప్రదర్శించారు. తివాసీలు, తెరలు, సోఫాలు, లాంతరులు, చిత్రలేఖనల విగ్రహాలు, అన్నీ అతడు కనివిని ఎరుగనంత ఔన్నత్యాన్ని ప్రదర్శిస్తున్నాయి. అతనికి ఎదురుగా గోడను ఆనుకొని ఒక మంచముంది. దానిపై రెండు, మూడు తలగడాలున్నాయి. వాటిని ఆనుకొని ఒక పురుషుడు కూర్చున్నాడు. నడివయస్సులో నున్న ఆతని మీసములు మెలిపెట్టబడి కర్ణములను తాకుతూ అక్కడక్కడ తెల్లబారివున్నాయి. ఆతని ముఖంచూస్తే విశ్రాంతి, నిద్ర లేక ఏదో పరితాపం చెందుతున్నట్లుగా తోస్తున్నది.

అతని ప్రక్కన అనన్య సౌందర్యవతి అయిన ఒక యువతి కూర్చొనివుంది. ఆమె శరీరం వెన్నకంటె తెలుపురంగులో వుంది. అంతకంటెనూ మృదువుగాను, స్వచ్ఛంగాను ఉండే వస్తువుతో పోల్చదగినదికూడా. కాని ఆమె ఎర్రటి బుగ్గలు దుమ్మబారి ఉన్నవి. చిలుకముక్కు ఎరుపుకంటె ఎర్రనైనవి ఆమె మృదువైన పెదవులు. తీర్చి దిద్దిన ఆ సన్నని కనుబొమ్మలు, వాటిక్రిందనున్న నీలిరంగు విశాల నేత్రద్వయం— ఎర్రబారివున్నాయి. ఆమె తలకట్టు బంగారు వన్నెకలిగి వుంది. ఆమె పచ్చటి పొడుగుచేతుల చొక్కాను, ఎర్రటి లాగును ధరించింది. స్వచ్ఛమైన ఆ అనుపమ సౌందర్యరాశి శరీరంపై అలంకరింపబడిన మంచిముత్యముల ఆభరణాలు అనవసరమైన భారంగా తోస్తున్నాయి.

ఆగదిలో వాళ్ళిద్దరేకాక ఇంకా చాలామంది యువతులున్నారు. వారి వాలకాన్ని బట్టి, వారి మౌనాన్ని చూచి వైద్యుడు వారంతా సత్రప్ అంతఃపుర పరిచారకులని గ్రహించాడు.

గదిలో ప్రవేశించిన వెంటనే సత్రప్ ఆతనిని ఆపాదమస్తకం చూచాడు. వైద్యుని నల్లటి నేత్రాలు ఆతనిదృష్టిని ఆకట్టాయి. ఆ వైద్యునికి కనుక తన దుస్తులనిస్తే ఆతడు పర్శుపురిలోని అందమైన యువకులవంటివాడు కాగలడని తోచింది.

'మీరు తక్షశిలకు చెందిన వైద్యులా?' అని మర్యాదగా ప్రశ్నించాడు సత్రప్.

'ఔను మహాప్రభూ!'

'నాభార్యకు చాలా జబ్బుగా వుంది. నిన్నటినుంచి ఆమెపరిస్థితి చాలా ఆందోళనకరంగా వుంది. నా స్వంతవైద్యులిద్దరు ఇచ్చిన మందులు నిరుపయోగము లయ్యాయి.'

'మీ భార్యను చూచినతర్వాత నేను మీ వైద్యులతో మాట్లాడుతా.'

'వాళ్ళు సిద్ధంగావుంటారు. రండి మనం లోపలకు వెడదాం.'

తెల్లటి గోడనుంచి మెత్తటి తెరను ప్రక్కకు తొలగించాక లోపల మరొక ద్వారం బయటపడింది. సత్రప్, ఆతని 16 సం॥ల యువతి ముందు దారిచూపారు. వెనుక వైద్యుడు వారిని అనుసరించాడు. ఆ గదిలో ఏనుగుదంతపు కోళ్ళుకలిగిన

మంచముపై మెత్తటి సముద్రపు నురగవలె తెలుపైన పక్కపై ఒక రోగిష్టి యువతి నిద్రిస్తూంది. ఆమె శరీరమంతా మృదువైన కదళీమృగ చర్మంతో కప్పబడి వుంది. ముఖంమాత్రం కనిపిస్తోంది.

సత్రప్ లోనికిరాగానే పరిచారికలు వెనక్కి తప్పుకున్నారు. వైద్యుడు రోగి దగ్గరగాపోయి ఆమెను పరీక్షించాడు. ఆమె ముఖం ఆ యువతిని పోలివుంది. కాని వయస్సు మళ్ళుటవల్లా, దీర్ఘవ్యాధివల్లా ఆయువతిముఖంలో నవయౌవన సౌందర్యం లేదు. ఆమె ఎర్రటి పెదవులు పాలిపోయి వున్నాయి. ఒకనాటి యౌవనప్రాభవాన్ని వెదజల్లే ఆమె బుగ్గలు నేడు లోతుకుపోయి ముడతలు పడిపోయాయి. ఆమె కళ్ళు గుంటలుపడి లోనికి దించుకొనిపోయాయి. సొగసుతీర్చిన ఆమె కనుబొమ్మలు ముడుచుకుపోయాయి. కాంచనలీను ఆమె లలాటం శుష్కించిపోయి తేజోవిహీన మైంది.

'లఫ్షా!' అన్నాడు ఆమెపై వంగుతూ సత్రప్. రోగి కన్నులు సగంతెరచి మళ్ళీ మూసుకుంది. 'ఆమె స్పృహలోవుంచీ వుండకుండా వుంది' అంటూ వైద్యుడు ఆమె నాడి చూచాడు. శరీరం చల్లగా వుంది. వైద్యుని ఆందోళన సత్రప్ కనిపెట్టాడు.

'కొద్దిద్రాక్షసారా-నిలవదైతే మరీమంచిది' అన్నాడు వైద్యుడు.

సంచారంలో వున్నప్పటికి సత్రప్ మకాంలో సారాకు లోటులేదు. మెరుస్తున్న ఒక గాజుపాత్రలో ఎర్రటిసారాయి తేబడింది. రత్నములతో పొదగబడిన బంగారపు కప్పుకూడా తేబడింది. ఆ వైద్యుడు ఒక మూటనువిప్పి మురికితోకూడిన అతని కుడి చేయి చూపుడువ్రేలునకుగల పొడుగైన గోరుతో, ఏదో ఒకమందు ఒక గురివింద గింజ ఎత్తు తీసి రోగిని నోరుతెరవమని కోరాడు. సత్రప్ ఆమెనోరు తెరిపించటంలో ఏమీ కష్టపడలేదు. ఆ వైద్యుడు మందు, ఒక్కచుక్క సారాయి ఆమెచే త్రాగించి సంతృప్తితో ఆమె త్రాగుచుండుట చూచాడు. 'కొద్దిసేపటిలో ఆమె కళ్ళుతెరుస్తుంది, అప్పుడు నన్ను తప్పక పిలవండి, ఇంతలో నేను మీ వైద్యుల్ని ఒకసారిచూస్తా' అన్నాడు సత్రప్‌తో వైద్యుడు.

వారు మరొక గదిలోకి వెళ్ళారు. పెర్షియన్ వైద్యులతో అతడు సంప్ర తించాడు. సోగ్దానుంచి బయలుదేరినప్పుడు సామాన్య జ్వరం తగలటం, అది ప్రస్తుత

పరిస్థితికి ఎట్లావచ్చిందీ వివరించారు. ఇంతలో యువతి భర్తను పిలుస్తోందని ఒక పరిచారిక కబురు తెచ్చింది. సత్రప్ ముఖం వికసించింది. వెంటనే వైద్యునితో అతడు రోగివద్దకు వెళ్ళాడు. అతనిభార్య నేత్రాల్లో జీవితాశ కొద్దిగా కనిపిస్తూంది.

ఆమె 'నాకోసం మీరు చాలా ఆత్రుతచెందారని వాళ్ల చెప్పారు. నేను త్వరలోనే ఆరోగ్యం పొందగలనని చెప్పటానికి మిమ్ములను పిలిచా. నామనస్సు కుదుటబడుతోంది. నేను ఇప్పుడు కొంత బలంగావున్నా' అంది.

'సరిగ్గా అదే యీ హిందూవైద్యుడు చెపుతున్నాడు' అన్నాడు సత్రప్.

'నాజబ్బు హిందూవైద్యుడర్థముచేసుకున్నాడు. ఇప్పుడు తగ్గిపోయింది కదూ?' ఆమె వికసితవదనంతో అంది.

'అవును జబ్బు తగ్గిపోయింది; కాని కొంతకాలం విశ్రాంతి తీసుకోవాలి. సాధ్యమయినంత త్వరలో మిమ్ము పర్శుపురి పంపుటకు తగిన బలం మీకు కలుగజేయాలని ఆలోచిస్తున్నాము. కొన్ని లోహములనుంచి తయారుచేయబడిన అద్భుతమైన మందులు నా దగ్గర వున్నాయి. నేను హిందువులు వాడే కొన్నిమందులు ఇస్తా. ద్రాక్షరసం, దానిమ్మరసం కొద్దిగా త్రాగుతూవుండాలి.'

'మీరు నా వ్యాధిని అర్థంచేసుకున్నారు. మిగతావాళ్ళు తెలివితక్కువవాళ్ళు. మీరు ఏమిచెపితే అదిచేస్తా. రోషణా.'

'ఏమమ్మా' అంటూ యువతి ముందుకొచ్చింది.

'నాబిడ్డా! నీకళ్ళు తడిసిపోయాయి. ఆ వైద్యులు నన్ను చంపివేసేవారు; కాని ఇప్పుడు నీవు ఆత్రుత చెందనక్కరలేదు. మన దేవుళ్ల అహురా, మజ్దా ఈ హిందూవైద్యుణ్ణి మనదగ్గరకు పంపారు. అతన్ని జాగ్రత్తగా చూడు. ఆయన చెప్పినవి నేను తినటానికి, త్రాగటానికి నీవే స్వయంగా తెచ్చిపెట్టు.'

వైద్యుడు రోషణాకు కొన్ని సలహాలుచెప్పి బయటకువెళ్ళాడు. భోజపత్రములలో కట్టి కొన్ని మందులను అతడు సత్రప్‌కు యిచ్చి వెళ్ళిపోయాడు. అమితోత్సాహంతో ఉన్న సత్రప్—

'మీరు మాతో యిక్కడే వుండితీరాలి.'

'నాకు ఆస్థానమర్యాదలు తెలియవు.'

'మనుష్యుడు ఎలాసంచరించాలో మీకు బాగాతెలుసు. ఇక కట్టుబాట్లవిషయమా? ప్రతిజాతికి కొన్ని ప్రత్యేకమైనవి వున్నాయి.'

'నేను మీతో ఉండిపోతే అది మీ నౌకర్లకు శ్రమ.'

'మా గదిప్రక్కనే మీకు ఒక ప్రత్యేకగదిని యేర్పాటుచేస్తాను. మీరు మాకు అందుబాటులో దగ్గరగా ఉంటే అదిమాకు ఎంతో సంతృప్తి.'

'మీభార్యవిషయంలో యిక యేమాత్రం ఆందోళన చెందనవసరంలేదు. వైద్యులు వ్యాధిని సరిగా గుర్తించలేదు. ఇంకో 2 గంటలు నేనురాకపోతే ఆశేలేదు. కాని ఇప్పుడు అపాయం దాటిపోయినట్లు భావించవచ్చు.'

సత్రప్ బలవంతంపై వైద్యుడు రాజమందిరంలోని ఒక గదిలో బసచేయటానికి అంగీకరించాడు. నాలుగురోజులనాటికి సత్రప్ భార్య లేచి కూర్చోనసాగింది. ఆమె ముఖంమీది ముడతలు తొలగిపోయి తిరిగి ఆమె ముఖం వికసించనారంభించింది. అందరిలోను రోషణ సంతోషమునకు హద్దులేదు. ఆమె కలుసుకొనిన రెండవరోజుననే, సత్రప్ బహుమతిచేసిన రెండురకముల విలువగల బట్టతో తయారుచేసిన వస్త్రమును ఆమె స్వయంగా వైద్యునికి బహూకరించింది. ఈ వైద్యుడు యిదివరకు ముష్టివాళ్ళతో కూర్చుని ఖర్బూజా పళ్ళు తినేవాడుకాడు యిప్పుడు. మంచి చొక్కా, బంగారపు నడికట్టు, రత్నములుపొదిగిన జోళ్ళతోను వెలిగిపోతున్నాడు.

త్వరలోనే రోగి కొద్దిపాటి ఆహారాన్ని తీసుకోవడంప్రారంభించింది, ఆరవ రోజు సాయంత్రం ఆమె వైద్యునికోసం కబురుచేసింది. వైద్యుడు ఆమెను కొత్తగా చూచాడు. ఆమె తన మేనల్లుడు వచ్చినట్లు భావించింది. వైద్యుని కూర్చోబెట్టి సాదరంగా 'మీకు నా కృతజ్ఞత. సముద్రమధ్యంలో కొట్టుకొనిపోతున్న నాప్రాణాన్ని రక్షించటానికి మజ్దాప్రభువే మిమ్మల్ని పంపాడు. మీ జన్మస్థానమెక్కడ?'

'తక్షశిల.'

'తక్షశిలా? విజ్ఞానానికి ఎల్లెడలా పేరుమ్రోగిన ప్రఖ్యాత పట్టణమది— మీరు ఆ పట్టణవాసులలో శ్రేష్ఠులు.'

'కాదు. నేను ప్రథమదశలోవున్న సామాన్యవైద్యుణ్ణి.'

'అవును. మీరు నిస్సందేహంగా యువకులు. కాని వయస్సుకీ విజ్ఞానానికీ వైరుధ్యంలేదు. గౌరవనీయులగు మీ పేరు?'

'నాగదత్ కాప్యా.'

'మీ పేరును పూర్తిగా ఉచ్చరించడం నాకు కష్టంగావుంటుంది. మిమ్ములను 'నాగ్' అని పిలిస్తేచాలా?'

'ఆ. చాలు.'

'మీరు ఎక్కడికి పోతున్నారు?'

'ప్రస్తుతం పర్శపురికి.'

'తరువాత?'

'సంచారం చెయ్యవలెననే కోరికచేతనే నేను యింటినుంచి బయలుదేరా.'

'మేముకూడా పర్శపురికి పోతున్నాం. మీరు తప్పక మాతోరావాలి. మీపట్ల మేము పూర్తి శ్రద్ధవహిస్తాం. రోషణా నీవే స్వయంగా గౌరవనీయులైన మన వైద్యుని కనిపెట్టాలి. నౌకర్లు అశ్రద్ధగావుంటారు.'

'అమ్మా? నేను మునుపే ఈ విషయంలో శ్రద్ధతీసుకున్నా. సోఫియాను ఈపనికి నియోగించాను.'

'నాకోసం మా తమ్ముడు పంపించిన ఆ గ్రీకు యువతియా?'

'అవునమ్మా! ఆమె నీకు చెయ్యవలసినపని ఏమీ లేదు. ఆమె చాలా తెలివైనదిగా తోస్తోంది. అందువల్ల ఈపనికి ఆమెనే నియమించా.'

'ఆలాగైతే మీరు మా పర్శపురికి రావాలి. మీరుకనుక మాగృహవైద్యులుగా ఉండిపోతే సంతోషిస్తాం.'

కొంతసేపు నాగదత్ అక్కడవుండి తరువాత తనగదిలోకి వెళ్ళిపోయాడు.

——

# 3

చెట్లు చేమలు లేని కొండలపై ప్రకృతిసిద్ధమైన దారిద్ర్యంలో ప్రపంచంలోని గొప్ప రాజ్యములలోకెల్ల గొప్పదైన దాని రాజధాని నిర్మింపబడుతుందని నాగదత్ కలలోనైనా ఊహించలేదు. పర్శపురి ఒక గొప్పపట్టణం. కాంతులీను మహోన్నత పాలరాతి స్థంభాలతో ఆ రామాలతో విరాజిల్లు ఆ రాజవీధులు చూస్తే ఆనాటి రాజేంద్రుల వైభవం చూపరులకు కొంత విస్పష్టం కాగలదు. నగరంకూడా చాలా సమృద్ధిగా వుంది. కాని ఇదంతా మానవ శ్రమఫలితం. కాని ప్రకృతిసిద్ధమైన సంపదలేదు.

రాజ సోదరియగు అఫ్షాయొక్క భవనముకంటె పర్శపురి భాగ్యమును వెల్లడిచేయగల మరొక నిదర్శనమనవసరము. వారు రాజధానిని చేరగనే నాగదత్ కోర్కెలన్నింటిని తీర్చుటకు శ్రద్ధవహించింది. ఆమె బహూకరింపదలచగా వైద్యుడు సోఫియానే కోరెను.

ఆమె మాట్లాడే వచ్చీరాని పెర్షియన్ భాషను అర్థంచేసుకోవడం కష్టమే అయినా అతడు ఆమెకనులలోని సజీవకాంతులను మాత్రము చూడగలిగాడు.

ఆమె నాగదత్ పరిచారిక అయినప్పటినుంచి అతడు ఆమె నెన్నడు దాసిగా చూడలేదు. క్రమేపి ఆమెభాషాపరిజ్ఞానము వృద్ధిపొందింది. నాగదత్ గ్రీక్ అక్షరాలు నేర్చుకొన్నాడు. సోఫియా అతనికి ఏథెన్స్‌భాష నేర్పడం ప్రారంభించింది. ఒక సంవత్సరంలో అతడు బాగా నేర్చుకోగలిగాడు.

'విధి చాలా విచిత్రమైనది! మీవంటి దయార్ద్రహృదయులగు యజమానుల క్రింద పనిచేయగలనని నేనెన్నడు ఆశించలేదు,' అంటూ సోఫియా యువకుడగు వైద్యునియెడ కృతజ్ఞత తెల్పింది.

'అదికాదు సోఫియా! నీవుకనుక సత్రప్ భార్యవద్దనేవుంటే బహుశా నీజీవితం మరింత సుఖంగా వుండేది. కాని నన్ను యజమాని అని పిలువకు! దాసిత్వంఅనే మాటవింటే నాకు జ్వరంవస్తుంది.'

'కాని నేను నీదాసిని.'

'నీవు దాసివుకాదు. నేను సత్రప్‌తోటి అతని భార్యతోను నిన్ను దాసిత్వం నుంచి నిముక్తిచేశానని తెలియచేసా'.

'అయితే యిప్పుడు నేను బానిసను కాదన్నమాట ?'

'కాదు. నావలెనే నీవు స్వేచ్ఛాజీవివి. నీయిష్టంవచ్చిన చోటుకు పోవడానికి నేనుకూడా నీకు సహాయపడతా.'

'అయితే, నేను మీ వద్దవుండిపోగోరితే మీరు వద్దంటారా ?'

'అది నీయిష్టం.'

'బానిసత్వం మానవుని ఎంత అధోగతికి దింపివేస్తూంది ! నేను మా తండ్రి వద్దవుండే మాస్వంతబానిసలను చూసేదాన్ని. వారు నవ్వుతు జీవితాన్ని అనుభవించడం చూచాను. కాని ఆ మందహాసం వెనుక యింతటిబాధ దాగివున్నదని నేనెన్నడూ వూహించలేదు. కాని ఈ బానిసత్వం ఎంతటి నరకమో .నేను బానిసను అయిన తరువాత కాని తెలుసుకోలేకపోయాను.'

'సోఫియా ! ఒకమాట అడగనా ? నీవు బానిసవెట్లయ్యావు ?'

'నాతండ్రి ఏథెన్సులో ఒక ప్రఖ్యాతపౌరుడు. మేసిడోనియా రాజగు ఫిలిప్ మా పట్నాన్ని జయించినప్పుడు కుటుంబంతో మాతండ్రి ఓడపై ఆసియాకు తప్పించుకొనిపోయాడు. అక్కడ తలదాచుకోవాలని మేము తలచాం కాని మేము దిగినపట్టణం కొద్దినెలలకే పెర్షియనుల వశమైంది. భయంతో ప్రజలు అన్నివైపుల పారిపోయారు. కొందరిని పెర్షియనులు పట్టుకొన్నారు. అట్టివారిలో నేనొకదెను. యువతిని, అందమైనదానను కావటంవల్ల, నేను సేనాధిపతివద్దకు పంపబడ్డాను. అతడు నన్ను రాజువద్దకు పంపాడు. రాజుఅప్పటికే నావంటి వందలకొలది గ్రీకుకన్యలను కలిగివున్నాడు. అతడు నన్ను లతని చెల్లెలివద్దకు పంపాడు. నేను బానిసనైనా నా ఆకృతి నాకు గౌరవస్థానాన్ని కలుగజేసింది. నా అనుభవాలు మామూలుగా దాసికంటె భిన్నంగావుంటాయి. అది యెంత రంపపుకోతో నాకు తెలుసు. నాది మానవ శరీరంకాదని నేను భావించాను.'

'సోఫీ ! అయితే నీవు మీనాన్నను మళ్ళా కలుసుకోలేకపోయావన్నమాట ?'

'ప్రాణాలతో అతడు తప్పించుకొనిపోయాడని నేను నమ్మటంలేదు. ప్రస్తుతం మేమంతా గాలికి ఎగిరిపోయిన ఎండుటాకులం. మాప్రియమైన ఏథెన్సు జయింపబడింది. నాతండ్రి బ్రతికివున్నా మేము ఎక్కడ కలుసుకోగలం ?'

'సోఫియా ! ఏథెన్సు ఒక గొప్పపట్టణమైవుండాలి.'

'ఒకప్పుడు ప్రభూ !' అంటూ ఆమె అతణ్ని సంబోధించింది.

'సోఫియా ! నేను ప్రభువునుకాదు. నన్ను నాగ్ అనిపిలు.'

'అయితే నాగ్ ! ఒకప్పుడు అది గొప్పపట్టణమే. కాని ఇప్పుడు శిథిలమై పోయింది. గ్రేట్ డరయసు కోరలుపీకిన మా ప్రజాప్రభుత్వం నీచుడగు ఫిలిప్పుచే నాశనం చేయబడింది.

'సోఫియా, ఎందుకల్లా జరిగింది ?'

'మేము అనేక పెర్షియన్ దండయాత్రలను నిష్ఫలం చేశాం. కాని పెర్షియన్ నిరంకుశత్వంతో తులతూగగల బలిష్టమైన సామ్రాజ్యం నిర్మించినగాని తమకు మోక్షము లేదనే నమ్మకం ఏథెన్సు నాయకులలో పాతుకుపోయింది. ఏథెన్సు పట్టణవాసుల సహాయం రాకపోతే ఫిలిప్ ఎన్నడూ విజయం పొందేవాడుకాడు.'

'ఓ తక్షశిలా ! నీలోకూడా ఒక విష్ణుగుప్తుడు జన్మించాడన్నమాట !'

'తక్షశిలా – విష్ణుగుప్తుడు – ఏమిటి ?'

'గర్వింపదగిన తక్షశిల నా జన్మభూమి. అది తూర్పుననున్న ఏథెన్సు. మా ప్రజాప్రభుత్వం అనేకసార్లు ది గ్రేట్ డరయస్‌తోను అతని తరువాతవారితోను పోరాడి తరిమివేసింది. కాని నా చిన్ననాటి సహాధ్యాయుడు విష్ణుగుప్తుడుకూడా ఫిలిప్‌ను బలపరచిన మీ ఏథెన్సు నివాసులవలెనే చెపుతున్నాడు.'

'మునుపటి ఏథెన్సువలె నేటితక్షశిల ఒక ప్రజాస్వామ్యం అన్నమాట ?'

'అవును మాతక్షశిలలో బానిసలు లేరు. అక్కడ అడుగు పెట్టగానే బానిస స్వేచ్ఛాజీవి అవుతాడు.'

'ఆహా ! తక్షశిల చాలా దయగల ప్రదేశం !'

'నాగ్ ! నేను మొదటినుంచీ నీకు బానిసలతో సంచరించటం చేతకాదని చూశా.'

'అది నేనెన్నడూ నేర్చుకోను. మగధదేశీయులను పవిత్రమైన తక్షశిలకు తీసుకొనివచ్చినట్లయితే దాస్యమనే కళంకం తక్షశిలలో ప్రవేస్తుందని నేను విష్ణుగుప్తునితో చెప్పాను.'

'మగధ ఎక్కడిది ?'

'తక్షశిలకు తూర్పునవున్న పెద్ద హిందూరాజ్యం. పెర్షియన్ దండయాత్రల ఒత్తిడి హెచ్చుటవల్ల కాలం గడచినకొద్దీ మేము బలహీనులమై అలసిపోయాం. చక్రవర్తులను తక్షశిల ఒంటరిగ ఎదుర్చుట కష్టమనుట నిజం. కాని అనేక ప్రజాస్వామ్యములను ఒక సమితిగా కూడగట్టుట అందుకు విరుగుడు కాగలదని నా అభిప్రాయం.'

'నాగ్ ! కాని ఈ పద్ధతి మాదేశంలో అనుసరింపబడుట చూచాం. పెర్షియనులను ఎదుర్చుటకు హెల్లాసుచెందిన అనేక ప్రజాస్వామ్యములు ఒకసమితిగా ఏర్పడ్డాయి. కాని ఆ సమితి చిరకాలం నిలువదు. ప్రతి ప్రజాస్వామ్యం తన స్వాతంత్ర్యాన్ని నిలుపుకోవాలని పట్టుబడుతుంది, కాని సమితికి తగు బలం కలగజేయటానికి అవి నిరాకరిస్తాయి.'

'బహుశా నా అభిప్రాయం తప్పుగాను, విష్ణుగుప్తునిది సరియైనదిగాను పరిగణించవచ్చు.'

'విష్ణుగుప్తుడు సమితి జయప్రదమగుటకు అవకాశంలేదని భావిస్తాడా ?'

'మనశత్రువు ఎంతో బలవంతుడగుటవల్ల ప్రజాస్వామ్యముల కూటమి కూడా శత్రువును ఎదుర్కొనజాలదని అతడు వాదిస్తాడు కాని అనేకరాజ్యములు వాటి సరిహద్దుల్ని ఎత్తివేసి ఏకరాజ్యంగా తయారు కాగలిగితే కొంత ఆశకలగవచ్చు. కాని అది ఎన్నటికీ నెరవేరే పనికాదు.'

'నాగ్ !' బహుశా నీమిత్రుడు చెప్పినది సత్యమేకావచ్చు. లొంగిపోయి ఏథెన్సు స్వాతంత్ర్యాన్ని కొల్పోవలెననే భావన అయినా తుదివరకూ మాకు ఎన్నడూ కలగలేదు.'

'అయితే ప్రజాస్వామ్యమైన ఏథెన్సురాజ్యంలో బానిసత్వం ఏలాప్రవేశ పెట్టబడింది?'

'పతనాన్ని కోరుతోందో అనట్లుచేసింది. ధనాఢ్యులు తమ అవసరంకొద్దీ బానిసత్వాన్ని బహుళంగా ప్రవేశపెట్టారు. క్రమేపీ యజమానుల సంఖ్యకంటె బానిసలసంఖ్య పెరిగిపోయింది.'

'పెర్షియన్‌ల ఆచారాలలోకెల్ల ఏది నికృష్టమైనదిగా నీకు తోచింది?'

'నాదేశంలోకూడా ఉండే బానిసత్వం, రాజులు ధనాఢ్యులుకలిగి వుండే అంతఃపురాలు.'

'మీదేశంలో ఉండవా?'

'అక్కడ మేసిదోనియారాజగు ఫిలిప్‌కూడా ఒక భార్యకంటె హెచ్చుమందిని వివాహమాడరాదు. ఇక్కడ మామూలు కర్మచారులుకూడా అనేకమందిని వివాహం చేసుకొంటారు.'

'నాదేశంలో బహుభార్యలుగలవారు చాలాఅరుదు. కాని ఆ పద్ధతి స్త్రీలను బానిసలుగా చేయుటకు తోడ్పడుతుంది. ఏథెన్సులో మొదట బానిసత్వం ప్రవేశపెట్ట బడి వుండవచ్చు! కాని తక్షశిలలో బహుభార్యాత్వం బానిసత్వానికి పునాదులు నాటింది.'

'కొన్ని కుటుంబాలు విపరీతంగా ఆస్తులుప్రోగుచేసుకోటానికి కూడాను.'

'ప్రజాస్వామ్యంలో ఎవరైనా కోరినంత ధనం సంపాదించుకోవచ్చు. కాని రాజులవలె ధనం దూబరాఖర్చు చేయరాదని నేను విష్ణుగుప్తునితో చెప్పాను. సోఫియా, నీవే స్వయంగా చూస్తున్నావు కదా! లేడిచర్మం, పట్టు, ముత్యాలు, వజ్రములు మొదలగువాటివల్ల ఏ అలవాట్లు ఎట్టివ్యామోహం కలుగుతున్నాయో! వారి సుఖం కోసం స్వార్థంకోసం ఎన్ని వేలమంది రక్త మాంసాల్ని వారు పీల్చుకొంటున్నారో వాళ్ళు ఎన్నడు ఆలోచించరు.'

'శ్రామికుల నెత్తుటిబొట్లే ధనాఢ్యుల కోశాగారాల్ని నింపుతున్నాయి.'

'మట్టిని బంగారంచేసేవాళ్ళు తినతిండి కట్టబట్ట లేక అల్లాడుతున్నారు. బంగారమును మట్టిచేసేవాళ్ళు ఆనందిస్తున్నారు. నేను మూడుసార్లు రాజదర్శనం

చేసాను. ప్రతిపర్యాయం నా హృదయం భగ్గున మండిపోయింది. ఒకవైపు రాజ వైభవం మరొకవైపు శీతాకాలపుచలికి, ఎండాకాలపు ఎండకు చచ్చిపోతున్న శ్రామికుల బాధలు నేను చూచాను. అతని ఎర్రని ద్రాక్షసారా అణచివేయబడిన ప్రజలరక్తం వలె నాకు తోచింది. పర్శుపురి అంటే నాకు అసహ్యంవేసింది. నేను తొందరగా వెళ్ళిపోగోరుతున్నాను!'

'నాగ్, ఎక్కడికిపోవాలని అనుకుంటున్నావు?'

'ముందర నీసంగతి తెలుసుకోగోరుతున్నాను.'

'నేను ఏంచెప్పను?'

'గ్రీస్.'

'అక్కడ నేను సుఖంగా ఉండగలను.'

'అయితే అక్కడికేపోదాం.'

'కాని దారిలో ఎవరైనా నన్ను బంధించవచ్చు. ఈసారి నాగ్‌వలె నాకు మరొకరక్షకుడు లభించకపోవచ్చు!' అంటూంటే ఆమె గొంతు సన్నగిలిపోయింది. ఆమె చక్కని విశాలనేత్రాలు భయభ్రాంత దృక్కులు పరపసాగాయి. చెవులపైబడు తున్న బంగరు వన్నెగల ఆమె కురుల్ని సర్దుతూ అతడు 'అలాకాకుండా నేను ఒక ఆలోచన చేశాను. కాని ముందుగా నీ అంగీకారం కావాలి.'

'ఏమిటి?'

'నేను గౌరవార్హుడనగు హిందూవైద్యుడనని వెల్లడించే ఉత్తరాలు సత్రపు, అతనిభార్య, రాజుదగ్గరనుంచీ తెస్తాను.'

'అవును. అప్పుడు నిన్నెవరూతస్కరించరు.'

'నీవుకనుక వైద్యుని భార్యగా ప్రపంచమునకు ప్రకటించుకొనుటకు అంగీకరిస్తే, ఆ ఉత్తరాల్లో నీపేరుకూడా చేర్పిస్తా.'

ఆమె కళ్ళల్లో అశ్రుబిందువులు చూపట్టాయి. ఆమె నాగ్‌దత్ చేతులతో తన చేతులు కలుపుతూ 'నాగ్! నీవు ఇంత దయగలవాడవు అని తెలియదు. నీవు చాలా

అందగాడివి. నాగ్! మణులవలెమెరిసే ఆమె కళ్ళను నీవు చూడలేదు? రోషణా నిన్ను ప్రేమిస్తోందని ఆమె నాతో కొన్నివందలసార్లు చెప్పింది. ఆమెను ఎవరో జబ్బుమనిషి అయిన బంధువుకు పెండ్లిచేయాలని ఆమె తల్లితండ్రులు ఆలోచిస్తున్నారు. కాని ఆమె నిన్నే ప్రేమిస్తోంది.'

'సోఫియా! ఆసంగతి నాకు తెలియకపోవడం మంచిదైంది. లేకపోతే నేను నిరాకరించవలసివచ్చేది. ఈ రాజభవనాల్ని అంటిపెట్టుకొనియుండే భోగాలకోసం నేను పుట్టలేదు. బహుశా నేను ఏస్త్రీకొరకూ ఉద్దేశింపబడను. నావంటి పురుషుని ప్రేమించే స్త్రీ సుఖమయ జీవితాన్ని గడపలేదు. అయినప్పటికీ నీవు అంగీకరిస్తే, అన్ని ఉత్సవాలతోను నిన్ను నా భార్యగా రాజుపేర స్వీకరిస్తా. బహుశా గ్రీసులో కనుక నీప్రేమను పొందగలిగినవాడెవడైనా దొరికితే ఎప్పుడు కోరితే అప్పుడు నీవు స్వేచ్ఛగా పోవచ్చు.'

---

## 4

హిందూవైద్యుడగు నాగదత్ ప్రతిచోట గౌరవింపబడ్డాడు. అతడు పెర్షియా రాజగు దరయస్ యొక్క ఆంతరంగిక వైద్యుడు. వైద్యంలో అరితేరినచెయ్యి. పర్శుపురిలో ఉన్నప్పుడు గ్రీకుభాష నేర్చుకొన్నాడు. అతని సహచరిణి సోఫియా. అతడు మాసిదోనియాకు వెళ్ళి అలగ్జాండరు (సికిందర్) యొక్క గురువగు అరిస్టోటిల్‌ను చూచాడు. నాగదత్ భారతీయ ఆధ్యాత్మికతత్వవేత్త. అరిస్టోటిల్ రాజరికాన్ని ప్రేమించేవాడు. కాని నాగదత్ వానితో ఏకీభవించకపోయినా మాసిదోనియా (మకదోనియా) విడిచిపోవునప్పటికి అతనియెడ సద్భావాన్ని కలిగియున్నాడు. అనిర్వచనీయమైన దానినుంచిగాక, అరిస్టోటిల్ ప్రకృతినుంచి సత్యాన్వేషణంచేసేవాడు. అందువల్ల అరిస్టోటిల్ అంటే నాగదత్‌కు అభిమానం. భారతీయులు హృదయాంతర్గతంనుంచే సత్యాన్వేషణం చేయవలెనని కోరుటచే నాగదత్ విచారించాడు. అరిస్టోటిల్ తనశిష్యులు గొప్పవారని చెప్పగా నాగదత్ మనస్వి అనే శిష్యుని చాలా సార్లు కలుసుకున్నాడు. ఆ యువకునిలో అసాధారణశౌర్యమే కాకుండా, విషయనిర్ణయ శక్తికూడా అధికంగాకలదు.

నాగదత్ ఏథెన్సు వెళ్ళవచ్చుటకు అరిస్టోటిల్‌యొక్క అనుమతిపొందెను. కాని గ్రీక్‌తత్వవేత్తతో అదే కడసారి కలయిక యని అతనికి తెలియదు.

జన్మభూమియగు తక్షశిలలో ఎంతఆప్యాయంగా ప్రవేశిస్తాడో ప్రజాస్వామ్యము నకు నిలయము, వీరవతంసుల జన్మభూమి యగు ఏథెన్సులోకూడా అంతగాప్రేమిస్తూ ప్రవేశించాడు. సోఫియా పూర్వపు ఏథెన్సుకూ యిప్పటిఏథెన్సుకూ చాలాతేడావుందని చెప్పింది. గుళ్ళు, గోపురాలు ఇదివరకువలెనే అమరశిల్పంతో అలరారుతున్నప్ప టికీ అచ్చటి ప్రజల్లో సోఫియా ఇదివరలో చూచిన ఉత్సాహంకాని, శాంతిగాని, జీవ కళగాని లేదు. పూర్వం ఆమె తండ్రి యిల్లు ఉండేప్రదేశంలో యిప్పుడో క్రొత్త భవనంఉంది. దాని యజమాని ఒకమద్గొనియా వ్యాపారి. ఆయిల్లుచూచినతర్వాత ఆమె విచారంతో ఒకరాత్రంతా చెప్పలేనంత బాధపడింది. ఒకప్పుడు అకస్మాత్తుగా అశ్రుబిందువుల్ని జలజరాలుస్తుంది. మరొక్కప్పుడు శిలాప్రతిమవలె నిర్జీవిగా ఉంటుంది. చిన్ననాటి స్వగృహం ఈరూపంలో ఉండటమే ఆమె అనిర్వచనీయ మైన ఈ బాధకు కారణమని నాగదత్ గ్రహించాడు. ఆమెను ఊరడించుటకు అవ కాశం చిక్కకుండుటచే ఏబాధతో ఆమె హృదయం తూట్లుపడిపోతోందో ఆబాధకు నాగదత్ వశుడైపోయాడు. బాధనుంచి తేరుకున్నాక సోఫియా పూర్తిగా మారి పోయింది.

ఆమెకు అలంకరణాలలో ఆసక్తిలేదు. కాని ఆమె ఏథెన్సు నందలి యువతీ మణులవలెనే విరియబోసిన బంగరు వన్నెగల కురులను చక్కటిపూలదండతో కలియ కట్టింది. పాదములవరకూ వ్రేలాడు సుందరమైన గౌను ధరించి, వ్రేళ్ళకు నగిషీ జోళ్ళు కలిగియుంది. విశాలలలాటము, గులాబీపువ్వులవంటి ఆమె చెక్కిళ్ళు, మృదువైన పెదవులు, ఆమె నిండుయౌవ్వనపు తేజస్సు ఆమెలో మూర్తీభవించి కళ్లు మిరుమిట్లుగొలుపుతున్నాయి. ఆమె పెదవులపై చిరునవ్వు తాండవిస్తోంది.

నాగదత్ ఏమీ ఆశ్చర్యపడలేదుకాని అంతులేని సంతోషాన్ని పొందాడు.

"ప్రియమైన నాగ్! అడిగావుగనుక చెపుతున్నా. నేను యింతవరకూ జీవితం దుఃఖమయమనీ, భరింపరానిదని అనుకున్నాను. కాని అది చాలాతప్పు. ఈవిధంగా జీవితాన్ని ఒకేదృష్టికోణంతో చూచుటవల్ల జీవితపువిలువ తగ్గిపోతుంది. అందువల్ల మనుష్యుడు కర్తవ్యనిర్వహణలో సఫలుడు కాజాలడు. నాగ్! కాని తక్షశిల

విషయంలో ఇంతబాధా నీకుంది. నీవు శాంతియుతంగా, ధైర్యంతో భావికర్తవ్యాన్ని గురించి ఆలోచిస్తున్నావు.'

'నీవు యిలా ఆనందంగా ఉండడం నాకు ఎంతో బాగుంది సోఫియా!'

'ఆనందంకాకేమి? ఏథెన్సుకు వచ్చాను. నా ప్రియుణ్ణి పొందాను.'

'నీవు నీప్రియుణ్ణి యింతకాలంతరువాత పొందటం మరింత ఆనందదాయకం.'

'నాగ్! నీవు మానవాతీతుడవు. నీలో ఈర్ష్య అణుమాత్రమైనా లేదు.'

'ఈర్ష్యా! ఎందుకు సోఫీ! నిన్ను క్షేమంగా గ్రీస్ చేరుస్తానని నేను వాగ్దానం చెయ్యలేదా? ఇక్కడ నీవుకోరిన ప్రియుణ్ణి వెతుక్కోమని నేను చెప్పలేదా?'

'ఔను.'

'నీసంతోషాన్ని చూస్తేనే, నీకేదో ప్రియమైన వస్తువు దొరికిందని అనుకున్నా.'

'నాగ్! నీఊహ సరియైనది.'

'సరే! ఆతన్ని యిక్కడికి ఆహ్వానిద్దాం. అతడు రాలేకపోతే నన్ను వెళ్ళి అతన్ని చూడ....'

'అవునుకాని. ఎందుకు అంత ఆతృత?'

'నేను నిజంగా ఆతృతగా ఉన్నానా? ఔను. నిజమే. ఒక్క అనుమతి కలయక అని' అంటూ అతడు తన్నుతాను అరికట్టుకో చూచాడు.

సోఫియా అశ్రువులను ఆపుకోలేక ముఖం ప్రక్కకు త్రిప్పి 'చూడగలవు. కాని నీవు యింతకంటె మంచిగా ఏథెన్సు యువకుని వేషం ధరించాలి.'

'నీవు నిన్న కొనితెచ్చిన కొత్తబట్టలు, కొత్తజోడు నేను ధరిస్తాను.'

'వెళ్ళు. నీవు వాటిని ధరించు. ఇంతలో లిదియా తయారుచేస్తున్న పుష్పమాలను నా ప్రియుని కొరకు తెస్తాను.'

'మంచిది.' అంటూ నాగదత్ మరొక గదిలోకి వెళ్ళాడు. సోఫియా తనగది లోని అద్దం ముందుకు వెళ్ళి ఒకసారి ఒంటిమీద బట్టలను, తలలోని పూలను సరిచేసు కొంది. ఒక పూలమాలను అద్దం వెనుకదాచి నెమ్మదిగా గదిగుమ్మముదగ్గఱకు పోయి 'నాగ్! ఆలస్యమౌతోంది. నాప్రియుడు మళ్ళీ ఏవాహ్యాళికేనా పోతాడు.'

'ఇదిగో త్వరగా వచ్చా! ఏమిటి ఈచొక్కా తెచ్చావు. సరిగ్గాలేదే.'

'నేను సరిచెయ్యనా?'

'మంచిది.' అంటూ ఆమె ముడతలు సరిచేసింది. నాగదత్ కొత్త జోడు తొడుక్కున్నాడు. సోఫియా అతని కాంతివంతమైన ముఖాన్ని చూడలేక, చెయ్యి పట్టుకొని లాగుచూ 'నడు ముందు అద్దంలో నీక్రొత్తవేషం ఎల్లాఉందో చూసుకో.'

'సోఫియా! నీవు చూశావు. ఇదే పదివేలు. నాదుస్తులు చాలా గౌరవ ప్రదంగా వుంటాయి.'

'ఔను నీవు గౌరవనీయుడవే. కాని అద్దంలో ఒకసారి చూసుకొంటే పోయిం దేముంది?' అంటూ అతడిని అద్దంవద్దకు లాక్కుపోయింది. అద్దంలో తన ప్రతి బింబాన్ని చూచుకొంటున్నాడు. సోఫియా పూలమాలను చటుక్కున తీసి 'నేను ఈ దండను నా ప్రియునికొరకు తయారుచేశా.'

'చాలా బాగుంది సోఫీ!'

'కాని అతనికి ఎట్లావుంటుందో తెలియదు?'

'ఏం? తప్పకుండా బాగుంటుంది.'

'అతని జుట్టు పచ్చగావుంటుంది. ఈ మాల అచ్చంగా గులాబీలది.'

'అది చాలా అందంగా ఉంటుంది.'

'కాస్త ఇది నీమెళ్ళో వేసిచూడనా?'

'నీ యిష్టం! నాజుట్టుకూడా పచ్చగానేవుంది.'

'అందుకే నేను ధృవపరుచుకోగోరుతున్నా.'

ఆమె దండను అతని మెడలో జారవేసి, ఎదురుగా నిలచిచూచింది. అతడిని అద్దంనుంచి ముఖం వెనక్కి తిప్పమని అద్దంలో నాగ్‌ను చూపుతూ 'అడుగో నాప్రియుడు చూడు' అంది.

నాగదత్ తలనుత్రిప్పి వెనక్కిచూచాడు. ఇంతలో ఆమె అతన్నికౌగలించుకొని తన పెదిమలను అతని పెదిమలకు హత్తింది. నాగదత్ ముగ్ధుడైపోయాడు. ఎంతసేపు వాళ్లు తన్మయత్వంలో ఉన్నారో వారికి తెలియదు. తరువాత ఆమె తన ఎరుపాటి చెక్కిళ్ళను అతని స్వచ్ఛమైన బుగ్గలకు ఆన్చి, 'ప్రియుడా! నాగ్, ఎంత బాగున్నావు!'

'సోఫియా! నేను నీకు తగనేమో!'

'ప్రియతమా! నేను నీదానను. మన మిరుపురం ఆజన్మాంతం కలసివుండాం.'

నాగదత్తుడు ఆనందబాష్పాలు రాలుస్తూ 'ఆజన్మాంతం' అన్నాడు.

---

## 5

గ్రీక్ నావికాదళం పెర్షియన్లను ఓడించిన ప్రదేశం (సాలమీ అగాథం) చూడాలని నాగదత్ గాఢంగా కోరుతున్నాడు. సోఫియాతో అతడు అక్కడకు వెడుతున్నాడు. అతడు చాలా ఉత్సాహంగా వున్నాడు. కాని మధ్యమధ్య అతనికి తక్షశిల జ్ఞాపకంవస్తోంది. దారిలో వాళ్ళు విశ్రాంతి కోసం ఒక చెట్టునీడను ఆగారు.

'నాగ్! విన్నావుకదూ! ఫిలిప్ చచ్చిపోయాడనీ అలగ్జాండరె మాసిదోనియాకు రాజు అయ్యాడనీ, అతడు గొప్ప సైన్యాన్ని పోగుచేస్తున్నాడని.'

'ఔను. అతని ఆశ భూమధ్య సాగరతీరాన్నంతనీ తన అధికారంక్రిందకు తెచ్చుకోవాలని. కాని దాని తూర్పు, దక్షిణములు పెర్షియన్‌ల చేతుల్లో వున్నాయి.'

'అయితే పెర్షియన్‌లతో యుద్ధం చేద్దామని కోరుతున్నాడన్న మాట'.

'అందుచేత తన సామ్రాజ్యాన్ని స్థాపించటానికి అతడు ప్రజాస్వామ్యమైన గ్రీస్ సహాయాన్ని పొందగోరుచున్నాడు. ఒకే దెబ్బకు రెండు పిట్టలను కొట్టాలని అతని ఆశ. సోఫీ! చక్రవర్తిని భూమధ్య సముద్రతీరంనుంచి వెనక్కు తరమాలి—లేకపోతే అభిమానులైన గ్రీక్‌ల రాజభక్తిని పొందాలి'.

'అరిస్టోటిల్ అతనికి యీ శిక్షణ నిచ్చాడు. అతని ఆశల్ని పెంపొందించాడు.'

'వేదాంత శాస్త్రవేత్తయగు అరిస్టోటిల్ ఏనా?'

'ఔను. అతని గురువగు ప్లేటో ఈలాంటి ప్రజాస్వామ్య రాజ్యాన్ని స్థాపించాలని చూచాడు. కాని ఆ రాజ్యంలోకూడా ప్రజల్ని కర్షక కార్మికులుగా ఉంచకోలేదు. కాని అరిస్టోటిల్ ప్రజాస్వామ్యానికి బదులుగా చక్రవర్తియే ఉండాలని తలచాడు. ఈ గ్రీక్ చక్రవర్తి పెర్షియన్ మహారాజును ఓడించి ఎంతవరకూ పురోగమిస్తాడో ఏం తెలుస్తుంది?'

'సోఫియా! ఒకసారి బయలుదేరితే ఎక్కడ ఆగురాడో అతనికే తెలియదు. అక్కడ నా స్నేహితుడగు విష్ణుగుప్తచాణుక్యుడు కూడా మగధలో ఒక చక్రవర్తిని ఏర్పరుద్దామని చూస్తున్నాడు.'

'బహుశా! గ్రీక్ చక్రవర్తి, హిందూచక్రవర్తి ఇద్దరూ సింధునదీతీరాన తారసిల్లారుకదా!'

'సోఫియా! ఈతరంలో రాకపోతే మరోతరంలో! కాని అప్పటికి ప్రపంచం ఎంత చిన్నదై పోతుందో!'

వారిరువురూ సలామీప్రదేశాన్ని చూద్దామని నావలో బయలుదేరారు. సముద్రం చాలా ప్రశాంతంగావుంది. గాలి బొత్తిగాలేదు. రెండు శతాబ్దాలక్రితం ఏ సముద్రతరంగాలైతే పెర్షియన్ల నౌకాదళాన్ని ధ్వంసంచేశాయో, వాటిని వారిరువురూ కృతజ్ఞతాపూర్వకంగా చూడసాగారు. సముద్రంలో చాలాదూరం వెళ్ళేటప్పటికి ఒక పెద్ద తుఫాను చెలరేగింది. వారిద్దరూ మునుపు పెర్షియనులపై చెలరేగిన తుఫానుతో దీనిని పోల్చసాగారు. ఇంతలో వారి దృష్టి భీతావహులైన నావికులపై పడింది. తెరచాప విరిగిపోయింది. నావ యిటూ అటూ ఒరగనారంభించింది. పరిస్థితి

స్పష్టమైంది. సోఫియా నాగదత్‌ను గాఢాలింగనంచేసుకొని హృదయానికి హత్తుకొంది. ఆమె చిరునవ్వుతో 'చచ్చిపోయేవరకూ' అంది.

'ఔను. మనం చనిపోయేవరకూ' అంటూ నాగదత్ సోఫియాను దగ్గరకు తీసుకున్నాడు. వారిరువురూ ఒకరినొకరు ముద్దిడుకొంటూ పెనవేసుకుపోయారు. మరుక్షణంలో నావ తల్లక్రిందులైంది. ప్రేమైకజీవు లిద్దరూ ఆజన్మాంతం కలిసి ఉన్నారు.

---

# "ప్రభా"

## (పదకొండవ కథ)

[ప్రాంతం—ఉత్తరహిందూస్తానం; కాలం—క్రీ. శ. 50 సం॥రాలు.]

సాకేత్ లేక అయోధ్య మును పెన్నడూ ఏ పరిపాలనకు రాజధానికాదు. బుద్ధుని సమకాలికుడు కోసలరాజగు ప్రసేనజిత్తు అక్కడ ఒక రాజభవనం వున్నా, అతని రాజధాని అయోధ్యకు 50 మైళ్ళ దూరంలోవున్న శ్రావస్తి. కోసలరాజ్య స్వాతంత్ర్యాన్ని అతని అల్లుడగు అజాతశత్రువు నాశనంచేసాడు. అప్పటినుంచి శ్రావస్తి వైభవం క్షీణించిపోయింది. సరయూనదీతీరమున నున్న సాకేత్ నావికా వ్యాపారానికి ప్రసిద్ధికెక్కిన కేంద్రం. తూర్పు రోడ్డువ్యాపారముల కూడలియగు పంజాబ్‌కు మధ్యగల ఎడారి మార్గమధ్యమునకూడా వున్నందువల్ల సాకేత్ చాలా కాలం ఈ ఔన్నత్యమును కలిగివుంది.

విష్ణుగుప్త చాణక్యుని శిష్యుడగు చంద్రగుప్తమౌర్యుడు మగధరాజ్యాన్ని మొదట మగధవరకును, తరువాత గ్రీక్‌చక్రవర్తి సెల్యూకస్‌ను జయించి హీరత్, అముదార్యవరకును, తరువాత పడమర హిందూకుష్ ప్రాంతమువరకును వ్యాపింప

జేశాడు. చంద్రగుప్తునికాలంలోనూ మౌర్యరాజుల కాలంలోనూ సాకేత్ వ్యాపార కేంద్రముకంటె ప్రాముఖ్యత కలిగివుంది. బహుశా పాటలీపుత్రానికి (పాట్నా) అంతకుముందుగల ప్రాముఖ్యతను పోగొట్టకుండా, మౌర్యవంశాన్ని జయించిన సేనా నాయకుడు పుష్యమిత్రుడు ఈ పట్టణానికి (సాకేత్) రాజధానికి గల ప్రాముఖ్యత కలుగచేశాడు. శుంగ వంశీయులలో అధికారపదవువారు లేక పుష్యమిత్రుడు పాలించే ప్రాంతంలో రామాయణాన్ని రచించేప్పుడు దీనికి 'అయోధ్య' అనే పేరును వాల్మీకి ప్రచారంచేసాడు.

అశ్వఘోషుడు వాల్మీకి వ్రాసిన పవిత్రమునందలి మాధుర్యమును ఆస్వాదించాడు. శుంగవంశపురాజుల మన్ననకొరకు వాల్మీకి పుష్యమిత్రుడు లేక అగ్నిమిత్రుని రాముడను పేరుతో కీర్తించి దశరధుని రాజధాని ఔన్నత్యముకొరకు జ్యోతిష్కుల సహకారములో కాశీనుంచి సాకేత్ (అయోధ్య) కు మార్చాడు.

ఇదేవిధంగా కాళిదాసు 'రఘువంశం'లో చంద్రగుప్తవిక్రమాదిత్యుని 'రఘు' వనే పేరులోను, కుమారగుప్తుని (చంద్రగుప్త విక్రమాదిత్యుని కుమారుడు) 'కుమార్' అనే పేరులో 'కుమారసంభవం' లోను కీర్తించాడు.

పుష్యమిత్రుడు తన రాజును చంపినా మౌర్య సామ్రాజ్యము నంతయు స్వాధీనముచేసుకోలేకపోయాడు. పంజాబ్ యావత్తు గ్రీక్ రాజగు మీనాండర్ ఆధీనమైంది. ఒకప్పుడు మీనాండర్ సాకేత్పై దండెత్తినాడని పుష్యమిత్రుని పురోహితుడగు పతంజలి వ్రాసాడు. అందుచేత పుష్యమిత్రునికాలమునాటినుంచి సాకేత్పట్టణం ప్రముఖస్థానంపొందినా, అప్పటికింకా అయోధ్యఅనే పేరు దానికి రాలేదు. రెండు వందల సంవత్సరముల తరువాతకూడా సాకేత్లో ధనికులైన వర్తకులు నివసిస్తున్నారు. అక్కడ లక్ష్మీప్రసన్నమున్నది. కనుక విద్యకుకూడా కొంత స్థానంఉంది. ఇంకా ధర్మం, బ్రాహ్మణుల పూజాపురస్కారములు ఉండడంకూడా సహజం. ఈ బ్రాహ్మణశ్రేష్ఠులలో లక్ష్మీసరస్వతుల ప్రసన్నముగల ఒక కుటుంబముంది. యజమానురాలి పేరు సువర్ణాక్షి. పుత్రుడు సువర్ణాక్షుని మంచితనంవల్ల తల్లి శాశ్వత కీర్తి నార్జించింది. ఆమె కన్నులవలె కుమారునికీ బంగారురంగుగల నేత్రములే వున్నాయి. ఆ కాలంలో బ్రాహ్మణులలోను క్షత్రియులలోను నల్లటి బంగారురంగుగల కళ్ళు అరుదుకావు. పచ్చనికళ్ళు కలిగివుండుట దోషయుతంగా తలచేవారుకారు.

---

## 2

అది వసంతఋతువు. చెట్లు అప్పుడే చిగురిస్తున్నాయి. నేడు చైత్రశుద్ధ నవమి. సాంకేతపురమునందలి స్త్రీపురుషులు సరయూనదీతీరమున జలక్రీడలకు గుమిగూడుతున్నారు. వసంతోత్సవాన్ని జలక్రీడలతో జరుపుకొనుట వారికి అలవాటు. ఒకే రేవులో యువతీయువకులు దిగంబరులై జతలు జతలుగా జలక్రీడలాడుతారు. గ్రీక్ శిల్పకారులచేత తయారుచేయబడిన పాలరాతి విగ్రహములతో పోల్చదగిన తెలుపు ఛాయగల శరీరములు, ఎఱ్ఱని కురులతో విరాజిల్లు అనేకమంది గ్రీక్ సుందరీమణులు వారిలో వున్నారు. బ్రాహ్మణస్త్రీలుకూడా అందంలో వారికి ఏమాత్రం తీసిపోరు. తుమ్మెదరెక్కలవంటి నల్లటి పొడుగైన కురులలోను, గోధుమ వర్ణ దేహచ్ఛాయతోను కూడిన వైశ్య యువతులుకూడా ఆకర్షణీయంగా లేకపోలేదు.

నేడు సరయూనదీతీరమున పట్టణమునందలి యవ్వనులగు యువతీయువకులందరూ గుమిగూడారు. స్త్రీలవలెనే పురుషులు కూడా తమతమ వస్త్రములను విప్పి నదిలో దుముకుటకు సిద్ధముగా వున్నారు. కండలుతేరి, బలిష్ఠులైన వారి శరీర కాంతులు తెలుపు, గోధుమవర్ణములతోను కూడివున్నాయి. వారి జుట్టు, ముఖం, ముక్కు వారి వారి కులమును తెలుపుతున్నాయి. వారి సౌందర్యపరీక్షకు ఈ జలక్రీడా మహోత్సవంకంటె వేరు సుసమయం లభ్యంకాదు. ప్రతి ఏడు ఈ సమయంలో అనేక స్వయంవరాలు జరుగుతాయి. ఈ ఆచారమును తల్లిదండ్రులు ప్రోత్సహించేవారు.

జలక్రీడలకు యువతీయువకులు మొదట పడవలలో సరయూనది ఆవలిఒడ్డును చేరుటతో ప్రారంభించారు. తరువాత వారు నీటిలో దుమికి వెనుకకు ఈదుకు వచ్చారు. కొందరు నీటిలోపల, కొందరు వెల్లకిలా, కొందరు వెల్లకిలాపడుకొని ఈదుతున్నారు. వారి ననుసరించి ఉన్న చిన్న నావలు నడుస్తున్నాయి. ఆ నావలలో ఉన్నవారు వారిని ప్రోత్సాహిస్తున్నారు. అలసిపోయినవారిని నావల్లోకి ఎక్కిస్తున్నారు. ఈదేవారంతా ముందుగా గట్టుచేరుటకు తమ యావచ్ఛక్తినీ వినియోగిస్తున్నారు. గట్టు కొద్దిదూరం ఉందనగా వారిలో చాలా మంది అలిసిపోతున్నారు. అప్పుడు ఇరువురు యితరుల్ని అధిగమించి ముందుకు ఈదుతున్నారు. గట్టు చేరువైనకొద్ది వారు వేగంగాను, సరిసమానంగాను ఈదుతున్నారు. వారు ఆపోటీలో ఒకరికొకరు తీసిపోవుటలేదు. ప్రేక్షకులందరూ, వారిద్దరిలో ఎవరో ఒకరు మరొక

రిని అధిగమించగలరని భావించారు. పడవల్లోనివారు వారిని త్వరగా ఈదుడని ప్రోత్సాహిస్తున్నట్లు తోస్తుంది. చివరకు వారిద్దరూ ఏకకాలంలో గట్టు చేరు కొన్నారు. వారిలో ఒకడు యువకుడు, మరొకతె యువతి. ప్రజల హర్షధ్వానులమధ్య వాళ్ళు దుస్తులు ధరించారు. ప్రేక్షకులు వారిని పల్లకిలోకూర్చోబెట్టి పూలు చల్లుతూ తీసుకొనిపోయారు. ఇప్పుడు ఆ యువతి యువకులు ఒకరి సౌందర్యాన్ని మరొకరు దగ్గరలో చూడసాగారు. ప్రజలు వారి ఈతనేకాకుండా వారి సౌందర్యాన్నికూడా పొగడసాగారు.

'నేను ఆపిల్ల నెరుగుదును. కాని ఆపిల్లవాడెవరు?' అన్నాడు ఒకడు.

'సువర్ణాక్షపుత్రుడు. అశ్వఘోషుని పేరు వినలేదా?' అన్నాడు రెండోవాడు.

'అబ్బే! మాపురోహితుని బంధువులనుమాత్రం ఎరుగుదును. వర్తకులగు మాకు యిదంతా తెలుసుకొనుటకు తీరుబడి ఏదీ?'

'అరే! అశ్వఘోషుని పాండిత్యం దేశదేశాల మారుమ్రోగింది. ఇతడు సర్వవేదశాస్త్రిలలోను నిధి.' అన్నాడు మరొకడు.

'కాని ఈతని వయస్సు 24 సం॥లకు మించియుండదు' అన్నాడు మొదటి వాడు.

'ఔను. సరిగ్గా అంతే. ప్రజలు అతని కావ్యాలు చదువుతారు; మైమరచి కీర్తిస్తారు.'

'అల్లాగైతే, ఇతడు కవివరేణ్యుడగు అశ్వఘోషుడు. ఇతని ప్రేమగీతములే మన యువతి యువకులు పాడుతూ ఉంటారు.'

'ఆ. అతడే, మిత్రమా! ఆ యువతిపేరు ఏమిటి?' అని అడిగాడు మూడో వాడు.

'ప్రభా! సాకేత్‌లో నివసించే గ్రీక్ వర్తకుడగు దత్తమిత్రుని పుత్రిక' అన్నాడు మొదటివాడు.

'ఆ. అదీకారణం. ఇంత అందం సాధారణంగా యితరులలో చూడం. శరీరం ఎంత నాజూకుగా ఉంది. అయినా ఎంతబాగా ఈదుతుంది?' అన్నాడు రెండోవాడు.

'ఆమె తల్లిదండ్రులు ఆరోగ్యవంతులు; బలిష్ఠులు' అన్నాడు మొదటివాడు.

నగరోద్యానములో జరిగిన సన్మానసభలో వారిద్దరను గురించి ప్రజలకు బాగా తెలియపరచబడింది. వారు లజ్జాయుత దృక్కులతో ఒకరి నొకరు తెలుసు కొన్నారు.

---

# 3

సాకేత్‌లోని ఉద్యానవనము సేనాపతి పుష్యమిత్రుని పరిపాలనకు స్మృతి చిహ్నము. అతడు చాలధనం ఖర్చుపెట్టి, శ్రమపడి దానిని నాటించాడు. ఆతనివంశం రాజరికంలో లేకపోయినా, ఆ పట్టణవాసులు రెండువందల సంవత్సరాలక్రితం పుష్య మిత్రుని పరిపాలనాకాలంలో అది ఏలావుండో అలాగే నేటికీ కాపాడారు. ఆ ఉద్యానవనంలో మధ్యన ఒక సరస్సువుంది. అందు రంగురంగుల తామరలు కలువలు వికసించిఉన్నాయి. హంసల జంటలు అందులో ఈదుతున్నాయి. ఆ సరస్సుకు నలువైపుల స్ఫటికంవలె మెరిసే తెల్లటి రాతిగట్లు వున్నాయి. ఆ చెరువుగట్టుచుట్టూ పచ్చని పచ్చికవుంది. అక్కడక్కడ గులాబి, మల్లె మొదలైన పూల మొక్కలు, అశోకవృక్షములు వున్నాయి. కొన్నిచోట్ల చిన్నవీ, పెద్దవీ అయిన లతాగృహములు, మరికొన్ని చోట్ల పిల్లల ఆటస్థలములూ వున్నాయి. మట్టిగాని, గుట్టలుగాని లేకుండా నేల పచ్చని పచ్చికతో కన్నులపండువుగా వుంది. వర్షపు జల్లులవలె నీటిని వెదజల్లు చిమ్మన గొట్టములు అక్కడక్కడా వున్నాయి.

సాకేత్ నివాసులు మధ్యాహ్నసమయమున లోపల స్థలంచాలక లతాగృహ ములముందు నిలబడి వుంటారు. ఈరోజున అక్కడ ఒక గుంపు వుంది. కాని వాళ్ళంతా చాలానిశ్శబ్దంగా వున్నారు. వారంతా లతాగృహంలోంచి వినవచ్చే ఏదో ధ్వనిని వింటున్నట్లుంది. ఒకనెల క్రితం జరిగిన ఈతపోటీలో బుద్ధిపూర్వకంగా

ఓడిపోయిన యువకుడు ఆ లతాగృహంలో ఒక రాతిపై కూర్చొని వున్నాడు. అతడు తన జట్టును నెత్తిపై కొప్పుగా పెట్టుకొని, ఒంటిపై మెత్తని సిల్కువస్త్రం కప్పు కున్నాడు. వీణపై ఆతని వ్రేళ్ళుఆడుయా తన్మయపరచేలా మ్రోగిస్తున్నాయి. అతడు అర్ధనిమీలితనేత్రుడై తాను స్వయంగా రచించిన 'వసంతకోకిల' అనే సంస్కృత గీతమును అప్పుడే ముగించాడు. సంస్కృతగీతము తరవాత ప్రాకృతగీతం పాడటం చాలా అవసరం. అది సభికులకు ఎక్కువ అభిరుచికరం. ఇదివరలో తాను రచించిన 'ఊర్వశీవియోగం' అనే గీతాన్ని గానంచేశాడు. ఊర్వశి మాయమైపోయింది. అప్సరసయగు ఊర్వశికోసం పురూరవుడు 'ఊర్వశీ! ఊర్వశీ!' అంటూ పర్వతా ల్లోను, నదుల్లోను, తటాకములందును, అరణ్యములందును, లతాగృహములందును ప్రతిచోటా వెతుకుతూ తిరుగుతున్నాడు. అప్సరస కనిపించదు. కాని ఆతని పిలుపుల ప్రతిధ్వనియే వినిపిస్తోంది. ఈ పురూరవ విరహగీతాన్ని ఆలాపిస్తుంటే గాయకుని కన్నులనుంచి అశ్రుబిందువులు జలజలరాలాయి. శ్రోతలు కూడా కన్నీటికాల్వలు కార్చసాగారు. గానం పూర్తయింది. ప్రజలంతా వెళ్ళిపోయారు. అశ్వఘోషుడు లతాగృహమునుంచి వెలుపలికి వచ్చాడు. అతనిచుట్టూ నిలబడివున్న యువతీ యువ కులలో ఎర్రబడిన కళ్ళతో ప్రభాకూడా నిలిచివుంది.

'నీ వెంత గొప్పకవివి!' దగ్గరకు చేరుతూ అన్నాడొకయువకుడు.

'గొప్పకవినా? నేను అధముం కవినై నారాదు.'

'నా భక్త్యానుసారం నన్ను చెప్పనియ్యి! సాకేత్‌లో మా గ్రీకులకు ఒక చిన్న నాట్యశాల వుంది.'

'నాట్యంకొరకా? నాకుకూడా నృత్యంఅంటే చాలాయిష్టం.'

'నృత్యంకొరకేకాదు. తరచు నాటకాలుకూడా వేస్తాం.'

'ఓ నాటకాలా?'

'ఔను. గ్రీకుల నాటకం అదో విశేషంగా వుంటుంది. దేశకాల పరిస్థితులను తెలియచేయటానికి మా నాటకశాలలో పెద్దపెద్ద తెరలుంటాయి. అన్ని ఘట్టములను వాస్తవిక రూపంలో చూపటానికి ప్రయత్నిస్తున్నాం.'

'సాకేత్ పౌరుడనై వుండీ నేను ఒక్కసారైనా మీ నాటకం చూడలేక పోయానంటే నాకు చాలా విచారంగావుంది.'

'మా నాటకాలు కొద్దిమంది గ్రీకులకూ, వారి సన్నిహిత మిత్రులకూ మాత్రమే అందుబాటులో ఉంటాయి. అందువల్ల సాకేతలోని అనేకమందికి గ్రీకుల నాటకాల సంగతి....'

'అభినయం అంటే నాటకం వేయడమా?'

'అవును. నాటకమే. ఈరోజున ఒక నాటకం వెయ్యబోతున్నాం. దాన్ని మీరు చూడాలని మాకోరిక.'

'చాలాసంతోసం. నన్ను ఆహ్వానించినందుకు మీకూ, మీ స్నేహితులకు కృతజ్ఞుణ్ణి.'

అశ్వఘోషుడు వారిని అనుసరించాడు. నాటకరంగమునకు దగ్గరగా అతనిని కూర్చోపెట్టారు. ప్రాకృతభాషలోకి అనువదింపబడిన గ్రీకు విషాదాంతనాటకం ప్రదర్శింపబడుతోంది. పాత్రధారులు ఉన్నతకుటుంబీకులైన గ్రీకు యువతీయువకులు. వారందరు గ్రీకుదుస్తులనే ధరించారు. గ్రీకుపద్ధతిలోనే తెరలన్నియు చిత్రించ బడ్డాయి. ముఖ్యపాత్రధారిణియగు ప్రభా అశ్వఘోషునికి పరిచితురాలు. ఆమె అమోఘ నటనాచాతుర్యానికి అతను ముగ్ధుడైపోయాడు. పూర్వపరిచితుడగు యువకుడు అశ్వఘోషుని ఊర్వశీవియోగగీతాన్ని గానం చేయమని ప్రార్థించాడు. అతడు వెంటనే వీణనుపుచ్చుకొని రంగస్థలంపైకి వెళ్ళాడు. మరొకమారు అతని సంగీతం అతనినేకాక శ్రోతల్ని కూడా విచారసాగరంలో ముంచేసింది. ఆ సమయంలో అతని దృష్టి ప్రభాయొక్క వ్యాకులదృష్టితో కలిసింది. నాటకం పూర్తికాగానే నటీనటుల అందరు కవికి పరిచయం చేయబడ్డారు.

'నేను సాకేతలో నివసిస్తున్నా ఈ చక్కని నాట్యకళనుగురించి నాకు బొత్తిగా తెలియదు. నాకు తెలియని ఉజ్జ్వల ప్రపంచాన్ని నాకు చూపినందుకు మీకు నేనెంతో కృతజ్ఞుణ్ణి' అన్నాడు అశ్వఘోషుడు.

'ఉజ్జ్వల' అనేమాట వినగనే కొందరు యువతులు ప్రభవైపు క్రీగంటచూచి చిరునవ్వు నవ్వారు.

తిరిగి అశ్వఘోషుడు :— 'మీరు గ్రీకునాటకాన్ని ప్రాకృత రూపంలో ఎల్లాగయితే ప్రదర్శించారో అలాగే మేము మాదేశపు కథలను కొన్ని మంచి నాటకాలు తయారుచేసి ప్రదర్శించాలి అని నాకు తోచింది.'

'మీబోటి కవి తలుచుకుంటే గ్రీక్ వాటికంటె ఉత్తమమైన నాటకాలని రచించ గలరని మాకుధైర్యం వుంది.'

'ఎంతమాట! మీ గ్రీకు నాటక రచయితలవద్ద శిష్యరికం చేయదగినవాడను మాత్రమే. నేను ఊర్వశీవియోగం నాటకంగా రాస్తే?'

'మేము తప్పక దాన్ని ప్రదర్శిస్తాం. కాని పురూరవునిపాత్ర మీరే వెయ్యాలి.'

'నిరభ్యంతరంగా. కొద్ది మాత్రపు అభ్యాసంతో నేను బాగానే నటించగలను.'

'మేము కొన్ని తెరలుకూడా తయారు చేయిస్తాం.'

'ఆ తెరలమీద పురూరవుని దేశాన్ని చిత్రించాలి. నేనుకూడా కొద్దిగా చిత్రించగలను. అవసరమైతే మీకు సహాయంచేస్తా.'

'మీ దర్శకత్వంక్రింద తెరలు తయారు చేయించటం చాలా మంచిది. నటకుల వస్త్రభూషణాల్ని గురించి, తదితర, పాత్రలను గురించి మీరు మాకు సలహాలివ్వాలి.'

'అప్పటికప్పుడు పాత్రలను నిర్ణయించలేం. కాని పాత్రధారులు తక్కువుండాలి.'

'ఎంతమంది ఉండాలి ?'

'పదునారు లేక ఇరువదిమంది.'

'అలా అయితే మంచిది. మీరే పురూరవునిపాత్ర; మన ప్రభ ఊర్వశి పాత్రవేస్తే ఎల్లావుంటుంది? ఆమె నటనాకౌశల్యాన్ని మీరే చూచారు.'

'ఆమె బాగానే నటిస్తుందని తోస్తుంది.'

'చాలామంచిది. ఆమెను ఊర్వశిగా నిర్ణయిద్దాం; మా సమాజంలో ఎవరికి ఏ పనియిస్తే అది వారుచెయ్యాలి.'

ప్రభా కొంత సంకోచించింది. కాని వారిలో ముఖ్యుడు అడిగినమీదట ఆమె తన అంగీకారాన్ని తెలియజేసింది.

---

# 4

అశ్వఘోషుడు ప్రముఖ గ్రీకుయువకుడగు బుద్ధప్రియునితో కలిసి ప్రాకృతం లోనికి అనువదింపబడ్డ కొన్ని గ్రీకు నాటకాల్ని చదివాడు. రంగస్థల విషయాలన్నిటినీ అతనితో చర్చించాడు. గ్రీకుల రంగస్థలంమాదిరిగానే తానుకూడా తయారు చేశాడు. సంస్కృత, ప్రాకృత భాషల సమ్మిళిత నాటకాన్ని పద్యాలతోనూ, వచనంతోను తయారుచేశాడు. ఆ కాలంలో సంస్కృత ప్రాకృతభాషలలో తేడా ఎక్కువగా లేదు. ఊర్వశీవియోగమనేనాటకమే భారతీయనాటకములలో మొదటిది. అశ్వఘోషుడే మొదటి భారత నాటక రచయిత. ఇది కవియొక్క ప్రథమ ప్రయత్నమైనా 'రాష్ట్రపాల్' 'సారిపుత్ర' మొదలగు నాటకాలతో సమానమైనది.

తెరలు తయారుచేయుటలోను, నాటకాన్ని అభ్యాసం చేయడంలోను ఈ ప్రముఖ గ్రీకు యువకుడు నిద్రాహారములు సయితం మర్చిపోయాడు. అతడు తన జీవితంలో అత్యద్భుతమైన ఘడియలు గడుపుతున్నట్లు తలచాడు. అతడూ, ప్రభా కలసి ప్రతిరోజూ అనేకగంటలు గడిపారు. శతపోటీలనాడు వారి హృదయాల్లో నాటబడిన విత్తు నేటికి అంకురించసాగింది. అశ్వఘోషుని తమ ఆత్మీయునిగా చేసికొనవలెనని ఆపేక్షచెందుచున్న గ్రీకులు ఈ సంబంధ బాంధవ్యాన్ని బలపరచసాగారు.

ఒకనాడు అశ్వఘోషుడు చిత్రములు వ్రాయుటలో కొన్ని గంటలు గడిపాక నాటకశాల దైటగల ఉద్యానవనంలోకి వెళ్ళి ఒక పర్క్ మీద కూర్చున్నాడు. ఇంతలో ప్రభాకూడ అక్కడకువచ్చి 'ఊర్వశీవియోగ నాటకాన్ని రచించేటప్పుడు మీ మనస్సులో ఏముంది?' అని సహజమైన మృదుమధుర స్వరంతో అడిగింది.

'ఊర్వశీ పురూరవుల కథ.'

'అవును. అది అని నాకు తెలుసు. ఊర్వశిని అప్సరస అని మీరు సంబోధించారు.'

'అవును. ఊర్వశి అప్సరసయే.'

'అలా అయితే మీరు కావ్యంలో పురూరవుణ్ణి, ఊర్వశినీ వేరుచేసి అతడు ఆమెకోసం నదీనదాలు, చెట్టుపుట్టలు వెతికినట్లు వర్ణించారు.'

'ఆ పరిస్థితిలో పురూరవుడు అలా సంచరించటం సహజమే.'

'ఊర్వశీవియోగాన్ని గానంచేసే గాయకుడు లతాగృహంలో అశ్రుధారలని వీణవలెనూ, పాటను సహచరిణిలాగా చేసికొన్నాడు.'

'ప్రభా! గాయకుడుగాని, నటకుడుగాని, తన అభినయంలోనూ, తన పాటలోనూ తన్మయుడై పోవాలి.'

'కాదు. నీవు నాకు సరిగా చెప్పటంలేదు.'

'నీ అభిప్రాయం?'

'నీవు పురాణాల్లోని ఊర్వశీవియోగాన్ని గురించి పాడలేదు.'

'మరి?'

'నీ ఊర్వశి నీ హృదయలోవుంది. ఆమె అప్సరా అంటే సరయూనదిలో ఈదేది.'

'ఇంకా?'

'ఈ ఊర్వశియొక్క పురూరవుడు ఏ పర్వతాల్లోను, ఏ అడవులలోను లేడు. కాని సాకేతలో సరయూనదివద్దనా, పుష్పోద్యానవనాల్లోను, లతాగృహాల్లోనూ వెతుకుతూ తిరుగుతున్నాడు.'

'సరే, యింకా?'

'అతని అశ్రుకణాలు పురాణ పురూరవుని గురించికాదు. తన హృదయావేదనని చల్లార్చుకోడానికే.'

'ప్రభా! ఇక నన్ను చెప్పనియ్యి.'

'సరే. నే నింతసేపూ ఎక్కువగా మాట్లాడా.'

'ఆరోజున లతాగృహన్నుంచి బయటకు వచ్చి ఆకర్షణీయమైన నల్లటి నీ విశాల నేత్రాల్ని చూచాను.'

'మీ సంగీతం నన్ను వ్యాకులపరిచింది.'

'నీ వియోగమే ఆ నా పాటకు కారణం.'

'కానీ, నీ పాటలోని ఊర్వశిది పాషాణహృదయం. నీవు ఆమెను అలాగే చిత్రించావు.'

'అవును. వ్యాకులంగాను, నిరాశాపూరితగాను.'

'ఎందుకు?'

'ఆమె మెరుపువలె మెరిసి మాయమైంది, ఆ మెరుపును నేను ఎన్నడూ చూడలేను. ఆమె ఎన్నడో నన్ను మరిచి ఉంటుంది.'

'కవీ, నీవు ఇంత అల్పుడవా?'

'ఆత్మవిశ్వాసం నశించినప్పుడు మానవుడు తన్నుఖమునిగా భావించక ఏం చేయగలడు?'

'నీవు సాకేతలోనేకాక ఈ విశాల ప్రపంచంలోకల్లా గొప్ప కవివి; సాకేత ఈత పోటీలలో విజయుడవు. సాకేతలోని ప్రతిపౌరుని నాలుకచివర నీ ప్రశంసయే. సాకేతపురంలోని ప్రతి సుందరి నిన్ను తన ప్రియునిగా చేసికొనగోరులోం . . . . .'

'ఏమిలాభం? నాకు నా ఊర్వశియే సర్వస్వమూను. రెండు వారాలు ఆమె నా కంటబడకపోతే నా జీవితంలో చీకటి క్రమ్మసాగింది. ప్రభా నేను నిజం చెప్పుతున్నా. మానసికంగా నేనింత దుర్బలుణ్ణి కాలేను. ఇంకొక్కవారం నిన్ను చూడకపోతే నేనేమైపోయేవాడినో!'

'కవీ! నీవింతస్వలాభివికావు. నీవు నీదేశపు అమరగాయకుడవు. నీమాతృభూమి నీమీద ఎన్నో ఆశలుపెట్టుకొంది. నీ ఊర్వశీవియోగ నాటకం ఎంతగా పొగడబడుతోందో నీకు తెలుసా?'

'నేనేమీ వినలేదు.'

'గడచినవారం నాబంధువైన గ్రీకువ్యాపారి ఒకడు భరుకచ్ఛనుంచి ఇక్కడకు వచ్చాడు. ఆనగరంలో చాలమంది గ్రీకులు నివసిస్తున్నారు. సాకేతలో నివసిస్తున్న గ్రీకులమైన మేము భారతీయులమయ్యాం, కాని అక్కడివారు తమభాషను మర్చిపోలేదు. అక్కడకు గ్రీసునుంచి వ్యాపారులూ, కవులూ వస్తుంటారు. ఈనాబంధువు గ్రీకు సాహిత్యంలో పండితుడు. అతడు మీనాటకాన్ని గ్రీకునాటక రచయితల్లో ప్రముఖులగు యాంపీదోకల్, యురోపిద్ అనువారి రచనలతో పోల్చాడు. గ్రీకులు దీన్ని తర్జుమాచేసి నాట్యకళాప్రియుడగు ఈజిప్టురాజైన తురమాయికు పంపదలచారు. ఈజిప్టునుంచి భరుకచ్ఛకు నిత్యం ఓడలరాకపోకలు ఉన్నాయి. వారిమాటలు వింటోంటే నాహృదయం గర్వింపసాగింది.'

'నీఅభిమానమే నాసర్వస్వమూను ప్రభా!'

'కవీ! మీవిలువ మీకు తెలియదు.'

'ఇప్పుడు నాకు తెలిసింది. నీవు నాగీటురాయివి.'

'కాదు నీవు అశ్లాఘావించకు. ప్రభాప్రియుడగు అశ్వఘోషుడు, ఈయుగంలో కల్లా గొప్పకవియగు అశ్వఘోషుడు వేరు, వేరు. ప్రభాప్రియుడగు అశ్వఘోషుణ్ణి నీయిష్టంవచ్చినట్లు చేసుకో. కాని ముఖ్యమైనవిషయం ఏమిటంటే కవివరేణ్యుడగు అశ్వఘోషుడు ప్రపంచంయొక్క సొత్తుఅని గుర్తుంచుకో!'

'నీయిష్టంవచ్చినట్లు చేస్తాను.'

'నేను ఇంతఅదృష్టవంతురాలనౌతానని ఎన్నడూ అనుకోలేదు.'

'ఏం?'

'నీవు నన్ను మరచిపోయావనీ అనుకొన్నాను.'

'నీవు అంతటి సామాన్యురాలవా!'

'నీఎదుట మునుపూ ఉన్నాను, ఇప్పుడూ ఉన్నాను.'

'నీవు కవిత్వమనే క్రొత్తవరాన్ని నాకు ప్రసాదించావు. నా కవిత్వంలో నేనొక క్రొత్తధోరణీ ప్రోత్సాహం చూస్తున్నా. నా ఊర్వశీవియోగ కావ్యానికి,

నాటకానికికూడా నీవేకారణం. నాటకాన్ని అందరికీగా చేస్తున్నాను. కాని నిన్ను నేను విస్మరించగలనని ఎట్లా ఊహించావు?'

'ఏవిధంగానూ నేను నీకు తగినదానను కాను. నీగుణగణాలను గురించి విన్నతరువాత నేను నిరుత్సాహం పొందాను. సాకేతలోయువకులంతా నీనామం విన్నంతమాత్రానే తన్మయులుకావటం చూచి నేను మరింత నిరుత్సాహం చెందాను. అదికాక నీవు ఉన్నతమైన బ్రాహ్మణుడవని విన్నాను. నేను బ్రాహ్మణుల తరువాత అగ్రకులమగు క్షత్రియతరగతికి చెందిన గ్రీకు కుటుంబీకురాల్ని. అయినప్పటికీ పెండ్లి కుమార్తెయొక్క పుట్టు పూర్వోత్తరాలు, మంచిచెడ్డలు ఏడుతరాల వెనుకనుంచీ శోధించే ఓ బ్రాహ్మణ ఛాందసులు మనప్రేమను ఏలా అంగీకరిస్తారు?'

'ప్రభా! నీహృదయానికి అలా బాధకలిగినందుకు చాలావిచారంగావుంది.'

'అయితే నీవు ప్రభాను....' అంటూంటే ఆమె పెదవులు తడబడ్డాయి.

ఆమెను అశ్వఘోషుడు తన హృదయమునకు హత్తుకుంటూ, చెమర్చిన ఆమె నేత్రాల్ని చుంబిస్తూ 'ప్రభా! అశ్వఘోషుడు ఎల్లప్పుడూ నీవాడే. మృత్యువుకూడా మనలను వేరుచేయజాలదు' అన్నాడు. ఆమె కన్నులనుండి నీరు కాలువలు గట్టింది. ఆమెను తన బాహువల్లరిలో బంధించుకొని అతడు వాటిని తుడిచాడు.

అనేకసార్లు సాకేతపురవాసులు ఆశ్చర్యచకితులయ్యేట్లు అతని నాటకం ప్రదర్శించబడింది. నాట్యకళ ఇంత గొప్పదని వారెన్నడూ భావించలేదు. నాటకం ముగిసిన తరువాత అనేకసార్లు అశ్వఘోషుడు గ్రీకు నాట్యకళలనే తా ననుసరించినా దానిలో పరభాషాప్రభావంలేదని బహిరంగంగా ప్రకటించాడు.

సంస్కృత, ప్రాకృతభాషలలో అతడు రచించిన పాటలూ పద్యాలూ సాకేత్ నుంచి కోసలవరకూ వ్యాపించాయి. అతని నాటకాలు ఇంతకంటే ఎక్కువ ప్రచారంలోకి వచ్చాయి. ఉజ్జయిని, దశపురం, సుప్పారక్, భరుకచ్ఛ, స్యాల్‌కోట్, తక్షశిల, పాటలీపుత్రం మొదలగు పట్టణములలోని గ్రీకు నాటకశాలలందు ప్రదర్శింప బడ్డాయి. ప్రజానీకం, ధనికులు, వర్తకులు వీటిని ఎంతో మెచ్చుకొన్నారు.

---

# 5

అశ్వఘోషుడు నాటకంలో నటిస్తున్నసంగతి, ఒక గ్రీక్ యువతిని ప్రేమిస్తున్నవిషయం, ఆతని తల్లితండ్రులకు తెలియకపోలేదు. ఈ వార్త అతని తండ్రిని ముఖ్యంగా కలతపెట్టింది. అందువల్ల అతడు భార్యయగు సువర్ణాక్షిని కుమారునికి సంగతి నచ్చచెప్పమని నియమించాడు. ఆమె తమవంటి కుటుంబీకులు అటువంటి వివాహాన్ని చేసుకొనుట మతవిరుద్ధమని కుమారునికి నచ్చచెప్పసాగింది; కాని అతడు వేదపారంగతుడగుటచే, ఋషుల రచనలనుంచి అనేక ఉపమానములను ఎత్తితీసి వాటినన్నింటినీ తన వాదానికి సాక్ష్యంగా చూపేవాడు. (ఈ రోజునకూ వజ్రచ్ఛేదికోపనిషత్తులలో కానవచ్చే, వాటిని అతడు వ్రాశాడు). కాని ఆతని తల్లి 'నాయనా! అదంతా చాలా బాగుంది. కాని ఈరోజున బ్రాహ్మణులమైన మనం మాత్రం ఆ పద్ధతులను అనుసరించటంలేము' అంది. 'అలాగైతే, బ్రాహ్మణుల్లో ఒక నూతనమార్గాన్ని నేను ప్రవేశపెడతాను' అన్నాడు కుమారుడు. ఆమెకు కుమారుని మార్గం ఏమీ నచ్చలేదు. కాని ప్రభా లేని జీవితాన్ని తాను గడపజాలనని కుమారుడు చెప్పుటవల్ల ఆమె కుమారుని బలపరచి తన అంగీకారాన్నిచ్చింది.

ఒకరోజున అశ్వఘోషుడు తన తల్లివద్దకు ప్రభాను పంపాడు. ప్రభా మంచి గుణాలు, ఆమె నమ్రత, అందుకు తగిన సౌందర్యంచూచి ఆతనితల్లి ఆమెను దీవించింది. కాని అతని తండ్రి లొంగలేదు. అతడు ఒక రోజున అశ్వఘోషునితో 'బ్రాహ్మణకులంలో మనకుటుంబానికి గౌరవనీయమైన స్థానం వుంది. అనేకతరముల నుంచి ఉన్నత బ్రాహ్మణ కులంలోని యువతులే మన ఇంట కాలుపెట్టారు. నీవు వాంఛిస్తున్న ఈ వివాహానికి నీవు పాల్పడితే, మనమూ, మన ముందు తరం అధోగతిలో పడతాం. మన గౌరవ మర్యాదలు నశిస్తాయి' అని ఖచ్చితంగా చెప్పాడు. కాని ప్రభాను తిరస్కరించుట అశ్వఘోషునకు దుర్ఘటమైనపని. అప్పుడు అతని తండ్రి ప్రభా తల్లిదండ్రులకు అనేకవిధాల నచ్చచెప్పిచూచాడు. ఎట్టకేలకు ఆతడు ప్రభాదగ్గరకే వెళ్ళి తన తలపాగాను విజ్ఞప్తిసూచకంగా ఆమె పాదాలవద్ద పడవేసి కూడా ప్రయత్నించాడు. అశ్వఘోషునితో మాట్లాడుతానని మాత్రమే ఆమె సమాధానం చెప్పింది.

——

# 6

ప్రభా అశ్వఘోషు లిద్దరూ గాఢతరమైన ప్రేమచే బంధింపబడ్డారు. వారిలో ఒకరు నదీతీరమునకుగాని, ఉద్యానవనం లేక తీర్థాలకుగాని, నాట్యశాలలకుగాని, మరెక్కడకుగాని వెడితే రెండోవారుకూడా అక్కడే ప్రత్యక్షం. రవి సందర్శన మాత్రమున వికసించు తామరవలె, ఆమె సమక్షమున అతని హృదయం ఉప్పొంగేది. అనేక వెన్నెలరాత్రులను వారు హృదయంగమంగా ప్రేమకలాపాలతోనేగాక జీవిత మర్మములను గురించిన చర్చలతోకూడా, నదీతీరములందు గడిపారు.

సరయూనదీప్రవాహతీరాన ఒక వెన్నెలరేయిని ఇసుకతిన్నెపై కూర్చొని అశ్వఘోషుడు ప్రభా సుందరరూపాన్ని తన హృదయంలో చిత్రించుకొంటున్నాడు. అకస్మాత్తుగా ఉద్రేకంలో 'ప్రభా! నీవే నా కవిత్వము. 'ఉర్వశీవియోగము' నేను రచించుటకు నీ సౌందర్యమే కారణం. నీ సౌందర్యం నా కవిత్వాన్ని హృదయంగమంగా చేస్తోంది. కవిత్వం హృదయాన్నుంచే కాకుండా బాహ్యపరిస్థితులను బట్టి ఉంటుంది. నీవు నాకు ప్రేమసత్యాన్ని బోధించావు.' అతడు అలా మాట్లాడుతుంటే ప్రభా చల్లని ఇసుకతిన్నెపై వెల్లకిలపడుకొంది. అశ్వఘోషుడు ఇసుకపై పొర్లాడుతున్న ఆమెపొడుగాటి స్వచ్ఛమైన కురులను చూచి, ఆమె తలను తనఒడపైకి తీసుకొన్నాడు. ఆమె ముఖమును పైకత్రిప్పి అలన్ని చూస్తూ 'నీవు చెప్పే ప్రతివిషయంతోను నేను ఏకీభవిస్తాను. అయినా వాస్తవిక సౌందర్యం ప్రోత్సహించకపోతే కవిత్వం పరిపూర్ణంకాదు. నేను నీ విగ్రహాన్ని మానంతో ఊహిస్తున్నా, కవిత్వపరిభాషలో నిన్ను చిత్రించాలని నేను ఆశిస్తున్నా. కాని శాసించుటకు కవిత్వం నావస్తువుకాదు. ఆరోజున నీకు చెప్పాను. ఇద్దరు వ్యక్తులవలె నిన్ను నీవు భావించుకోవలెనని; నీవు అమరజీవివి. ఈయుగంలోకల్లా గొప్ప కవి యైన అశ్వఘోషుడవని భావించుకోవాలని—ఎందుకంటే ఆ అశ్వఘోషుడు ఏ ఒక్కరి సొత్తూ కాడు; అతడు ప్రపంచముయొక్క అమూల్యరత్నం. కాల్కారాం విద్వాంసుని వద్దకు రెండురోజులక్రితం మనం వెళ్ళినప్పుడు ఆ విజ్ఞానియగు సన్యాసి చెప్పిన మాటలు నీకు జ్ఞాపకంఉన్నాయా?'

'అతడు అత్యద్భుతమైన మేధావిగా తోస్తున్నాడు.'

'ఔను. అతడు ఎంతోసంచారంచేశాడు. అతడు ఈజిప్టులోని అలెగ్జాండ్రియాలో జన్మించాడు.'

'నేను అలాగే విన్నాను. కాని ప్రియుడా! ఒకటి నాకు అర్థంకావటంలేదు. గ్రీకులకు బౌద్ధమతమంటే అంత గౌరవమెందుకు?'

'ఎందువల్లనంటే, అది వారి స్వభావాలకూ, వారి స్వతంత్రభావాలకు అనుగుణ్యంగా వున్నట్లుతోస్తుంది.'

'కాని బౌద్ధులు ప్రతివారిని సన్యాసులుగాను, తాపసులుగాను, భిక్షకులుగాను చేయుటకు ప్రయత్నిస్తున్నారు.'

'సంసారులతో పోల్చిచూస్తే బౌద్ధులలో సన్యాసులు చాలా తక్కువ. అందరి వలె బౌద్ధగృహస్థులు అన్నీ అనుభవిస్తారు.'

'ఈదేశంలో అనేక మతా లున్నాయి. ముఖ్యంగా బౌద్ధమతాన్నే గ్రీకులు ఎందుకు అవలంబించాలి?'

'అది మతములన్నింటిలోను చాలా ఉదారమైనది. మనపూర్వీకులైన గ్రీకులు భారతదేశం వచ్చినప్పుడు, ప్రతివారూ వారిని అనాగరికులని నీచంగాచూశారు. నేను దండెత్తి వచ్చిన గ్రీకుసైనికులనుగురించి మాత్రమే మాట్లాడుటలేదు. వలసవచ్చిన గ్రీకువర్తకులుకూడా అదేవిధంగా చూడబడ్డారు. కాని బౌద్ధులు వారిని అసహ్యించుకో లేదు. గ్రీకులకు తమదేశంలోకూడా బౌద్ధమతంతో పరిచయముంది.'

'గ్రీసులోకూడానా?'

'చంద్రగుప్తమౌర్యుని మనుమడగు అశోకునికాలమున చాలమంది బౌద్ధ సన్యాసులు గ్రీసుకు వచ్చారు. మనం కలుసుకొన్న ధర్మరక్షిత్ భారతదేశంలోకాక అంతకుముందే అలెగ్జాండ్రియాలోని బౌద్ధవిహారంలో మతం స్వీకరించాడు.'

'ప్రభూ! అతనిని మరొకమారు చూడగోరుతున్నాను.'

'తప్పకుండా కలుసుకోవాలి. అనేక గంభీరసమస్యలను గురించి నీకు చెప్ప గలడు. బౌద్ధధర్మాన్నిగురించేకాక గ్రీకు వేదాంతాన్నికూడాను.'

'గ్రీకులలోకూడా వేదాంతులున్నారా?'

'ఆ. కాని వైరాగ్యవిషయాల్ని తెలిసికొని నన్ను మరిచిపోవుగదా' అంటూ ఆమె తననుంచి అతడ్ని ఎవరో ఎత్తుకుపోతోంటే పట్టుకుంటోందా అన్నట్లు గాఢంగా కౌగలించుకుంది.

'కొన్ని కాల్కారామ్ విషయాలు నాకు ఆకర్షణీయంగా ఉన్నాయి. మన దేశాన్నంతనీ అలాచేస్తే, అని నాకు తోచింది.'

'కాదు ప్రియా, నీవు నన్నువిడిచి బౌద్ధవిహారంలోకి పోవద్దు.'

'నిన్ను వదలటమా, నాజీవితంలో అది అసాధ్యం. కాని అక్కడ భేద భావాలు ఏమీలేవని ఆలోచిస్తున్నా. గ్రీకు ధర్మరక్షిత్, పర్శియ సుమన్‌వంటి గొప్ప సన్యాసులు అనేకమందితో మనదేశ సన్యాసులూ (బ్రాహ్మణులు మొదలగు చండాలుర వరకు) అందరూ ఒకేచోట నివసిస్తూ కలసిభోజనపానాదులూ, విద్యాభ్యాసం చేస్తున్నట్లు ఒక్కసారి ఊహించు. కాల్కారామములో నివసిస్తున్న వృద్ధుడైన ఆన ల్లటి సన్యాసి పేరేమి?'

'మహాస్థవిర్ ధర్మసేన్–సాకేతలోని బౌద్ధవిహారములలో నివసించే భిక్షుకు లందరిలో ప్రధానుడు.'

'కాల్కారామములోని సన్యాసులవలె మన పట్నాల్లోని పల్లెల్లోని ప్రజలుకూడ జాతిమత వివక్షతలు పాటించకుండుట మంచిది.'

'ప్రియుడా! నీకు నేనొకవిషయం చెప్పలేదు. ఒకరోజున నీ తండ్రి, నావద్దకు వచ్చి ప్రాధేయపూర్వకంగా నిన్ను నా ప్రేమబంధంనుంచి విముక్తుని చేయుమని ప్రార్థించాడు.'

'నీవు విముక్తియిస్తే తనవద్దకు తన తనయుడు వచ్చినట్లా? నీవేమిచెప్పావు ప్రభా?'

'నేను నీతో ఆలోచిస్తానని చెప్పాను.'

'మంచిది. మనం మాట్లాడుకున్నాం. బ్రాహ్మణులంటే నాకు అంతులేని అసహ్యం. వారిపేరు చెపితే నావళ్ళు భగ్గుమంటుంది. పవిత్రమైన మతగ్రంథాలు

ప్రమాణమని వారు చెప్పుతారు. నేను ఎంతో శ్రమపడి శ్రద్ధగా వాటిని చదివాను. కాని వారు దేనిని నమ్ముతున్నారో అదినాకు కనిపించలేదు. బహుశా వారు స్వార్థాన్నే నమ్ముతారనుకుంటా. వారి పూర్వఋషుల వచనాన్ని మనం ప్రమాణాలుగా చూపితే 'ఈరోజుల్లో మా ఆచారాలు వేరు' అంటారు. ఆచారాల్ని లేక ఋషులరచనల్ని వీటిలో దేన్నో ఒకదాన్ని మాత్రం అనుసరించాలి. పాతపద్ధతుల్ని నాశనంచేస్తేకదా నూతన విధానం అమల్లోకి వచ్చేది. పిరికివారు, భయభ్రాంతులు, స్వార్థపరులుగాను వారిని చెప్పవచ్చును. వారికి కావలసినదల్లా మస్తుగా భోజనం, ధనధాన్యాలు – వీటికోసం రాజుల్ని, యువరాజుల్ని తృప్తిపరచుటకు ఈ ప్రపంచంలో వారు ఏపనైనా చేస్తారు.'

'వారిమతంలో తక్కువ కులస్థులైన పేదలకు తావులేదు.'

'అవును వారు గొప్ప బహుమానాల్ని పొందవచ్చని దండయాత్రచేసిన గ్రీకులూ, శాక్యులూ మొదలగు క్షత్రియుల్ని గుర్తిస్తారు. కాని తక్కువతరగతి వారగు పాకీవారిని, జాలరులను మట్టిలో కలిసిపోవునట్లుగా చిత్రిస్తారు. ఏ మతంలో అయితే ఉదారత లేదో, ఏ మతంలో ధనబలాలు ప్రాధాన్యత వహిస్తాయో ఆ మతం మానవజాతికి కళంకం. ప్రపంచం మారుతుంది. వేదాల్లో ఆ మూలాగ్రంగా పురాతన కాలంనుంచి నేటివరకూ వ్రాయబడిన వాటినన్నింటినీ చదివితే వాటిలో గొప్పమార్పు కనిపిస్తోంది. కాని బ్రాహ్మణులు ఈ విషయాలన్నీ శాశ్వతమనీ, మార్పులేనివనీ వాదిస్తారు. ప్రియా ఇది ఎంత అసంగతం!'

'ప్రియా! ఈ దుష్ప్రభావాలకు కారణం నేనుకాదుకదా!'

ప్రభా: అవును, అందుకు నీకు కృతజ్ఞుడను. నా కవిత్వానికి శక్తినీ, జీవాన్ని పోశావు. అదేవిధంగా ఆత్మశోధనకు నాకు నీవే శక్తినిచ్చావు. నేను విజ్ఞానతీరాన్ని చేరుకున్నానా అనుకునేవాడిని. ఈ దురభిమానంచేతనే బ్రాహ్మణుడు సులువుగా పతనమౌతున్నాడు. కాని జ్ఞానం అనేది బ్రాహ్మణుల గుత్తకాదనీ వారి భోజపత్ర గ్రంథములయందు మాత్రమేకాక అది ఎంతో వ్యాప్తికలదని నేను గ్రహించాను.'

'నేను ఆడదానను మాత్రమే!'

'ఎవడైనా స్త్రీని స్త్రీ అనేకారణంచే నీచంగాచూస్తే అది నాకు చాలా అసహ్యం.'

'ఇంకా గ్రీకు స్త్రీలకు ఇతర స్త్రీలకంటె గౌరవం హెచ్చు. పిల్లలు లేకపోయినా మొదటి భార్య జీవించివుండగా మరొకతెను పురుషుడెన్నడూ వివాహంచేసికోడు.'

'సిగ్గు! కాని యీ బ్రాహ్మణులు వందలకొలది స్త్రీలను కేవలం ధనంకోసం వివాహమాడతారు. గ్రీకులెవ్వరూ బ్రాహ్మణమతాన్ని అనుసరించనందుకు నాకు సంతోషంగా ఉంది.'

'మేము బౌద్ధులమయినా వ్రతాలు మొదలైనవాటికి బ్రాహ్మలు మాయింటికి వస్తారు.'

'స్వలాభంకోసం వారు గ్రీకులను క్షత్రియులుగా అంగీకరించారు. అలాం టప్పుడు దక్షిణకోసం మీ యింటికి రావటానికి కెందుకు సందేహిస్తారు?'

'అయితే బ్రాహ్మణమతం నుంచి నీ విముఖత్వానికి నేను కారణం కాదన్న మాట?'

'నీపైనా ఫరవాలేదు. బ్రాహ్మణాభిమానం మన ఇరువురినీ విడదీయాలని చూస్తే దానిని నేను విసర్జనీయంగా భావిస్తాను!'

'ప్రియుడా! నీవు నన్నింతగా ప్రేమించటం చాలా ఆనందదాయకంగాఉంది.'

'ప్రేయసీ నీప్రేమే లేకపోతే నేను జీవచ్ఛవాన్నే!'

'అయితే నా ప్రేమకు ప్రతిఫలం ఏమిటి?'

'ఆ ఒక్క ప్రేమతప్ప అంతా నీదే.'

'నా ప్రేమ అమరజీవియగు అశ్వఘోషునకు అణుమాత్రమైనా హాని కలిగిస్తే.... ఆప్రేమ నాకువద్దు.'

'ప్రియురాలా! నీ ఉద్దేశం ఏమి?'

'మన ప్రేమకు ఆటంకములు కలుగజేయటం నా ఉద్దేశంకాదు. కాని ఆప్రేమ నీచేత శాశ్వతకీర్తిని కలుగజేసేవాటిని సృష్టించుటకే నేను చచ్చిపోతే ....'

అశ్వఘోషుడు ఆవేశంతో లేచి ప్రభాను ఎత్తుకొని హృదయానికీ హత్తుకొన్నాడు. ప్రభా అతనిబుగ్గలు తడిగాఉండడం చూచింది. ఆమె 'ప్రియా, ప్రియా' అంటూ అతడిని చాలాసార్లు ముద్దెట్టుకుంది. అశ్వఘోషుడు శాంతించినమీదట,

'విను, ప్రియుడా నా ప్రేమ నిన్నొక గొప్పబహుమతి కోరుతోంది. దానిని నీవు ఇవ్వాలి.'

'ప్రభా నావద్ద నీకు ఇవ్వగల దేమిలేదు.'

'నన్ను పూర్తిగా చెప్పనియ్యి'.

'నీవు ఏదో భయంకరమైన విషయం చెప్పేట్లే ఉన్నావు.'

'కాని నా అశ్వఘోషుని బాగుకొరకై నేను తప్పక చెప్పాలి. నీవు నీ అమర కవిత్వంవలె నా ప్రేమను గుర్తించాలి కాని నా శరీరంవలెకాదు. శాశ్వత అశ్వఘోషుని యొక్క ప్రభా ఎల్లప్పుడూ యౌవన సౌందర్యాలతో విరాజిల్లుతుంది. హృదయ పూర్వకంగా ఇందుకు అంగీకరించు.'

'అయితే నీవు అసలు ప్రభానుకాక ఊహాప్రభాను నాయెదుట ఉంచదలచావా?'

'నేను ఇద్దర్నీ సత్యంగానే భావిస్తానుప్రియా. అందులో ఒక ఆమె జీవిత పరిమాణం కలది, రెండవ ఆమె శాశ్వతంగా ఉండేది. నీ ప్రభ నీ ఊర్వశీ వియోగంలో శాశ్వతంగా ఉంటుంది. నా ప్రేమకు అమరత్వం కలిగించటానికి నీవు అమర అశ్వఘోషునివా. చాలా చీకటిపడింది. సరయూనదికూడా తరంగాలులేక నిద్రించినట్లుంది. నడు మనంకూడా ఇంటికి పోదాం.'

'నేను నా హృదయంలో అమరప్రభాయొక్క చిత్రాన్ని చిత్రించుకొన్నాను.'

'ప్రియుడా! అంతే. అదే నాకోరిక' అంటూ తనయొక్క మృదువైన కురులను అతని చెక్కిళ్ళకాన్చి తన్మయత్వంతో నిలబడిపోయింది ప్రభా.

——

# 7

అది ఒక పెద్దవాకిలి. అక్కడ మూడంతస్థుల మేడ; వరండా. వరండాలో కొన్ని పచ్చని బట్టలు ఆరవేయబడ్డాయి. అక్కడే మూలగా ఒక నుయ్యి, స్నానాల గదిఉన్నాయి. తక్కిన ఆవరణలో అనేక వృక్షాలున్నాయి. అక్కడ ఒక చిన్న అరుగు వుంది. అక్కడే రాతికటకటా లున్నాయి. దానిపై అనేక ప్రమిదలు ఉంచుటకు వీలుంది. ప్రభా ఒక మహావృక్షానికి నమస్కరించి 'ప్రియా! ఈజాతి వృక్షపు నీడనే గౌతమ సిద్ధార్థుడు ఆత్మచింతనచే భ్రాంతినుంచి విముక్తుడై జ్ఞాన నేత్రాన్ని తెరిచాడు. అప్పటినుంచీ అతనికి బుద్ధుడని పేరుకలిగింది. ఆ మధురస్మృతికొరకే మేము ఈవృక్షాన్ని పూజిస్తున్నాం.'

'అంతులేని ఆలోచనయే ఆతని విజ్ఞానానికి కారణం; అటువంటి సజీవ విజ్ఞానం ఎల్లప్పుడూ పూజనీయమైనది; అతని ఆత్మవిజయానికి హేతువు కాగలదు.'

వారిద్దరూ ధర్మరక్షిత్ వద్దకు వెళ్ళారు. అప్పుడే వికసించి పూలసుగంధాన్ని వెదజల్లుతున్న వకుళవృక్షం క్రింద అతను కూర్చొని వున్నాడు. బౌద్ధయోగినివలె ప్రభా ఆయనకు సాష్టాంగ దండప్రణామం చేసింది. అశ్వఘోషుడు నిలబడే గౌరవాన్ని ప్రదర్శించాడు. తరువాత వారిద్దరూ అక్కడఉన్న పద్మాసనములపై ఆసీనులయ్యారు. అశ్వఘోషుడు వేదాంతచర్చకు ఉపక్రమించగలడని సన్యాసిశిష్యులు అక్కడనుంచి వెళ్ళిపోయారు. మర్యాదగా కుశలప్రశ్నలు వేసినతరువాత అశ్వఘోషుడు వేదాంతంసంగతి ప్రస్తావించాడు.

'బౌద్ధమతంలోకూడా వేదాంతాన్ని జ్ఞానులు, బౌద్ధులు బంధనంగా భావిస్తారు.'

'ఆలాగైతే బౌద్ధమతంలో వేదాంతానికి స్థానంలేదా?'

'స్థానంలేకేమి? బౌద్ధమతమే వేదాంతమతం. వేదాంతం మానవునికి తెప్ప వలె ఉండాలికాని బంధనంగా ఉండరాదనిమాత్రం బుద్ధుడు చెపుతాడు.'

'తెప్ప-అంటే ఆతని భావం?'

'నదిని దాటవలసివస్తే ప్రజలు తెప్పను కట్టుకొని దాని సహాయంతో నదిని దాటుతారు. అంతేకాని ఆ తెప్పను భుజములపై నుంచుకొని మోసుకొనిపోరు.'

'తన మతంకోసమైనా, అవిధంగా ప్రకటించగలిగినవ్యక్తి సత్యాన్నిశోధించి దాని ఆనందాన్ని పొందినవాడై యుండాలి. మా మానసిక ఆనందంకోసం బుద్ధుని వేదాంతాన్ని గురించి వివరించవలసిందిగా కోరుతాను.'

'ఆత్మ శాశ్వతమైనదికాదు. కాని బ్రాహ్మణులు దానిని నాశనములేని ధృవ తారగా వర్ణిస్తారు. కాని బౌద్ధ ప్రపంచంలో ఏదీ శాశ్వతమైనదికాదు. అందువల్ల ఆత్మయందు నమ్మకములేనిదానిగా దాన్ని వర్ణింపవచ్చు. ప్రతిదీ క్షణభంగురం. ఒక క్షణంలో జన్మించుట, మరోక్షణంలో మాయంకావటమూను.

'ఈ భావం నాకు నచ్చింది. తెప్పతో పోల్చదగిన ఈమతాన్ని బోధిస్తూ, ఆత్మ అశాశ్వతమైనదని చాటుతున్న ఆ జ్ఞానిని నేను అత్యంత శ్రద్ధతో గౌరవిస్తా. నేను దేనిని అన్వేషిస్తున్నానో అది నాకు లభ్యమైంది. ఈభావాలే నాలోఉన్నాయి. కాని నేను వాటిని నిర్వచించలేకపోయాను. బుద్ధుని సిద్ధాంతములకు అనుగుణ్యంగా మానవులు ప్రవర్తిస్తే నూతన ప్రపంచం ఏర్పడగలదు.'

'టుహూరా ! నిజం ! నిజం ! నా మాతృభూమియగు గ్రీస్‌లో గొప్ప వేదాంత వేత్తలు జన్మించారు. వారిలో పైథాగరస్, హెరాసిలిటస్‌లు బుద్ధుని సమకాలికులే. డిమోసిరిటస్, ప్లేటో, అరిస్టోటిల్ కొంతకాలం తరువాత జన్మించారు. ఈ గ్రీకు వేదాంతులు చాలా శోధించారు. వారిలో ఒక్క హెరాసిలిటస్ మినహా మిగతావారు అమరత్వంకంటె హెచ్చుగా ఊహించలేకపోయారు. ఈకాలంఅంటే వారికి చాలా యిష్టం. ఎందువల్లనంటే భవిష్యత్తునుకూడా వాళ్ళు దీనితో ముడివేద్దామని చూస్తారు. బుద్ధునివలె ఆశాశ్వతాన్ని నమ్మరు. అతని వేదాంతంలో స్వార్థంఉంది.'

'వేదాంతులకు స్వార్థం ఎలాకలుగుతుంది ?'

'మిత్రా ! స్వార్థం ప్రతివిషయంలోను పనిచేస్తుంది. ఆరోజుల్లో మా ఏథెన్సు పట్టణం ఒక ప్రజాస్వామ్యం; రాజరికంలేదు. మొదటి రోజుల్లో రాజ్యాధికారం హెరాసిలిటస్ వంశీయులచేతులలో ఉండేది. అతనికి రాజ్యవ్యవహారాలు నచ్చలేదు. అతడు దేశాభివృద్ధికొరకు మార్పును కోరలేదు. సరికదా దేశాన్ని ఎంతమాత్రం అభివృద్ధి కానివ్వలేదు.

'ఓ సాధూ ! మనంకూడా విప్లవాన్ని కోరాలి. మనలను ముందుకు గొనిపో గలది విప్లవం. ఎందువల్లనంటే దేశం నిద్రావస్థలోఉంది.'

'యువకుడా! నీవు చెప్పినది సత్యం. ప్రపంచాన్ని మరింత ఆనందదాయకంగా చేయగల విప్లవాన్ని బుద్ధుడు కోరాడు. రేపటి ప్రపంచానికి ఆదర్శప్రాయులగు సన్యాసుల్ని అతడు తయారుచేసాడు.'

'హెచ్చు తగ్గులూ, వర్ణభేదాలులేని ప్రపంచాన్ని.'

'ఎక్కడ కష్టసుఖాలు అందరికీ సమానంగా ఉంటాయో దాన్ని-చీపురుచేతబట్టి మహామహుడగు ధర్మసేన్ వీధులు తుడుచుట నీవు ఎప్పుడైనా చూశావా?'

'ఆనల్లటి మనిషా?'

'ఔను. అతడు అందరికంటె ఉత్తముడు. ప్రతిదినం భక్తితో అతనికి మేము ప్రణమిల్లుతాం. అతడు కోసల్‌లోని అన్ని బౌద్ధగృహాలకు అధికారి.'

'అతడు మాలమాదిగల వంశీకుడట. నిజమేనా?'

'కుమారా! బౌద్ధగృహాలలో కులాన్ని పాటించరు. అక్కడ మానవుని గుణాలకే ప్రాధాన్యత. అతని విజ్ఞానం, సుగుణసంపత్తియే అతడు మాపైవాడుగా ఉండుటకు కారణం. అతడు మా తండ్రి. భిక్షాటనకు బయలుదేరితే ఏకొద్దిగా సంపాదించినా దానిలో కొంతభాగం లేనివారికి పంచిపెట్టకుండా తానెన్నడూ తినడు. అది బుద్ధుని ఉపదేశం. మూడు వస్తువులు తప్ప మిగతా ఆస్తిఅంతా అందరిదీ. అవి భిక్షాపాత్ర, మరచెంబు, దువ్వెనయూను. మిగతావన్నీ ఇళ్ళు, తోటలు, బల్లలు, అందరికీ చెందుతాయి. కొన్ని బౌద్ధగృహాలకు భూవసతికూడా ఉంది. క్రొత్తవానిని మాలో చేర్చుకొనునప్పుడు మేము శల్యపరీక్ష చేస్తాం. అయినపిదప అతడు భిక్షువు. మా సమాజంలోని అందరివలెనే చూడబడతాడు.'

'జాతి యావత్తూ ఆ సమాజంలో చేరుటట్లుచేస్తే మాత్రమేమి?'

'కుమారా! అది ఎట్లుసాధ్యమౌతుంది? రాజులు, భాగ్యవంతులు తమను యితరులలో సమానులుగా ఎప్పుడు అంగీకరిస్తారు! ఒక దాసుని మఠంలో చేర్చుకున్నారు, అతడు దాసత్వమునుంచి విముక్తుడయ్యాడు. అతని యజమాని గోలపెట్టసాగాడు. ఇతర యజమానులు అతన్ని బలపరచసాగారు. అతడు వెయ్యి

మంది బానిసల యజమాని. తన ఆస్తికి కలుగుతున్న నష్టాన్ని ఎట్లు ఓర్చగలడు? బుద్ధుడు అప్పటినుంచీ సమాజంలో బానిసలు చేర్చుకొనబడరాదని తీర్మానించాడు. వర్గభేదములతో కూడివున్న మనసమాజం, సముద్రం మధ్య దీపంవలె ఉంది. బానిసత్వం, బీదరికం ఈ ప్రపంచంలో ఉన్నంతకాలం అది సురక్షితంగా ఉండజాలదు.

---

# 8

అది శరదృతువు. నాడు పూర్ణిమ; సూర్యాస్తమయంతోనే చంద్రుడు తన చల్లని కిరణాలతో తూర్పున ఉదయించాడు. అశ్వఘోషుడు ఎక్కువకాలం ప్రభా ఇంటివద్దనే గడుపుతున్నాడు. వారిరువురూ డాబాపై పండువెన్నెలలో కూర్చొని ఉన్నారు.

'ప్రియుడా! సరయూనదీ కెరటాలు నన్ను పిలుస్తున్నాయి. మన ఇరువురి స్నేహానికీ, మనల్ని బంధించివేసిన ఈ మోహానికీ కారణం ఆ కెరటాలే. ఇది జరిగి రెండుసంవత్సరాలు గడిచినా నేటిదిలావుంది. మనం ఎన్ని సుఖమయ రాత్రులు సరయూనదీతీరాన వెన్నెల వెలుగులో గడుపలేదు! అవి ఎంత హృదయంగమమైనవి? నేటి చంద్రబింబం అదుగో! నడు. మనం నదీతీరానికి పోదాం!'

వారిరువురూ బయలుదేరారు. పట్టణానికి కొంతదూరంలో నది ప్రవహిస్తోంది. తెల్లటి వెన్నెలలో, ఇసుకపై వారు చాలా దూరం నడిచారు. ప్రభా చెప్పులను చేతితో పట్టుకొని నడుస్తోంది. ఇసుక కాళ్ళకు తగులుతుంటే నడక ఎంత ఆహ్లాదకరంగా వుంటుంది?

'ఇసుక పాదాలకు తగులుతుంటే ఎంత ఆనందంగావుంది' అంటూ ఆమె అశ్వఘోషుని తనచేతుల్లోకి తీసుకొంది.

'అది పాదాలకు చక్కలగిలి.'

'దానివల్ల శరీరం గగుర్పొడుస్తుంది.'

'ఒకప్పుడు మన మిద్దరం పారిపోవాలనిపిస్తుంది నాకు. మన ప్రేమకు అసూయపడే వారెవ్వరూ లేని ప్రపంచానికి పోవాలనిపిస్తుంది. నీవు నన్ను త్తేజపరచి వ్రాయించిన గీతాల్ని మన మిరువురం వీణాగానం చేయటానికి వీలైన చోటికి పోవాలనిపిస్తుంది. ఈలాంటి శరద్రాత్రులందు, యీ ఇసుకతిన్నెపైన నావీణను తెచ్చుకుందుకు వీలులేదు. ప్రజలు ఇక్కడకు వస్తారు. వారి అసూయతోకూడిన దృష్టిదోషం మనకు తగులుతుంది.'

'తప్పుగా భావించకు – నేను మరణించినట్లయితే అని నాకు అప్పుడప్పుడు తోస్తుంది——'

'వద్దు. ప్రేయసీ! ఎప్పటికీవద్దు. మనం యిప్పటివలెనే జీవిద్దాం!' అంటూ అశ్వఘోషుడు ఆమెను తన బాహువులతో బిగియగట్టాడు.

'నా అభిప్రాయం అదికాదు. ఒక్కసారి ఊహించు – నీవు మరణించవలసి వస్తే, నేను వంటరిదాననై పోతాను. అది ఈ ప్రపంచంలో జరిగిరీరుతుంది. అలాకాదా?'

'ఔను. అది జరుగుతుంది.'

'ప్రియుడా! నీ మరణాన్ని గురించి ప్రస్తావిస్తే నీవు ఎందుకు చలించలేదు? నిన్ను కోల్పోతే నేను విచారసాగరంలో మునిగిపోతా!'

'ప్రభా ఇటువంటి సంగతులుచెప్పి నన్ను కష్టపెట్టకు.'

ప్రభా అతన్ని ముద్దెట్టుకొని ఓదారుస్తూ 'జీవితం బహు సుఖమైనది. ఎల్ల కాలం వెన్నెలరాత్రులుండవు. చీకటిరోజులు ఎక్కువగా వుంటాయి. మనలో ఒకరు మరణిస్తే రెండోవారు ఏమిచెయ్యాలని మాత్రం నేను చెప్పదోతున్నాను. నిన్ను కోల్పోతే నేను ఏమిచెయ్యాలో నీకు తెలుసా?' అంది.

పెద్ద నిట్టూర్పు విడుస్తూ తలవంచుకొని 'ఏంచెయ్యాలి?' అన్నాడు.

'నన్ను నేను ఎన్నడూ చంపుకోను. బుద్ధభగవానుడు ఆత్మహత్య తెలివి తక్కువ పని అనీ, నిందార్హమైనదనీ చెప్పాడు. నేను వీణ నేర్పుతో వాయించగల నని నీకు తెలుసునుగదా!'

'మంచిది. నీవు వీణవాయిస్తుంటే తన్మయుడనై ఎన్నిసార్లు నేను దానితో మేళవించి పాడలేదు.'

'మంచిది. అది జరిగితే నా అశ్వఘోషుడు నావద్దనుంచి వేరు చేయబడినట్లే! కాని తరతరములకూ కవివరేణ్యుడగు శాశ్వత అశ్వఘోషుడైనానే నేను. నేను నా వీణను ప్రయోగిస్తూ, గీతాల్ని గానంచేస్తూ భారతదేశంలోనేకాక యితర దేశాల్లో కూడా నా జీవితపర్యంతం సంచరిస్తా. మన జీవన వాహినులు మరొకజన్మలో, మరొక దేశంలో కలిసేవరకూ కూడాను. ప్రియుడా! నేను మరణిస్తే నీవు ఏమిచేస్తావు?'

ఈ మాటలకు అశ్వఘోని శరీరంలోని ప్రతి అంగం, ప్రతి నరం కంపించి పోయాయి. ప్రభా అతని శరీరం కంపించడం చూడగలిగింది. అతడు మాట్లాడ్డానికి ప్రయత్నించాడు, కాని అవి తడబడ్డాయి. కన్నులు చెమర్చాయి. కొన్ని క్షణాలు మాట్లాడ్డానికి యత్నించినతరువాత 'అది భయంకరకష్టం! కాని ప్రభా! నేను మాత్రం నన్ను చంపుకొంటానా? నీ ప్రేమజ్యోతి నా హృదయంలో వెల్గినంతకాలం నేను గానంచేస్తాను— జీవితాంతంవరకూ కూడాను— నీ శాశ్వత అశ్వఘోషుడు....' అని మాట్లాడుతూంటే, అతని మాటలు తడబడి ఆగిపోయాయి. 'ప్రేయసీ నది నిద్రపోతోంది. మనం యింటికి పోదాం' అన్నాడు అశ్వఘోషుడు.

---

# 9

వేసంగిలో సువర్ణాక్షికి జబ్బుచేస్తుంది. రాత్రి పగలు అశ్వఘోషుడు తల్లి ప్రక్కనే ఉంటాడు. ప్రభాకూడా పగలంతా ఆమెవద్దనే వుంది. మందులు పనిచెయ్య లేదు. రోగిపరిస్థితి మరింత పాడైంది. పౌర్ణమిరాత్రి వచ్చింది. వెన్నెల పిండార పోసినట్లుంది. డాబాపైకి వెన్నెలలోకి తనను తీసుకొనిపోవలసినదిగా సువర్ణాక్షి

కోరింది. ఆమె పరుండుటకు పైన ఏర్పాటుచేయబడింది. ఆమె శరీరంలోని ఎముకలు బయటపడ్డాయి. ఆమెను చూస్తే కుమారుని హృదయం పగిలిపోసాగింది.

'చంద్రకాంతి ఎంతబాగుంది' అని రోగి నెమ్మదిగానైనా, దృఢస్వరంతో అంది. ఆమాటలు వింటుంటే అతడికి ప్రభామాటలు– 'సరయూనదీ కెరటాలు పిలుస్తున్నాయి.' అనేవి వినిపించసాగాయి. అతని శరీరం గగుర్పొడిచింది.

'ప్రభా ఏదీ?' అంది అతనితల్లి.

'అమ్మా! ఆమె యింటికి వెళ్ళింది. సాయంత్రంవరకూ యిక్కడే వుంది.'

'ప్రభా .... కుమార్తె .... నాయనా .... ఆమెను ఎన్నడూ విస్మరించకు.' అంటూ ముగించకమునుపే ఆమె ఆయాసంతో దగ్గుతూ ఉన్న సమయంలో స్పృహ తప్పిపోయింది. మరిరెండుసార్లు అలాజరిగినతరువాత ఆమెశరీరం చల్లబడిపోయింది; చైతన్యరహితమైంది.

సువర్ణాక్షి అంతరించిపోయింది. ఆమె కుమారుడు శోకవిహ్వలుడయ్యాడు. రాత్రంతా అతడు విచారించాడు. మరుసటిదినం మధ్యాహ్నంవరకూ ఆమె అంత్యక్రియలతో గడిచిపోయింది. అప్పుడు అతనికి ప్రభా జ్ఞాపకం వచ్చింది. అతడు దత్తమిత్రుని యింటికి వెళ్ళాడు. ప్రభా తల్లిదండ్రులు ఆమె అతనితో ఉన్నదని భావించారు. గతరాత్రి తగిలిన దెబ్బప్రభావం యింకా అశ్వఘోషుని మనస్సును వికలంచేస్తోంది. ఇప్పుడు అతడు మరింత ఆందోళనచెందాడు. అతడు ప్రభా పడకగది లోకి వెళ్ళాడు. ఎక్కడి వస్తువు అక్కడే వున్నాయి. పరుపుమీద పరువబడివున్న తెల్లటిదుప్పటిని తొలగించాడు. అక్కడ తన చిత్రపటాన్ని చూశాడు. ఒక గ్రీకు చిత్రకారునిచే ప్రభా ఆచిత్రాన్ని గీయించింది. అప్పుడు అశ్వఘోషుడు తప్పనిసరిగా అతనిదగ్గర రెండుగంటలు కూర్చొనిపోయాడు. ఆ పటముపై మల్లెపూలదండ ఉంది. దానిక్రింద ప్రభా వ్రాసిన భోజపత్రలేఖ ఒకటి ఉంది. అతడు ఆ ఉత్తరాన్ని తీసు కొన్నాడు. దానిపై వేయబడిన ముద్ర ఇంకా తడిగానే ఉంది. అతడు ముద్రను కదపకుండా ఆ పత్రాన్ని తెరిచాడు. కొద్దివాక్యాలు మాత్రమే ఉన్నాయి. ప్రభా దస్తూరియే.

'ప్రియుడా! ప్రభా నీవద్దనుంచి సెలవుతీసుకొంటోంది. సరయూనదీ కెరటాలు నన్నుపిలిచాయి. నేను వెళ్ళిపోతున్నాను. నా ప్రేమకు ప్రతిఫలంగా నీవు నాకొక

వాగ్దానాన్ని చేశావు జ్ఞాపకంఉందా? నా శాశ్వత యౌవనాన్ని, మార్పుపొందజాలని నా సౌందర్యాన్ని నీకు వదలిపెట్టి నేను వెళ్ళిపోతున్నాను. ఇక నీవు తెల్లనివెంట్రుకలు, ఊడిపోయిన పళ్ళు, వంగిపోయిన నడుముగల ప్రభాను చూడవలసిన అవసరం లేదు. నా ప్రేమ, నా శాశ్వతయౌవనం నిన్ను ఉత్తేజపరచుటకు ఎల్లకాలం మిగిలి ఉంటాయి. వాటి సందేశాల్ని ఎన్నడూ విస్మరించవద్దు. ప్రియుడా! మీ కుటుంబం నన్ను నిందించుటవల్ల నేను ఆత్మహత్య చేసుకొన్నానని భావించవద్దు. నేటివరకు లోపరహితమైన నా సౌందర్యాన్ని ఉత్తమకావ్యరచనకు నిన్ను ఉద్దీపితుని చేయుటకు విడిచిపోతున్నాను. ఆఖరుసారి నీప్రియురాలు ప్రభా నిన్ను కౌగలించుకొని, మానసికంగా ముద్దుపెట్టుకుంది.'

ఉత్తరాన్ని ముగించేలోపుగా అనేకసార్లు అశ్వఘోషుడు కన్నీటిని తుడుచుకొన్నాడు. ఉత్తరం అతనిచేతులనుంచి జారిపడింది. హృదయస్పందనం ఆగిపోయింది. అది పూర్తిగాపనిచేయుట ఆగిపోవుటకొరకు నిరీక్షిస్తున్నట్లు అతడు విచారంతో నిశ్చేష్టుడైపోయాడు. మట్టిబొమ్మ నేత్రములవలె అతని కాంతివిహీన నేత్రములు అర్థరహితంగా చూస్తున్నాయి. కొంచెంసేపటితరువాత ప్రభా తల్లిదండ్రులు గదిలోప్రవేశించి, అతనిస్థితిని చూచి నిశ్చేష్టులయ్యారు. అతనిదగ్గర పడివున్న ఉత్తరాన్ని చూచి తీసి చదివారు. ప్రభాతల్లి పెద్దగా కేకవేసి నేలకూలింది. దత్తమిత్రుని నోట మాటలేదు. అతనికళ్ళు కాల్వలు కట్టాయి. ఇంకా అశ్వఘోషుడు తదేకదృష్టితో అదేస్థితిలోఉన్నాడు. చాలాసేపు నిరీక్షించి అందరూ బయటకు వెళ్ళిపోయారు. చీకట్లు అలముకున్నాయి. అశ్వఘోషుడు ఇంకా అక్కడేవున్నాడు. అతనికళ్ళు పొడిబారిపోయాయి. అతని గుండె ఘనీభవించిపోయినట్లు తోస్తుంది. రాత్రి పొద్దుపోయినతరువాత కూర్చున్నచోటుననే అతడు వాలి నిద్రపోయాడు.

ఉదయాన్ని ప్రభాతల్లి వచ్చి ముడుచుకొని కూర్చున్న అశ్వఘోషుని చూచింది. అప్పుడు అతడు; 'తల్లీ! నేను బాగానేఉన్నా. ప్రభా నాకు ఒప్పగించినపని నేనుచేస్తాను. ఆమెకు తెల్సు కాని నేను అర్థంచేసుకోలేకపోయాను. ఆమె నా కర్తవ్యాన్ని నాకు బోధించింది. ఆమె నన్ను సజీవునిగా చేసింది. నేను ఈ ప్రాణదానాన్ని ఆత్మహత్యగా చేయవచ్చు! కాని నేను అంతటి కృతఘ్నుణ్ణికాదు.' అన్నాడు.

అశ్వఘోషునిభావాన్ని ఆమె అర్థంచేసుకొంది. అతడు లేచి నిలబడ్డాడు. 'కుమారా! ఎక్కడికి పోతున్నావు?' అంది.

'నేను బౌద్ధసన్యాసిని కలుసుకోవాలి. సరయూనదిని చూడాలి.' అంటుంటే ఆతని గొంతుకలో ఏదో అడ్డుపడి నట్లయింది.

'సన్యాసి ధర్మరక్షిత్ నీకోసం బయట వేచియున్నాడు. సరయూనదిని చూచుటకు వెళ్ళినప్పుడు నేనుకూడా నీతో వస్తా.' అని చెపుతూ మరొక మాటయినా చెప్పలేకపోయింది ప్రభాతల్లి.

అశ్వఘోషుడు బయటకువెళ్ళాడు. తనకొరకు వేచియున్న బౌద్ధ సన్యాసి ధర్మరక్షిత్‌కు ప్రణమిల్లుతూ 'నన్ను మీమఠంలో చేర్చుకోండి.' అన్నాడు భక్తి పూర్వకంగా.

'కుమారా! నీవు గొప్పకష్టంలో ఉన్నావు.'

'ఔను. అది గొప్పకష్టమే. కాని అది నన్ను ప్రోత్సహించుటలేదు. ప్రభా యిందుకునన్ను సంసిద్ధుణ్ణి చేసింది. నేను గ్రుడ్డిగా యిందుకు తయారవుటలేదు.'

'ఇంకా నీవు కొంతకాలం ఆగాలి. అంతతొందరగా నిన్ను సమాజంలో చేర్చుకోం.'

'ఆగుతాను. కాని నన్ను బౌద్ధవిహారంలో ఉండనివ్వాలి.'

'ముందుగా నీవు నీతండ్రిఅనుమతి పొందాలి. తల్లిదండ్రుల అంగీకారము లేనిదే ఎవరినీ మా సంఘంలో చేర్చుకోం'.

'అలా అయితే నేను వెళ్ళి వారి అనుజ్ఞ పొందుతా' అంటూ అశ్వఘోషుడు అక్కడనుంచి బయలుదేరాడు. ప్రభాతల్లి ఆమాటలు విని అతని వెంబడి బయలు దేరింది. వారిద్దరూ ఒకనావపై నదిలో బయలుదేరి వెతుకుతూ ప్రవాహంవెంబడే పోయారు. మరునాడు కూడా యింకా ముందుకుపోయి వెతికినా ప్రభాజాడ తెలియలేదు.

అశ్వఘోషుడు ఇంటికి వెళ్ళి భిక్షువగుటకు తండ్రి అనుమతిని కోరాడు. స్వభావసిద్ధంగా తండ్రి తన ఏకైక పుత్రుడు సన్యసించుటకు అంగీకరించలేదు. అప్పుడు అశ్వఘోషుడు 'నా తల్లికోసంకాని, ప్రభా కోసంకాని విచారాన్ని తట్టుకోలేక నేనీపని చేయటంలేదు. నా జీవిత పరమావధికి నే నీమార్గాన్నే వరించాను. నా మాట లనుబట్టి నడతలు చూచి నీవు నే నేవిధమైన మానసిక దౌర్బల్యానికి గురికాలేదని తెలుసుకోవచ్చు నాన్నా. నేను మరికొంతకాలం జీవించాలని నీవంటే నీవు అనుమతినియ్యి.'

మరునాడు కన్నీళ్ళు గ్రుక్కుతూ తండ్రి అనుమతినిచ్చాడు. సాకేతపు చెందిన బౌద్ధవిహారంలో అశ్వఘోషుడు సన్యసించాడు. మహాస్థవిరధర్మసేనుడు ఉపదేశమిచ్చాడు. ధర్మరక్షితుడు గురువు అయ్యాడు. తరువాత నావపై పాటలీపుత్రం వెళ్ళుతున్న ధర్మరక్షితుని అశ్వఘోషుడు అనుసరించాడు.

---

## 10

పాటలీపుత్రమునందలి బౌద్ధవిహారంలో అశ్వఘోషుడు పది సంవత్సరాలు గడిపాడు. బౌద్ధమతంతోపాటు అతడు బౌద్ధ, గ్రీకు వేదాంతశాస్త్రాల్లో అసమాన పాండిత్యాన్ని సంపాదించాడు. మగధలోని విద్వాంసులగు మతగురువులలో అతడు ఉన్నత స్థానాన్ని ఆక్రమించాడు. ఇదే సమయంలో పశ్చిమాన్నుంచి దండెత్తుతున్న శాక్యరాజగు కనిష్కుడు విజయవంతంగా పాటలీపుత్రం చేరాడు. పాటలీపుత్రం, మగధ బౌద్ధమతానికి ముఖ్య కేంద్రము. కనిష్కునకు యీ మతమందే విశేషమైన అభిమానం. అతడు 'గాంధారకు' తనతో ఒక గొప్ప విద్వాంసుడగు భిక్షువుని తీసుకొనపోగోరాడు. ఆతని తమ్ములు అందుకు అశ్వఘోషుని ఎన్నుకొన్నారు. పురుష పురం (పెషావరు) శాక్య, గ్రీక్, టర్కీ, పెర్షియన్, భారతీయ దేశముల యొక్క సమ్మిళిత విజ్ఞాన కేంద్రమని అశ్వఘోషుడు తెలుసుకున్నాడు. ఇదివరలో అతడు భారత సాహిత్యంలో గ్రీకునాటకాన్ని ప్రవేశపెట్టాడు. ఇప్పుడు గ్రీకు వేదాంతాన్ని శోధించి అందలి ప్రత్యేక విషయాల్ని, విపులీకరణ విధానాల్ని భారతవేదాంతంలో అనగా బౌద్ధమతంలో ప్రవేశపెట్టి దాన్ని భాగ్యవంతమైనదానిగా చేశాడు. గ్రీకు శాస్త్రములను బౌద్ధులకు మార్గదర్శకంగా చేసింది ఇతడే. అతనిని తరువాత వారు

అనుసరించవలసి వచ్చింది. విజ్ఞానశాస్త్రం, గణితం, దేహసంబంధమైన శాస్త్రము, తత్వము మొదలగునవన్నియు గ్రీకు శాస్త్రంనుంచే ఈయన తీసుకున్నాడు.

ప్రథా అతని మానసిక వికాసానికి తోడ్పడింది. బౌద్ధుడైన అశ్వఘోషునికి తరతమభేదంలేదు. ఆమె ప్రోత్సాహంవల్ల అతడు అనేక కావ్యాలు, నాటకాలు, కథలు మొదలైనవి వ్రాశాడు. తరువాత వాటిలో కొన్నిపోయాయి. కాని ప్రకృతి అతనిని ప్రత్యేక శ్రద్ధతో చూచింది. 700 సం॥ల తరువాత మధ్య ఆసియాలోని గోబీ ఎడారిలో సారిపుత్ర అనే అతని నాటకం దొరికింది. అతడు రచించిన బుద్ధ చరిత్ర, సౌందరానంద అను కావ్యములు ప్రపంచంలో శాశ్వతస్థానాన్ని పొందాయి.

అతడు తన గ్రంథాల్లో తనను 'సాకేతవాసియగు సువర్ణాక్షి యొక్క పుత్రుడను అశ్వఘోషుడను' అనివర్ణించి వాటికి అపూర్వం కలిగించాడు.

---

# "సుపర్ణ యౌధేయ"

## (పన్నెండవ కథ)

[కాలం:— క్రీ. తరువాత 420.]

నేనెంత దురదృష్టవంతుణ్ణి. నేనెల్లప్పుడూ తిరుగుతూనే వుంటాను. కాని ఎక్కడా స్థిరంగా ఉండను. జీవితంలో సుఖములకంటె కష్టాలే ఎక్కువ. వర్షం తరువాత కొద్దిగా చినుకులు, ఎండా ఎల్లాగుంటుందో అల్లాఉంది నాజీవితం. ఇటువంటి మార్పు ఎందుకు జరుగుతోందో తెలియదు. ఉత్తరగాంధారంలో గోమాంసం భుజిస్తారు. కాని మధ్యప్రాంతంలో (యుక్తప్రాంత-బీహారు)లో ఆ మాట తలచుకొంటేనే పాపం. అక్కడ గోబ్రాహ్మణ రక్షణయే ముఖ్యధర్మం. ధర్మంకోసం అంత పట్టింపెందుకో తెలియదు. ఒకచోట అది అధర్మం అవుతుంది. ఆయా ప్రదేశాల్లో పరివర్తనం ఏకకాలమందు జరుగకపోవటమే దీనికి కారణం అయివుండాలి. తరువాత ఆ ధర్మం అనుసరించబడుతుంది ఇంకోచోట అని నాకు తోస్తుంది.

నేను అవంతీ ప్రాంతంలో క్షిప్రానదీతీరాన ఉన్న ఒకగ్రామంలో పుట్టాను. నా కులస్థులకు భూమీ పుట్రా ఉన్నా వారు గుంపులువారుగా పరిగణింపబడతారు. నిజానికి తమ గృహాల్ని, భూముల్ని ఎక్కడకీ తీసికొనివెళ్ళలేరు. మా రూపమూ, మాశరీరాలు తక్కిన గ్రామస్థులకంటే వేరుగా ఉంటాయి. వారు చాలా పొడుగ్గాను, బాగా ఎర్రగానూ ఉంటారు. ఇతరులయొక్క గొప్పతనాన్ని చూచి ఓర్వలేరు. నాతల్లి పచ్చటి ముఖంతోనూ నల్లటి కురులతో ఎంతో అందంగా ఉంటుంది. మావాళ్ళు మేము బ్రాహ్మణులమని అంటారు. ఇతరులు దీనిని నమ్మరు. నమ్మడానికి వీల్లేనిది కూడాను. అక్కడి బ్రాహ్మణులు లాగుడుమూపైనా తలపెట్టరు. మా యింట అహర్నిశయూ అది లేకపోతే గడవదు. మేము స్త్రీపురుషులం కలసి నాట్యంచేస్తాము. వారిలో అదిలేదు. మాకులంవాళ్ళ అంతా ఒకచోటచేరి ఆడుకునేవాళ్ళం. చిన్నప్పుడు అన్నిచోట్ల ఇల్లాగేఉంటుందని అనుకునేవాణ్ని. కాని పెద్దయ్యాక ఆవూరి బ్రాహ్మణ పిల్లలతో ఆడుకుంటే వాళ్ళ వేళాకోళం చేయడమూ, మేమూ బ్రాహ్మణులం అని ఒప్పుకున్నా కులం విషయంలో వారికి నమ్మకం ఉండేదికాదు. మాగ్రామం చాలా

పెద్దది. అనేకమంది కోమట్లున్నారు. నాగరులు దుకాణాలు పెట్టినా మాకుమల్లెనే బ్రాహ్మణులం అని చెప్పుకుంటారు. మేము అనేకమంది నగరకుల కన్యలను పెండ్లిజేసికొన్నాం. బ్రాహ్మణులం కాదనడానికి ఇదో కారణం. నా స్నేహితులు నామీద కోపంవచ్చి 'కోడిపుంజు' అంటారు. నేను మా అమ్మని 'అదేమిటి' అని అడిగితే ఆమెమాట మరిపిస్తోంది.

నేను ఇప్పుడు పెద్దవాణ్ణయ్యాను. నాకు పదేండ్లవయస్సు ఇప్పుడు. ఈవూరిలో ఒక బ్రాహ్మణ బడికిపోయి చదువుకుంటున్నాను. నేను యింకోయిద్దరు నగరబాలురూ తప్పితే ఆ బడిలోని పిల్లలంతా బ్రాహ్మణులే. మా బ్రాహ్మణీకం మాత్రం అనుమానాస్పదం. మాగురువుగారికి నేనంటే ఎంతో ప్రేమ. ఎందుచేతఅంటే నేను తెలివైనవాణ్ని కాబట్టి. మా కులాచార ప్రకారం నేను తగవులమారిని. ఒకనాడు నన్నొక బ్రాహ్మణ బాలుడు తిడుతూ 'మాగొప్పబ్రాహ్మడివి బయల్దేరావు. కోడిపుంజూ, నా బంధువుని గ్రీకుడవై బ్రాహ్మణ్ణని చెప్పుకుంటావూ! సిగ్గులేదూ!' అన్నాడు. చిన్నప్పుడు ఇల్లాగేతిట్టేవారు- అప్పుడు ఆమాటలు తెలియక బాధ అనిపించేది కాదు. మాబడిలో మేము ముగ్గురమూకాక ముప్పదిమంది మగపిల్లలూ, నలుగురు ఆడపిల్లలూ ఉండేవారు. వాళ్ళు మావలె పచ్చవారు. కాని మావలెకాక వాళ్ళకొంచెం పొట్టిగా ఉండేవాళ్ళు. అయినప్పటికీ వారికి అంతా జడవలసిందే!

ఒకనాడు నేను ముఖం దిగాలుపైచుకొని ఇంటికెళ్ళాను. మా అమ్మనన్ను ముద్దెట్టుకొని —

'ఏం, నాయనా విచారంగా ఉన్నావు?'

'అమ్మా మనం బ్రాహ్మలంకాదా? వీళ్ళంతా మనం బ్రాహ్మలం కామని అంటున్నారు.'

'నాయనా, మనంపరదేశ బ్రాహ్మలం అంచేత వాళ్ళు అలా అనుకుంటున్నారు.'

'బ్రాహ్మలేకాదు, క్షత్రియులూవా అల్లాగే అంటున్నారమ్మా!'

'వారు బ్రాహ్మణులమాటలనే వల్లిస్తారు.'

'మనము యజమానిలేము. బ్రాహ్మలు పౌరోహిత్యం చేస్తారు. భోజనాలకు వెడతారు. అవి మనటలంలో లేవు. బ్రాహ్మణులు తమ పంక్తిలో మనకు భోజనంపెట్టరు. అమ్మా! నీకు తెలిస్తే చెప్పవూ?'

మాఅమ్మ ఎన్నోచెప్పింది. కాని నాకు సంతోషం కలగలేదు. నేను యిల్లా బాధపడుతుంటే నా నాగరిక స్నేహితులూ యింకా మాతులస్థులూ నన్ను ఓదార్చేవారు. నేను వాళ్ళకి ధైర్యంచెప్పేవాడిని.

---

## 2

కాలం గడిచిపోయింది. నాకు 13 సం॥లు వచ్చేసరికి పాఠశాలలో నా చదువు పూర్తిఅవచ్చింది. నేను ఋగ్వేదము, ఐతరేయ బ్రాహ్మణము, వ్యాకరణము, నిరుక్తము, ఇంకా కొన్ని పద్యకావ్యములు చదివాను. నా ఉపాధ్యాయుడు నన్ను ఎక్కువగా ప్రేమించసాగాడు. అతని కుమార్తె విద్య నాకంటె నాలుగు సంవత్సరములు చిన్నది. ఆమెకు నేను చదువుకొనేటప్పుడు సహాయపడేవాడిని. తల్లిదండ్రులు నన్ను ఏవిధంగా చూస్తున్నారో తెలిసినదగుటవల్ల ఆమెకూడా నన్ను సోదరునివలె చూస్తూఉండేది. ఉపాధ్యాయుని భార్యకూడా నన్ను తల్లివలె ప్రేమించింది.

ఆ రోజులలో మరొకసారి నా తోటివిద్యార్థి ఒకడు నన్ను 'కోడిపుంజు' అని పిలిచాడు. దానికి కారణం నేను బాగా చదవటం, వ్రాయటంవలనా వాడికి కలిగిన అసూయయే – కాని నేను యిప్పుడు చాలా నెమ్మది అలవరచుకొంటున్నా – కోపం లేదనికాదు, కాని ఆత్మనిగ్రహాన్ని కూడా అలవరచుకొంటున్నా.

మా తాతకు 70 సం॥రాలకు పైగా వుంటాయి. నేను అనేక దేశాలను గురించి, తగాదాలను, యుద్ధాలనుగురించి ఆయనవద్దనుంచి అనేక కథలు విన్నాను. అతడూ, అతని సోదరులే ఈ గ్రామంలో మొట్టమొదట నివాసమేర్పరచుకొన్నవారనికూడా నాకు అతడే చెప్పాడు. మా వంశపు పుట్టుపూర్వోత్తరాలు ఆతనినుంచి తెలుసుకోవలెనని నేను నిశ్చయించా. మా గ్రామమునకు తూర్పున ఒక మామిడితోపు వుంది. ఇంకా పండకపోయినా పళ్ళు బాగానేవున్నాయి. మా బానిస సోనా వాటిని కాచుటకు గుడిసెవేసుకొని అక్కడే కాపురముంది. మా తాత మొదట్లో ఈ గ్రామం వచ్చినప్పుడు దక్షిణమునుంచి వచ్చిన ఒక వర్తకునివద్దనుంచి సోనాను నలభై వెండి

నాణెములకు కొన్నాడు. అప్పుడు సోనా బహుశా చిన్నవయస్సుదై వుండివుండాలి. లేకపోతే అంత ధరపెట్టి కొనడు. ఒకప్పుడు ఆమె అందమైనదని చెపుతారు. కాని యిప్పుడు ఆమె నల్లటిచర్మం ముడుతలుపడి ముఖం వాడిపోయివుంది. మా తాత ముఖ్యంగా ఏకాంతంలో ఉన్నప్పుడు ఆమెను ఎంతో ఆదరంతో చూసేవాడు. ప్రజలు వారి స్నేహాన్ని అనేకవిధాలుగా చెప్పుకున్నారు. అతడు భార్యలేని ముసలి. అలాంటప్పుడు కొంత అనుమానం ఏర్పడుట సహజమే!

మా తాత ప్రతిసాయంత్రం ఈ మామిడితోటలోనికి వచ్చేవాడు. ఒకరోజున నేను ఆయనను వెంబడించాను. ఆతనికి నేనంటే ఎంతో ప్రేమ. మేము అనేక విషయాలు మాట్లాడుకొంటున్నాం. అప్పుడు నేను యిలా అన్నాను. 'నేను మన కుటుంబాన్నిగురించి నిజం తెలుసుకోగోరుతున్నాను. ప్రజలు మనల్ని సిసలైన బ్రాహ్మణులుగా ఎందుకు పరిగణించరు. 'కోడిపుంజు' అంటూ మనల్ని ఎందుకు అవమానపరుస్తారని నేను అమ్మను చాలసార్లు అడిగాను కాని ఆమె సరియైన సమాధానం యివ్వలేదు.'

'ఈ విషయాన్నిగురించి ఎందుకు నీవు ప్రశ్నించాలి?'

'తాతయ్యా! తప్పక తెలుసుకోవాలి. అసలుసంగతి తెలియగానే, మన కుటుంబానికి జరుగుతున్న అవమానానికి ప్రతిక్రియ ఆలోచించాలి. ఇప్పటికే నేను బ్రాహ్మణులను గురించి చాలా చదివాను. నా కుటుంబాన్ని గౌరవింపచేయటానికి తగినంత నేర్చుకొన్నాను.'

'నాయనా! అది నేను నమ్ముతా. నీతల్లికే అసలుసంగతి తెలియదు; అందువల్ల నీవద్దనుంచి దాస్తోందని అనుకోకు. ఈ ప్రపంచములో మన కుటుంబ గౌరవ విషయమంటావా? మనము నగరాలతోగల ఇచ్చిపుచ్చుకొనే సంబంధమే దాన్ని రుజువు చేస్తోంది. వారు అవంతిలోను, లట్ (గుజరాత్) నందు హెచ్చుగా ఉన్నారు. అందువల్ల తేలినా మునిగినా మనం వారితోపాటే — కాని మన వంశం వాస్తవానికి నగరాలకంటె యౌధేయులకే దగ్గర.'

'తాతయ్యా! యౌధేయ్ అంటే ఏమిటి?'

'అది మన ప్రజల పేరు. అందుకే ప్రజలు మనల్ని 'కోడిపుంజు' లంటారు. (యౌధేయా అంటే యుద్ధంచేసేటి).

'యౌధేయులు బ్రాహ్మణులా?'

'వారు బ్రాహ్మణులకంటే సిసలైన ఆర్యులు.'

'అలాగైతే వారు బ్రాహ్మణులుకారు?'

'ఒకమాటలో ఔను, కాదు అని చెప్పలేం. వారు ఎటువంటివారో వివరిస్తాను. సత్‌లజ్ జమ్నాలకు మధ్యప్రాంతములో వారు నివసిస్తారు. హిమాలయములనుంచి ఎడారివరకూగల ప్రాంతాలకు వారు అధికారులు.'

'వారందరూనా?'

'ఔను. వారిలో రాజు లేడు. వారి ప్రభుత్వాన్ని ప్రజాస్వామ్య మంటారు.' ప్రజాహితకార్యాలన్నీకూడా ప్రజలు లేక జనసమితిచేత నిర్వహింపబడుతాయి. ఒక మనిషి పాలనను – నిరంకుశత్వాన్ని – వారు గర్హిస్తారు.'

'తాతా! ఆ ప్రభుత్వాన్ని గురించి నేను వినలేనైనాలేను.'

'కాని, అది అటువంటి ప్రభుత్వం. ఆ దేశంనుంచి పారిపోయి వచ్చినప్పుడు మావద్దనున్న యౌధేయ నాణెముల మూడింటిని మా నాన్న నాకిచ్చాడు.'

'అలాగైతే మీరైనా యౌధేయులు కారన్నమాట!'

'నా తల్లిదండ్రులు అక్కడినుంచి పారిపోయేనాటికి నావయస్సు 10 సం॥రాలు. నాకు ఇద్దరు అన్నలు వున్నారు. వారి కుటుంబాలనే యిక్కడ నీవు చూస్తున్నావు.'

'వాళ్ళెందుకు పారిపోవలసివచ్చింది?'

'ఆ ప్రదేశం పురాతనకాలంనుంచి యౌధేయులది. భారతదేశంలో మౌర్యులు, గ్రీకులు, శాక్యులు మొదలైన ఆదర్శప్రాయులగు గొప్ప చక్రవర్తులు జన్మించారు. కాని వారెవ్వరూ మనల్ని నాశనం చెయ్యలేదు. కాని గుప్తవంశీకుడు చంద్రగుప్తుని పూర్వీకుడగు విక్రమాదిత్యుడు ఉజ్జయినిలో ఒకప్పుడు దర్బారుచేస్తుండేవాడు. అతడు గొప్పస్థానాన్ని ఆక్రమించి యౌధేయుల్ని నాశనంచేసాడు. అంతకుముందే వారు అతనికి కప్పంకడుతున్నా, అతడు అంతటితో సంతృప్తిచెందలేదు. ఆతడు యౌధేయను

తనచే నియమింపబడిన పాలకుడే పాలించవలెననీ, తన వంశీయులే అక్కడ తన ప్రతినిధులుగా ఉండవలెననీ కోరాడు. పురాతనకాలంనుంచీ యౌధేయులు ప్రజా స్వామ్యమును తప్ప మరేవిధమగు పరిపాలనను ఎరుగరని మా నాయకులు అతనికి నచ్చచెప్ప ప్రయత్నించారు. అధికార గర్వాంధుడగు ఆతడు వారి విజ్ఞాపనలను అంగీకరించలేదు.

ఎట్టకేలకు విధిలేక యౌధేయులు వారి ఇష్టదైవమువద్ద శపథమూని ఖడ్గాన్ని చేతబట్టారు. అనేకసార్లు వారు గుప్తులసైన్యాన్ని ఓడించగలిగారు. వారి సైన్యము కంటె నాలుగైదు రెట్లుఉన్నా యౌధేయులు ఓడించబడేవారుకారు. బ్రహ్మపుత్రానది నుంచి రాజపుటానా అరణ్యములవరకు వ్యాపించియున్న ఆ సామ్రాజ్యపు పెద్ద బలాల ముందు ఎంతోకాలం వారు నిలువజాలకపోయారు. కొన్ని పోరాటాల్లో గెలుస్తున్నా వారు బలహీనులు కాసాగారు. వారిసైన్యం అపారంగా నశించిపోసాగింది. గుప్తులు పట్టణాల్ని, పల్లెలను దోచుకొని స్త్రీ పురుషులనందరినీ చిత్రవధచేయసాగారు. అయినా 30 సు॥రాలు మా ప్రజలు పోరాడారు. మనదేశంలోని ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని నిలుపుకొనుటకు వారు ఎంతటి త్యాగాలనైనా చేయుటకు సంసిద్ధులయ్యారు.'

'తాతా! ప్రజాస్వామిక ప్రభుత్వమంటే ఏమిటి?'

'ప్రతి యౌధేయుడు స్వతంత్రుడు. ఏ ఒక్కడూ మరొకరివద్ద కలలోనైనా తలవంచనక్కరలేదు. యుద్ధం వారికి ఆటవంటిది. అందుకే వారికి యౌధేయులని పేరువచ్చింది.'

'తాతా! మనమేకాకుండా యింకా యౌధేయులున్నారా?'

'బిడ్డా! లేకపోలేదు. కాని ఎండుటాకులవలె వారు ఆ గాలిదుమారంలో చెల్లా చెదరై పోయారు.'

'మనవలెనే పుట్టుకను విస్మరించి, వారుకూడా నగర్ కుటుంబీకులతో కలసి పోయారా? ఆలాగైతే, మనం బ్రాహ్మణులమని ఎందుకు చెప్పుకోవాలి?'

'అదంతా పెద్దగాథ. పూర్వకాలంలో ప్రతిచోట నిరంకుశత్వానికి బదులుగా ప్రజాస్వామ్యం అమలులో ఉండేది. అప్పుడు క్షత్రియులకూ, బ్రాహ్మణులకూ మధ్య భేదంలేదు.'

'వారంతా ఒకే కులంవారా?'

'అవును. వారిలో ప్రతివారు దైవపూజ, అవసరమైతే యుద్ధమూ చెయ్యగలరు. తరువాత విశ్వామిత్ర వశిష్ఠులు బయలుదేరి ప్రజలను తరగతులుగా విభజింపసాగారు'.

'ఆలాగైతే ఇద్దరు కొడుకులుంటే, ఒకడు రంతిదేవునివలె క్షత్రియుడు, మరొకడు గౌరివతివలె బ్రాహ్మణగురువు కావచ్చునన్నమాట!'

'బిడ్డా! పుస్తకాల్లో ఆవిధంగా ఉందా?'

'తాతా! ఔను. వేదాల్లోను చరిత్రలోను ఆలాగేవుంది. పురాణాల్లో ఇంకా యెన్నో విషయాలు ఉన్నాయి. అవన్నీ చెపితే ఇప్పటివాళ్ళు నమ్మరు. చంబలు నదీ తీరాన్ని ఉన్న దశపురాన్ని చూచావా తాతా?'

'ఆ. చాలాసార్లు ఉత్సవాలకి వెళ్ళాను. అక్కడ నాగరులు ఎక్కువ. వారిలో చాలామంది వ్యాపారం చేస్తారు'.

'ఈ దశపురమే రంతిదేవుని రాజధాని. చర్మణ్వతి అనే పేరేలవచ్చిందో తెలియదు'.

'ఏమిటీ? కులాన్ని బట్టి'.

'రంతిదేవుడు రాజైనప్పటికీ చాలా అతిథిప్రియుడు. అతడు మహారాజులలో ఒకడు. ఆ మహారాజుయొక్క భోజనశాలలో అతిథులకొరకై రోజూ రెండు వేల ఆవులు చంపబడతాయి. ఆ ఆవుల చర్మాన్ని ఉడుకపెడతారు. ఆ నీరే నదిలా ప్రవహిస్తోంది. చర్మంనుంచి బయలుదేరిన నీటిలో ఏర్పడినదానికి చర్మణ్వతి అని పేరొచ్చింది.'

'బిడ్డా! పురాణ గ్రంథాలలోని ఈ సంగతి నిజమే నంటావా?'

'అవును. తాతా! మహాభారతంలో స్పష్టంగా వ్రాశాడు.'

'మహాభారతంలోనా! పంచమవేదంలో గోమాంసభక్షణమా!'

'తాతా! అతిథులకోసం అని యీ గోమాంసాన్ని వండటానికి రెండు వేల మంది వంటవాండ్రున్నారు. అతిథులలో బ్రాహ్మణులెక్కువ. వారికి మాంసం చాలనిచో సూపువోసుకోమని ప్రార్థించేవారట.'

'బ్రాహ్మణులు గోమాంసం తిన్నారా?'

'మహాభారతంలో అబద్ధం వ్రాయబడుతుందా?'

'ప్రపంచం ఇంతగా తారుమారై పోయిందా?'

'తాతా! తారుమారై పోతోంది. ఈ గుడ్లగూబల కన్నులు తెరవాలి. యౌధేయులు ఈ బ్రాహ్మణుల మోసంలో పడలేదు.'

'అవును. వారు తమకన్న బ్రాహ్మ లెక్కువవారని ఒప్పుకోరు.'

'తాతా! నీవిక్కడకు వచ్చి బ్రాహ్మణులతోకాక నాగరులతో ఎందుకు వివాహ సంబంధాలు చేసావు?'

'రెండు కారణాలున్నాయి. ఈ బ్రాహ్మణులకి మన కులంవిషయంలో సందేహం ఉంది. కావాలంటే మనం బ్రాహ్మల్ని పెళ్ళి చేసికోవచ్చు. నాగరకులు బ్రాహ్మణులమని చెప్పుకుంటారు—రూపంలో మనతో సమానంగా ఉంటారు?'

'తాతా! నాగరులెవరు?'

'బ్రాహ్మణులు బ్రాహ్మలమని అన్నమాత్రాన నమ్మరు. ఎక్కడివారు? గోత్రం ఏమిటి? అని అడుగుతారు. నగరముల్లో నివసించుటచే నగర బ్రాహ్మణులని చెప్ప మొదలెట్టారు. అల్లాగే మనం యౌధేయ బ్రాహ్మలం?'

'అసలు వారెవరు తాతా?'

'సముద్రతీరపు యవనులు. వారిలో బ్రాహ్మణులు తక్కువ. బౌద్ధ ధర్మాన్ని నమ్ముతారు. ఉజ్జయినీలో యీ సంగతి బాగా తెలుస్తుంది. యవనులమని చెప్పుకొనే వాళ్ళు చాలామంది ఉన్నారు. బ్రాహ్మణులు వీళ్ళని క్షత్రియులంటారు.'

'అయితే జాతులు యిష్టాయిష్టాలమీద ఏర్పడుతాయా?'

'అల్లాగే తోస్తోంది. అబ్బాయీ!'

---

# 3

నాకు ఇరవై ఏండ్లు వచ్చాయి. నాదండలు కండలుతేరి ముఖంలో యౌవనత్వం వచ్చి నేను చాలా అందంగా ఉన్నాను. ఇప్పుడు నేను ఉజ్జయినీలో చదువుకొంటున్నాను. మా అమ్మ తాలూకు నాగరకులు ఉజ్జయినీలో ఉన్నారు. వాళ్ళ బలవంతంమీద వాళ్ళింట్లోనే ఉన్నాను. నాబోటి గ్రామవాసునికి ప్రపంచాన్ని తెలుసుకోడానికి ఉజ్జయిని ఒక కిటికీలాంటిది. కాళిదాసుని కవిత్వం చదివాను. ఆయన శిష్యరికం చేసే భాగ్యం నా కిక్కడ అబ్బింది. చంద్రగుప్త విక్రమాదిత్యుని ఆస్థానంలో ఈకవికి అత్యధిక గౌరవం వున్నది. అంచేత ఉజ్జయినీలో ఈయన చాలా తక్కువగా ఉంటూంటాడు. కాళిదాసుని యందు నాకు గురుభక్తి వున్నది. కాని ఆయన రాజుని సేవిస్తాడనే బాధకూడా వుంది. అప్పుడు కాళిదాసు కుమారసంభవం వ్రాస్తున్నాడు. 'విక్రమాదిత్యుని కొడుకగు కుమారగుప్తునికి కుమారసంభవంలో శంకరపుత్ర కుమార కార్తికేయునిగా అమరత్వం యిస్తానని' నాతో చెప్పేవారు.

నేను ఎన్నిసార్లు నా సంశయాలు తీర్చమని అడిగినా ఆయన కోప్పడేవాడు కాదు. నేను ఒకరోజున 'గురూ! చంద్రగుప్తునియొక్క, అతని పుత్రుడు కుమారగుప్తునియొక్క రాజ్యం జీవితాంతంవరకే. కాని మీ కవిత్వప్రతిభ అనంతమైనది. మీరు రాజులను ఆశ్రయించి యింత తెలివితక్కువవారవుతున్నారేం?'

'సువర్ణా! విక్రమాదిత్యుడు ధర్మ సంస్థాపకుడు. హూణులనుంచి భారత భూమిని కాపాడాడు.'

'గురూ! హూణులు ఇప్పటికీ పంజాబులోను కాశ్మీరంలోను ఉన్నారు.'

'చాలా భాగంనుంచి వారిని తరిమాడు.'

'రాజులు ఒక రాజుని వెడలగొట్టి తమ రాజ్యం స్థాపిస్తారు.'

'కాని గుప్తవంశం గోబ్రాహ్మణున్ని రక్షిస్తుంది.!

'గురూ! మూఢులకు చెప్పేలా చెపుతున్నాదు నాకు. మా పూర్వులుకూడా గోరక్షణ చేసేవారు భక్షణకై. తామే మేఘదూతలో రంతిదేవుని కీర్తినివర్ణిస్తూ చర్మణ్వతి నదిని గురించి వ్రాస్తూ అది గోవుల చర్మపునీరు' అని వ్రాసారు.

'ప్రియశిష్యా – నీవు చాలా కొంటెవాడవు.'

'కాని దిగంతకీర్తినిపొందిన మీరు గుప్తరాజులకు తలఒగ్గుతున్నారంటే చాల శోచనీయం.'

'నీవు వారిని ధర్మనాశకులని అంటున్నావా? సువర్ణా!'

'అవును. తప్పకుండా. హూణులు, నందులు, మౌర్యులు, శాక్యులు చేయనంత పాపాన్ని గుప్తవంశజులు చేశారు. భారత భూమిలో ప్రజాస్వామ్యాన్ని నామరూపాలు లేకుండా చేశారు.'

'సువర్ణా! ఇప్పటికాలానికి ప్రజాస్వామ్య ప్రభుత్వం తగదు. సముద్రగుప్తుడు ప్రజాస్వామ్యాన్ని అల్లాగేఉంచితే హూణులు మొదలగు బలీయులైన శత్రువుల్ని జయించలేక పోయేవాడు.'

'అతడేంసాధించాడు? సామ్రాజ్యం స్థాపించి తాను రెండవ చంద్రగుప్తుడయ్యాడు. కాని చాణక్యుని లౌకికశక్తివలన స్థాపించబడిన ఈ సామ్రాజ్యం ఎక్కువ కాలం నిలవలేదు. విక్రమాదిత్య కుమారగుప్తుల వంశజులు ఆచంద్రతారార్కం పరిపాలించలేరు. ప్రజాస్వామ్యాన్ని నాశనంచేసి ఏవిధంగా ధర్మసంస్థాపన చేద్దామని? పూర్వంనుంచీవస్తూన్న ప్రజాస్వామ్యాన్ని నాశనంచేయుట అధర్మంకాదా?'

'కాని రాజు విష్ణుదేవుని యొక్క అంశము.'

'కుమారగుప్తుడు తన చిత్రముమీద నెమలిచిహ్నం వేయించుకొన్నాడు. రేపు కవుపెవరైనా ఆతనిని కుమారదేవ సంభూతునిగా చిత్రింపవచ్చును. ఇది చాలా మోసము. ఈ నీచత్వమంతా మాంసం సూపు కొరకు, రాష్ట్రంలోని సుందరులతో

అంతఃపురమును నింపుకొనుటకు, శ్రమికుల కష్టార్జితాన్ని ఆనందంతో పాడు చేయుటకు మాత్రమే! ఇందుకేనా నీవు గుప్తవంశీయుల్ని మతరక్షకులుగా పొగడుచుట. బ్రాహ్మణుల సహకారంతో వారు అనేక ఎత్తుగడలు వేస్తున్నారు. గుప్తరాజులను విష్ణుసంభూతులుగ తలచుట వారి నాణెములపై లక్ష్మీమూర్తిని ముద్రించుట జరుగు తోంది. గుప్తవంశ స్థిరత్వంకోసం బీదలను పీడించి ధనంపోగుచేసి విష్ణాలయాలు నిర్మించారు.'

'సువర్ణా! వాళ్ళేంచేస్తున్నారో నీకుతెలుసా? యిలా రాజునుగురించి చెప్పడం కఠినత్వమే కావచ్చు!'

'ఈదినం ఈ విషయాన్ని మీకు ఒక్కరికిమాత్రమే చెప్తున్నా. కాని మహారాజగు కుమారగుప్తుని ముఖంమీదనే ఈ మాటలు నేను పలికేరోజు వచ్చి తీరుతుంది. ఈ మోసాల్ని దిగమ్రింగి నేను నిలువజాలను. నా ఉద్దేశం నీవు అశ్వ ఘోషునిదారి ననుసరించాలి.'

'ప్రియకుమారా! నేను ఒక కవినిమాత్రమే. కాని అశ్వఘోషుడు గొప్పకవి, మహాపురుషుడూను. ఆతనికి ప్రాపంచిక సుఖములంటే వ్యామోహములేదు. విక్రమాదిత్యుని రాజప్రాసాదమునందుండే స్త్రీలవంటివారినీ, ఎర్రటి ద్రాక్షసారాను, ఒక గొప్పభవనాన్ని దాసదాసీలనూ నేను కోరుతాను. నేను అశ్వఘోషునిగా ఎట్లు మారగలను? నా రఘువంశములోని మారుపేర్లవలన నేను దేవాంశసంభూతులగు గుప్తులచంటివాడయ్యాను.' విక్రమాదిత్యుడు సంతోషపూర్వకంగా నాకీభవనాన్ని ప్రసాదించాడు. కాంచనమాల అనే ఒక యువతినికూడా బహుమతిచేసాడు. ఆమె ప్రేమబంధములలో నేను 15 సం॥లనుంచి బంధింపబడివున్నాను. ఇప్పుడు నేను 'కుమారసంభవం' అనే నూతనకావ్యాన్ని వ్రాయవలెనని తలుస్తున్నా. దీని కేమి బహుమతి వస్తుందో నీవు చూడగలవు.'

'నేను నమ్మను. నీవు అశ్వఘోషునివలె కనుక కావ్యాలు వ్రాసి ఉంటే నీవు కూడా అతనివలె సౌఖ్యాల్ని త్యజించేవాడివి. రాజులను కీర్తించకపోతే సౌఖ్యంలేదనే మాయత్రోవనుపడి నీవు కొట్టుకొంటున్నావు. నీవు కవులకు చాలా పెద్ద సంప్ర దాయాన్ని నేర్పుతున్నావు. నిన్నుచూచి వాళ్ళుకూడా ఈ తప్పులుచేయుటకు జంకరు.'

'నేను ఇంకొరకం కావ్యాలనుకూడా వ్రాయగలను.'

'నీవు గుప్తుల చెడునడతలను వర్ణిస్తూమాత్రం ఏమీ వ్రాయవు.'

'అదినాకర్తవ్యంకాదు. నేను ఎంతో మెత్తటివాడినైపోయాను.'

'నీవు మహారాజుల పాపాలకు మతాన్ని అంటగడతావా?'

'అలాచెయ్యాలి. అదిలేనిదే రాజాధికారం స్థిరంకాదు. వశిష్ఠ, విశ్వామిత్రులు దీని ఆవశ్యకతను గుర్తించారు.'

'స్త్రీలకోసం, మంచి భవంతులకోసం కాళిదాసువంటి వీరుకూడా ఈ పాపాలను బలపరచారు.'

'సువర్ణా! నీవు యుద్ధకౌశల్యంతోపాటు, కావ్యపఠనకూడా చేస్తున్నావని విన్నాను. నీకు అంగీకారమైతే నిన్ను రాజు ఆస్థానంలో సంహాదాపుగనో, ఉద్యోగిగనో ప్రవేశపెట్టవలెనని ఉంది. రాజు చాలా సంతోషిస్తాడు.'

'నేను నా శరీరాన్ని ఎవరికీ అమ్ముకోను.'

'అలాగైతే రాజగురువులలో నీకు స్థానం ఏలా ప్రాప్తిస్తుంది?'

'బ్రాహ్మణుల స్వార్థపరత్వానికి నేను అత్యంత విముఖుడను.'

'నీవు ఏమిచేద్దామనుకొంటున్నావు?'

'ప్రస్తుతం నేను కావ్యపఠనం చేస్తాను.'

## 4

నేను ఉజ్జయినీలో నివసించేటప్పుడు నాకుగల విద్యాభిలాషను తీర్చుకొన్నాను. ఇదియేకాకుండా, ఇదివరలో నేను వ్రాసియున్న ప్రకారం ఈ విశాలప్రపంచాన్ని గురించి కొంత తెలుసుకొన్నాను. రాజులను బ్రాహ్మణులు ఎలా అమ్ముకుపోయారో నేను పూర్తిగా తెలుసుకోగలిగాను. ఇతరులు నన్ను బ్రాహ్మణుడని అంగీకరించక పోయినా ఒకప్పుడు నేను బ్రాహ్మణుడననే భావముతో చాలా గర్వించేవాడిని. కాని నేను నా గ్రామమును విడిచిపోవటానికి ముందుగానే ఆ అహంభావము కరిగి

పోసాగింది. గ్రామమునుంచి పట్టణము చేరుకొన్న తరువాత వర్తకం నిమిత్తం ఉజ్జయినికివచ్చే సిసరైన గ్రీకులను అనేక మందిని నేను కలుసుకొన్నాను. ఒక శతాబ్దముక్రితము ఉజ్జయిని, లట్ (గుజరాత్), సౌరాష్ట్ర (కతియవాడ్)లను పాలించిన శాక్య, అభియర్ తరమువారగు వారిని చాలమందిని కలుసుకొన్నాను. గుండ్రటి కళ్ళు, వంగపండురంగు ముఖాలు కలిగిన హూణులనుకూడా కలుసుకొన్నాను. వారు యుద్ధములు చేయుటలో ప్రవీణులుమాత్రమే కాని వారికి ఇతర విషయములు తెలియవు. నేను ఈ వివిధజాతుల ప్రజలను పరిశీలించాను. ఉజ్జయినీవెలుపల నివసించే బౌద్ధభిక్షువులు నన్ను ఆకర్షించారు. నామేనమామ ఆతనికుటుంబం బౌద్ధులే. ఈ బౌద్ధవిహారంలో అనేక మంది నాగరు సన్యాసులు ఉన్నారు. అందువల్ల నేను తరచు వారివద్దకు పోయేవాడిని. ఒకసారి నేను భరుకచ్ఛకుకూడా వెళ్ళాను.

విద్యాభ్యాసం ముగించిన తరువాత నేను సంచారంచేసి విజ్ఞానం పెంపొందించుకొనదలచాను. ఈరోజులలో 'అచింత్యా' (అజంత) అనే ప్రఖ్యాత బౌద్ధ విహారం ఒకటి కలదనీ, అక్కడ వివిధదేశాల భిక్షువులు నివసిస్తారని విన్నాను. దానిని చూచుటకు అక్కడకు వెళ్ళాను. ఇంతవరకు నేను ఎక్కడకు వెళ్ళినా సహచరులతో అవసరమైన వస్తువులు తీసుకొని పోయేవాడిని. కాని మొదటిసారి ఒంటరిగా కట్టుబట్టలతో బయలుదేరాను. మార్గమధ్యంలో దోపిడీభయంలేదు. ఈ విధంగా రక్షణ యివ్వగలిగినందుకు మనం గుప్తులను హర్షించాలి. దేశంలోని ప్రతికుటుంబం అష్టైశ్వర్యములతో తులతూగునట్లు పాలించుటవలననా దొంగతనములు లేకపోవుట ? కాదు. గుప్తులు పన్నులు విధించుటలో పూర్వీకులను అన్నివిధములా మించిపోయారు. భవంతుల నిర్మాణం, వాటి అలంకరణములనిమిత్తం ఇంతధనం మునుపు ఎన్నడూ ఖర్చుచేయబడలేదు. తమ రాజమందిరాలచుట్టూ, పర్వతాలు, వనాలు సరస్సులు, నదులు నిర్మించుటకువారు ప్రయత్నించారు. వారి ఉద్యానవనములు వాస్తవిక అరణ్యములు. అక్కడ వన్యమృగాలు బంధించబడి అరపులు అరుస్తూ వుంటాయి. వారి వనాల్లో గుట్టలపై పర్వతాల్లో వుండే చెట్లు నాటబడ్డాయి. జలధారలు ప్రవహించునట్లు చేయబడ్డాయి. వారి సరస్సుల్లో అనేక నీటి కాల్వలువచ్చి కలుస్తాయి. ఆ కాల్వలను దాటుటకు ఏర్పాట్లు, నావలు తిరుగుటకు వీలగునట్లు చేయబడ్డాయి. ఆ రాజభవంతులలో వెండిబంగారాలు, మణిభూషణాలు, పట్టువస్త్రాలు, విలువైన తివాసీలు కుప్పతిప్పలుగా ఉన్నాయి. వాటి అలంకరణలో చిత్రకారులు తమ హస్తనైపుణ్యాన్ని ప్రదర్శించారు. శిల్పకారులు వారి లోహపు రాతివిగ్రహము

లను తగు స్థలములలో ఏర్పరచారు. యాత్రికులవల్ల, రాయబారులనుంచీ చిత్రకారుల, శిల్పకారుల నైపుణ్యాన్ని గురించి విన్నప్పుడు నేను ఆనందసాగరంలో మునిగిపోయాను. కాని శిథిలమైపోతున్న వారి గ్రామాలలోని దరిద్రులను చూచినప్పుడు నా శరీరం ఉడుకెత్తిపోయింది. ఉజ్జయిని, దాని వైభవోపేతమైన భవంతులు నాకు అసహ్యాన్ని కలుగచేశాయి. భవంతుల నిర్మాణంకోసం మట్టి ఉపయోగింపబడుటవల్ల ఏవిధంగా పెద్ద అగాథము లేర్పడుతున్నాయో అదేవిధంగా ఒకని బీదరికానికి కారణం మరొకని విశేష ధనసంపత్తేయని నేను భావించాను.

నగరాల్లోను, పట్టణాల్లోనే కాకుండా, గ్రామాల్లోకూడా నిపుణులగు చేతిపనివారు అనేక రకములైన వస్తువులు తయారు చేస్తున్నారు. స్త్రీలు సన్నని నూలుతీస్తే నేతగాళ్ళు మృదువైన వస్త్రాలు నేయసాగారు. కంసాలులు, లోహపనివారు నిపుణులయ్యారు. వీరికి దగ్గర బంధువులే రాజభవనాలు అలంకరించినది. కాని వారి శరీర ఆరోగ్య పరిస్థితి, వారి వసతిగృహాలుచూచి వారివి పగటికలలని, వారి నైపుణ్యం ఏ విధంగానూ వారికి ఉపయోగపడుటలేదనీ తెలుసుకొన్నాను. వారు గ్రామాలు విడిచి పెద్ద భవనాలుగల వర్తక కేంద్రములగు పట్టణాలకు చేరుతున్నారు. అక్కడి నుంచి వారిలో చాలమంది పశ్చిమసముద్రములో వుండే భరుకచ్ఛ మొదలగు తీర్థముల ద్వారా ఇరాను లేక తూర్పు సముద్రమువైపు; తామ్రలిప్తంనుంచి జావా, సుమిత్రా చేరారు. భారతదేశపు వర్తకవ్యాపారం యింతకు మునుపెన్నడూ అంతఔన్నత్యాన్ని పొందలేదు. ఇందువల్ల మొదటిగా ఎగుమతి సుంకాల్ని హెచ్చుగా విధించి గుప్త రాజ్యం లాభం పొందింది. రెండోవారగు సామంతులు శిల్పులనుంచీ, వ్యాపారస్థుల నుంచీ లాభం పొందగలిగారు. వర్తకులు, షాహుకార్లు, ఆఖరుకు మిగలగలిగినా వారి లాభాలుకూడా తక్కువగా ఉండేవికాదు. రైతులు, గ్రామాల్లోని చేతివృత్తుల పనివారు ఎందుకింత పేదవారైపోయారో; అయినా ప్రభుత్వం నగరనిర్మాణంలో ఎందుకు ధనాన్ని వెచ్చింపగలుగుతుందో ఇదంతా పరిశీలించిన నాకు విస్పష్టమైంది.

కంచీలతో గొడ్లవలె మోదబడుతూ, మానవులను విక్రయించే సంతలను గ్రామాల్లో తరచు చూడవచ్చు. ఎంత హృదయవిదారకం! గతజన్మలో చేసిన పాపముల ఫలితమే ఈ జన్మలో మానవుల దాసత్వానికి కారణమని నాగురువు కాళిదాసు ఒక సమయంలో చెప్పాడు. ఈ విషయాన్ని నేను విన్నక్షణంనుంచి గత జన్మనుగురించి నా నమ్మకం మారిపోయింది. తమ అధికారాన్ని బలపరచుకొనే నిమిత్తం మతాన్ని గుప్తులు ఎన్నివిధాలుగా ఉపయోగించుకొంటున్నారో చూస్తే

ఆలోచనాశక్తిగలవారెవరికైన ఈ సంశయం కలుగకమానదు. కాని సామాన్యప్రజలు చాలామందకొడిగా కనిపించారు. బహుశా! వారునిస్సహాయస్థితిలో ఉన్నందువల్లనే- ఆ గ్రామస్థులకు తమ గ్రామంతప్పితే మిగతా ప్రపంచంసంగతే తెలియదు. కుమార గుప్తుడు ఒక రాష్ట్రంకోసం సల్పిన సమరంకంటె బహుశా! హెచ్చుగా వారు తమ పొలాలలోని ఒక్కఅంగుళం మేరకోసంకూడా గ్రామంలో యుద్ధంచేస్తూ వుంటారు. కాని గ్రామసరిహద్దుల వెలుపలి సంగతులతో వారికి సంబంధంలేదు.

ఒక గ్రామంలో జరిగిన సంఘటన నాకు జ్ఞాపకం వుంది. అది వేసవి కాలం. నెరుసుపడి ఒక ఇల్లు నిప్పంటుకొంది. గ్రామంలోనివారంతా నీటికుండలతో ఆ ప్రమాదాన్ని ఎదుర్కొనసాగారు. కాని ఒక్కకుటుంబంలోని దంపతులుమాత్రం నీటి కుండలతో తమ ఇంటిముందరే కూర్చొనివున్నారు. అదృష్టవశాత్తు ఆ గ్రామంలో సహాయపడని కుటుంబం యిదిఒక్కటే; లేకపోతే ఒక్కకొంపకూడా మిగిలేదికాదు. ఈ సంఘటన నాకు పురాతన యౌధేయను స్మృతిపథంలోకి తెచ్చింది. బ్రతికితే అందరూ బ్రతకాలి; లేకపోతే అందరూ మరణించాలని వారు తమ ప్రజాస్వామ్యం కోసం పోరాడారు. సముద్రగుప్తుని, చంద్రగుప్తుని కుమారగుప్తుని దండయాత్రల విజయంకోసం వారు జీవితాల్ని త్యాగంచేసే బానిసలగనే మరణించారు; తమకోసం తమకుటుంబాల రక్షణకోసంకాక యితరులకోసం వారు త్యాగం చేశారు! గుప్తుల పరిపాలనవలన ఒక రాజ్యంలోని ప్రజలలో కలిగిన ఫలితాలు తలచుకుంటే నేను వణికిపోసాగాను. వారి రాజ్యాధికారం కనుక యింకా కొన్ని శతాబ్దాలు కొనసాగితే దేశం బానిసదేశంతప్ప మరేమీకాజాలదు. మానవుడు ఎట్టిహక్కులూ లేనివాడనే మూఢ విశ్వాసంలో రాజుల రక్షణకోసం పోరాడి మృత్యువును ఆహ్వానించే జాతిగా దేశం తయారయ్యేది.

అచింత్య (అజంతా) లోని బౌద్ధవిహారం ఎంతో ఆకర్షణీయమైనది. అక్కడ ఒకపచ్చని కొండలోయవుంది. అందులో అర్ధచంద్రాకారంగా ఒక నీటివెల్లువ పారుతోంది. ఈ వెల్లువ ఎప్పుడూ జలమయమై వుంటుంది. దీనికి ఎదురెదురుగల పర్వతమును శిల్పులు సుందరప్రతిమలతోకూడిన దేవాలయములుగను, సభాభవనములుగను చెక్కి తమశిల్పనైపుణ్యాన్ని వెల్లడించారు. ఈ గుహలు సుందరవర్ణముల వారి కొరకు చిత్రములతోను, శిలాప్రతిమలతోను అలంకరింపబడ్డాయి. అచింత్య (అజంత) లోని గోడలపై చిత్రింపబడిన చిత్రములూ, రాతివిగ్రహములూ చాల

అందమైనవి. అవి గుప్తరాజభవనములతో పోల్చదగినవికానందున నన్ను ఆకర్షింప లేదు. రక్తసంబంధీకులగు ఏకకుటుంబీకులవలె అనేక దేశాలనుంచి వచ్చిన భిక్షువులు కలసివుండుట నన్ను ఎక్కువగా ఆకర్షించింది. దూరదేశమైన చైనానుంచి వచ్చిన వారిని, పెర్షియన్‌లను, గ్రీకులను, సింహళవాసులను కలుసుకొన్నాను. జావా, సుమత్రాలనుంచికూడా వచ్చినవారిని చూచా. ఇదివరలో చంపాద్వీపం, కాంబోడి యాల పేర్లు విన్నాను. కాని యిప్పుడు ఆదేశప్రతినిధులనే చూడగలిగాను. కపిషా, ఉదయన్, తుషార్, కుభాదేశస్థులు సన్యాసుల కాషాయబట్టలు ధరించుట చూచాను.

విదేశాలగురించి తెలుసుకోవలెనని నేను చాలా ఆతృతగా ఉన్నాను. ఆసన్యాసులను ఒక్కరొక్కరినే ఒంటరిగా కలుసుకొంటే ప్రతిఒక్కరితోను ఒకసంవత్సరం గడపగలను. వారందరినీ చూడటంతో గర్భదరిద్రునకు అష్టైశ్వర్యములు కలిగినట్లు ఎగిరి గంతేశాను. మా గురువువద్ద కవియగు 'దింగ్‌నాగ్' పేరువిన్నాను. గుప్తుల నిరంకుశత్వం, దానికి మూలమగు బ్రాహ్మణమతాన్ని కాళిదాసు బలపరచేవాడు. నేను అందుకు కారణాలు యింతకుముందే వివరించాను. 'దింగ్‌నాగ్' తన మార్గకంటకుడని ఆతనికి తెలుసు. 33 కోట్ల దేవతలచే ఆరాధింపబడు విష్ణువు ఈ నాస్తికుడగు 'దింగ్‌నాగ్' ఏమీ చేయలేడు. రాజులయొక్క, బ్రాహ్మణులయొక్క స్వార్థంకోసం మనం మతంపేరిట చేస్తున్న ప్రచారంలోని ఆంతర్యం ఇతనికి తెలుసు. వృద్ధుడగు వసుబంధువు ఈతని గురువగుటమే దీనికికారణం. కాళిదాసు వసుబంధుని విజ్ఞానం అపారసాగరమని చెప్పేవాడు. రెండవ చంద్రగుప్త విక్రమాదిత్యుని రాజధానియగు అయోధ్యలో ఆతడు చాలాసంవత్సరాలు ఆస్థానపండితుడుగాకాక, స్వతంత్రుడగు గౌరవనీయుడగు గురువుగా జీవించాడు. తరువాత గుప్తుల నీచభావములకు విసుగెత్తి ఆతడు తన జన్మభూమియగు పర్శుపురి (పెషావరు)కి తిరిగి వచ్చివేశాడు. దింగ్‌నాగ్ బల్లెములను, కత్తులనేకాక అంతకంటె పదునైన విజ్ఞానాన్నీ, పరిజ్ఞానశక్తినీ ప్రపంచానికి ప్రసాదించాడు. పేకముక్కల మేడవలె, బ్రాహ్మణుల మిధ్యావాదమంతా ఒక్క అరగంట ఆతనితో వాదిస్తే కూలిపోగలదు.

నేను అజంతవిహారంలో 6 మాసాలు నివసించాను. అప్పుడు ప్రతిరోజు దింగ్‌నాగ్ యొక్క అత్యద్భుత ఉపన్యాసములను వినేవాడిని. అంత గొప్పగురువును కలిగియుండినందుకు నేను గర్విస్తాను. ఆతని విజ్ఞానం అపారం; ఆతని ఉపన్యాసం నిప్పులుకక్కేది. ప్రజల మూఢనమ్మకాలను గురించి ఆతడు నాతో ఒకరోజున యిలా చెప్పాడు.

'సుపర్ణా! ప్రజాశక్తిని వినియోగించి కొన్ని కార్యాలు నెరవేర్చవచ్చును. కాని నేడు ప్రజలు తప్పుదారి ననుసరిస్తున్నారు. కుల, మత విభేదాలను నాశనంచేయాలని బుద్ధుడు గొప్పయత్నాలు చేసాడు. కొంతవరకూ సఫలీకృతుడయ్యాడు. విదేశీయులగు గ్రీకులు, శాక్యులు, గుర్జారులు, అభీరులు మనదేశం వస్తే బ్రాహ్మణులు వారిని నీచంగా చూశారు. కాని సమానహక్కులు వారికికూడా ప్రసాదించి బౌద్ధులు వారిని తమలో చేర్చుకొన్నారు. కొన్ని శతాబ్దాల క్రితమే భారతదేశంలో కులభేదాలు నశించిపోతాయనిపించింది. కాని భారతదేశం దురదృష్టంవల్ల అప్పుడు బ్రాహ్మణులకు తోడుగా గుప్తులు అధికారంలోకి వచ్చారు. వారిగౌరవాన్ని అభివృద్ధిపరచుటకే కాళిదాసు రఘువంశం, కుమారసంభవం వ్రాశాడు. చిరస్థాయిగా నిలచే సామ్రాజ్యాన్ని స్థాపించవలెనని గుప్తులు ఆశించారు. వారిని బ్రాహ్మణులు ప్రోత్సహించారు. కాని మాగురువు వసుబంధువు వారికి ఆవిధమైన ఆశలు కలుగచేయలేదు. లిచ్ఛవి ప్రజాస్వామ్య పద్ధతులతో నిర్మింపబడిన బౌద్ధ సంఘాలయెడ అతడు అభిమానం కలవాడు. బౌద్ధులు తమకు పరమశత్రువులని బ్రాహ్మణులకు తెలుసు. అన్ని దేశాల్లోని బౌద్ధులు మాంసంతింటారని వారికి తెలుసు. అందుకే భారతదేశమంతా వారు మాంసం విసర్జించాలని మతప్రచారంగా ప్రారంభించారు. దీనినే వారు 'గోబ్రాహ్మణ సంరక్షణ' అంటారు. బౌద్ధులు కులమత విభేదాలు విస్మరించవలెనంటారు. అందువల్ల బ్రాహ్మణులు, గ్రీకులు, శాక్యులు మొదలగు విదేశీయవంశీకులకు కులంలో ప్రధానస్థానం యివ్వసాగారు. ఈ అపాయకరమైన ఎత్తుకు మనలోని బౌద్ధులు అనేకమంది పడిపోతున్నారు. ఈ విధంగా ప్రజలను బలహీనపరచి, తమను, రాజులను బలపరచగోరుతున్నారు. కాని ఈ ఫలితాలు దేశానికి చాలా అరిష్టదాయకం. ఎందువల్లనంటే, దానిసలమీద ఆధారపడిన ఏ దేశం బలవత్తరమైనది కాజాలదు.'

యౌధేయుల ఈవీరగాథను వారి త్యాగమును వినుటతో మా గురువు ఎంతో విచారించాడు. యౌధేయ ప్రజాస్వామ్యమును పునరుద్ధరించగలనని నేను చెప్పినప్పుడు అతడు 'నా ఆశీర్వాదం స్వీకరించు. కృతనిశ్చయుడగు వీరుడు అడ్డంకుల్ని లెక్క చేయడు' అన్నాడు.

'ఆయన ఆశీర్వాదబలంతో నేను యౌధేయకు ప్రయాణంచేస్తున్నాను. 'నాశనం చెయ్యబడిన నాదేశానికి ప్రాణంపోస్తాను. లేకపోతే ఇసుకమీది పాదముద్రవలె మాయమైపోతాను.'

———

# "దుర్ముఖుడు"

## (పదమూడవ కథ)

[కాలం:— క్రీ. తరువాత 630 సం॥రాలు]

నా పేరు హర్షవర్ధనుడు. రెండవ చంద్రగుప్తుడు తన పేరుచివర 'విక్రమాదిత్యుడు' అని ఏవిధంగా చేర్చుకున్నాడో ఆవిధంగా నేను నాపేరుచివర 'శీలాదిత్యుడు' సదాచారానికి సూర్యుడు అనే మృదువైన బిరుదం చేర్చాను. విక్రమాదిత్యునికి ఇతరులను బాధించటం, అణచటం అనే భావాలున్నాయి. కాని నాకు అల్లాంటి ఉద్దేశాలులేవు. గుప్తులు తమ్ము వైష్ణవులని చెప్పుకున్నారు. నాసోదరుడు విష్ణువర్ధనుడు. అతడు పరమబౌద్ధుడు. అతనిని మంచియౌవనంలో గౌడరాజగు శశాంకుడు నమ్మించి చంపాడు. ఈమాట తలుచుకుంటే నాకు ఒళ్ళు ఝల్లుమంటోంది. అన్నగారన్నా, బుద్ధుడన్నా నాకు చాలా భక్తి గౌరవాలున్నాయి. కాని నేను శైవుణ్ని. నారాజ్యంలో మత స్వాతంత్ర్యం ఉంది. నేను ఐదుసంవత్సరాలకి ఒకసారి త్రివేణీ సంగమంవద్ద బ్రాహ్మణులకూ బౌద్ధులకు దానధర్మాలుచేస్తాను. శీలాదిత్యుడనేబిరుదు నేను ధరించక పూర్వం సముద్రగుప్తునివలె జైత్రయాత్రను చేశాను. నేను దక్షిణాపథరాజగు పులకేశిచే ఓడింపబడకపోతే నేనుకూడా విక్రమాదిత్యునిలాగే ఉండేవాడిని. నేను చక్రవర్తిని అయినప్పటికీ చంద్రగుప్తునివంటివాడను కాను. అశోకుని కళింగ విజయమువలె పశ్చాత్తాపపడి ప్రజలయొక్క మన్ననలనుపొందుతా. కాని నేను చాలా మృదుస్వభావము కలవాడను.

నేను ఎన్నడూ రాజపదవిని కోరలేదు. ఎందుచేతంటే రాజ్యవర్ధనుని సోదరుణ్ణి అగుటచే అందులోవుండే సాధకబాధకాలు నాకు తెల్సు. అన్నమరణానికి ప్రతీకారం చేయుటకే నేను కన్యాకుబ్జ సింహాసనం అధిష్టించాను. లేకపోతే ఎన్నడూ అధిష్టించే వాణ్నికాదు. నా సోదరుడుండగానే నేను నా సోదరియగు రాజ్యశ్రీయొక్క రాజ్యంలో గుప్తులు వెళ్ళగానే అక్కడికివెళ్ళి పాలించేవాడిని. నేను స్వార్థంలేనివాడనని నాతరువాత వచ్చేవారు తెలుసుకొందుకే నేనీమాటలు చెప్తున్నా. నాసంగతి అర్థంచేసుకోలేక

నాసామంతులూ కర్మచారులూ, చంద్రగుప్త విక్రమాదిత్యునివలెనూ, సముద్రగుప్తుని వలెనూ నన్ను తయారుచేద్దామని చూశారు కాని వారి ఈ కోర్కె అన్యాయమైంది.

నేను ప్రాణిరక్షణకొరకూ, ధర్మపాలనకొరకూ రాజ్యాన్ని స్వీకరించాను. దానములలోకెల్ల విద్యాదానమే గొప్పదని నాఅభిప్రాయం. అందుచేతనే నేను నలందా విశ్వవిద్యాలయంలో పదివేలమంది విద్యార్థులూ, పండితులూ నివసించేందుకు వారు సుఖంగా విద్యనేర్చుకుందుకు ఏర్పాటుచేశాను. నాకు విద్వాంసుల్ని గౌరవించుట చాలాయిష్టం. అందుచేత నేను చీనాపండితుడగు హేన్‌చింగును హృదయపూర్వకంగా సన్మానించాను. అతనియొక్క బుద్ధికౌశలత వాక్చాతుర్యము చూచి అతనిని అభివృద్ధిలోనికి తీసుకొద్దామని తలచాను. కాని అతడు కాళిదాసుని పంచచేరి ఉత్తభట్రాజులా అయిపోయాడు. దీన్నిబట్టి నేనెంతటి విద్యాభిమానినో తెలుస్తుంది.

ఎల్లరు తమతమ మతాల్ని పాలించాలి. ధర్మాలువారి యిష్టంమీదే ఆధారపడి ఉండాలి. అప్పుడే ప్రపంచంలో శాంతి; పరలోకంలో ముక్తి ఉంటాయి.

కామరూప్ (అసామ్) నుంచి సౌరాష్ట్రం (కథియవాడ్) వరకూ; వింధ్య పర్వతాల్నుంచి హిమాలయములవరకు గల నారాజ్యంలో న్యాయాన్ని స్థాపించాను. నాకర్మచారులు అన్యాయాలు చేయకుండా చూచేందుకు మధ్యమధ్య నేను రాజ్యంలో సంచారంచేసేవాణ్ని, అప్పుడు నేనొక బ్రాహ్మణుని కలిసికొన్నాను. అతడు నా(హర్ష) చరిత్రవ్రాస్తున్నాడు. అది నేనువిన్నాను. అది విక్రమాదిత్యునిగురించిన వర్ణనలాఉంది. నేను అతన్నికేకలేసాను. అతని ఉత్సాహం తగ్గిపోయింది. తరువాత కథను అతడాట్టె ఉత్సాహంగా వ్రాయలేకపోయాడు. అతడువ్రాసిన కాదంబరినిచూచాను. అదినాకు చాల బాగుంది. అందులో దర్బారు, అంతఃపురము, పరిచారికాపరిచారకులు మొదలగువర్ణనలు చదివితే అచ్చంగా నాదర్బారు మొదలైన వాటివలెనూ ఉన్నాయి. నా రాణివాసంలో గల పారశీకరాణి అంటే నాకెంతో ప్రేమ. ఆమెసొగసులు, అందమూ అందర్నీ మోహింపచేస్తాయి. ఆమెనే అతడు కాదంబరిలో మహాశ్వేతగా వర్ణించాడు. నాసౌరాష్ట్రపు రాణి కాస్తవయస్సు మళ్ళినది. ఆమె ఆనందమునకై ఆమెభవనాన్ని నేను ప్రత్యేకశ్రద్ధతో అలంకరింప చేసేవాణ్ణి. బాణుడు ఆమెనే కాదంబరిగా వర్ణించాడు. అందులోని ఈ రెండు విషయాలే నాకు వర్తిస్తాయి. మిగిలినవన్నీ అతిశయోక్తులే!

బాణుడు నా శ్రేయస్సును కోరేవాడు కాడని నేను నా ఆఖరిదినాల్లో అనుకునే వాడిని. హర్షచరితం, కాదంబరి మొదలగువానిలో చేసిన వర్ణనలు నన్నుగురించే అని ప్రజ లనుకోనేవారు. నాగానందము, రత్నావళి, ప్రియదర్శిక మొదలగునవి నాపేరవ్రాసి చాలాఅనర్థం చేసాడు. నేను కీర్తికోసం బాణుడికి డబ్బిచ్చి నాపేర వ్రాయించానని ప్రజ లంటారు. నిజానికి నాకేమీ తెలియదు.

నేను వైశ్యకులంవాడనని చాటుగా చెప్పుకునేవారు. ఇది పచ్చి అబద్ధం. మేము వైశ్య క్షత్రియులముకాని వైశ్యవర్తకులము కాము. మాశాతవాహనుని రాజ్య పాలన తరువాత మావాళ్ళంతా గోదావరి ఒడ్డునగల ప్రతిష్ఠానపురం వదలి థానేశ్వరం వచ్చేరారు. శాతవాహనుని వంశం వైశ్యకులంకాదని ప్రపంచానికి తెలుసు, నా ప్రియురాలైన మహాశ్వేతకూడ పారశీకరాజవంశానికి చెందిన స్త్రీ.

---

## 2

నాపేరు బాణుడు. నేను అనేక నాటకాలనూ, కావ్యాలనీ వ్రాశాను. నా యందు ఎవరికైనా దురభిప్రాయం ఉంటే దానిని సరిదిద్దడానికే నేనీ లేఖ వ్రాస్తున్నా. నా కావ్యాలు చదివేముందే దీన్ని చదవండి.

హర్షుడు నిందుదర్పాటులో నన్ను విషయలోలుడని అన్నాడు. నేనొక ధనికుని పుత్రుడను. నేనంటే మాతండ్రికెంతో ప్రేమ. నేను కాళిదాసుని కావ్యాలు చదివి శాస్త్ర శోకేశానయ్యాను. నేను బలిష్టమైన సుందరరూపిని. నాలో దేశాటనం చేయాలనేకోర్కె బలవత్తరంగా ఉంది. నేను నాయౌవనాన్ని ఆనందంగా గడపాలని కోరాను. కావలిస్తే నేను నాతండ్రిలాగ ఇంటివద్దనే ఉండగలను. కాని నాకది ఇష్టంలేదు. నా హృదయం ఎల్లాగుంటుందో నేను పైకికూడా అలాగే ఉండకోరుతాను. నాటు నటించడం అంటె అసహ్యం. నేను చాటుగా ఏదీ చెయ్యలేదు. ఏదిచేసినా బహిరంగంగా చేశాను. నాతండ్రి కులంకానివానిని లసుపుత్రుడేనని ఒక్కసారి మాత్రమే వైర్యంగా వెల్లడించాడు. నేను నావాంఛల్ని స్వదేశంలోకాక విదేశంలో తీర్చుకోవాలని కోరాను. స్వగ్రామంలో అయితే స్వజాతీయులు నిందిస్తారు; ధనమూ

పోతుంది. మగధనుంచి వెళ్ళి నేనొక నాట్యమండలిని స్థాపించాను. నామిత్రులంతా రూపవంతులు మంచి కళాప్రియులూను. నా నాట్యమండలిలో వేశ్యలేకాక యితర యువతులుకూడా ఉన్నారు. మేము నాటకాలువేయడానికని రత్నావళి, ప్రియదర్శిక మొదలగు నాటకాల్ని వ్రాశాను. నేను నావ్యసన వాసనతో కళాపోషణగూడా చేర్చాను. దీనితో మంచి కళాసేవ చేయగల్గానని అంతా ఒప్పుకుంటారు-ప్రశం సిస్తారు. నన్ను హర్షుడు తన ఆస్థానకవిగా చేస్తాడని నేనెన్నడూ అనుకోలేదు. నన్నుచాటేసుకుందుకే నేనీ నాటకాలన్నీ హర్షునిపేర రచించాను. నాటకాల్ని చదివినవాళ్ళు ఇందలివిలువను గ్రహిస్తారు. నా నాటకాలకు గొప్పగొప్పవాళ్ళుకూడా వచ్చేవారు. పండితులు, రాజులు, కవులు అనే భేదంలేకుండా అంతావచ్చేవారు. నేను హర్షుని దర్బారులోతప్ప అస్సామ్‌నుంచి సింధువరకూ, హిమాలయములనుంచి సింహళమువరకు గల రాజదర్బారులలో నా నాటకాల్ని ప్రదర్శించాను. నేను బాణుడ నని రాజులకు తెలిస్తే నా ఆనందానికి ఆటంకంకలిగేది. నాకెన్నడూ ఆస్థానకవిని కావాలనే కోర్కెలేదు. నాకు కావలసినంత ధనం ఉంది.

నేను విషయ లంపటుడనని మీరు అనుకుంటారు కాని నా నాట్యమండలిలో వారకాంతలు చాలాతక్కువ. వారైనా నృత్యగానములకొరకే. ఇంతవరకు దేశంలో ఉండే యువతులు రాజులయొక్క సామంతులయొక్క సొత్తుగా భావింపబడుతున్నారు. కాని ముందేం జరుగుతుందో తెలియదు. నామేనత్తను ఒక మాగధుడు బలవంతంగా అట్టేపెట్టుకున్నాడు. అతడు చనిపోయాడు. ఆమె మాయింటనే ఉంది. ఆమెఅంటే నాకు అపరిమితమైన ప్రేమ. అప్పుడు సుందరమైన యువతులు చాలాతక్కువ. సామంతులు, రాజులు యువతీమణులను స్వీకరించుటలో అనేక విధాలున్నాయి. కొంతమంది భర్తవద్దకువెళ్ళే మొదటిరాత్రే తమదానిగా భావిస్తారు. ఇది ప్రజలు తమ సౌభాగ్యంగా తలచి తమపుత్రికలను, కోడళ్ళను, చెల్లెళ్ళను మేనాల్లో ఎక్కించి అంతఃపురాల్లోకి పంపుతారు. అందు ఒకరాత్రి అట్టేఉంచుతారు. అల్లా పంపకపోతే అదివారి సర్వనాశనానికే! రాత్రి అంతఃపురంలో గడిపిన స్త్రీ యజమానికి నచ్చితే ఆమెను అక్కడే దాసీలా ఉంచుకుంటాడు. రాణీ సౌభాగ్యం రాచకన్యలకు, సామంతుల కన్యలకు మాత్రమే వుండేది. అంతఃపురంలో ఉండేకన్యలకు ఒకసారి కన్న అధికంగా రాజదర్శనంకాదు. వాళ్ళయౌవనం ఏంకోడుతుందో మీరే చెప్పండి! నామండలిలోని స్త్రీలంతా ఇటువంటి రాణివాసములనుండి వచ్చినవారే. నేను 'నావద్ద కళవుంది. కాని కళోపాసనకు అందమైన స్త్రీలు చాలామంది ఉన్నప్పటికీ వాళ్ళ

నాట్యరంగంలో అడుగిడదు.' అని అంటే రాజులూ, సామంతులూ 'ఏం దొరకరా?' అనేవారు.

'ఒక్క ముద్దు, ఒక్క ఆలింగనం, ఒక్క రాత్రి, ఒకే సెజ్జపై నిద్ర. అంతే; మళ్ళీ ఇవి ఎల్లావుంటాయో యెరుగని అమాయకపు స్త్రీలు అంతఃపురాల్లో బంధింపబడి వుంటారు! అల్లాంటిచోట కళని ప్రేమించే యువతులు ఎల్లా దొరుకుతారు?'

'నాట్యవతంసమా! నిజంచెప్పావు. కాని ఒకసారి అంతఃపుర ప్రవేశం చేయించాక ఎల్లా పొమ్మనేది?'

ఆపైన నేను నాట్యం, గానం రాచకన్యలకు రాజాంతఃపురాలకు ఎంత అవసరమో చెప్పాను. నేను నావద్దనున్న చతురులైన స్త్రీలను వారివద్దకు పంపాను. వారు తమ అంతఃపురాల్లో నాట్యం, గానంనేర్పమని వారిని కోరేవారు. మా నటీ మణులు వారికి నాట్యంనేర్పి, కబుర్లుచెప్పి మా మండలిలోనికి ఆకర్షించేవారు.

నేను సహగమనాన్ని నిరోధిస్తే నీచులైన రాజులు, బ్రాహ్మణులూ చాలా కోపించేవారు. భ్రూణహత్యలకంటె వితంతువివాహమే మేలని నాఉద్దేశం. గుప్తుల కాలంలో ధర్మంలో అనేక మార్పులొచ్చాయి. ఇప్పటికాలంలో మాంసం వర్జనీయంగా చేయబడింది. పూర్వం ధర్మంగా భావించబడేవి, యిప్పుడు అధర్మంగా ఎంచబడు తున్నాయి. రామగుప్తునియొక్క భార్యను చంద్రగుప్త విక్రమాదిత్యుడు తన పట్టపు రాణిగా చేసికొన్నాడు. బ్రాహ్మణులూ, రాజులూ ఏస్త్రీనీ వితంతువుగా ఉంచలేక పోతున్నారు. ఎంచేతంటే భార్యాపిల్లలున్నవాడు కూడా పరాయిస్త్రీలకై ప్రాకులాడు తున్నారు కాబట్టి. వితంతువివాహాలు చేయకపోతే భ్రూణహత్యలు జరుగుతాయి. వీటిని అరికట్టడానికి వితంతువివాహాన్ని ఒప్పుకోవాలి. కాని బ్రాహ్మణులూ, రాజులూ తమ స్వార్థంకోసం, మతంకోసం సహగమనాన్నే ప్రోత్సహిస్తారు. స్త్రీలను ఈవిధంగా తగులబెట్టడం వారు మహాపుణ్యంగా భావిస్తున్నారు. యిలా చేస్తోంటే దేవతలు ఊరుకుంటున్నారంటే వారిలో ఆత్మనేది ఉందా లేక శిలావిగ్రహాలేనా ?

నరాధములగు రాజులు, మతపిచ్చిగల బ్రాహ్మణులు తమ స్వార్థంకొరకై స్త్రీలు స్వేచ్ఛగా ఆనందంగా భర్తతో అగ్నిప్రవేశం చేస్తున్నారని అంటారు. ఒక్క ప్రాణికోసమని ఆ ప్రాణిఅంటే అణుమాత్రమైనా ప్రేమలేని అనేక మంది యువతు లను సహగమనమనే పేరుతో కాల్చేస్తారు. వీరిని రాక్షసులనాలో ఏమనాలో తెలియదు.

పతివియోగాన్ని భరించలేక ఏ స్త్రీయైనా సహగమనం చేస్తానంటే ఆమెను బ్రతిమాలి, బామాలి ఆపుచేయవచ్చు. కొన్ని రోజులు గడిచాక ఆమె ఆబాధను విస్మరించగలదు.

ప్రయాగలో అక్షయ వటవృక్షం వద్దనుంచి యమునలో పడి ప్రాణాలు విడిస్తే స్వర్గంవస్తుందని అంటారు. ఈ మూఢనమ్మకంతో ఏఏటా అనేకమంది మూర్ఖులు ఆవిధంగా తమ ప్రాణాల్ని కోల్పోతున్నారు. నేను రాజాశ్రయాన్ని పొందాలి అంచేత వీటనన్నిటని వ్యతిరేకించను.

నేను రాజాశ్రయం సంపాదించాను. కాని మనస్ఫూర్తిగాకాదు. నేను ధనవంతుడను. కాని నాకు లక్షలాది స్త్రీలను అనుభవించాలని ఆశలేదు. బహుశా నేను నూరుమందిని మాత్రమే ప్రేమించి ఉంటాను. నాయావదాస్తి హర్ష సామ్రాజ్యంలో ఉంది. హర్షుడు మాటమాటకీ కబురుపంపితే నేనేంచేయగలను? అశ్వఘోషునిమల్లే తాడూ బొంగరంలేనివాడనైతే హర్షుణ్ని లెఖచేసేవాడ్నికాదు.

హర్షుడు చెడ్డవాడు కాడని నాఅభిప్రాయం. మాధర్మం సోదరుని మృత్యువుతో పాటు అతనుకూడా చచ్చిపోవాలంటే తప్పక హర్షుడు అల్లా చేసేవాడు. అతనికి పొగడ్తఅంటే ఇష్టం. కాని ఇష్టంలేనట్లు నటిస్తాడు-స్త్రీలంటే యిష్టంకాని ఆయిష్టంగా ప్రవర్తిస్తాడు. హర్షుడు అడక్కుండగానే నేను నా నాటకాలకు అతనిపేరు పెట్టటడం ప్రచారం చేయడం అంతా చెప్పాను. కాని అతడు తనపేరుపెట్టమని ఎన్నడూ చెప్పలేదు.

పర్యటనమూలంగా ప్రపంచాన్ని యథారూపంలో చిత్రించాలనే కోర్కె నాకు కలిగింది. దేశాటనం చేయకపోతే నాకీకోర్కె కలిగేదికాదు. కలిగినా నేను సాఫల్యం పొందలేకపోయేవాడ్ని. నేను కాదంబరీపథవనం వర్ణించేటప్పుడు హిమాలయాలు నాకండ్లకు కట్టినట్లున్నాయి. నా కవిత్వంలో వింధ్యపర్వతాల్ని, నేనెరుగున్న హర్షునియొక్క సామంతులయొక్క సంపదనూ రాజభవనాల్ని, ఉద్యాన వనాల్ని, అంతిపురాల్ని వర్ణించాను. కాని నేను పేదలదైన్యాన్ని, వారి గుడిసెలనూ వర్ణించలేకపోయాను. నేను అల్లాచేసినట్లయితే రాజుల్ని వారిభవనాల్ని నీచంగా చిత్రించవలసివచ్చేది. ఎంచేతంటే వీటిమూలంగా పేదలు, ఆ గుడిసెలూ ఏర్పడ్డాయి-నేను అలావర్ణిస్తే రాజులకు అయిష్టుడనయ్యేవాడిని.

—

# 3

నేను దాపరికంలేకుండా ఉన్నది ఉన్నట్లు ఎదురుగా అనేస్తాను. అంచేతనే నన్ను దుర్ముఖుడంటారు. నాలా అనేవాళ్ళు తక్కువమంది ఉన్నారు. వారు పిచ్చి చేష్టలు చేస్తూ అంటారు. అంచేత వారిమాటలు ఎవరూ లెఖచెయ్యరు. శ్రీపర్వతం నుంచి అనేకమంది సిద్ధులు వచ్చేవారు. నేనుకూడా సిద్ధుడనని అనగలను కాని నాకు ప్రపంచాన్ని మోసంచేయడం ఇష్టంలేదు. లోకాన్ని మోసంచేయడానికే నేను నలందను విడిచాను. అక్కడే ఉన్నట్లయితే నేనుకూడా మహాపండితునిగా గణింపబడే వాడ్ని. అక్కడ ఒక అగ్నిని చిరజీమ్మేవాడ్ని చూచాను. నావారూ పరాయివాళ్ళూ-అతడ్ని ఎంతగా ప్రేమించారో చూచాను. అతనిపేరు వినాలని ఉందా? అవునా. అదిగో 'తార్కికశ్రేష్ఠ అనే గొర్రెల మందలో శ్రేష్ఠమైన పొట్టేలు.' అతడే ధర్మకీర్తి.

అతడు నలందాలో కూర్చొని 'బుద్ధికంటెకూడా గొప్పదగు జ్ఞానంపొందాలి, ప్రపంచంలో కర్తా ధర్తా ఈశ్వరుడే అని ఒప్పుకోవాలి, జాత్యభిమానం-పాపనాశనం కోసం శరీరాన్ని కష్టపెట్టాలి' అని బల్లగుద్ది చెప్పేవాడు.

నేను 'గురూజీ? మీ అస్త్రం చాలా మహత్వం కలది. కాని ఇది ప్రజలకు కనిపించవీల్లేనంత చిన్నదైపోయింది.'

'నా అస్త్రంలోని లోపం నాకు తెల్సు. నేను దాన్ని నాశనం చేద్దామని చూస్తున్నాను. కాని అల్లాచేయడానికి ఇంకా భయంకరమైన ఆయుధాల్ని చేబట్టాలి. నేనంటే నలందాలోని సంఘాలు మహంతులు ఇప్పటికే కోపంగా ఉంది. నలందా ఒక తమాషాఅనీ ఇందులోకి వచ్చే విద్యార్థులంతా మూర్ఖులవుతారనీ, అందరికళ్ళూ మిరుమిట్లుగొల్పి ఏమీకనుపించదు, ఏమీ తెలియదు, అని చెపితే నాకు ఒక విద్యార్థి కూడా దొరుకుతాడా? యిక్కడ శీలాదిత్యుడు ఇచ్చిన గ్రామాల్నించి సన్నబియ్యము, నెయ్యి, పాలు, పెరుగు, పప్పు, ఖర్జూరాలు మొదలైనవి వస్తాయి. ఇవన్నీ మెక్కే వాళ్ళ శీలాదిత్యునిమీద విప్లవం లేవతీయండని ప్రజల కేవిధంగా చెప్పగల్గుతారు'- అని ధర్మకీర్తి అన్నాడు.

'అయితే గురూజీ! మీరు ఈ అంధకారమయ కూపంలోంచి వెలువడ్డానికి మార్గమే లేదా?'

'మార్గమా ? ప్రతిరోగానికీ మందుంటుంది. ప్రతికష్టాన్నుంచి తప్పుకోవడానికి వీలుంటుంది. కాని ఇందులోంచిమాత్రం కష్టం. ఇందు అంధకార ప్రాబల్యమే అధికం.'

'అయితే గత్యంతరం?'

'ప్రపంచాన్ని మోసంచేయటంకంటె ఇందులో యిమిడిపోవటమే మంచిది. మార్గదర్శకులనిచెప్పే వాళ్ళంతా ఎట్లాలోకవంచకు లౌతున్నారో చూడ్డంలేదా ? ఈ స్థితి మన దేశానికేకాదు ప్రపంచానికంతకూ ఉంది. సింహళం, చీనా, పారస్య మొదలగు సమస్త ప్రదేశాలకూ చెందిన విద్యార్థులు ఇక్కడ ఉన్నారు. వాళ్ళతో మాట్లాడితే ప్రపంచం ఎంత గ్రుడ్డిగా చేయబడిందో తెలుస్తుంది.'

ధర్మకీర్తి ఈ అంధకారాన్ని కాంతివంతంగా చేయటానికి శాయశక్తులా ప్రయత్నించాడు. కాని నాకు అవేవి నచ్చలేదు. నేనుకూడా ప్రకాశవంతమైన జువ్వలను వెదజిమ్మాలని అనుకొన్నా. కాని నేను అట్లా చేయలేను. నేను నాకవిత్వ చాతుర్యాన్ని చూపుదామంటే రాజదండం ఉంది. తక్షణం నానోటిని కట్టేస్తుంది. అయినప్పటికీ నేను అప్పుడప్పుడు అల్లాంటివి విసురుతూనే ఉంటాను.

నేను ఒకసారి ప్రయాగతీర్థంలో 'మహారాజా! మీరు ప్రతిఐదు సంవత్సరాలకు యిక్కడ దాన ధర్మాలకు వెచ్చించేధనం దాసదాసీల ముక్తికై వినియోగిస్తే ఇంతకంటె గొప్ప ధర్మకార్యంకాదా?' అన్నాను.

శిలాదిత్యుడు మాట్లాడలేదు. ఈయనచెల్లెలైన రాజ్యశ్రీ ఉండగా మళ్ళీ ప్రశ్నించాను. నేనామెకు దాసదాసీలు పడే యమయాతనలు చెప్పాను. ఆమె హృదయం ద్రవించిపోయింది. 'దాసదాసీల ముక్తియే తమముక్తిమార్గం' అని నేను చెప్పినమాట ఆమె హృదయంలో నాటుకుపోయింది. పాపం ఆమెకు దాసత్వంలో దాగిఉన్న స్వార్థం ఏమితెలుస్తుంది; భూమే స్వర్గంఅయితే స్వర్గం సహించగలదా ? స్వర్గనరకాలు నిశ్చలంగా వుండటానికే రాజు-సేవకులు; నరకం-స్వర్గం; దాసుడు-యజమానీ అనేవి సృష్టించబడ్డాయి.

రాజుగారు ఒంటరిగా నాతో 'నేను ధనమిచ్చి దాసదాసీలను స్వతంత్రులుగా చేస్తాను. వాళ్ళు తమ ధనహీనత కారణంగా మళ్ళీ అమ్ముడుపోతారు.' అన్నారు.

'ఈ జానిసవ్యాపారాన్ని అరికట్టాలి. చేస్తే దండించాలి.'

ఆయన మాట్లాడలేదు. నేను 'నాగానందంలో నాగదత్తుడు ఇతరులకొరకై తన ప్రాణాన్నికూడా ధారపోయడానికి సిద్ధం'అన్నాను. నాగానందాన్ని హర్షుడే వ్రాశాడనే ప్రతీతిఉంది. దానికి సమాధానం ఏం చెప్తాడు? చివరకు ఆయనకు దాసీలనిముక్తికంటె బ్రాహ్మణులకు, భిక్షువులకు దానాలిస్తే అధికమైన కీర్తి వస్తుందని తోచింది. అప్పటినుంచీ నాదృష్టిలో శీలాదిత్యుడు 'శీలాదిత్యుడుకాక దుశ్శీలు' డని తోచింది.

పాపం ఇందులో శీలాదిత్యుని తప్పేముంది? ఈకాలంలో విలాసంగా ఉండటమే నాగరికతలకు లక్షణం. పూర్వం మద్యాన్ని మంచి నీరులా వాడేవారు. కాని నేడు బ్రాహ్మలు మద్యపానాన్ని నిషేధించారు. బాహటంగా త్రాగితే వెలివేసి నానాగల్లంతు చేస్తారు. ఫలితం దేవపూజకనీ సాధనసిద్ధికనీ భైరవపూజలోను చాటుగా తాగుతున్నారు. బ్రహ్మచర్య మనే మాయ యింకోటి. కాని భైరవీ చక్రంలో స్త్రీలు ముఖ్యం. అందు తల్లి, సోదరీ, కూతురు అనే విచక్షణ ఉండదు. అంతా భగవంతునికొరకే పంచమకారాలకే, అట్లాంటి ప్రదేశం వ్యభిచారస్థలంకాక మరేమౌతుంది? వీటిని ఈ రూపంలో చూడగలిగేవారుంటే ఇవన్నీ సహించరేదు.

నేనొకసారి కామరూప్‌కు వెళ్ళాను. ఆరాజుకు నలంద మహాయానమన్నా ఎక్కువప్రేమ. 'నేను భూమిమీద ఒక్క జానిస ఉన్నంతవరకు నిర్యాణము పొందను' అని మహాయానమతంలో బుద్ధుడు బోధించాడు. మహారాజా! మీ రాజ్యం లోనివారు పట్నములకుపోయి చేతితో విలాస దండములు ఆడిస్తూ ఎవ్వరూ తమ్ము ముట్టుకోరాదని ఒడుస్తారు తాకితే తాము మైలపడిపోతామని. ఉమ్మిక్రింద వేయ వలసివస్తుందని చేతిలో పాత్ర ధరిస్తారు. ఒక్క ముట్టుకుంటే మనుష్యుడు అప విత్రుడుకాడు. అతని నిష్ఠకేమాత్రమూ భంగంరాదు. మహారాజా! చండాలుడు ఒక్క కన్నకూడా నికృష్టుడా? నీచమైనవాడా?'

'కాదు కుక్కకంటే నీచుడుకాడు. వానిలోకూడా ప్రాణంవుంది. వాడుకూడా బుద్ధుడవవచ్చును'.

'అయితే చండాలురు ఉమ్మిపాత్ర తేనవసరంలేదని ఆజ్ఞాపించండి'

'ఇది నాశక్తికిమించినపని. ధర్మం ఆలాచెపుతోంది'.

'మహాయానధర్మమా?'

'కాని ఇక్కడివాళ్ళంతా మహాయానులు కారు'.

'నేడు గ్రామాల్లోను, పట్నాల్లోను అన్నిచోట్ల ఇదే ఉంది'.

'అవును. నేను ప్రచారంచేస్తే సనాతనులు ఆగ్రహిస్తారు'.

'మహారాజా! మీరు బోధిసత్వునిలా సర్వసంగపరిత్యాగంచేస్తే మిమ్మనుసరించడానికి అనేకమంది ఉన్నారు'.

'ఇది రాజ్యంలోని విషయమేకాదు. పరమభట్టారకులుకూడా కోపిస్తారు'.

'మరి శీలాదిత్యహర్షుడు నాగానందంలో బుద్ధునిగురించి అద్భుతంగా చిత్రించాడు?'

'ఉత్తుంగతరంగాల్ని ఆపడానికెవరికీ శక్యంగాదు'.

'అశ్వఘోషుడు, నాగార్జునుడూ యీ విధంగానే తలిస్తే?'

'వారిలో సాహసంఉంది కనుకనే కొంతదూరం వెళ్ళగలిగారు'.

'మహారాజ్! మీరు మార్గంచూపితే తరువాత వారు ఇంకా ముందుకు వెళ్తారు'.

'నేను పిరికిపందనని నానోటితో చెప్పిస్తేకాని వదలవా!'

'పిరికితనం కాదు, ధర్మం ఒక మోసంఅని'.

'నాహృదయం "ఊ" అని సమ్మతిస్తే, నా నాలుక 'కాదు' అంటుంది లేకపోతే జవాబే యివ్వదు'.

ఈ బ్రాహ్మణమతం కారణంగానే కామరూపరాజూ మొదలగు సహృదయులు కూడా పిరికివారయ్యారు. బ్రాహ్మణులమూలాన్నే ఈ జాతులు అనేవి ఏర్పడ్డాయి. ఐకమత్యం నశించింది. వీరి ధర్మజ్ఞానాలు రాహుకేతువుల్లాంటివి.

నలందాలో దేశ దేశాల సంగతులు అనేకం తెలుస్తాయి. అంచేత నేను ఒకటి రెండు సంవత్సరాలు దేశాటనంచేసి ఐదు ఆరు మాసాలు నలందాలో ఉంటాను. ఒకసారి ఒకబౌద్ధభిక్షుకుడు 'మాదేశంలో మజ్దక్ అనే విద్వాంసుడు పుట్టాడు. ఆయన ఐక్యతనుగూర్చి ప్రచారంచేశాడు' అని చెప్పాడు. అల్లాగే బుద్ధుడు బౌద్ధుల్లో ప్రచారం చేసాడు. కాని ఇప్పుడా ఐక్యత 'వినయపిటక్' గ్రంథంలో మాత్రమేఉంది. మజ్దక్ భిక్షుకవాదాన్ని ఒప్పుకోలేదు. అతడు 'మానవజీవితాన్ని, ప్రియుడు-ప్రియురాలూ, పుత్రులు-పౌత్రుల జీవితాన్ని ఒప్పుకుంటాడు. కాని 'నేను, నాది,' అనేవే అన్ని కష్టాలకు, చెడ్డలకు కారణం అనీ, అంతా కలిసి సంపాదించాలి, అంతా కలిసి తినాలి, అంతాకష్టపడాలి, అంతాసుఖపడాలి అనీ ఇంకా భార్యాభర్తలు కలసిఉండాలి, ప్రేమకు స్వేచ్ఛఉండాలి, పిల్లలు అందరి పిల్లలు అని భావించాలి అనీ జీవహింసకూడదనీ చెప్పాడు. నాకు ఆయన ఉద్దేశాలు నచ్చాయి. నౌశీర్వా అనే పారశీకరాజు న్యాయమూర్తిగా మజ్దక్‌నీ అనుయాయులనూ చంపించాడని వినగానే నాకు 'రాజులు ఉన్నంతకాలం దానధర్మాలు ఉంటాయి, బ్రాహ్మణులుంటారు. వీళ్ళు ఉన్నంత కాలం పృథ్వి స్వర్గం కాదు భూతలం స్వర్గం అవడానికి వీల్లేదు' అని తోచింది.



# "చక్రపాణి"

## (పదునాల్గవ కథ)

[కాలం:— క్రీస్తుతరువాత 1400 సం॥ రాలు.]

ఆ కాలంలో భారతదేశంలోని పట్టణములలోకెల్ల కనోజ్ భాగ్యవంతమైన పెద్దపట్టణము. ఆపట్టణ వీధులు, బజారులు ఎల్లప్పుడూ క్రిక్కిరిసియుంటాయి. ఆ పట్టణం లేపినవస్తువులకూ, వాసననూనెలకూ, పాత్రలు ఆభరణాలు మొదలైన అన్ని వస్తువులకూ దేశమంతటా పేరుమ్రోగినది. మౌఖరీ, వైస్, ప్రతిహార్, అహడ్వార్ మొదలగు రాజవంశీకులకు 600 సం॥ రాలు రాజధాని అగుటచే ఈ పట్టణమంటే ప్రజలకు గౌరవం ఏర్పడింది. కొన్నిజాతులవారు ఈ పట్టణంపేరును తమజాతిలోని శాఖలపేరుగా పెట్టుకున్నారు. అందువల్లనే నేటికీ కన్యాకుబ్జ బ్రాహ్మణులనీ, కన్యాకుబ్జగొల్లలనీ ఈలాగే అనేకజాతులు కూడా పేరుపెట్టుకొన్నాయి. హిందూమతమంటే ఏలాంటి అభిమానం ఉందో అట్టి అభిమానమే ప్రజలకు కన్యాకుబ్జమన్నా వుంది.

హర్షుని తరువాత భారతదేశంలో అనేక విప్లవాత్మకమైన మార్పులు జరిగాయి. కాని నూతిలోనికప్పవలె భారతీయులు అభివృద్ధి చెందక సంకుచితబుద్ధితోనే నివసింపసాగారు.

హర్షవర్ధనుని పరిపాలనాకాలంలోనే అరేబియాలో ఇస్లామ్ అను నూతనమతం స్థాపింపబడింది. ఆ మతస్థాపకుడు మరణించిన (క్రీస్తుతరువాత 622 సం॥ రము) ఒక శతాబ్దము లోపుగనే ఆ మతం సింధునుంచి స్పెయిన్‌వరకూ ప్రతిదేశంలోను వ్యాపిస్తుందని అప్పుడెవరూ ఊహించలేదు. ఇంతవరకు రాజుల, రాజ్యాలపేరిట యుద్ధాలు జరిగెడివి. కాని మొదటిసారిగా ప్రజలు యిప్పుడే మతయుద్ధాలపేరిట యుద్ధాలు జరగటం వింటున్నారు. ఆత్మరక్షణకు ఏమీ అవకాశం యివ్వకుండా శత్రువును తుడిచిపెట్టివేయటమే ఈమతయుద్ధములధర్మం. ఇరానీయుల బలవత్తరమైన పెర్షియన్ సామ్రాజ్యం అరబ్బుల మొదటిదెబ్బకే పేకముక్కల మేడవలె కూలిపోయింది. ఇస్లామ్‌స్థాపకుని నిర్యాణం తరువాత రెండు శతాబ్దాలు గడువకుండానే పామీర్‌లోకూడా చంద్రధ్వజం; ఇస్లాంమతసూత్రాలు వ్యాప్తిలోకి రాసాగాయి.

అరబ్బుజాతుల పద్ధతిలో ప్రపంచానంతనీ తయారు చేయవలెననీ, ఆ మతస్థులలో కొండజాతులవారిలోవలె సోదరభావం ప్రజాస్వామ్య సిద్ధాంతాలు ప్రచారం చేయవలెననీ, ఈమతము మొదట్లో ప్రయత్నం చేసింది. ఇప్పటికి వైదిక ఆర్యుల యుగం 3,000 సం॥రాల క్రితమే గడిచిపోయింది. గతించిన కాలం తిరిగిరావటం అసంభవం. ఇస్లాంమతం రాజ్యస్థాపనకు ఉపక్రమించుసరికి గుంపుస్వరూపం మాయమైంది.—ఇస్లామ్ ప్రధానశాసకుడు సుల్తానయినా, నిరంకుశ ప్రభువైనా ఖలీఫా అని పిలువబడేవాడు. వారిలో ఇస్లాం పవిత్రధర్మమగు నిరాడంబరత్వము, సమానత్వం, సౌభ్రాతృత్వం శూన్యం. ఇస్లాం రాజ్యస్థాపనకు బలవత్తరమైన సైన్యం కావాలి. ఇప్పుడా సైన్యంలో అరబ్బులుకాకుండా యితరులే ఉన్నారు. ఇప్పుడు వాళ్ళు సుల్తాన్‌కోసం ప్రాణత్యాగం చెయ్యలేరు. ఎందువల్లనంటే స్వర్గాపేక్షయే కాకుండా ప్రాపంచిక లాభాలను వారు ఆశపడుతున్నారు. తాము జయించిన రాజ్యములపైననే కాకుండా దోపిడీ చేసిన వస్తువులపైనా, బానిసలపైనా వారు సర్వాధికారులు. ఈ విధంగా చేతికిచిక్కినదాన్ని దోచుకొని ముందుకు సాగిపోయే సైన్యం ఇదివర కెవరికీ లేదు. మనలోనుంచే మనతో పోరాడుటకు తయారు చేయబడిన సైన్యాన్ని ఎదుర్కొనుట కష్టం.

హర్షుడు చనిపోయిన 100 సంవత్సరములకు పూర్వమే సింధు దేశములో తురుష్కరాజ్యం ఏర్పడింది. కాశీ, సోమనాథపురములవరకూ కూడ తురుష్కులు తమ యుద్ధకౌశల్యం చూపెట్టారు.

ఈ కొత్తదాడులనుంచి తప్పించుకొనుటకు నూతన మార్గాలను అన్వేషింపవలసి వచ్చింది. కాని హిందువులు తమ పూర్వపుపద్ధతులను వదలుటకు సిద్ధంగాలేరు. కాని భారతదేశంలో రాజపుత్రులే యుద్ధకుశలురు. వారైనా అంతర్యుద్ధాలలో మునిగి వున్నారు. తమలో తాము ఐకమత్యం చేకూర్చుకోలేకపోయారు.

—

## 2

'మహారాజా! ఆదుర్దా పడవద్దు. గాలికి ఎండుటాకులవలె తురుష్కులు ఎగిరిపో గలరు. పవిత్రహృదయుడగు సన్యాసి అందుకు అనువైన ఉపాయాన్ని అన్వేషింపసాగాడు.'

'మనగురువు మిత్రపాదుడు ఎంత ఉదారస్వభావుడు! నాకుగాని నా కుటుంబానికి గాని ఏదైనా ఆపదవస్తుందనే భయంవేస్తే ఆతడు తన భగవత్ సంబంధమైన శక్తిని వినియోగపరచి నన్ను రక్షిస్తాడు.'

'మహాప్రభూ! హిమాలయముల వెనుకగల బహోట్ దేశంనుంచియే కనోజ్‌కు రాగల ప్రమాదాన్ని పవిత్రుడగు ఆగురువు గుర్తించాడు. అందువల్లనే ఆతడు నన్ను మీ వద్దకు పంపాడు.'

'ఆతడు ఎంతమంచివాడు!'

'తారాదేవి మీకు సహాయం చేస్తుందని ఆయన చెపుతాడు. తురుష్కులకు భయపడనవసరం లేదు.'

'తారాదేవి యందు నాకుపూర్తి నమ్మకముంది. కష్టములలో నున్నవారిని రక్షించుతల్లీ! ఈ దోపిడిగాండ్లను ఎదుర్కొనుటలో మాకు సహాయపడు!'

స్వర్గములోని ఇంద్రభవనముతో పోల్చదగిన రాజమందిరంలో, పాలరాతితో చేయబడి కాంతులీనుచున్న సింహాసనముపై ముదుసలి రాజగు జయచంద్రుడు ఆసీనుడై వున్నాడు. అనుపమ సౌందర్యరాసులైన నలుగురు రాణులు తుమ్మెద రెక్కలవంటి తమ నల్లని కురులను ముడివేసికొని అతని ప్రక్కప్రక్కననే ఆసీనులై వున్నారు. వారి శరీరములు చూడామణులు, చంద్రహారములు ముత్యాలహారములు మొదలైన అనేక ఆభరణములతో బరువెక్కి ఉన్నాయి. వారు మృదువైన సన్నని వస్త్రములు ధరించి వున్నారు. వారి దుస్తులు శరీరమును మరుగుపరచుటకుగాక, బహిరంగపరచి వారి సౌందర్యమును వెల్లడిచేయుటకే ఉపయుక్తమైనవిగా ఉన్నాయి. వారి మృదువైన చర్మమును, వారి ఘనకుచములను మరుగుపరచకుండుటకే అట్టి వస్త్రములను వారు ధరించారని సుస్పష్టమైపోతోంది. వారి స్తనములయొక్క అరుణ కాంతి కంచుకంలోంచి పైకి చిమ్ముతోంది. వారి తల నూనెల, మల్లెపూలమాలల

సుగంధాలు మందిరమునంతా పరిమళించేసాయి. వారివద్ద చాలామంది సుందరులైన దాసీలు ఉన్నారు. వాళ్ళు పంకాలువేయుట, గంధంతీయుట మొదలైనవి చేస్తున్నారు. కొంతమంది యువతులు తమలపాకుల చిలుకలు చుట్టుతున్నారు. కొంతమంది సుగంధజలములు తెస్తున్నారు. కొందరు శుభ్రమైన తెల్లని మల్లెపూవువలె ఉన్న వస్త్రములను తెస్తున్నారు. అక్కడ వీణా, మృదంగం మొదలగు వాయిద్యములతో కొంతమంది ఆసీనులై వున్నారు. కొంతమంది బంగారు రాజదండములను చేబూని యిటు నటు తిరుగుతున్నారు.

మిత్రపాదుని శిష్యుడగు సన్యాసి సుధాకరుడూ, రాజు జయచంద్రుడు మినహా అక్కడ ఉన్నవారంతా రాణులూ, సౌందర్యవతులైన యువతులే.

ఆ సన్యాసి సెలవుతీసుకొంటుంటే రాజు, ఆతనితోబాటు లేచి నిలబడి నమస్కరించారు. ఇప్పుడు యువతీమణుల మధ్యన రాజు ఒంటరిగా ఉన్నాడు. అతడు ముసలివాడు. నెరసిపోతున్న ఆతని పొడుగుపాటిజుట్టు పైకెత్తి చక్కగా పాపిడి దువ్వబ; చక్కనిపద్ధతిలో కాపాడబడుతున్న ఆతని ఒత్తైనమీసములు, ఆతడు ధరించిన విలువైన దుస్తులూ, ఆభరణాలు చూస్తే ఆతడు తన యౌవ్వనకాలం ముగిసిపోయినట్లు భావించుటలేదని తెలియగలదు. ఆతడు సైగచేయుటయే తడవుగా ఒక పరిచారిక వంగి ఆతనిముందు సురాపాత్రతో నిలబడింది. రాణులలో ఒకతె దానిని తీసుకొని కప్పునిండాపోసి రాజుకు అందించింది. ఆతడు దానిని త్రాగబోయూ 'ఓ నా అందకత్తే! రాజాల్! నీవు ఎంగిలిచేయకుండా దీనిని నేను ఎల్లా త్రాగగలను?' వెంటనే ఆమె పెదవులను నాలుకను దానిలో తడిచేసుకొంది. అప్పుడు ఆ ప్రసాదాన్ని రాజు త్రాగివేశాడు. వరుసగా ఒకరితరువాత మరొకరుగా ఆతని ప్రియురాండ్రందరూ దానిని ఎంగిలిచేసి ఆతనికి అందించారు. ఆతని కన్నులు మెరయసాగాయి. తురుష్కుల భీతివల్ల ఆతనిముఖంలో ఏర్పడియున్న విషాదచ్ఛాయలు తొలగిపోయి, ఆతనిముఖం వికసింపసాగింది. ఆతని బరువైనశరీరము పాన్పుపై వాలింది. అతడు రెండువైపులా చెరియొక రాణిని లాక్కొన్నాడు. మరోరాణి తోడలో శిరస్సును ఉంచాడు; నాల్గవరాణిభుజాలనుంచి తన రెండుచేతుల్ని ముందుకు చాచాడు. వారితో కలసి రాజు మద్యం సేవించాడు. ఇప్పుడు నాట్యము చేయవలసినదిగా ఆజ్ఞాపించాడు. అనేకమంది యువతులు నాట్యంచేయుటకు లేచి నిలబడ్డారు. వారు గజ్జెలు ధరించి అందంగా తయారై నాట్యం ప్రారంభించబోతున్నారు. వీణ వాయించుట, మృదంగం

ప్రయోగించుటతో నాట్యం ప్రారంభమైంది. ఒక పాటతో రాజు తన్మయుడై వారిని నగ్నంగా నాట్యం చెయ్యమన్నాడు. గజ్జెలుమినహా నాట్యకత్తెలు తమ శరీరముపై గల ఆభరణములను, వస్త్రములను తీసిపారవేశారు. ప్రక్కగదిలో రాణులు. వారి చెలికత్తెలతో రాజు ఆలింగనములూ, వేళాకోళాలూ ప్రారంభించాడు. ఆ గదిమధ్య నగ్నయువతుల నాట్యం సాగిపోతోంది. వారిలో ఒక యువతి నగ్నసౌందర్యానికి ఆకర్షితుడై రాజు ఆమెను తనవద్దకు పిలిచాడు. మరొకస్త్రీ ఆ యువతికి బదులుగా నాట్యంలో పాల్గొంటుంది. రాజు కన్నులు ఎర్రబడసాగాయి. మాటలు తడబడ సాగాయి. సురాపానప్రభావం కనబడసాగింది. అప్పుడు 'మీ రందరూ నగ్నంగా నాట్యంచెయ్యండి' అన్నాడు.

ఆ గదిలోని స్త్రీలందరూ తమ వస్త్రములను, ఆభరణములను తీసివేశారు. ఆ సౌందర్యవతుల కురులు విరియబోసికొనవలసినదిగా కోరాడు; అప్పుడు అందమైన వారి నల్లటికురులు తలనుంచి పాదములవరకూ వ్రేలాడాయి. అప్పటికే రాజుకు మైకం కమ్మింది. అందువల్ల ఆ యువతులు ఆతనికి వస్త్రములను, ఆభరణములను తొల గించుకొనుటలో సహాయపడ్డారు. వడిలిపోయి లోతుకుపోయినబుగ్గలు, తెలుపు నలుపు రంగులలోనున్న మీసాలు, పిల్లలతల్లికిగల కుచములవంటి కుచములు, గుండ్రని బొజ్జగల ఆతనిని చూచి ఏ సాధారణయువతీ అసహ్యించుకొనకుండా ఉండజాలదు. కాని అందరి యువతులప్రాణాలు ఆ ముదుసలి పిడికిలిలో ఉన్నాయి. వారిలో ఒకతె వాని బోసినోటితో తన పెదవులను చేర్చింది. మరొకతె తన జబ్బలను వానివాటితో చేర్చింది. మూడవ యువతి వానిచేతులలో తన భుజములను, బుగ్గలను చేర్చింది. మళ్ళీ నృత్యగానములు ప్రారంభమయ్యాయి. ఆ రాణులమధ్య, వారి పరిచారకులమధ్య రాజు వాని గుండ్రనిబొజ్జతో నాట్యంచేయసాగాడు.

---

## 3

'దయచేయండి! కవిరాజా!' అంటూ రాజు మధ్యవయస్కుడగు యువకుని ఆసీనునిగాచేసి గౌరవపురస్సరంగా రెండు తమలపాకులు ఆతనిచేతిలో పెట్టాడు.

మంచి రంగుగలిగి, నల్లటిమీసములతో యౌవనచ్ఛాయలు ఇంకా ముఖంలో చూపట్టుతూన్న ఆ కవిరాజు సుమారు 50 సంవత్సరముల వయస్సుగలవాడు. అతడు తెల్లని వస్త్రములు ధరించాడు. రుద్రాక్షమాల కలిగిఉన్నాడు. చంద్రవంకవంటి భస్మ రేఖలు మూడు ఆతనిముఖంపై తీర్చిదిద్దబడినాయి.

బంగారు రేకులో చుట్టబడివున్న ఆ తమలపాకులను నోటిలో వేసుకొంటూ 'రాజా! మీ ప్రయాణం సుఖంగా జరిగిందా? మీరు ఆరోగ్యంగానే పోయివచ్చారా? ఇప్పుడు మీరు ఆనందదాయకమైన కలనే కంటున్నారా?'

'నాలోని పురుషత్వం నశించిపోతోంది. కవిపుంగవా.'

'మీకవి శ్రీహర్షుని వేళాకోళం చేయగోరుతున్నారా?'

'కవిపుంగవా! అని మిమ్మలను వేళాకోళానికిగాదు నేను పిలుస్తా. మిమ్మ లను అభినందించుటకే.'

'అది ఒక జంతువు. (ఎద్దును పుంగవం అంటారు.)'

'తెలుసుకొని దానిని ప్రఖ్యాతపురుషులకుకూడా వాడుతారు.'

'దాన్ని నేను 'జంతువు' అనేఅర్ధంలో తీసుకొంటా.'

'నేను గౌరవనీయమైనదిగా భావిస్తా. మంచిది మిత్రమా! ఓకవీ! నీవంటి పాతస్నేహితుణ్ని కాక మరెవర్ని వేళాకోళం చేయగలం.'

'కాని దర్బారులో కాదుగదా!' మెల్లగా అన్నాడు శ్రీహర్షుడు.

జయచంద్రుడు ఆతనిచేయి పుచ్చుకొని దర్బారులోనుంచి ఉద్యానవనంలోనికి తీసుకొనిపోయాడు. అప్పుడే వేసవి ప్రారంభమౌతున్నందువల్ల పచ్చని చెట్లపై నుంచి వీచేగాలి ఆనందదాయకంగా వుంది. సరస్సుమెట్లపైన వున్న పాలరాతి కుర్చీపై తన సహచరుని కూర్చోబెట్టి రాజు ఇట్లు చెప్పసాగాడు.

'నీవు నారాత్రులనుగురించి అడిగావు.... నేను ముసలివాడనై పోతున్నానని భావిస్తున్నా.'

'ఎందువల్ల?'

'నగ్నసుందరులుకూడా నా కోర్కెను రేకెత్తించలేదు.'

'మహారాజా! అలాగైతే మీరు యోగులన్నమాట.'

'ఈ యోగిదగ్గర ఈ 16000 మంది సుందరులూ ఎందుకు?'

'వారిని దానంచెయ్యి. సంతోషంతో ఎంతోమంది స్వీకరిస్తారు. లేకపోతే గంగాజలం, దర్భలూ తీసుకొని వారిని కాశీబ్రాహ్మణులకు దానంచెయ్యి. దానములలోకెల్ల గొప్పదానం భార్యాదానమని నీకు తెలుసునుగా?'

'అదే నేను చేయవలసివుంది. నా ప్రధానవైద్యుడగు చక్రపాణియొక్క పందెంవేసేశక్తి తగ్గింది. ఇప్పుడు నా జీవితంలో ఉన్న ఆశ నీ కవిత్వమును విని ఆనందించటమే.'

'సౌందర్యాన్ని గుర్తించలేకపోతే కావ్యప్రతిభమాత్రం ఎందుకు? అయినా మహారాజులవారికి 60వ పడి దాటింది.'

'ఏమిటి? 16,000 మందితో ఇంతకాలంనుంచీ అనుభవిస్తున్న ఆటోతునకా?'

'మంచిది. నేను కనోజ్‌నుంచివచ్చి రెండుమాసాలైంది. ఇంతవరకూ మీరు కాశీవెళ్ళలేదు.'

'చైత్రమాసంలో నవరాత్రులలో భగవతి వింధ్యావాసివద్దకు వెళ్ళాను.'

'ఎందుకు? నా పడవ ఆమార్గాన్నుంచే వెళ్ళింది. నాకు తెలిసివుంటే నేను నిన్ను పిలిచేవాడిని.'

'కాని మీరు అక్కడ దిగి ఆ పూజలలో పాల్గొనవలసినది.'

'అందునిమిత్తమేనా నీవు అక్కడకు వెళ్ళినది?'

'నేను భగవతి వింధ్యావాసిని భక్తుడను.'

'కాని నిజమైన వైష్ణవునివలె నీవు రాముని, సీతనుకూడా పూజిస్తావే?'

'అవును మీకు తెలుసునుగా. అంతఃకరణతో శివుని, బహిరంగంగా విష్ణువును పూజిస్తాను.'

'ఏ. అలాగైతే బహిరంగములో నీవు వైష్ణవుడ వన్నమాట.'

'మహారాజా! నేను అలా ఉండాలి. మాబోటి సామాన్యులు మీవలె విమర్శకుల నోళ్ళు కట్టించలేరు.'

'ఓరి ఊసరవిల్లీ!'

'మహాప్రభూ! ఇంకా నేను ముందుబోయా. నేను పూజించేవారిలో బుద్ధుని కూడా జతపర్చుకున్నాను.'

'ఏమిటి! ఆ విజ్ఞానమూర్తిని కూడానా?'

'ఔను.'

'సిగ్గు సిగ్గు.'

'మహారాజా! శక్తినిపూజించేవారి సౌకర్యంకోసం మేము బుద్ధుని పూజా విధానాన్ని క్లిష్టీకరించాం. దానినే వజ్రయానుడు అనుసరించే బౌద్ధమతమంటారు.'

'ఔను. మిత్రమా! అందుకే వీరిని 'సహజయాను' లంటారు.'

'ఈ సహజయానుల పద్యాల్లోను, పాటల్లోను ఏమీ కవిత్వం కనిపించదు. కాని 'మ'కారములనైదింటిని (మద్యమూ, మాంసము, మీనము, ముద్ర, మైథున్ వీటిని) ప్రచారంచేసి లోకానికి ఉపకారం చేసినందుకు వీరికి కృతజ్ఞుణ్ణి.'

'ఈ పంచ 'మ' కారాల్ని ఉపాసించుట చాలా కష్టము.'

'ఒకప్పుడు తలనొప్పిగా ఉండినా నేను నీకవిత్వ మాధుర్యాన్ని ఆస్వాదిస్తాను. కాని వేదాంతంమాత్రం నా తలపై మోయలేని బరువు పెట్టినట్లుంటుంది.'

'మహారాజా! అయినా నాగార్జునుని వేదాంతం చాలా ఉపయోగకరమైనది. అది అనేక చెడు అభిప్రాయాల్ని తొలగించగలదు.'

'ఓ కవీ! నీవు వేదాంతివని ప్రసిద్ధివుంది.'

'నేను నా గ్రంథాన్ని వేదాంతగ్రంథమని ప్రచారం చేశాను. నాగార్జునుని సిద్ధాంతములలో తక్కువ ప్రాధాన్యతగల వాటిని శోధించి విపులీకరించాను.'

'నేను ఎన్నడూ దానిని జ్ఞాపకం ఉంచుకొనలేదు. కాని నాగార్జునుని వేదాంతం లోని ముఖ్యవిషయం చెప్పు?'

'మీ మతగురువు మిత్రపాదుదు ఆతని వేదాంతాన్నే నమ్ముతాడు.'

'ఏమిటి, నా మతగురువే?'

'ఔను. పాపం, పుణ్యం, ఆచారం, అనాచారం కేవలం ఊహామాత్రములే. ప్రపంచములో సత్యాసత్యములు నిర్ణయించబడుట కష్టము. స్వర్గ నరకములూ, బంధనమూ, మోక్షమూ ఇవన్నీ చంటిపిల్లల భ్రమలాంటివి. ఈ పూజాపురస్కార ములు పామరులను వంచించుటకే! దేవుడూ, దెయ్యం అనేది శుద్ధఅబద్ధం.'

'అదా! ఈ వేదాంతంతోనే నాజీవితాన్నంతనూ గడిపాను.'

'మహారాజా! అందరూకూడా అంతే. ఇహలోకంలోని సుఖాన్ని అనుభవించ లేక పరలోక సౌఖ్యాన్ని ఆశిస్తారు.'

'మిత్రమా! నీ శరీరపటుత్వం తగ్గలేదే?'

'నేను నీకంటె 8 సంవత్సరాలు చిన్నవాడను. అదిగాక నేను ఎన్నడూ ఒక స్త్రీకంటె ఎక్కువమందిని వివాహమాడలేదు.'

'వివాహం సంగతేముంది? కోరినంతమందినీ వివాహం చేసుకొంటే పవిత్ర మైన హోమగుండం చుట్టూతిరుగుటలోనే ఆరడు అలసిపోతాడు.'

'మహారాజా! నా ఇంట్లో ఒకేఒక భార్యవుంది.'

'ఇంతకాలం పళ్ళూడిపోయిన ముసలిదానితో కవియగు శ్రీహర్షుడు కాపరం చేస్తున్నాడని ప్రపంచమంతా భావించాలనా?'

'ప్రపంచం నమ్ముతుంది. నమ్ముతోంది. మహారాజా! నా గ్రంథాల్లో నేను సమాధి అయ్యాననీ, నాకు బ్రహ్మసాక్షాత్కారమైనదనీ వ్రాశాను.'

'కవీ! నీ పచ్చివేదాంతంలో బ్రహ్మదర్శనంకూడానా? యిందులో ఏదో మోసంవుంది.'

'మహారాజా! అన్నింటికీ అందులో ఆస్కారముంది.'

'క్లుప్తంగా. ప్రజలకు ఏభావమైనా నచ్చచెప్పుటకు వారిని గ్రుడ్డివారిగా వుంచాలి.'

'మహారాజా! మాకు ధర్మమంటే విశ్వాసంలేదు.'

'విశ్వాసం ఎప్పుడు పుడుతుందో, ఎప్పుడు అంతరిస్తుందో నాకు తెలియదు. పవిత్రులగు బ్రాహ్మణుల వేదపారాయణ వారి అనుసరణవిధానాలు చూస్తే నేను ఏదీ స్థిరంచేసుకోలేను. ఇదిమాత్రం నేను నమ్ముతా. దానధర్మాలు చెయ్యాలనీ, గుడి గోపురాలు కట్టించాలని - మతంచెప్పినట్లు చెయ్యాలనీ - కాని బ్రతికినంతకాలం జీవితాన్ని అనుభవించాలి.'

ప్రేమ, మతములనుంచి వారి సంభాషణ రాజకీయముల వైపు మరలింది. 'ఇది నిజమేనా! మహారాజా! మీరు పృధ్విరాజుకు సహాయంచేయ నిరాకరించారని?' అన్నాడు శ్రీహర్షుడు.

'నేను అతనిని ఎందుకు బలపరచాలి? అతడే తుఫానును చెలరేగించాడు. ఆతనినే ఎదుర్కొననియ్యి.'

'అదే నేనూ భావిస్తున్నా. చక్రపాణి లేనిపోని గోలచేస్తున్నాడు.'

'ఆతని పని మందులు కలుపుట. అందుకూ ఆడడు పనికిరాడు. మూడుసార్లు ఆతడు నాకు బలానికి మందిచ్చాడు. కాని పనిచెయ్యలేదు. ఇప్పుడు అతడు రాజకీయాల్లో వేలుపెడుతున్నాడు.'

'మహారాజా! అతడు మూఢుడు.'

---

# 4

'వైద్యరాజా! నిజం చెప్పావు. శ్రీహర్షుడు తండ్రిని కామాంధునిగా చేసేసాడు.'

'కుమారా! నామందులు ఉత్తమమైనవి. నేను 20 సంవత్సరాల నుంచి కన్యాకుబ్జ రాజాస్థాన వైద్యుడను. మహారాజుకు శక్తిని కలుగచేయలేదని కోపంగా ఉంది. కాముకునికి వీర్యవృద్ధి ఎంతోకాలం కలిగించలేము. అందుచేతనే ఆహారవిహారము లలో జాగ్రత్తగా ఉండాలని వ్రాయబడింది. నేను మాళవంలో ఉంటానంటే వారు ఒప్పుకొనుటలేదు.'

'తండ్రిగారిదోషంవలన మీరు మమ్మువిడువకండి. గుడ్‌హవార్ వంశీయులు మీమీదే ఆశపెట్టుకున్నారు.'

'నామీద కాదు. కుమారుడగు హరిశ్చంద్రునిపై. గుడ్‌హవార్ వంశంలో జయచంద్రుడు కాక హరిశ్చంద్రు డుంటే ఎంతబాగుండును.'

'అప్పుడు జయచంద్రునకు మీరే మంత్రి. కాని మీరు మాతో ఎల్లకాలం ఉండాలి.'

'ఆజన్మాంతం మీతోనేఉంటాను. గుడ్‌హవార్ వంశం అస్తమించదు. కాని హిందువుల సూర్యుడు అస్తమిస్తాడు. మేము యుద్ధంచేస్తాం తురుష్కులతోకూడా.'

'మాతండ్రికి అల్లునికి సహాయంచేద్దామని లేదు. పృథ్వీరాజు నాకు బావ, అతడు సంయుక్తను ప్రేమిస్తున్నాడు. ఆమె ఆనందంలో అతని ననుసరించింది. ఇందులో తండ్రిగారు కోపించవలసిన దేముంది?'

'కుమారా! పృథ్వీరాజు వీరుడు.'

'నిస్సందేహంగా-అతనిరాజ్యం ఏమంత పెద్దదని తురుష్కులతో పోరాడు తున్నాడు. ఆతని వీరత్వమే అందుకు కారణం. సుల్తానుకు మార్గంవదిలితే బహు మతికూడా ఇస్తాడు. సుల్తాను 600 సంవత్సరాలనుంచి పెద్ద రాజ్యాన్ని పాలించే కన్యాకుబ్జాన్ని జయించకోరుతున్నాడు. కాని తండ్రిగారు ఇది తెలుసుకో లేదు. ఆయనలో తెలుసుకొనే శక్తికూడా లేదు.'

'ఇప్పుడు మీకు పట్టాభిషేకంచేస్తే?'

'మీ శుశ్రూషచేతనే నాతండ్రిని సింహాసనాన్నుంచి తొలగించలేకపోతున్నాను. కాని నాకు ఒక్కొక్కప్పుడు సింహాసనాన్ని ఆక్రమించాలనే ఉంటుంది.'

'పరిస్థితులు చాల నిరాశాపూరితంగా ఉన్నాయి. కుమారా! తండ్రితో కలహానికి ఇది సమయం కాదు. పరిస్థితుల్ని గమనించక ఏదైనా చేస్తే రాజ్యానికే ముప్పు.'

'వైద్యరాజా! ఏంచెయ్యను. మా సేనానాయకులంతా పిరికిపందలు, అసమర్థులూను. యువకులగు సేనానాయకుల్లో సమర్థులైన వారున్నారు. కాని వృద్ధులు వారిని ఆపుచేస్తారు. ఇదేవిధంగా మంత్రులుకూడా నిర్వీర్యులై పోయారు.'

'గతించినదానికోసం విచారించుట తప్పు.'

'నేను హిందూయువకుల నందరినీ యోధులనుచేస్తాను.'

'కుమారా! ఇది పూర్వులదోషం-పూర్వం ద్రోణుడు, కృపుడు మొదలైనవారు యుద్ధంచేసేవారు. కాని యిప్పుడు రాజపుత్ర జాతిదే రక్షణభారం?'

'వర్ణవిభేదాలే మనవారికి అడ్డు అని నేననుకుంటాను.'

'అవును. కుమారా ఇది చాలా ఆటంకం. పూర్వులు మంచి పనులుచేశారు. కాని హిందువులలో జాతి మత విభేదాల్ని పెట్టి చీలదీయుట మహాపాపం.'

'కాబూలు, లాహోరులు జయింపబడ్డాయి. నేడో రేపో ఢిల్లీకూడా అదేగతి. ఇదంతా మన వర్ణభేదాల ఫలితమే.'

'నేటికికూడా మనం పిఠానాలతో కలసి యుద్ధంచేస్తే?'

'అది పాపం.'

'ఒక పాపమే! అనేక పాపాల్ని చేస్తున్నాం. ధర్మనాశనం'.

'ధర్మక్షయం. మనం ఎన్ని పాపాలు చేశాము. ప్రతిసంవత్సరం ఎంతమంది వితంతువుల్ని అగ్నిలో ఆహూతిచేయలేదు! మనుష్యుల్ని పశువుల్లా అమ్మేశాం— మణుల రాసులు దేవాలయాల్లో పోసి మ్లేచ్ఛుల్ని ఆహ్వానించాం. యుద్ధంలో శత్రువుకు సహాయంచేశాం! మన కామతృప్తికై ప్రజలయొక్క కష్టార్జితం హృదయంలేకుండా నాశనం చేస్తున్నాం.'

'వైద్యరాజా, విషయలోలత్వంకాదు, పిచ్చి. మన కామతృష్ణకు భార్య ఒక్కతే చాలు. ఇంద్రియ పిచ్చికి ఎన్నివేలమంది స్త్రీలయినా చాలవు. అక్కడ ప్రేమ అనేదే శూన్యం. నేనుడు అంతఃపురంలోని స్త్రీలను బ్రాహ్మణులకు దానం చేసాను. వాళ్లు ఆనందంతో స్వీకరించారు.'

'కుమారా. అక్కడ ఒకరిద్దరికంటె సవతులుండరు, స్త్రీని దానంచేయొచ్చా?'

'మనం ఏకమై దుష్టుల నెదిరించాలి.'

'ఇది మహారాజు చెయ్యాలి, నీచుడగు శ్రీహర్షుడంటే ఆయనకు నమ్మకం.'

——

## 5

నాడు అష్టమి. చంద్రుడు అప్పుడే తూర్పున ఉదయిస్తున్నాడు. ప్రపంచం ప్రశాంతంగా ఉంది. గుడ్లగూబ కూస్తోంది. ఇద్దరు యువకులు యమునానదివడ్డున నిలబడి ఈలవేశారు. అవ్వలిఒడ్డునుంచి నావ వస్తోంది. నావికుడు నిశ్శబ్దంగా నావను గట్టుకు చేర్చాడు. యువకులిద్దరూ నెమ్మదిగా నావ ఎక్కారు. నావలోంచి

'సేనానాయకుడగు మాధవుడేనా ?'

'గురుదేవా ! అవును. నాతో అల్లుణుడుకూడా వచ్చాడు. యువరాజెట్లా ఉన్నాడు ?'

'ఇంకా స్పృహరాలేదు. కొద్దిగా మందు ఇచ్చాను. యువరాజు యుద్ధరంగం లోకి వెడితే—'

'అదిమంచిదే. గాయపుబాధకూడా తగ్గుతుంది.'

'గురుదేవా ! గాయం అపాయకరమైనది కాదుగదా ?'

'కాదు. సేనాపతి, గాయాన్ని కుట్టేస్తాను. రక్తం పోవటంచేత బలహీనంగా ఉంటాడు. భయమేమీలేదు.'

'మహారాజు శవాన్ని అంతఃపురంలోకి పంపారా ? సేనాపతి ఏమయ్యాడు ?'

'ఆ అంతఃపురస్త్రీలు రాజుతో సహగమనంచేస్తారు. సేనాపతి, ఆంత్యకాలంలో కూడా యుద్ధంచేసాడు. కొంతమంది పట్టుబడ్డారు. కొంతమంది పారిపోయారు. వాళ్ళల్లో ఒక్కడుకూడా జీవిస్తాడని నాకు నమ్మకంలేదు.'

'ఇది మూడు సంవత్సరముల క్రితమే జరిగితే హరిశ్చంద్రుడు మనకు మహారాజు, నీవు కన్యాకుబ్జమునకు సేనాధిపతివి అయ్యేవారు.'

దీర్ఘనిశ్వాసవిడిచి మాధవుడు 'గురుదేవా ! మీమాటలన్నీ నిజం. పృథ్వీరాజుతో కలసి తురుష్కులతో యుద్ధం చేయండని మేము మహారాజుకు అనేకసార్లు చెప్పాం. కాని అంతా అరణ్యరోదనం అయింది.' అన్నాడు.

'ఇప్పుడనుకుంటే ఏం లాభం. ఏమి ఏర్పాటులు చేసావో చెప్పు.'

'ఐదువందల నావలు ఇరువదియైదు ఇరువదియైదు చొప్పున సైనికులతో వస్తున్నాయి. సైన్యాన్ని గాగా, జోగే, నలభూల లక్షీనంచేసి మూడుభాగాలు చేసాను. ఒకటి చందావరంనుంచి తూర్పుగా వెళ్ళి తురుష్కులను ఎదిరించాలి, మరొకటి ఎదురుగా వెళ్ళి చిన్నచిన్న దెబ్బలుకొట్టాలి. మూడవది పరిస్థితి అనుకూలంగా లేకపోతే తూర్పువైపుకు క్రమేపీతగ్గుతూపోవాలి,' అని ఆజ్ఞ యిచ్చాను.

'కనోజరాజగు ప్రసాదుడు .... ?'

'గంగానదిలోని నావల్ని అన్నింటినీ రప్పించేశాను.'

'మాధవ్ ! అంచేత నిన్ను సైన్యాధ్యక్షునిగా చేయలేదు. వాడు తనకంటె ముందుగా నిన్ను చంపించేవాడు. నీవు యువరాజూ బ్రతికి ఉన్నారు. నాకదే

సంతోషం. హిందువులకు ఇంకా ఆశాజ్యోతి ఉంది. నేను ఆఖరు వరకూ అతి జాగ్రత్తగా నాబలాన్ని వ్యయపరుస్తాను.'

'గురుదేవా! ఇంకా నావలు వస్తున్నాయి.'

'అలహణా! ఆ నావలురాగానే వెంటనే తిరిగివెళ్ళమను. మాధవా! నడు. క్రిందిగదిలో దీపంలేదు. అక్కడికి వెడదాం. దీపంవెలిగించు. ఎందుకైనామంచిది నన్ను చక్కా అనిపిలు.'

అందులోఉన్న యువతి 'స్త్రీల అలవాటు మారుటకష్టం. మేము చక్రపాణి పాండేయునికి బదులుగా మిమ్ము 'బాబా' అని పిలుస్తాం.'

వారిరువురు లోనికి వెళ్ళారు. నావపైభాగంపోయింది. కాని క్రిందిభాగంలో రెండు గదులున్నాయి. దీపం వెలుగుతోంది. అక్కడ మంచంమీద తెల్లటివస్త్రం కప్పుకొని ఎవరో పండుకున్నారు. ముఖం మాత్రం కప్పబడలేదు.

చక్రపాణి 'భామా! యువరాజు కదులుతున్నాడా!'

'లేదు. ఆయన శ్వాస ఒకేమాదిరిగా ఉంది.'

'మన రాజాధిరాజు హరిశ్చంద్రుని సేనాధిపతి అయిన మాధవుడు ఈయనే! ఇంక భయంలేదు.'

'మాధవుని నేనెరుగుదును. చిన్నప్పుడు యువరాజూ ఇతను కలసి ఆడుకునేవారు. నన్ను మర్చిపోతారా?'

'బాబా! మీరు భామా అనిపిలిస్తే ఎంత బాగుంది!'

'పుత్రీ! మీనాన్న జ్ఞాపకం వస్తున్నాడా?'

'లేదు బాబా. రాజకులంలో పరివర్తనం తేవాలి. అందులో ఉండే మోసం, డాబూ, దర్పం అన్నీ పోవాలి. అవన్నీ భట్టాచార్యునిగారితోనే అంతమవ్వాలి.'

'పోయాయి. అమ్మా ! నీవు యువరాజు అంతఃపురాన్ని చూశావా ?'

'ఆ. బాబా ! మీరు మమ్మ తిరిగి మనుష్యుల్ని చేసారు.'

'బావా' అంటూ యువరాజు పిలిచాడు.

'నా చంద్రా ! - రాహువునుంచి ముక్తి పొందిన చంద్రునివలె లేచావా' అంటూ భామా అతనివద్దకు పరిగెత్తింది.

'ఆ కాని బాబాగారేరి ? భామా !'

'ఈ బాబా గుడ్‌హవారుల వంశనాశకుడగు బాబా కాదు. నీవు బాబా అని పిలుస్తున్నావు. కాన ఈ బాబాని నేనుకూడా బావా అనేపిలుస్తాను.'

'యువరాజా ! ఒంట్లో ఎలావుంది ?' అన్నాడు చక్రపాణి.

'బాగానేఉంది.'

'యువరాజా - గాయం పెద్దది. అట్టే మాట్లాడకు.'

'మీరు చెప్పినవన్నీ నాకు వేదవాక్యములే బాబా.'

'కాని యీ హరిశ్చంద్రుడు నాకెందు కుపయోగిస్తాడు ?'

'ఇది నాకు మీయందుండే గౌరవం. బ్రాహ్మణుల మాటనైనా నేను ప్రమాణికం చేయిస్తేకాని నమ్మను.'

'యువరాజా నీ తలిదండ్రులూ, భారతభూమి చాల ధన్యులు.'

భామా మంచినీళ్ళిచింది. యువరాజు త్రాగాడు. నావనడుస్తోంది. యువరాజా మనం మన రెండవ రాజధాని అయిన వారణాశికి వెడుతున్నాం. సేనాధిపతియగు మాధవుని ఆజ్ఞానుసారంగా మన సైన్యం అక్కడకు వెడుతోంది. సైన్యం అక్కడ తురుష్కులను ఆపుతుంది. అక్కడ మనం మన సైనికుల్ని తయారుచేద్దాం.'

'కాదు బాబా. మీరు పూర్వం చెప్పేలాగున హిందూ రాజ్యలక్ష్మిని తిరిగి పొందటానికి ప్రయత్నం చేద్దాం. ఇప్పుడు పొందే రాజ్యలక్ష్మి హిందూరాజ్యలక్ష్మి అవుతుంది. దీనిని హిందువులయొక్క భుజబలంచే తిరిగి సంపాదించాలి.'

'బ్రాహ్మణ అబ్రాహ్మణ భేదం నశించాలి.'

'అవును గురుదేవా!'

—

# "బాబా నూర్ దీన్"

## (పదిహేనవ కథ)

[కాలం – క్రీస్తుశకం 1300 సం॥లకు తర్వాత]

'హిందూ ధనికులనుంచీ, వర్తకులనుంచీ ధనం వసూలుచేసి మనం ఆనందాన్ని అనుభవించే రోజులు పోయాయి. ఇప్పుడు హిందువుల్ని సాధువైన గోవువలె తలవడానికీ వీల్లేదు. మనం స్వతంత్రులం. గోరీయొక్క బానిసలం కాదు. మనం హిందూదేశంలోని స్వతంత్ర ఖిల్జీ పరిపాలకులం,' అంటూ ఒక యువకుడు తనతో వున్న వృద్ధునితో అన్నాడు. ఆ వృద్ధుడు తెల్లని ఉడుపులు ధరించాడు. అతని గెడ్డం నెరిసింది. ముఖం ప్రశాంతంగా వుంది. అతడా యువకునివద్ద మోకాళ్ళపై కూర్చొని ఉన్నాడు.

'కాని, అన్నదాతా! గ్రామమునసబుల్నీ, ఇలాకాదారుల్నీ దెబ్బగొడ్తే వాళ్ళకి కోపమొస్తుంది. సామ్రాజ్యంలోని ప్రతి గ్రామానికి పన్నువసూళ్ళనిమిత్తం సైనికుల్ని పంపలేము' అన్నాడు వృద్ధుడు.

'మీరు హిందూదేశంలోవుండి, హిందూరాజ్యాన్ని పరిపాలించకోరుతున్నారా లేక గజనీ గోరీలవలె ధనం దోచుకొని, మణిభూషణాలను తీసికొని పోగోరుతున్నారా?'

'అన్నదాతా! ఇప్పుడు మనం హిందూదేశంలోనే ఉండాలి.'

'మనం స్వతంత్రంగా ఢిల్లీలో ఉండాలి. ఏదైనా తిరుగుబాటువస్తే మనకు సహాయం చేసేందుకు అఫ్గానిస్థానంలోనూ, అరేబియాలోను సైన్యాలు లేవు; మనం పరుగెత్తుకుపోయేందుకు స్థలమూ లేదు. అందుచేత మనం యిక్కడే నివసించాలి. ఇక్కడి వాళ్ళు సుఖంగాను, శాంతంగానూ ఉండాలి. నూరుసంవత్సరాలైనా మనం ఢిల్లీ చుట్టుపట్ల వారిని ముసల్మానులను చేయలేము. ఇందుకు ఎంతకాలం పట్టుకుంటుందో మీరే చెప్పండి, ముల్లా అబూమహమ్మద్.'

అక్కడనే కూర్చున్న పొడవైన తెల్లటి గెడ్డంగల వృద్ధుడు - 'బాదషాహ్ ! నేను అధైర్యపడ్డంలేదు. కాని మనం బలవంతంగా ప్రజలను ముసల్మానులుగా చేయలేము.'

'మనం హిందూదేశంలో నివసించేవాళ్ళం కాలంకోసమని నిరీక్షించలేము. మనం ఒక శతాబ్దంనుంచీ భూమిపన్ను, వర్తకప్పన్ను మాత్రమే వసూలుచేస్తున్నాం. దీని ఫలితమే గ్రామపటేలు సిల్కుదుస్తులు ధరించి గుర్రంమీద స్వారిచేస్తున్నాడు. బాణాలు విడుస్తున్నాడు. ఇటువంటివి ఎక్కడా లేవు. నా రాజ్యంలో యిలా జరగడానికి వీలులేదు. ఈ దోపిడీ పనికిరాదు.'

'కాని జహాపనాహ్ ! ఇంతవరకు హిందువులు ధనాశచే ముసల్మాను లవుతున్నారు. ఇక అదికూడా ఉండదు.'

'ఇస్లాము మతం లంచాలకు ఆశిస్తే, రాజకోశానికి ముప్పువస్తుంది. ఏరాజ్యం లోనైతే యిలాంటి నౌకర్లుంటారో ఆసామ్రాజ్యమునకు వారెందుకు పనికివస్తారు ?'

'ఇల్లాంటి వాళ్ళుంటే రాజ్యం బలవత్తరంకాదు' అని మంత్రిఅన్నాడు.

'గ్రామాల్లోని రాజకర్మచారులు కోరినది వాళ్ళు చెయ్యగలిగితే చేసుకోవచ్చు. కాని గ్రామాల్లో రాజకర్మచారులా, రైతులా ఎక్కువగా ఉన్నది ?'

'రైతులలో నూటికొక కర్మచారి ఉంటాడు.'

'నూరుమంది రైతుల రక్తాన్ని పీల్చి వాడు ఆనందంగా గుర్రంపై స్వారి చేస్తాడు. యిలాంటి పీడించేవాళ్ళని నాశనంచేసి రైతులస్థితి బాగుచేస్తాం. వారిని పరిపాలకులపట్ల విశ్వాసంతో ఉండేటట్లు చేస్తాం. ఒకనిని కాదని వందమందిని సంతోషపెట్టి వారి గౌరవాన్ని పొందడం మంచిదికాదా ?'

'తప్పక ప్రభూ! నాకుకూడా ఏమీ అనుమానంలేదు. ముసల్మాను పరిపాలనల్లో మీరు మరొక క్రొత్తమార్గం ప్రవేశపెడుతున్నారు. తప్పకుండా సఫలీకృతులౌతారు.'

'మనం పాలించే కొద్దికాలంలోనూ సామ్రాజ్యానికి గట్టిపునాదులు వేయాలి.'

'అన్నదాతా! రైతుల్ని అభివృద్ధిలోకి తేవటం సామ్రాజ్యానికి మంచిది. గ్రామాల్లోని పంచాయితీలను చూచాం. వాటిని కాస్త ప్రోత్సహిస్తే గ్రామాల్లోని వర్తకులు, వడ్డీవ్యాపారస్తులూ రైతుల్నిచేసే దోపిడీ తగ్గుతుంది. కర్మచారి సాలీల చేత ఊరికే బట్టలు నేయించుకుంటాడు. దూది ఏకిస్తాడు. ఊరికే చేయించుకోవడం కూడదన్నాం. ఇప్పుడు వారిలో బట్టలు నేసేవారు, దూది ఏకేవారు లేరు. వారంతా ఇస్లాములో చేరారు.'

'గుల్లాసాహబ్! చూచారా, ఏదైతే సామ్రాజ్యంకొరకు మంచిదో అది ఇస్లాముక్కూడా మంచిదే.'

'హిందువులు ఖురాన్‌ను కాళ్ళలో త్రొక్కి అగౌరవపరుస్తున్నారు.'

'ఇంతధైర్యముందా?'

'మసీదులు నాశనంచేస్తున్నారా?'

'ఇది కాకూడదా.'

'భగవంతు (ఖుదా)ని బజార్లలో తిడుతున్నారా?'

'లేదు. మహాప్రభూ కాని మీ సూఫీమతం పుచ్చుకొన్నవాళ్ళు రసూల్ – ఖుదాను ఋషిగా ఎంచుతున్నారు. కాని వారు మతవిరుద్ధమైన రీతిరివాజులు అనుసరిస్తున్నారు.'

'మీరు వాళ్ళని కాఫిరులంటూ ఇంకా ఆసంగతే చెప్పతారెందుకూ? నా పిన తండ్రి సుల్తాన్ జలాలుద్దీన్ నావలెనే హిందూదేశంలో అంతా ముసల్మానులు అయ్యే వరకు తాను స్థిరమైన శాసకుడో, అస్థిరమైనవాడో నిర్ణయించుకోలేకపోయాడు.'

'అప్పుడు మీలాగే అడిగితే ఇల్లాచెప్పాడు. మూర్ఖుడా! రోజూ హిందువులు యమునానదికి తమ పూజలనిమిత్తం నా మహల్ ద్వారంలోనుంచి శంఖం ఊదుతూ బాజాలు వాయిస్తూ వెడుతున్నారు. నా ఎదురుగుండానే వాళ్ళు తమ మతధర్మాల్ని నిర్వర్తిస్తున్నారు. ఇస్లాము మతవిరోధులైన హిందువులు నారాజధానిలో ధనమదంచే ముసల్మానుల్ని గేలిచేస్తున్నారు. ఎంతో విశ్రాంతిగా జీవితాల్ని గడుపుతున్నారు. పన్నులు పుచ్చుకొని నేను ఆనందిస్తున్నాను. సిగ్గు, సిగ్గు, ఇంతకంటె సరియైన జవాబు నేను చెప్పలేను.'

'సుల్తానుకు మతకర్తవ్యంకూడా ఉంది.'

'మరణదండన విధించవలసిన నేరంచేసినవానినికూడా యిస్లాంమతం పుచ్చుకుంటే వదిలేస్తున్నాను. ఇస్లాములో చేరితే దాసులకు స్వాతంత్ర్యం యిస్తాను. ఇప్పిస్తాను. కాని దాసులందర్నీ విడిపించాలని మీరూ చెప్పరు.'

'కాదు ప్రభూ! దాసుల బ్రతుకుకై భగవంతుడే ఏర్పాటుచేసాడు.'

'నేను నారాజ్యంపోయినాసరే, హిందూ ముస్లిమ్ దాసులను అందర్నీ మీరు స్వతంత్రుల్ని చెయ్యాలని కోరితే అందుకు ఇప్పుడే ఆజ్ఞ జారీచేస్తాను.'

'వద్దు. ఇది ముసల్మాను ధర్మానికి విరుద్ధము.'

'ముల్లాసాహెబ్, ధర్మవిరుద్ధం అనండి. అందరవద్దకంటె ముసల్మానుల వద్దనే ఎక్కువమంది గులాము లున్నారు.'

'ఇది భగవదేచ్ఛ.'

'అయితే వారిని ప్రపంచంలో స్వేచ్ఛగా ఉంచక స్వర్గంసంగతి చెప్పి ఊరడిస్తారా?'

'ముసల్మానురాజ్యంలో ఇస్లామ్ ధర్మప్రకారం రాజ్యం జరగాలి అంతే నేను కోరేది.'

'ఈకోరిక చిన్నదికాదు. ఇందుకు సామ్రాజ్యంలోని అధిక సంఖ్యాకులు ముసల్మానులు కావాలి. మంత్రివర్యా వినుడు – విదేశసైనికుల సహాయంతో దేశాల్ని కొల్లగొట్టి మహమ్మదు సుల్తాను వెళ్ళిపోయాడు. ఢిల్లీలో నివసించే నావల్ల ఈ పని కాదు – తగదు. హిందువుల పన్నులమీదా, హిందూసైన్యంమీదా నారాజ్యం ఆధారపడి ఉంది. నాసైన్యంలో చిత్తూరురాజు 5000 అశ్వికదళానికి సేనాధిపతి. నా సేనధిపతి మాలిక్ కూడా హిందువే!'

'సుల్తాను ఎప్పుడూ ఢిల్లీలోనే ఉంటారు. ప్రభూ!'

'మీరు భయపడకండి. నన్ను అస్థిరుడంటారు. గులాముల రాజ్యం పక్షిగూడులాంటిది. అది ఒక్క గాలిదెబ్బకు పడిపోతుంది. మంగోలుల దాడినుంచి

ఇస్లాము రాజ్యం అతి కష్టంమీద నిలిచింది. మంగోలులు ఎంతటి శత్రువులో హిందువులకు తెలియదు. తెలిస్తే వారు హిందూదేశంలో ఇస్లాము నామరూపాలు లేకుండా నాశనం చెయ్యగలరు. చంగేజివంశం ప్రపంచంలోనికల్లా పెద్దదగు సైనాను పాలిస్తోంది, తెలుసునా ? ఆ వంశం బౌద్ధమతాన్ని ఒప్పుకుంటుంది.'

'బౌద్ధమతమునా ! వారి మఠములనూ, మందిరాలనూ కాల్చి నాశనంచేసినా ఇంకా హిందూదేశంలో ఆ ధర్మం సన్యాసరూపంలో ఉంది.'

'ముసల్మాన్ విరుద్ధమైన రూపంలోనా ? ఎందువల్ల ?'

'అన్నదాతా ! హిందూమతంలో దేవుడున్నాడు. బౌద్ధమతస్థులు దేవుడున్నాడని ఒప్పుకోరు.'

'చంగేజివంశీయులు కుబ్లైఖాన్ కాలంనుంచీ తమను బౌద్ధులయొక్క శిష్యులుగా తలుస్తున్నారు. వారి సైన్యంలో అనేకమంది మంగోలులు సేనాధిపతులుగాను, సిపాయిలుగాను ఉన్నారు. వారు ముసల్మాను కేంద్రములగు 'బుఖరా, సామర్కండు' మొదలగువానిని ఏరిఏరి నాశనంచేశారు. మనస్త్రీలను అనేకమందిని దాసీలుగా చేసేరు. మంగోలులూ, బౌద్ధులూ, హిందువులూ కలిస్తే మన మతం నామరూపాలు లేకుండా పోతుంది.'

'ప్రభూ ! నాశనమైపోతుంది.'

'అందుచేత — మనం సామ్రాజ్యపు పునాదుల్ని ఇసుకమీద వేయరాదు. గులాములను అనుసరింపకూడదు.'

'మహాప్రభూ గ్రామాల్లోని రాజకర్మచారులు బలహీనులైతే పరిపాలన ఎల్లా జరుగుతుంది ?' అన్నాడు మంత్రి.

'నాకు తెలుసు. పాలకులు దోపిడీగాళ్ళైతే కర్మచారులుకూడా అంతే. ఇది ప్రపంచరీతి. ఇదివరకు పంచాయితె పన్నులవసూలు, న్యాయదండన మొదలగునవి చూచేది. రాజుకు పంచాయితీతో తప్పితే ఇంకెవరితోనూ సంబంధముండేదికాదు.'

'అన్నదాతా ! మనం పంచాయితీలను తిరిగి పునరుద్ధరింపచేయాలి.'

'అంతకుమించి గత్యంతరంలేదు. ఇస్లామురాజ్యం ఇక్కడ ఉండాలంటే ప్రజలు సుఖంగా ఉండాలి. హిందూ ధర్మశాస్త్రాలప్రకారం న్యాయం అనుసరింపబడాలి. మతప్రచారకులు ఉండచ్చు. వారికి మేము ధనసహాయం చేస్తాం. సూఫీ మతస్థులు ప్రచారం బాగా చేస్తున్నారు. వారి మఠములనుంచి మేము పన్నులు వసూలుచెయ్యం.'

---

## 2

వర్షకాలం గతించింది. ఇంకా చెరువుల్లోనూ, గుంటల్లోను నీరు నిండుగా ఉంది. చేలు సస్యశ్యామలంగా ఉన్నాయి. ఆ ప్రదేశంలో పాట్నా అనే పెద్ద గ్రామం ఉంది. ఆగ్రామంలో వర్తకుల పెద్దపెద్ద భవంతులూ, కార్మిక కర్షకుల పూరిండ్లూ ఉన్నాయి. అక్కడ ఉండే గుడిగోపురాల్ని భక్తియార్ ఖిల్జీ నూరుసంవత్సరాల పూర్వం నాశనం చేశాడు. హిందువులు ఆశిథిలాల్లోనే తమ దేవుళ్ళను పూజిస్తున్నారు. మఠములలో ఇప్పటికీ బౌద్ధసన్యాసులు నివసిస్తున్నారు.

నాటిసాయంకాలం మఠంవెలుపల ఒక రాతిఅరుగుపై మధ్యవయస్కుడైన ఒక యువకుడు కూర్చొనిఉన్నాడు. అతడు కాషాయవస్త్రాలను ధరించాడు-గెడ్డం కొద్దిగా మాసివుంది. అతనిచేతిలో రుద్రాక్షమాల ఒకటి ఉంది. నాడు ఆశ్వయుజ పూర్ణిమ. ప్రజలందరూ ఫలహారాలూ, బట్టలూ మొదలైనవి ఆతనికి సమర్పించి నమస్కరిస్తున్నారు. అతడు చిరునవ్వుతో వారిని ఆశీర్వదిస్తున్నాడు.

హిల్సాయొక్క పురాతనమఠం నాశనమైపోయింది. శ్రద్ధాభక్తులు హృదయంలో ఉండాలిగాని మఠంలోకాదు. కాషాయధారియగు అతడు అవివాహితుడు. శిథిలావస్థలో ఉన్న ఆ మఠాన్ని ఇంకా ప్రజలు అలాగే పిలుస్తున్నారు. అతని పూర్వీకులలోకూడా వర్ణవిభేదాలు లేవు. వారివలెనే ఇతడుకూడా ప్రజలకు విచార సమయంలో వేదాంతాన్ని ఉపదేశించి ధైర్యంచెప్తుతాడు. మునుపటివలెనే వారు ఫకీరులనుకూడా పూజిస్తున్నారు.

పురాతన పీరులయొక్క సమాధులవద్ద పూజలుచేసి ప్రజలు నెమ్మదినెమ్మదిగా వస్తున్నారు. రాత్రి కొద్దిగా గడిచింది. వెన్నెల ఎల్లెడల వ్యాపించింది. ఆసమయంలో శిల్పకారుల గృహములవైపు నుంచి ఇరువురు వ్యక్తులు వస్తున్నారు. అతడు వారిలో ఒకనిని 'మోలవీ అబుల్ అలాయీ' అని గుర్తించాడు. బాబా లేచి మృదుస్వరంతో 'ధన్యవాదాలు! దయచేయండి' అన్నాడు.

వెంటనే వారిరువురూ గౌరవసూచకంగా ఒకరినొకరు కౌగలించుకొని, దగ్గరలోనున్న ఒక రాతిఅరుగుపైన కూర్చున్నారు.

మౌలానా-'షాహసాబ్ అక్కడ హిందువులు గుమిగూడారు. ఆ తమాషా చూస్తున్నాను.' అన్నాడు.

'వాళ్ళు హిందువులు కారు. అదినాకు కష్టంగా వుంటుంది.'

'అందరిలోను జీవనజ్యోతి ఉంది. కాని వేరువేరు మతస్థులు కలసిమెలసి ఉండలేరు.'

'నీ యీ వేదాంతం మహమ్మదీయమతానికి విరుద్ధం.'

'మేము మీఉద్దేశాలు చెడ్డవని చెప్పుటలేదు; నది ఒక్కటే; కాని పాయంచాలు ఎక్కువగా ఉంటాయి. మీరు మానవులంతా భగవంతుని బిడ్డలని అంగీకరిస్తారా? భగవంతుడే సర్వశక్తిసమన్వితుడని నమ్మెదారా?'

'నిస్సందేహంగా.'

'మౌలానా! మనమంతాకూడా భగవంతుని బిడ్డలమే! మనలో ఎందుకీ విభేదాలు? భగవంతుడు తలచుకొంటే మనలను ఏకంచెయ్యగలడు. కాని ఏకం చెయ్యడు. అంటే అన్నీ ఆతనికి యిష్టమే!'

'మిత్రమా! మీకులంవారి చిణసత్యాల్ని చెప్పవద్దు.'

'సూఫీమతస్థులమగు మేము బానిసకూ, భగవంతునకూ మధ్య తేడాలు అంగీకరించము. మామహామంత్రం 'నేను సత్యదేవుణ్ణి; అంతా బ్రహ్మమయం-'

'ఇది ముస్లింమతానికి విరుద్ధం.'

'మీయిష్టంవచ్చినట్లు అనుకోండి. కాని సూఫీమతస్థులగు మేము మా ఆఖరి రక్తబిందువుకూడా ధారపోసి ఈసత్యంకోసం పోరాడుతాం.'

'అలాగైతే మీరు ఇస్లాంమతాన్ని ఇచ్చట వ్యాపింపచేయలేరు.'

'మేము మీయొక్క కత్తినీ, నిప్పునూ చెడ్డగా భావిస్తున్నాం. కాని మీకు మేము అడ్డురాలేదు. మీరు ఎంతవరకూ మతాన్ని వ్యాపింపచేసారు?'

'మీరు వారిధర్మాన్ని సత్యమని చెప్పుతారు.'

'ఔను. ఆ సత్యాన్ని మరుగుమరచలేము. మీరు మీమతాన్నే గొప్పదని భావిస్తే మీరు మీమతంలోనే త్యాగం ఉన్నదని భావిస్తే హిందువులు తమప్రాణాల్ని సంతోషంతో ధారపోసి తమమతం గొప్పదని ఋజువుచేస్తారు.'

'హిందూమతం సత్యమార్గమా? మనకూ దానికీ తూర్పుపడమరల దూరం ఉంది.'

'అంత తేడా వుంటే, నేడు హిందూ ముస్లిములు కలసి ముస్లిం గోరీలవద్ద ఎందుకు పూజలుచేశారు? ముస్లిములు హిందువులలో కలియుట మీకు ఏమాత్రం అంగీకారంకాదా? మౌలానా!'

'ఏమాత్రం సంబంధం ఉండకూడదు.'

'అలాగైతే మన ముస్లింస్త్రీలు పెట్టుకునే కుంకుమబొట్టును, భర్తలు బ్రతికుండగానే తుడిచివేయిస్తారా?'

'ఆ అలాగే చేయిస్తా.'

'జీవితమంతా ప్రయత్నించు. ఈపనికి నీ సలీమా ఒప్పుకొంటుందా?' అన్నాడు నవ్వుతూ బాబా.

'కాదు కాదు. వితంతువులే కుంకుమను పెట్టుకోరని మౌలానాకు తెలియదు' అన్నాడు జమ్మన్.

'క్షమించు మౌల్వీఅబుల్ ఇలాం! సూఫీమతస్థులమైన మేము సుల్తానుల, ధనవంతుల కటాక్షముపై ఆధారపడిలేము. మేము కట్టుబట్టలతో వచ్చాం. ఏ హిందువూ మమ్మలను బాధపెట్టలేదు. ఈ మఠాన్నిచూడు. ఒకప్పుడు ఇది బౌద్ధ విహారం. నాటి నుంచి ఇక్కడ ఉన్న జనపగురువు బౌద్ధదేవుని పకీరుల శిష్యుడు. అతడు నిరాడంబరుడు. అతని తరువాత ఈ ఖాన్‌కహా ముసల్మానుల పేరుతో ఫకీరు అయ్యాడు. మేము అతని బిడ్డల మతవిషయంలో ఇబ్బంది పెట్టలేదు. అతనికి మా ప్రేమతత్వాన్ని బోధించాం. అందువల్లనే మేము సర్వజన ప్రియులమయ్యాం. కాని హిందూపండితులు మీవలెనే ఈ ప్రేమతత్వాన్ని సరిగా తెలుసుకోలేకపోయారు అందుకే జుమ్మాన్ తల్లిదండ్రులు ముసల్మాను లయ్యారు. అందువలనే మిమ్ములను గౌరవిస్తున్నారు.

---

## 3

చైత్రమాసం గడిచిపోయింది. చెట్లుచిగిర్చి గుబురుగా వున్నాయి. ఈ సంవత్సరం మామిడిచెట్లు బాగా కాశాయి. చాలా ఎండగావుంది. ఆచెట్టుక్రింద ఉన్న ధాన్యపు కళ్ళంలో ఇద్దరురైతులు ధాన్యం ఎగరబోస్తున్నారు. గాలి వీస్తోంది. ఇంతలో ఎండకు అలిసిపోయిన బాటసారి ఒకడు ఆచెట్టుక్రిందకు వచ్చి చతికిల బడ్డాడు. మంగళచౌధరి అతనిదగ్గరకు వెళ్ళి 'నమస్తే సోదరా! మాగట్టివాడవోయి. ఇంత ఎండలో ప్రయాణముచేస్తున్నావు' అన్నాడు.

'నమస్కారం సోదరా! అవసరం కలిగితే ఎండా వానా లెక్కా?'

'నీవు దాహంగా ఉన్నట్టుంది. చల్లనీళ్ళు ఉన్నాయి. త్రాగు.'

'మీరెవరు?'

'మేము గొల్లలం. నాపేరు మంగళచౌధరీ.'

'చౌధరీ! నేను బ్రాహ్మణ్ని. తాడూచెంబూ నావద్దఉన్నాయి. నుయ్యి ఎక్కడుందో చూపెట్టు.'

'మహాశయా ! మీరు అంగీకరిస్తే మా నౌకరుచే తెప్పిస్తాను.'

'చాలా అలసిపోయా. నీవు తెప్పించు.'

చౌధరీ తనకుమారుడగా ఘీసాను పనిలోనుంచి పిలిచి నూతి దగ్గరకు వెళ్ళి మంచినీళ్ళు తెమ్మన్నాడు.

బాటసారి ఢిల్లీ 40 మైళ్ళదూరంలో ఉన్నందున తాను ఆదినం రాత్రిలోగా అక్కడకు చేరజాలనని అన్నాడు. మంగళచౌధరీ చాలా కలుపుగోలు మనిషి. అందుచేత మాట్లాడకుండా ఊరుకోలేకపోయాడు. అతడు 'భగవంతుని దయవల్ల ఈ సంవత్సరం పంటలు బాగున్నాయి. వైశాఖమాసమునకుకూడా నూర్పుళ్ళు పూర్తి కావు. మహాశయా ! మీ ప్రాంతంలో పంటలు ఎల్లావున్నాయి?' అన్నాడు.

'అంతపాడుగా లేవు.'

'మహాశయా ! రాజు మంచివాడైతే దేవతలుకూడా సంతోషిస్తారు. కొత్త సుల్తాను వచ్చినప్పటినుంచే ప్రజలు సుఖపడుతున్నారు.'

'చౌధరీ ! ఇది నిజమే ?'

'చూడండి ! కళ్ళంలోని ధాన్యంకుప్పను – రెండు సంవత్సరాలకు పూర్వం ఇందులో నాల్గవవంతుకూడా ఉండేదికాదు.'

'చౌధరీ ! బాగుపడ్డారా ?'

'బాగుపడ్డాం. దీనికి సుల్తాను మంచితనమే కారణం. ఇదివరకు మేము ఆకలితో చచ్చేవాళ్ళం.'

ఆ సమయంలోనే అచ్చంగా చౌధరీవలెనే దుస్తులు ధరించియున్న యింకో చౌధరీ అక్కడకువచ్చి 'ఆడాబు, దర్పం ఏమైంది ? పిల్లలంతా ముస్తైత్తుకుంటున్నారు. ఆ బ్రాహ్మడి పేరేమిటి ?'

'సిద్బా'

'ఇదివరకు సిద్ధాను పండిత్ శివరాముడని పిలిచేవాళ్ళు. ఇప్పుడు సిద్ధా అయిపోయాడు. నావద్దకు వచ్చి రెండుమళ్ళ గోధుమలు పంపు డబ్బురాగేనే యిస్తాను అనేవాడు. మళ్ళీ డబ్బుసంగతే లేదు. అడిగితే ఛీ, ఛీ, పో, పో అనేవాడు.'

'రెండు సంవత్సరాలలో మన పేరు 'మంగా' 'ఛిద్దా' నుంచి మంగళచౌధరీ చౌధీరామ్‌చౌధరి అయిపోయాయి.'

'ఇదంతా సుల్తాను దయ. లేకపోతే మనం పూర్వంలాగా ఉండేవాళ్ళం.'

'నేను యీ పండితునితో ఇదే చెపుతున్నా.'

'సుల్తాను మంచివాడు కాకపోతే మనకు పంచాయితీ రాదు, మనకు మంచి దినాలూ రావు.'

'మంగళరామ్‌చౌధరీ, నీకు చదువురాదుగదా పంచాయితీ అధ్యక్షపదవి ఎల్లా నిర్వహిస్తున్నావు? పంటలురాకుండానే యీవర్తకులూ, రాజకర్మచారులూ డబ్బు కోసం పీడించేవారు.'

'ఇదంతా మన సుల్తాను చలవమే.'

బ్రాహ్మణపాటసారికి యీగొల్లల మాటలు విందోంటే ఒళ్ళుమండిపోతోంది కాని సమయంకోసం చూస్తున్నాడు. మంచినీరు త్రాగిన తరువాత అతను కోపంపట్ట లేక 'అల్లావుద్దీన్ (సుల్తాను) మీకు పంచాయితీ యిచ్చాడేం—'

'అవును బ్రాహ్మణా. సుల్తానుపేరు అల్లావుద్దీను అని ఎవరుపెట్టారో తెలియదు. మా గ్రామంలో దీనులపాలిటి కల్పతరువు.'

'చౌధరీ—సుల్తాను హిందువులను ఏలా హింసిస్తున్నాడో తెలుసా?'

'మావాళ్ళు పమిటలులేకుండానే పొలాల్లోపనిచేస్తారు. వాళ్ళని ఎవరూ ఎత్తుకు పోరు.'

'గౌరవపుటుంబాల్ని నాశనంచేస్తున్నాడు.'

'అయితే మాకు గౌరవంలేదా! ఎవరు గౌరవం కలవారు?'

'మంగళరామ్—నీవు అనవసరంగా దూషిస్తున్నావు.'

'కాని మహాశయా! మా గౌరవం మాకు ఉంది. మా పంచాయితీ మాకు వచ్చింది. రాజకర్మచారులూ, శాసకులూ ఎంతటి గౌరవనీయులో మాకు తెలిసింది. హిందువూ ముస్లిమూ అంటారు. కాని ఆ పదవిలోకి వచ్చాక అందరూ ఒకటే.'

'యీ బ్రాహ్మలు హిందువులూ – ముసల్మానులువేరు అని చెప్తారు. తమ స్త్రీలను పరదాల్లోనుంచి బేగములుగా చేస్తున్నారు' అన్నాడు చౌదారామ్.

'కాని చౌధరీ పూర్వం మహారాజులు గుర్రాలమీద స్వారీచేసేవారు. ఇప్పుడు ముసల్మానులు మన స్త్రీలను పాడుచేస్తున్నారు. అంచేతనే పరదా రావలసివచ్చింది.'

'ఇప్పటికీ మాస్త్రీలు పొలాల్లో నిర్భయంగా తిరుగుతుంటారు.'

'భయమనేది సిబ్బా భార్యకు ఉండాలి.'

'ఇతరుల సొమ్ము తినేవాళ్ళు, ఇతరులను అగౌరపరచక చేసేదేముంది? బ్రాహ్మణుడా, ఇది హిందూ ముసల్మానులకు సంబంధించిన విషయంకాదు. ఇది ఇతరులను దోచుకొనేవారిపని. నిజమైన హిందువులం మేము. మాస్త్రీలు ఎప్పుడూ ఘోషాలో ఉండరు.'

బ్రాహ్మణుడు సాహసంతో 'ఓ చౌధరీ! సుల్తానుని సేనాధిపతియగు మాలిక్కాఫర్ దక్షిణానికి వెళ్ళి గుళ్ళు, గోపురాలు నాశనంచేశాడు. దేవతావిగ్రహాల్ని విరగగొట్టి కాళ్ళతో తొక్కాడు. ఇది వినలేదా?' అన్నాడు.

'మహాశయా, మేము చాలా విన్నాం. ఈ రాజ్యంలో ఇస్లాముమతమేకాని హిందూమతం లేదని. మేము ఢిల్లీకి దగ్గరలో నివసిస్తున్నాం. లేకపోతే మేము ఇవి అన్నీ నమ్మేవాళ్ళమే. మాచుట్టుపట్ల ఎక్కడా మందిరాలు నాశనం చేయబడి విగ్రహాలు త్రొక్కబడలేదు.'

'చౌధరీ మంగళరామ్! ఇది శుద్ధ అబద్ధం. నేను దసరాఉత్సవాలకు ఢిల్లీ వెళ్ళాను. మన ఉత్సవాలు నిరాటంకంగా సాగుతున్నాయి.'

'ఛేదారామ్, ఇదిఅంతా అబద్ధం, షేక్ నిజాముల్లా ఒకగుడి కట్టిస్తున్నాడు. ఏ ముసల్మానుగాని, పాదుషాకాని ఆటంకపెట్టటలేదు. సుల్తాను ఇష్టంలేకపోతే నాశనంచేశేయడూ ?'

'అవును మనంఅంతా సుల్తానుని చూడాలని వెళ్ళినప్పుడు అతడేంచెప్పాడు, పూర్వపు సుల్తాను చాలా రంగేశా. ఇప్పటి సుల్తాను పేదపాలిటి కుబేరుడు. మన కష్టసుఖాలు తనవిలా భావించేవాడు. అంచేత మనం సుఖపడాలని కోరుతున్నాడు.'

'ఇప్పుడు ప్రజలంతా సుఖంగా ఉన్నారు.'

——

# 4

అది ఢిల్లీ వెలుపలగల రుద్రభూమి. అక్కడ నిమ్మచెట్లు అవీ ఉన్నాయి. అది మార్గశిరమాసం. రాత్రులయందు చలి ఎక్కువగా ఉంది. అక్కడ ఇద్దరు ఫకీరులు మంటవద్దకూర్చుని చలికాగుతున్నారు. వారిలో ఒకడు మన బాబా. రెండవ వాడు తన తెల్లటిగడ్డం ముడ్రవేళ్ళతో సాపుచేసుకుంటూ 'బాబా! ఐదుసంవత్సరాల్లో ఎంత ఎంతమార్పువచ్చింది!'

'జాన్‌దీన్ నిజం చెప్పావు. రైతులు ఆనందంగా ఉన్నారు.'

'బాబా పంటలు బాగుంటే ముఖాలు బాగుంటాయి.'

'రాజకర్మచారులు పోయారు. యీవడ్డీవ్యాపారస్తులుకూడా నశిస్తే ప్రపంచంలో శాంతి ఏర్పడుతుంది.'

'ఈ మఠములూ, మందిరాలూ, అన్నింటిలోనూ దోపిడీయే.'

'ధనవంతులు లేకపోతే ధర్మం ఉండదని చెప్తారు. నేననేదేమిటంటే ధనికులున్నంతకాలం అధర్మం ఎక్కువౌతుంది.'

'జ్ఞానులూ, ధ్యానులూ, ఫకీరులూ, పైగంబరులూ, ఋషులూ, మునులూ, వీళ్ళకంటె ధర్మవేత్తలెవరు?'

'బీదలు శ్రమిస్తే ఆ ధనంతో ఆనందించే ధనికులున్నంతకాలం సౌభ్రాతృత్వం ఏర్పడదు. ఈసుల్తానులుకూడా అంతే. వీళ్ళు మనలో మనకు విభేదాలు పెట్టి బలవంతులౌతారు. కనుక వారు నశించాలి.'

'ఆరోజులుకూడా వస్తాయి, సోదరా. ఈవిభేదాలన్నీ నశిస్తాయి. ప్రపంచంలో స్థిరంగా ప్రేమరాజ్యం ఏర్పడుతుంది.'



# "సు రై యా"

## (పదహారవ కథ)

[కాలం :— క్రీస్తు తరువాత 1600 సం॥రాలు]

నేలంతా వానకి తడిసి మురికినీటితో బురదగా వుంది. సమతల భూమిమీద నీరు నెమ్మదిగా దొర్లుతూ ప్రవహించి చిన్నచిన్న కాల్వలై కొండవాగులతో కలసి పెద్దనదిగా ఏర్పడింది. చెట్లనుంచి వాటిగుబురుల్లో వానచుక్కలు దాగివున్నాయా అన్నట్లు అప్పుడప్పుడు ఇంకా వానజల్లు పడుతోంది; లేకపోతే వాన వెలిసి పోయినట్లే!

దానంతట అది పకి మొలచిన షామీచెట్టు కొద్దిదూరంలో వుంది. తెల్లని దుస్తులుధరించి దానిదగ్గరలో ఒక యువతి నిలబడివుంది. ఆమె మేలిముసుగు జారి పోయింది. నల్లటి కురులమధ్యవున్న పాపిడి హిమాలయాల మధ్యనుంచి ప్రవహించే గంగానదిలావుంది. ఆమె బుగ్గలమీద ఇంకా నీటిబిందువులు జారుతున్నాయి. ఆమె నల్లటి కన్నులు ఏదో దూరవస్తువును చూస్తున్నట్లు కనిపిస్తున్నాయి. ఆమె తడిబట్టలు శరీరమునకు అంటుకొనిపోయాయి. నారింజపళ్ళవలెవున్న ఆమె స్తనద్వయం అందంగా చూపట్టుతోంది. తడిసిన ఆమె పైజమాలోంచి ఆమె అంగ ప్రత్యాంగాలు సుస్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆమె తెల్లని మేజోళ్ళు పాడైపోయాయి. కాలిజోళ్ళు మెత్తబడి నిరుపయోగమయ్యాయి.

దగ్గరలోనే ఒకయువకుడు ప్రత్యక్షమయ్యాడు. అతని తలపాగ, కోటు, పైజమా అన్నీ తెల్లనివే. యువతిదుస్తులవలెనే అతనివీ తడిసిపోయివున్నాయి. అతడు ఆమెను సమీపించి పరిశీలించాడు. ఆమె అతనివైపు చూడటంలేదు. నిశ్శబ్దంగా దగ్గరకు వెళ్ళి ఆమెకు రెండు అడుగుల దూరంలో అతడు నిలబడ్డాడు. కొద్దిదూరంలో పారుతున్న మురికినీటిప్రవాహాన్ని ఆమె ఏదేకదృష్టితో చూస్తోంది. ఇక ఆమె తనను చూడగలదని భావించాడు. నిమిషాలు అతనిదృష్టిలో యుగాలులా గడిచిపోయాయి. ముఖంమీది వర్షబిందువుల్ని కూడా తుడుచుకోకుండా చలనరహితంగా అలాగే ఆమె నిలబడివుంది.

ఇంక ఓపిక పట్టలేక ఆ యువకుడు ఆ యువతి భుజముపై నెమ్మదిగా చెయ్యి వేశాడు. ఆమె ముఖం త్రిప్పింది; దృక్కులు కలిసాయి. ఆమె విశాలనేత్రాలు ఒక్క మెరుపు మెరిసాయి. ఒక చిరునవ్వు ఆమె పెదవులపై విరిసింది; తెల్లని పలువరుస ఒక్కసారి మెరిసింది. ఆమె అతనిచేయి పుచ్చుకొని 'కమల్' ఇక్కడ చాలాసేపటినుంచి నిలబడ్డావా ?'

'అనేక యుగాలనుంచి అనుకొంటా. శివుడు నీటినుంచి భూమిని సృష్టించి నప్పటినుంచీ – అప్పుడు భూమి ఇంకా తడిగానే వుంది. ఈ పర్వతాలు, చెట్లు సజీవ ప్రాణులు మొదలైనవి లేవు.'

'ఆ. ఆగు. కమల్ ? నీవెప్పుడూ కవిత్వమే మాట్లాడుతావు !'

'సురైయా ! నీవుచెప్పేది నిజమవ్వాలని నేను కోరుతాను. నాకు కవిత్వం అబ్బలేదు.'

'మంచిది. నీసురైయా పరాయిస్త్రీ ఎవ్వరూ నీతో వుండటం సంహించలేదు.'

'సురైయా ! నాహృదయంకూడా ఇదే చెపుతోంది. కాని ఏమిటి ? నీవు అంతశ్రద్ధగా చూస్తున్నావు ?'

'నేను దూరంగా ఎక్కడో వున్నదాన్ని గురించి ఆలోచిస్తున్నా కమల్ ! సముద్రం ఎంతదూరంలో వుంది ?'

'సూరత్ దగ్గరనే. ఒక నెలప్రయాణం.'

'ఈనీరు ఎక్కడకు ప్రవహిస్తుంది ?'

'బెంగాల్ వైపుకు – ఇంకాముందుకు. రెండునెలలప్రయాణం.'

'పాపం ! ఈమురికినీరు ఎంతదూరం ప్రయాణం చెయ్యాలి. కమల్ ! నీవెన్నడైనా సముద్రం చూశావా ?'

'నేను మానాన్నతో ఒరిస్సావెళ్ళా. అక్కడ సముద్రాన్ని చూశా.'

'అది దేన్ని పోలి ఉంటుంది?'

'మందరకానవచ్చే వినీలాకాశంలో వ్యాపించే మబ్బువలె ఆకాశపథాన్ని కలుసుకొనేవరకూ—.'

'వాననీరు గమ్యస్థానం సముద్రమా? అక్కడకూడా మురికిగానే ఉంటుందా?'

'ప్రేయసీ! నీలజలం-నల్లటిదే-సముద్రజలమంతా ఒకేరంగు.'

'నీవు తీసుకొనివెడితే నీతో నేను సముద్రాన్ని చూస్తా.'

'ప్రేయసీ సురైయా? నీవు ఆజ్ఞాపిస్తే ఈవాననీటితోపాటు నేనుకూడా సముద్రంవరకూ ప్రయాణంచేస్తా.'

ఆమె తన బాహువుల్ని అతని మెడకు చుట్టిపేస్తూ, తన తడిబుగ్గలను అతని బుగ్గలతో చేర్చింది. అతని మెరిసేకళ్ళల్లోకి చూస్తూ 'ఔను. మనం సముద్రం దగ్గరకు పోదాం, కాని ఈనీటి ననుసరించికాదు.'

'ఈమురికినీటితో వద్దు. ప్రేయసీ!'

'కమల్! మురికినీరని దానిని అనకు. భూమిపైపడిన తరువాతనే నీరు మలిన మైంది. ఆకాశంనుంచి పడినప్పుడు మురికిగా వుందా?'

'లేదు. సూర్యచంద్రులకంటె పరిశుద్ధంగా వుంచేది. అది నీ ఉంగరాల జుట్టును, నీ తెల్లని బుగ్గల్ని ఎంత అందంగా మెరిసేటట్లు చేసిందో! ఆకాశంనుంచి పడటంవల్లనే అది నీ అందాన్ని ఎక్కువ చేసింది.'

'అలాగైతే దానిలోని మురికితనం స్వభావసిద్ధమైనది కాదన్నమాట! ఆకాశ మునకూ, భూమికీ మధ్యగల పదార్థముల సంయోగమువల్ల అది అలా అవుతోందన్న మాట! సరాసరిని వాన సముద్రంలో పడితే అప్పుడో!'

'అప్పుడు పరిశుభ్రంగానే ఉంటుంది. ప్రేయసీ!'

'మంచిది. నేను దీనిలోఉండే కలుషితం మంచిదే అనుకుంటాను. నీ వుద్దేశ మేమిటి కమల్?'

'సుసైయా! నేను భావించినదాన్నే నీవు చెప్పావు.'

---

## 2

ఆకాశపు నీలిరంగు నదిలో ప్రవహించే జలాన్ని ఇంకా నీలంగా చేసి వేస్తోంది. ఆనీటి చుట్టూవున్న పాలరాతి సోపానాలు మరింత తెల్లగా వున్నాయి. వసంతకాలపు మధ్యాహ్నసమయంలో ఓగిర్చిన వృక్షాలు చాలా అందంగా కని పిస్తున్నాయి. అక్కడ ఉద్యానవనాలు పంక్తులుతీరిన చెట్లతోను, లతాగృహముల తోను, చిమ్మనగొట్టములతోను అలరారుతున్నాయి. ఇది రాజోద్యానవనము. నేడు వసంతోత్సవం. అందుకొరకే యువతీయువకులు నేడు ఆనందంగా ఆ ఉద్యాన వనంలో తమకాలాన్ని గడుపుతున్నారు.

ఆ పూలతోటలో ఒకవైపున సరస్సునకు దూరంలో ఒక అరుగుమీద నలుగురు కూర్చొనివున్నారు. అందరి తలపాగాలకు ఒకేరకంగా కుచ్చులు ఉన్నాయి. అందరూ మోకాళ్ళవరకూ వ్రేలాడేకోట్లు ధరించారు. అందరిమీసాలుకూడా గోధుమరంగులోనే ఉన్నాయి. ముందరవారందరూ నిలబడి ఉద్యానవనం నలువైపులా కలయచూచారు. తరువాత కంబళ్ళు, దిండ్లు ఆ చప్టాపై వేసుకొనికూర్చున్నారు. అక్కడ అంతా ప్రశాంతంగా వుంది. ఆ నలుగురు ముసలివారూ తప్ప ఇంకెవ్వరూ అక్కడలేరు.

ఎట్టకేలకు వారిలోఒకడు 'మహారాజా! —— ——'

'ఫజుల్! ఏమిటి మనమంతా దర్బార్‌లో కూర్చొని వున్నాం. మానవుడు ఎక్కడైనా మానవునివలె ఉండతగడా?'

'మరచిపోతున్నాను —— ——'

'జలాల్ అనికాని అక్బర్ అనికాని స్నేహితుడనికాని పిలు-'

'జలాల్! ఎంతకష్టం. మనం ఇంకా రెండింతలు జీవితంగడపాలి.'

'ఫజుల్! రెండింతలుకాదు, నాలుగింతలు.'

'బీర్! నీవు ప్రశంసార్హుడవు. ప్రతిదానికీ నీవు ఎప్పుడూ సిద్ధమే! మేము ఒకప్రపంచాన్నుంచి ఇంకోప్రపంచానికి వస్తే వెనుకటిసంగతులు జ్ఞాపకంచేసుకోడం కష్టమైపోతుంది. ఏమంటావు? టోండూ!'

'మెసు ఫజుల్. బీర్‌ది ఎంతసున్నితమైనబుద్ధి. ఆశ్చర్యపోరా!'

'భారతదేశంలో బీరబలుదే రాజ్యచక్రం త్రిప్పుతున్నాడంటారు.'

'కాని లోడరమల్లుదే!'

'బీరబలుడు అవునోకాదో కాని ప్రపంచానికి ఇదే తెలుసును. జలాలే దానికి సాక్షి.'

'నిశ్సంశయంగా! ఇది పాదుషా జలాల్‌ఉద్దీన్ అక్బర్ మారువేషంతో గ్రామాల్లో సంచరించాడనే పుక్కిటిపురాణంవంటి కాదు.'

'బాగా జ్ఞాపకంచేశావు. ఈ కట్టుకథలవల్ల మనఇద్దరికీ చిక్కే. అక్బరును గురించీ, బీరబల్‌ను గురించి ఏవో కట్టుకథలు అల్లి ప్రచారంచేయటం మామూలై పోయింది. నేను అట్టికథలు అనేకం సంపాదించా. ఒక్కొక్క కథకు ఒక బంగారు నాణెం చెల్లించా' అన్నాడు బీరబల్.

'అలాగా! డబ్బుకోసం వాటిని ఎప్పటికప్పుడు——'అన్నాడు అక్బర్.

'కావచ్చుకాని అందువల్ల తేడాఏమీలేదు. అయినా మన ఇరువురిని గురించి ఈకట్టుకథలలో ఎటువంటి అసంగతాలు వ్రాయబడుతున్నాయో మనం చూడవచ్చు! ఫజుల్! బాధపడకు. నేను ఛదామిమల్ వర్తకునివలె లోభినికాదు' అన్నాడు బీరబల్.

'ఏమాత్రం కాదు.' అన్నాడు అబుల్‌ఫజుల్. 'నామీదకోపించవద్దు. మిమ్మల్నుగురించిన కథలా! వాటినిగురించే నాకు భయం.'

'నేనుకూడా "ఆయినే అగ్బరీ"వంటి గ్రంథం వ్రాయలేదు' అన్నాడు బీరబల్.

'తోడర్‌మల్! 'ఆయినే-అగ్బరీ' చదివేవాళ్ళు ఎంతమంది ఉంటారో, బీరబల్‌కథలు చెప్పుకొనేవాళ్ళు ఎంతమందో నీవేచెప్పు' అన్నాడు అబుల్‌ఫజుల్.

'అది బీరబల్‌కు బాగాతెలుసు' అన్నాడు తోడర్‌మల్.

'మంచిది. బీర్! నీవు బంగారపుముక్కలిచ్చి కొన్న ఒక కథను మాకు చెప్పు' అన్నాడు అబుల్‌ఫజుల్.

'ఇది నేను బంగారునాణెం ఖర్చుపెట్టి కొన్నకథ కాదని మీకే తెలుసు' అన్నాడు బీరబల్.

'అవును. నీవు చెప్పకుండానే మాకు తెలుస్తుంది' అన్నాడు అక్బర్.

'నాకథలని వాటిపై ముద్రవేసిపున్నట్లు! మంచిది. మీయిష్టప్రకారమే ఒక కథ చెపుతా. కాని ప్లష్టంగా-ఒకానొకప్పుడు హిందువుగా మారిపోవలెనని అక్బరుకు ఎంతోకుతూహలం వుండేది. ఈ సంగతి బీర్బల్‌కు చెప్పాడు. అతడు నిర్ఘాంతపోతాడు. చక్రవర్తికి తను సహాయంచేయకుండా ఉండలేడు. కాని అతన్ని హిందువుగా మార్చటంఎట్లా? అతడు కొద్దిరోజులు ఆలోచనలో పడిపోయాడు. ఒకనాడు సాయంత్రం రాజమందిరంలోకి కిటికీలోంచి 'సుయ్' అనే శబ్దం జోరుగా వినిపించింది. అటువంటి సమయంలో ఆప్రదేశంలో ఎన్నడూ చక్రవర్తి అట్టిధ్వనిని వినివుండలేదు. వెంటనే అతడు దుస్తులుధరించి యమునానదీతీరమునకు వెళ్ళాడు. ఎంతవేషం మార్చుకొన్నా అతడు బీరబల్‌ను గుర్తించాడు. చాకలిబండపై తన బట్టలను ఉతుక్కోటానికి బదులుగా బీరబల్ ఒక పెద్దగాడిదను సబ్బుతో తోముతున్నాడు. చక్రవర్తి చిరునవ్వును మరుగుపరుస్తూ గొంతుమార్చి-

'చౌధరీ! నీవు ఏమిచేస్తున్నావు అక్కడ?'

'నాపని చేసుకొంటున్నా; నీకెందుకు?'

'ఏదీకానివేళ ఈచలిలో వణికిపోతున్నావు.'

'ఈ జంతువును రేపటిలోగా గుఱ్ఱంక్రింద మార్చి, దానిని చక్రవర్తికి యివ్వాలి. ఈపనిలో నేను చచ్చినాసరే!'

'గాడిదను గుఱ్ఱంగా మార్చటమా?'

'నేను ఏమిచెయ్యగలను? అది చక్రవర్తి ఆజ్ఞ!'

చక్రవర్తికి నవ్వువచ్చింది. అతను తన సహజస్వరంలో 'ఓర్! నాతో వచ్చి వేయి. గాడిద గుఱ్ఱం ఏవిధంగా కాలేదో మహమ్మదీయుడు కూడా అదేవిధంగా హిందువు కాలేడు.'

'ఫజుల్! మంచిది. ఇది విని చాలా విచారించాను.'

'ఇప్పుడు వింటున్నాం. జీవితంలో పడినశ్రమకు ప్రతిఫలం' అన్నాడు అక్బర్.

'జలాల్! మనం ఒకతరంలోని పనులనుమాత్రమే చెయ్యగలం. మన ప్రయత్నాలు నెరవేరినా లేక నెరవేరకపోయినా అదంతా ఆ తోటలో వసంతోత్సవం జరుపుకొన్నవారిపై ఆధారపడి ఉంది' అన్నాడు ఫజుల్.

'హిందువులను ముస్లిములుగాను, ముస్లిములను హిందువులుగాను మార్చుట మన ఉద్దేశ్యం కాకపోయినా' అన్నాడు తోడర్‌మల్.'

'ఒకజాతిగా, ప్రజలను ఐక్యపరచాలి' అన్నాడు ఫజుల్.

'దురదృష్టవశాత్తు హిందువుల, ముస్లిముల పండితులు మనతో ఏకీభవించరు. మనలక్ష్యం భారతదేశాన్ని బలవత్తరమైనదిగా చేయటం. భారతీయులు రణకౌశలురు, తెలివైనవారు, ధైర్యవంతులు. కాని అంతఃకలహాలు భారతదేశాన్ని బలహీనపరిచి అగౌరవం తెస్తున్నాయి. దానికి కారణం దేశం అనేకజాతులుగా విడిపోవటమే! దేశంలోని శక్తులన్నింటినీ ఒకేజండాక్రింద సమీకరించాలి' అన్నాడు బీరబల్.

'ఓ నా సహచరులారా! అదే నా ఏకైక వాంఛితం! ఇందుకే ఇంతకాలం నుంచి మేము కృషిచేస్తున్నాం. మొదట్లో చీకటి అలుముకుంది. కాని ఇప్పుడు వెలుగు చూపట్టుతోంది. ఒకతరంలో ఎంతవరకూ సాధ్యమో అంతాచేశాం. గుర్రాలు, గాడిదలలోకూడిన ఈజాతిని పాలించటం నాకు భారం' అన్నాడు ఉద్రేకంతో అక్బరు.

'నిరుత్సాహపడరాదు. ఈరోజుల్ని ఒక్కసారి బైరమ్‌ఖాన్ ఇఖానస్ రోజులతో పోలుద్దాం. అప్పుడైతే జోద్‌బాయ్ నిన్ను వివాహంచేసుకొని రాజమందిరంలో విష్ణుపూజ జరిపేవా ?' అన్నాడు ఫజుల్.

'ఔను తేడా వుంది. ఇంకా మన గమ్యస్థానం ఎంతదూరం వుంది ? పాశ్చాత్య మతప్రబోధకులు చెపుతుంటే విన్నా. ఆ దేశంలో చక్రవర్తికూడా ఒక స్త్రీకంటే ఎక్కువ మందిని వివాహము చేసుకోరాదని. బ్రోదర్ నేను అది చెప్పినప్పుడు ఎంత ఆదర్శప్రాయమైన ఆచారమో నీవు అర్థంచేసుకొని వుండాలి. కాని దానిని నేను మాత్రమే అనుసరింపగలిగాను. కాని మంచి చేయటానికికంటె చెడుగుచేయటానికే రాజుకు ఎక్కువ స్వేచ్ఛవుంది. వీలుకలిగినట్లయితే నాకుమారుడు సలీం అంతఃపురం లోనికి తల్లినితప్ప మరెవరినీ రానిచ్చువాడను కాను. సలీంకూడా తరువాత అదే అనుసరించాలని నేను కోరుతాను' అన్నాడు అక్బర్.

బీరబల్ - 'ఇరువురు వ్యక్తులుమాత్రమే ప్రేమించగలరు. జంటలుగా హంసలు జీవిస్తుంటే చూచినప్పుడు 'అవి ఎంత ఆనందంగా జీవిస్తున్నాయి' అనిపిస్తుందినాకు. కష్టసుఖాల్లో అవి సమభాగినులు.'

అక్బర్ - 'ఒకనాడు నేను కన్నీరు కార్చక తప్పలేదు. అదినాకు యింకా జ్ఞాపకం వుంది. సింహాలను వేటాడానికి నేను గుజరాత్‌కు వెళ్ళాను. ఏనుగుపైనుంచి తుపాకితో సింహాన్ని వేటాడ్డంలో సాహసం ఏమీలేదని నేను అంగీకరిస్తాను. సింహానికివలె మనిషికి పంజాలు, గోళ్ళులేవు. అందువల్ల కత్తి, డాలు, అతను ఉపయోగించాలి. కాని అంతకుమించిన ఆయుధాల్ని వాడటం ధైర్య లక్షణం కాదు. మంచిది. నేను సింహాన్ని తుపాకితో కాల్చాను. గుండు దానితలలో చొచ్చుకొని పోయింది. ఒక్కసారి గర్జించి అది కూలిపోయింది. మరుక్షణంలో పొదలోనుంచి ఆడసింహం ముందుకు దుమికింది. నాకేసి క్రోధంగా చూసింది. మళ్ళీ వెనక్కితిరిగి చచ్చినసింహం తలను నాకసాగింది. వెంటనే నేను నా వేటకాండ్రను వేట ఆపవలసినదిగా ఆజ్ఞాపించి, ఏనుగును వెనక్కి పట్టించాను. అప్పుడు ఆ ఆడసింహం నన్ను వెంటాడితే నేను దాన్ని చంపజాలనంతగా నామనస్సు కలతచెందింది. తరువాత కొన్నిరోజులు నేను విచారించాను. ఆ సింహానికి 1500ల ఆడసింహాలుంటే చచ్చినదానిని నాకుటకు అది రాదుకదా ! అని నాకు అప్పుడు తోచింది.'

'మనదేశం ఎంతో అభివృద్ధిచెందాలి. మనం శక్తిహీనులమైన తరువాత మన పనిని ఎవరు కొనసాగిస్తారో !' అన్నాడు అబుల్‌ఫజుల్.

'యుద్ధాలు - కొనసాగించే హిందూముస్లిములు ఏకగర్భ జనితులవలె నివసించ గలరని ఆశించాను. ఈఆశతోనే నేను అలహాబాద్‌లో త్రివేణీ సంగమందగ్గర ఒకకోట నిర్మించాను. గంగాయమునల సంగమం విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని నాకు బోధించింది. కాని నేను ఎంతకొద్దిగా సఫలీకృతుణ్ణి కాగలిగానో యిప్పుడు తెలుస్తోంది. అనేకతరములలో నెరవేర్చదగినకార్యాన్ని ఒకతరములోనే పూర్తిచేయటం అసాధ్యమని నాకు తెలుసు. నాకు అనుకూలురైన సహచరులు లభ్యమైనందుకు నేను ఎల్లప్పుడూ గర్విస్తాను. నేను ప్రతిగృహంలోను జోద్‌బాయ్‌తో నావివాహంవంటి మతాంతర వివాహాలు జరగవలెనని ఆశిస్తాను. కాని దానిని నేను సాధించలేకుండా వున్నాను' అన్నాడు అక్బర్.

'హిందువులే వెనుకబడుతున్నారు' అన్నాడు తోడర్‌మల్.'

'వీళ్ళే యిప్పుడు గాడిదను గుఱ్ఱంగా మార్చుటవంటి కధలు అల్లుతున్నారు అన్నాడు బీరబల్.

'హిందూ ముస్లిములమధ్య అంత తేడావుంటే ఎందుకు గాడిదలు గుఱ్ఱాలుగా మారుతున్నాయి ? వేలకొద్దీ హిందువులు ముస్లిములుగా మారటం చూడటంలేదా ?'

హిందూ ముస్లిం యువతీయువకులు వారి పేర్లు, మతం మార్చుకోకుండా వివాహం చేసుకోవాలని నేను కోరురా' అన్నాడు అక్బర్.

'జలాల్ ! అలాగైతే నీకొక సంతోషకరమైన వార్త చెప్పనియ్యి. మనం దేనినైతే సాధించలేకపోయామో, దానిని నాకుమార్తె సురైయా సాధించింది' అన్నాడు అబుల్‌ఫజుల్.

అందరూ అతనివైపు ఆతృతతో ఆశ్చర్యంగా చూశారు.

'మీరు యింకా తెలుసుకోవాలని ఆతృతపడుతున్నారు. కాని నన్ను ఒక్కసారి బయటకు వెళ్ళనివ్వండి' అంటూ ఫజుల్ బయటకుపోయి కటకటాలవద్ద నిలబడ్డాడు. మళ్ళీవచ్చి 'వినడంకంటే చూడ్డంమంచిది. నాతో రైటికిరండి !' అన్నాడు.

వారందరూ బైటికిపోయి కటకటాలవద్ద నిలబడ్డారు. అశోక వృక్షంక్రింద రాతి అరుగుమీద కూర్చొనివున్న ఇరువురు యౌవ్వనవయస్కులను అబుల్ ఫజుల్ వారికి చూపిస్తూ 'చూడండి! అక్కడ నా కుమార్తె సుర్రైయావుంది?' అన్నాడు.

'మరి నాకుమారుడు కమల్ కూడాను ఫజుల్. ప్రపంచం చీకటిమయంకాదు!' అంటూ తోడర్ మల్ తనమిత్రుని కౌగలించుకొన్నాడు. వారినిచూచి అందరు కంట తడిపెట్టారు.

'ఈ వసంతోత్సవాన్ని వయస్సులోవున్నవారికొరకు అనేక సంవత్సరాల నుంచి నేను ఏర్పాటుచేస్తున్నాను. కాని ఈసారి ఈ ఉత్సవములో నిజమైన వసంతోత్సవాన్ని నేను చూడగలిగాను. వారిరువురునూ తమ బిడ్డను ముద్దుపెట్టు కోవాలని నేను ఆశిస్తున్నాను. ఈ రెండునదుల సంగమమువలె, వారి కలయికకు మనం ఆనందిస్తున్న సంగతి తెలిస్తే అది ఎంతబాగుంటుంది' అన్నాడు అక్బర్.

'కమల్ కాదు. ఫజుల్! నీవు అదృష్టవంతుడవు. నీభార్య నీతో ఏకీభవి స్తుంది. కాని నా భార్యకు యింకా పూర్వపు ఆలోచనలున్నాయి. అయినా సుర్రైయా కమల్లు నా దీవెనెలు పొందగలరు' అన్నాడు తోడర్ మల్.

'మొదట దీవించేగౌరవం నాకు కలగాలి' అన్నాడు అక్బర్.

'జలాల్! నేను మీతోనేఉంటా!' అన్నాడు బీరబల్.

'నీకంటె మంచిచాకలి మాకెక్కడదొరుకుతాడు?'

'గాడిదను గుఱ్ఱంగా చేయాలనికోరే నావంటివాడు.'

'నేడు మన కలయిక ఎంతఆనందంగా ఉంది. నెలకొకసారి యీలా జరిగితే ఎంతబాగుంటుంది!' అని ముగించాడు అక్బర్.

---

# 3

మేడపై ఒక గది వుంది. ఆ గదికి నాలుగువైపులా గుమ్మాలున్నాయి. ఎరుపు పచ్చని, తెలుపు తీగలు పైనుంచి వ్రేలాడుతున్నాయి. గుమ్మాలకు రెండు తెరలు కట్టబడివున్నాయి. లోపలితెర గులాబీరంగులో వుంది. దానిపై పువ్వులు లతలు చిత్రించబడ్డాయి. ఆ గదిమధ్యనున్న తెల్లని ఒకబల్లపై చాలా దిండ్లువున్న మెత్తని సోఫాలమీద కూర్చొని ఇద్దరు యువతులు చదరంగం ఆడుతున్నారు. ఒకామె సురైయా. రెండోఆమె వీరబక్ కుమార్తె; వయస్సు 13 సం॥రాలు. ఆమె ఎర్రటి చొక్కా, ఆకుపచ్చనిలాగు వేసుకొని పసుపుపచ్చని కండువా కప్పుకొంది. వారిద్దరూ ఎత్తులువేయటంలో నిమగ్నులగుటవల్ల గదిలోకి ఎవరువచ్చినదీ తెలియని స్థితిలో వున్నారు. 'సురైయా!' అనే కేక వినగానే వారిద్దరూ లేచి నిలబడ్డారు.

సురైయా 'అత్తమ్మా' అంది. కమర్ తల్లి ఆమెను కౌగిలించుకొని ముద్దిడుతుంది. అప్పుడు ఆమెతల్లి 'అమ్మాయి! నీవు వెళ్లు. కమర్ ఎర్రటిచేపలు తెచ్చాడు. వాటిని సరస్సులో వెయ్యాలి. నీవు తిరిగి వచ్చేవరకూ నేను మున్నీతో చదరంగం ఆడుతూవుంటా' అంది.

'అమ్మా! మున్నీ చాలా తెలివైందమ్మా! నాఆట రెండు మూడుసార్లు కట్టేసింది. ఈమె చిన్నపిల్లకాదు' అంటూ సురైయా తనకండువా సరిచేసుకుంటూ బయటకు పరుగెత్తింది. రాజోద్యానవనంలోవున్న సరస్సుదగ్గర కమర్ వేచివున్నాడు. అతనివద్ద కొత్త మట్టికుండలున్నాయి. సురైయా అతనిదగ్గరకు వెళ్ళి అతనిచేతిని తన చేతుల్లోకి తీసుకొని 'ప్రియా! కమర్! నీవు నాకు ఎర్రని పచ్చనిచేపలను తీసుకొచ్చావా?' అంది.

'ఔను. ఇంకా బంగారుఛాయవి కూడాను.'

'నన్ను చూడనియ్యి' అంటూ సురైయా కుండలోకి తొంగి చూడబోయింది.

'నేను వీటిని సరస్సులో విడుస్తా. అప్పుడు చూడు! ఎంతో అందంగా వుంటాయి. సురైయా!'

సురైయా సరస్సుఒడ్డున నవ్వుతూ నిలబడింది. కమల్ కుండను సరస్సులో బోర్లించాడు. ఆ వివిధరంగుల చేపలు నీటిలో చాలా అందంగా చూపట్టాయి.

'అవి ఇంకా చిన్నవి. అవి పెద్దవైతే ఆరు అంగుళాలకన్న ఎక్కువ పెరగవు' అన్నాడు కమల్.

'కమల్ : ఇప్పుడుకూడా అందంగానే ఉన్నాయి.'

'సురైయా : దాన్ని చూడు ఆ రంగేమిటంటావు?'

'గులాబీ'

'నీ చెక్కిళ్ళవలెనే!'

'కమల్ : చిన్నప్పుడూ ఇల్లాగే అనేవాడవు.'

'సురైయా : చిన్నప్పుడుకూడా ఇల్లాగే వుండేవి.'

'కమల్ : అప్పుడు నీవు ఆకర్షణీయంగా వుండేవాడవు.'

'మరి యిప్పుడో!'

'ఇప్పుడా—మరింతబాగున్నావు.'

'అప్పటికంటేనా? ఎందువల్ల?'

'ఎందుకో నాకు తెలియదు. నీమాటలధ్వని నూరినప్పటినుంచీ, నీ నూనూగు మీసములు చూచినప్పటినుంచీ, నా హృదయంలో ప్రేమ నాటుకొనిపోయినట్లు తోస్తుంది.'

'అందుకే అప్పటినుంచీ నీవు దూరంగావుంటున్నావు.'

'నిన్ను దూరంగా వుంచుతున్నానా?'

'ఔను. నీవు ఇంతకుముందు గంతేసి నాభుజాలు పట్టుకొని వేళ్ళాడే దానవు. — —'

'పితూరీలు చెప్పడం కట్టిపెట్టు. కొత్తసంగతి చెప్పు.'

'కొత్తసంగతా? మనప్రేమ వెల్లడైంది.'

'ఎవరికి?'

'మనవాళ్ళకు—మనపాదుషాకుకూడాను.'

'పాదుషాకుకూడానా?'

'లేదు. ఎప్పుడో ఒకప్పుడు వెల్లడైతీరుతుంది. కాని యిప్పుడే ఎల్లా జరిగింది?'

'అదంతా నాకు తెలియదు. ముందు నీ తల్లిదండ్రులు. తరువాత నా తండ్రి, పాదుషా. ఆఖరున నాతల్లి ఒప్పుకొన్నారని తెలిసింది.'

'నీతల్లి — —?'

'ఆమె పూర్వాచారపరాయణురాలు. ఆమె అంటే ప్రజలకు భయం.'

'ఆమె నన్ను యిప్పుడే ముద్దెట్టుకుంది?'

'సరే! నేను అనుకున్నది అబద్ధమైంది.'

'ఆలాగైతే మన ప్రేమ అంగీకరించబడిందా?'

'మన మిత్రులూ, బంధువులూ అంగీకరించారు. కాని ప్రపంచం దీన్ని ఒప్పుకోదు.'

'కమల్! నీవు ప్రపంచానికి వెరుస్తావా?'

'సురైయా! దొత్తిగాలేమ. మన ముందువారికి మార్గదర్శకుల మౌతున్నాం.'

'కమల్! మానదినకుకూడా తెలుసునని నాకిప్పుడు తెలుస్తోంది. నిన్నరాత్రి నేను ఆమె ఇంటికి వెళ్ళాను. ఆమె నాతో పేళాకోళంగా నా వివాహంసంగతి ప్రస్తావించింది. కాని నీపేరు చెప్పలేదు.'

'బహుశా నీఅన్నగారు చెప్పిఫుంటారు. మనప్రేమ వాళ్ళకు కూడా యిష్ట మన్నమాట!'

'కమల్! అయితే నీఅత్తవారంతా నీపాదాక్రాంతులన్నమాట!'

'నీవు మాఅమ్మను నీపరానికి గమ్మత్తుగా తిప్పేసుకున్నావు.'

'కమల్! ఆమె ఆచారాలనుగురించి మీరు ఆలోచిస్తున్నారు. కాని ఆమె నన్నెంతగా ప్రేమిస్తోందో మీకుతెలిస్తే, మీరు ఆమెను సందేహించరు.'

'ఔను. మాకు తెలుసు. ఆమెను జయించుటకు నిన్ను తురుపుగా ఉపయో గించాలని నాన్న అనుకున్నాడు. కాని నీఅవసరంలేకుండా పనిజరిగిపోయింది. ఇక మనపెళ్ళి కాబోతోంది.'

'ఎల్లాగ?'

'పండితునివద్దకాదు; ముల్లావద్దాకాదు.'

'భారతదేశంలో త్రివేణీసంగమంవద్ద నూతనదుర్గ నిర్మాతయగు మన మత ప్రవక్తవద్దనే!'

'సరస్సులనూ, నదీనదాలనూ సముద్రమువలె చేయగోరుచున్న అతడు.'

'ఎప్పుడు కమల్!'

'ఎల్లుండి! ఆదివారమునాడు.'

'ఎల్లుండే?' అంటూంటే సురైయా కళ్ళల్లో ఆనందబాష్పాలు మంచుకొండపై మంచుబిందువుల్లా మెరుస్తూ నిలచిపోయాయి. కమల్ ఆమెను అనుకరిస్తూ ఆమె కళ్ళను ముద్దెట్టుకున్నాడు. ఇదేవిధంగా చాటుగా మరొక ప్రేమిప్రేమికులు ఎవరైనా ఆనందబాష్పములు విడుస్తున్నారేమో ఈ ప్రేమైకజీవులకు తెలియదు.

——

# 4

అస్తమిస్తున్న అరుణబింబకాంతి ప్రతిఫలించడంవల్ల సముద్రం చూపులకు ఎంతో అందంగావుంది. అది వసంతఋతువు. ఇరువురు యౌవనవయస్కులు ఆ సాంధ్యారుణకాంతులలో ఆనందంగావున్నారు. ఆ ఆనందమునకు తన్మయుడై వారిలో ఒకరు—

'సముద్రం—మనదేవత!—ఎంత బాగుంది?'

'మనం సముద్రంయొక్క బిడ్డలం! ప్రియుడా! ఇంకనూ మనం ఈ విషయాన్ని సంశయించాలా?'

'కసమ్ వద్దు. (కసమ్ అంటే ప్రమాణపూర్వకం) —సముద్రం తన హృదయంలో ఇటువంటి స్వర్గతుల్యమైన భూమిని దాచుకున్నదని ఎవరైనా ఊహించారా?'

'ప్రేయసీ! మానవుడు వెనిస్‌నుంచి స్వర్గాన్ని సృష్టించాడు. అది వాస్తవిక స్వర్గం కాకపోయినా; అది స్వర్గతుల్యమైంది.'

'పురుషులవలెనే స్త్రీలుకూడా వారిదేశంలో ముఖములపై ముసుగులేకుండా తిరుగుతారని సాధువు నాతో చెప్పినప్పుడు నేను విశ్వసించలేను. మనం ఇప్పటికి రెండు సంవత్సరాలనుంచి — ఈ స్వర్గంలో నివసిస్తున్నాం. ఒక్కసారి వెనిస్‌ను ఢిల్లీతో పోల్చిచూడు!'

'సురైయా! సముద్రంలోని ఫ్లారెన్సుద్వీపంవలె బలవత్తరమైన రాజ్యం చక్రవర్తి లేకుండానే ఉన్నదని ఎవరైనా చెప్పివుంటే నీవు నమ్మివుండేదానివా?'

'వెనిస్‌వంటి నగరాలను రాజులు పరిపాలిస్తారంటే!'

'ప్రేయసీ! ఢిల్లీలో మనం యింత బహిరంగంగా మాట్లాడుకోగలమా?'

'పరదాలేకుండా సాధ్యంకాదు. అక్కడ పల్లకీలో చిలుకవలె బంధింపబడి నేను సంచరించాలి. ఇక్కడ మనం చెట్టాపట్టాలు వేసుకొని తిరుగుతున్న సంగతి ప్రజలు చూస్తున్నారు? వాళ్ళు రెండోసారి మనవైపు తిరిగిచూడరు.'

'ఇప్పటికే గుజరాత్‌లో మనం గౌరవనీయులైన స్త్రీలు పరదాలేకుండా తిరగటం చూచాం. దక్షిణ భారదేశంలోకూడా పరదాపద్ధతి లేదని మనం వింటున్నాం.'

'అంటే దేశంయావత్తూ ఈ పరదాపద్ధతి తొలగిపోతుందన్నమాట! కమల్! మనదేశంలోకూడా అల్లా ఎప్పుడైనా జరుగుతుందా?'

'మన తండ్రులు వారి జీవితకాలాన్నంతా ఇందుకోసం వినియోగించారు. ఆ చిన్న రాజ్యం ఫ్లారెన్స్ స్థితి చూడు సుందరీ! ఆ రాజ్యంలో ఒకవైపునుంచి మరొకవైపుకు 3 రోజులలో నడిచిపోవచ్చు! అక్కడ ప్రజలు ఎంతగర్వంతో స్వతంత్రంగా ఉంటారో! వారెన్నడూ ఎవరిముందూ తలవంచరు. వారు రాజ్యాన్ని హర్షింపరు. వారు రాజును దెయ్యంగానూ విషసర్పతుల్యంగానూ తలుస్తారు.'

'కమల్! వారుచెప్పే దానిలో కొంత సత్యం లేదంటావా? ఇక్కడి వైభవాలను ఫ్లారెన్సులోవారితో పోలుద్దాం. ఇచ్చటివారివలె వారెన్నడైనా ఎండిపోయి చర్మావశిష్టంగా ఉంటారా!'

'ప్రేయసీ! ఉండరు. రాజవైభవాలకు, రాజదర్పాలకూ అక్కడ తావులేదు.'

'వెనిస్‌లో చాలా భాగ్యవంతు లున్నారు. వారు మన దేశంలోని వర్తకుల కంటే భాగ్యవంతులు.'

'మనలో గొప్పవర్తకులు తాము సంపాదించిన లక్షరూపాయిలను పడగెత్తుతారు. చీకటిలో దాచిపెట్టబడిన ఆ బంగారు, వెండినాణెముల ఉపయోగం ఏమిటని నేను ఆశ్చర్యపడతాను. ప్రజల్లో ప్రచారంలో ఉంచటం మంచిదికదా! ధనం ప్రజలలో చలామణికాకపోతే దుకాణాలలోని తినేవస్తువులు పాడైపోతాయి; పండ్లు చెట్లపైననే కుళ్ళిపోతాయి; పురుగులు బట్టను షాపులలోనే కొట్టివేస్తాయి. మన కరోడీమల్లు కోటికి పడగెత్తాడని ప్రజలు చెపుతారు.'

అప్పటికే సూర్యుడు అస్తమించాడు. చీకటి పడసాగింది. కాని ఈ ప్రేమీ ప్రేమికులు ఇసుకతిన్నెను విడిచిపోవటానికి అంగీకరించటంలేదు. వారు సముద్రాన్ని తమ సహచరునిగా ప్రేమించారు. వారు భూమార్గంగుండా ప్రయాణంచేసినా, ముందు కానవచ్చే సముద్రం ఒకమూల భారతదేశాన్ని ఆనుకొనిఉన్నదని వారికి తెలుసును.

సముద్రపు రెండువైపులగల గట్లను కలుపుట సాధ్యమా అని పలుమారు వారికి తోచి వారిని ఆశ్చర్యపరచకపోలేదు. వారు గృహోన్ముఖులయ్యేసరికి బాగా చీకటి పడింది. సురైయా చీకటిలో చూచినట్లే, తన భావములనుగురించి ఆలోచించుకో సాగింది.

'మనచక్రవర్తి తనరాజ్యంలో శాంతిస్థాపనకు అనేకయత్నాలు చేశాడు. అతడు చాలావరకూ సఫలీకృతుడయ్యాడు. కాని నిర్లక్ష్యంగా చీకటిరాత్రులందు మనం ఎందువల్ల సంచరించలేకపోయాం?'

'ఇక్కడ ప్రజలంతా సమృద్ధిగా వున్నారు. రైతులు ద్రాక్షతోటలు, వరి పొలాలు మొదలైనవి కలిగివున్నారు.'

'మన దేశంలోని పొలాలు పండవా?'

'సురైయా! మనదేశంలో పండిన పంటను దొంగిలించటానికి దొంగలు సిద్ధంగా వుంటారు?'

'ఇక్కడ మనం ఏయింటికైనా వెడితే, మర్యాదగా బల్లపై సారాయి పెడతారు. నీవు గమనించావా?'

'భారతదేశంలో చక్రవర్తితోకలసి మంచినీరు త్రాగితే మా నాన్నను నిందించారు.'

'రాజపుత్రస్త్రీలు ఎంతో మురికిగావుంటారని, అందుకు కారణం వాళ్ళు పంది మాంసాన్ని వారి ఇళ్ళలో వండుతారనీ నాకు చెప్పారు. భారతదేశంలోని ఆ గ్రుడ్డి ప్రజలు ఇచ్చటకువచ్చి ఈ హెచ్చుతగ్గులులేని సమాజాన్ని చూడవలెనని కోరుతాను.'

'ఎక్కడైతే ప్రజలు వారి ఇష్టానుసారం సంచరిస్తారో అక్కడకు.'

'ఫ్లారేన్సు సమైక్యదేశం—కమల్! ఏనాటికైనా భారతదేశంలో ఐక్యత ఏర్పడాలి.'

'ఆరోజు వచ్చితీరుతుంది—మనం సముద్రాధిపత్యాన్ని సంపాదించినప్పుడు—'

'సముద్రాధిపత్యమా?'

'సురై! యీవెనిస్ సముద్రాధిపత్యంవల్ల ఏర్పడిన నగరం. ఈ నగరంలోని కాల్వలు, భవనాలు ఇందువల్లనే ఏర్పడ్డాయి. ఇప్పుడు మాత్రం వెనిస్‌తో పోటీచేసే వారు లేకపోలేదు. కాని ప్రపంచాధిపత్యం సముద్రాధిపత్యం సంపాదించినవారి హస్తగతం కాగలదు. ఈ విషయాలు నాకు తోచినందుకు నేను సంతోషిస్తున్నాను.'

'రాత్రులందు నీవు ఏపుస్తకాలు చదువుతావు? ఇచ్చట పుస్తకాలు ఎంత సులువుగా దొరుకుతాయి.'

'మనదేశంలోకూడా కాగితాలు ఉన్నాయి. లోహంపనివారు ఉన్నారు. కాని అచ్చుపేయటం మనకు తెలియదు. అక్కడకనుక ముద్రణాలయములు స్థాపిస్తే విజ్ఞానం ఎంత త్వరితంగా వ్యాపిస్తుంది! ఈ పుస్తకాలు చదివినా, ఈనావికులను చూచినా సముద్రాధిపత్యంవున్న దేశం ప్రపంచాధికారాన్ని పొందగలదని నాకు తోస్తోంది. స్నానం చెయ్యరని ఈ పాశ్చాత్యుల్ని మనవారు నీచంగా చూస్తారు. కానీ వారిలోగల ఉత్సాహశక్తిని చూస్తే, వారిని మెచ్చుకోక తప్పదు. ప్రపంచాన్ని గురించి కథలు వ్రాయుటలో వారు సంతృప్తిచెందలేదు. వారు ప్రపంచములోని ప్రతిభాగాన్ని కనిపెట్టి, దాన్ని శోధించారు. సురైయా! నీకు వారి దేశపటాల్ని కొన్నింటిని చూపించానుకదా!'

'కమల్! నేను సముద్రాన్ని ఎంతగా ప్రేమిస్తాను!'

'ప్రేమ-మంచిది. సముద్రం దేశాల స్వాతంత్ర్యాన్ని కాపాడగలదు. ఓడపై వున్న ఫిరంగులను నీవు చూడవచ్చు! ఈఓడలు నీటిపై సంచరించే దుర్గములు. మంగోలియనులు తుపాకులవల్ల గుఱ్ఱములవల్ల విజయం పొందారు. ఈరోజులలో యుద్ధనౌకలు కలిగివున్నవారిని విజయలక్ష్మి వరిస్తుంది. సురైయా! ఇందువల్లనే నేను నౌకాయుద్ధాన్ని నేర్చుకోగోరుతున్నాను.'

కాని వారి ఆశలు నెరవేరలేదు. వారు సముద్రముపై భారతదేశానికి బయలు దేరారు. ఆ కాలములో సముద్రపుదొంగలు ఎక్కువగా ఉండేవారు. సూరత్‌కు ఇంకా రెండురోజులలో చేరగలరనగా, వారిపై ఓడదొంగలు దాడిచేశారు. కమల్ తనఅనుచరులతో వాళ్ళపై ఫిరంగులు పేల్చాడు. కాని దొంగలు అధికంగావున్నారు. కమల్ ఓడ ఫిరంగి దెబ్బలుతిని సముద్రంలో మునిగిపోసాగింది. సురైయా అతని వద్దనే వుంది. ఆమె ఆఖరుసారి చిరునవ్వుతో 'సముద్రాధిపత్యం' అంది!

---

# "రేఖా భగత్"

## (పదునేడవ కథ)

[కాలం – క్రీస్తుశ 1800 సంగుటు తరువాత]

నాడు కార్తీక పూర్ణిమ. హరిహరనాథుని దర్శనంకోసం అనేకమంది ప్రజలు గుమిగూడారు. దూరప్రదేశాల్నుంచికూడా తీర్థంకోసమై అనేకరోజుల్నుంచి కూడబెట్టిన డబ్బులు తెచ్చుకున్నారు. యాత్రికులు తమతో సత్తుపిండి, బియ్యం అవీతెచ్చుకొన్నారు. అక్కడ తోటలో కట్టబడిన కొన్ని ఏనుగుల్ని, ఎద్దుల్ని చూచినవాడు ముందు ముందు ఇది ప్రపంచంలో పెద్దతీర్థం అవుతుందని అనుకోడు.

రేఖాభగత్ సత్తుపిండితో కొంతకారాన్ని ముల్లంగినీ కలపితిన్నాడు. కొంచెం మంచినీరు త్రాగినతరువాత తనస్నేహితులతో కలిసి మామిడిచెట్టు నీడలో కంబళిపై కూర్చున్నాడు. రేఖా గేదెను అమ్మగా వచ్చిన యిరువై రూపాయలు మడతలుపెట్టి నడుముకు కట్టుకొన్న కండువాలోకట్టి వాటిని అప్పుడప్పుడు చూస్తూ ఉంటాడు. తీర్థములలో జేబుదొంగలు ఎక్కువగా ఉంటారని అతనికి తెలుసు. రూకలు ఉన్నాయోలేవో అని మొలను ఒకసారి తడవికొని 'నాగేదను అమ్మేశాను. మౌలా! మూడుమాసాలు బలుపుగా మేపాను. దానికి ఇరవై రూకలు తక్కువ వెలకాదు. కాని ఈరోజులలో చూస్తోండగా డబ్బు మాయమౌతుంది.'

'సోదరా రేఖా! పనిలేనిరోజులు. డప్పెల్లా ఉంటుంది. ఈకంపెనీ రాజ్యంలో మనం సాయంత్రంవరకు కష్టపడినా మన పిల్లలకు తిండిపెట్టలేము. మనరోజులు యీవిధంగానే వెడతాయి' అన్నాడు మౌలా.

'ఇప్పటివరకూ వైద్యులకు మామూళ్ళు, రాజకర్మచారులకు లంచాలు యిస్తూ మనం నాశనమౌదున్నాం. కనీసం భూములు మనవి.'

'ఏడుతరాలు అడవినరికి మనం పొలాలు చేశాం.'

19)

'అరే మౌలా? పులిభూమి ఉంది చూశావా? అది పెద్దఅడవి. అందులోనే మాబాబుని పెద్దపులి తినేసింది. అప్పటినుంచీ దానికి పులిభూమి అని పేరువచ్చింది. ప్రాణాలుకూడా అర్పించి పొలాలు తయారుచేశాం,' అన్నాడు సోబరన్.

ఇంతలోనే రేఖా అందుకుని 'భోలాపండిత్! మీకు సత్యయుగం విషయాలు తెల్సు. ప్రజలకు ఇంతకష్టం ఎప్పుడూ కలిగి ఉండదు.'

'భోలాపండిత్! పొలాలు మేము సాగుచేస్తున్నాం. ఇప్పుడు మనగ్రామానికి అధికారి రామపురపు గుమస్తా' అన్నాడు మౌలా.

భోలాపండిత్-'ఇది చాలా అధర్మం. కంపెనీవాళ్ళు రావణుని కంటె, కంసునికంటె మించిన క్రూరాల్ని చేస్తున్నారు. పూర్వకాలంలో రైతువద్దనుంచి పంటలో పదవవంతు పన్ను తీసుకోమని ధర్మశాస్త్రాలు అనుజ్ఞయిచ్చాయి.

మౌలా-'రామపురపు గుమస్తాని మనగ్రామానికి అధికారిగా చేసారేమిటా అని నాకాశ్చర్యంగా ఉంది.'

భోలా-'అంతా తల్లకిందులు. ఇదివరకు ప్రజలకు రాజు ఉండేవాడు. రైతులు రాజునే ఎరుగుదురు. రాజు రాజధానిలోనే ఉండేవాడు. అతడుకోరేది పదవ వంతు మాత్రమే. జమీందార్లకో-వీరికి పంటలుపోయినా వుస్తో పూసో తాకట్టుపెట్టి పన్ను చెల్లించాలి.'

రేఖా-'పన్ను యింతనికూడా నిర్ధారణలేదు. ప్రతిఏడూ హెచ్చుతూ ఉంటుంది. ఇల్లా ఎందుకు హెచ్చుతుందని అడిగేవాడేలేడు.'

కరణం సుందరలాలు తీర్థానికి వచ్చాడు. ఒక ఆవును కొందామని అనుకొన్నాడు. కాని ఖరీదులు చాలాఎక్కువగా వుండటంచేత కొనలేదు. ఆయన చొక్కాతొడుక్కొని, టోపీ పెట్టుకొన్నాడు. తీర్థంలోకూడా పని ఉంటుందనేకాబోలు కలంకూడా చెవులో పెట్టుకొనివచ్చాడు. తనకు సంబంధించిన మాటలు కాకపోయినా దయాళ్ళుపు రైతుల మాటల్లో కలుగచేసికొని-

'పండిత్! ఏమిటో అడిగేదిక్కే లేదంటున్నావు. ఎవరు అడుగుతారు? ఎవరి మట్టుకు వారే దోపిడీగాళ్ళు. ఇతరుల ధనాన్ని దోచుకొనటమే. దోచుకుంటే

దోచుకో! రాజు లేడు. రెండు వందల మంది సిపాయి లున్నారు. వాళ్ళే కంపెనీ.'

రేఖా–'కరణంగారూ! నిజంసంగతి తెలిసింది ఈవేళ. కంపెనీ బహదుర్ అంటే రాజు ఉంటాడనుకున్నాం.'

మౌలా–'అంచేతే ఎక్కడపడితే అక్కడే దోపిడి.'

సోబరన్–'ఈరామపురపు గుమస్తా మాగ్రామాధికారి ఎల్లా అయ్యాడు? కంపెనీ ఢిల్లీనవాబుని జయించిందా?'

కరణం : 'కాదు – మూర్షిదాబాద్ – మనగ్రామాన్ని ఢిల్లీ సింహాసనాన్నుంచి లాక్కుంది.'

'మాకంత జ్ఞాపకం ఉండదు. మాకు ఢిల్లీ ఒక్కటే తెల్సును. అయితే ఇప్పుడు మనకు రాజుఉన్నాడా? పన్నులు యిక్కడిస్తున్నాం. అయితే మనకు రాజులిద్దరా?'

రేఖా– 'ఇప్పుడుమాత్రం ఇద్దరు రాజులు. ఒకడు కంపెనీరాజు రెండవవాడు రామపురపురాజు. వీళ్ళమధ్య నలుగుతూ మనం బ్రతకగలమా? మీరేచెప్పండి కరణంగారూ.'

కరణం– 'రేఖాభగత్ నీవు చెప్పేది నిజం. జమీందారు తిరగలి రెండో రాయి. రాజుకంటె జమీందారు ఏవిధంగానూ తీసిపోడు.'

రేఖా– 'పంచాయితీని యిప్పుడుకూడా మనం ఎన్నుకొంటున్నాము కాని దాని మాట ఏమీచెల్లదు. అంతా జమీందారుదీ, రాజుదీ పెత్తనం. వారిమాటే న్యాయం. ఎప్పుడైనా భార్యాభర్తల తగవులో గేదె వేలంవేయబడిందా! తగవు ఏర్పటమని వాది ప్రతివాదుల యిద్దరకూ జుల్మానా వేస్తారు. ఇది ఎక్కడి న్యాయం?'

సోబరన్— 'పూర్వం అంతా పంచాయతీదే. హత్యలు జరిగినా పంచాయితీ రాజీచేసేది. సమదృష్టితో ఉండేది.'

'వాననీరు ఎక్కువైతే అది పోవడానికి మురుగుకాల్వలులేవు. తక్కువ వర్షం కురిసినప్పుడు చేలు ఎండకుండా నీరు నిలువచేసే ఏర్పాట్లులేవు.'

కరణం— 'కంపెనీవారు పంచాయితీలు నాశనంచేసి ఈ పని జమిందార్లకు యిచ్చారు.'

రేఖా— 'జమీందారు ఏంచేస్తున్నాడో చూస్తున్నాం.'

కరణం— 'రేఖాభగత్ - నేనుకూడా జమీందారు సేవకుడననే నీకు తెలుసు. నేను మసరఖయొక్క కరణాన్ని. ఇది అన్యాయపుసొమ్ము. నాకు పెద్ద యెద్దుల్లాంటి కొడుకులు ఏడుగురు. వాళ్ళుపోయారు.' అలా అంటూంటే అతని కళ్ళవెంబడి నీళ్ళు కారాయి. అంతా అతనివైపు దయతో చూచారు. 'అవునురేఖా - అందరూ మరణించారు! ఇప్పుడు నాయింట్లో మంచినీళ్ళు ఇచ్చేందుకు ఒక్క పిల్లాలేదు. ఇక మాయజమాని అంటావా ఛప్రావేశ్య స్నేహంతో అతనిలోని మానవత్వం నశించింది. అతని ఇంట్లో ఉన్నవారు ఇద్దరూ రాజసేవకులు.'

రేఖా— 'యజమానులు అంతా ఇల్లాగే, కరణంగారు.'

సోబరన్— 'మన సమస్తం పోయాయి - సప్తసముద్రాల అవతలి నుంచి దొంగలు దోచుకొనేందుకు వచ్చారు. పంచాయితీ పోయింది, తరుణంలో వర్షాలు కురవటంలేదు. నాలుగు గింజలు ఇంటికి వచ్చాయి అంటే - చౌకుదారు, కరణం, గుమస్తాలు యింతమందికి ఎక్కడ యివ్వగలం?'

కరణం— 'జమీందారు కరణానికి నెలకు అర్ధరూపాయి యిస్తాడు. దోచుకోకపోతే ఏం చేస్తాడు. మేము ఏంతింటాము - ఎల్లా నెలరోజులు గడుస్తాయి. ఇది జమీందారు ఎరగడా!'

రేఖా— 'ఎరుగును - జమిందారు గుడ్డివాడుకాడు. అతనికి అంతాతెల్సు, రాజు, జమీందారు, కరణం, గుమస్తా వీళ్ళు అంతా దోపిడిగాండ్రే! అయినా మేము ఏవిధంగా జీవిస్తున్నాము?'

సోబరన్—'కట్టగుడ్డా తినతిండీ లేకుండా బ్రతుకుతున్నాం'.

'కంపెనీవారికేం, వారు పన్నులు విధించారు. పన్ను ఇవ్వకపోతే జమీందారు వచ్చి యిల్లు వేలం వేస్తాడు. కంపెనీసొమ్ము కంపెనీకి ఎల్లాగావస్తుంది. దయాలపుర రైతులు ఏమైపోతే వారికేంకావాలి.'

'భగవంతుడా నీవు నిద్రిస్తున్నావా ? లేక సుషుప్తావస్తలో ఉన్నావా ? నీవు ఓడిపోయావు !'

సోబరన్— 'రేఖా! అవును. ఓడిపోయాడు. బరయీపరగణాలోని వారంతా కలసి జమీందారు తమయజమాని అని ఒప్పుకోలేదు. వారు కంపెనీవారివద్దకు వెళ్ళి 'మాకు జమీందారులు అధికారులుగా వద్దు. మాపంచాయతీయే మీకు పన్నుపైకం చెల్లిస్తుంది.' అధికారి 'వేసవిలోకూడా పన్నులిస్తారా' అన్నాడు. ఆకాలంలో భార్యాబిడ్డల్ని పోషించటమే చాలాకష్టంగా ఉంటుంది. అధికారికి అల్లా అడగడానికి నోరెట్లా వచ్చిందో? ఇంకా ఏమన్నాడంటే— 'పన్నులు యివ్వడం మానేయండి. కంపెనీవారు మిమ్మలిని ఏంచేస్తారు – మేము డబ్బుఉన్న వాళ్ళని జమీందార్లుగా చేస్తున్నాం. ఎంచేతంటే పన్నులు వసూలుకాకపోయినా అతడు కంపెనీసొమ్ము అణాపైసలతో చెల్లిస్తాడు, లేకపోతే అతని ఆస్తి గౌరవం నాశనం అవుతాయని అతనిభయం.... ఇదంతా నీకు తెలుసునా రేఖాభగత్'.

రేఖా— 'అందరిలోకి కంపెనీవారు చాలానిర్దయులు'.

'బరయీవారు ప్రాణాలర్పించి పోరాడారు. వీరికి చిన్న తుపాకు లున్నాయి. కంపెనీవారివద్ద పెద్దతుపాకులున్నాయి. కంపెనీవారిలో ధైర్యంఉంటే యుద్ధంచేసే వారితో యుద్ధం చెయ్యాలి. అంతేకాని, గ్రామాలు తగులబెట్టి స్త్రీలను పిల్లలను కూడా వదల్లేదు.'

సోబరన్—'వ్యవసాయం నాశనం అయింది. చేతిపనులు నాశనం అయ్యాయి. సాలీలు నాశనం అయ్యారు. ఇప్పుడు కంపెనీవారు విదేశాలనుంచి బట్టలు తెప్పించి అమ్ముతున్నారు'.

'అవును. మిల్లుబట్టలు. చూడు ఈనాచొక్కా అల్లాంటిదే. రాట్నంమీదవడికి, ఆనూలుతో బట్టనేస్తే యింతచౌకగా రాదు. గౌరవానికని ఇదేకొనవలసివస్తోంది. సర్కారు భవనాల్లోకి వెడితే యిల్లాగేవుండాలి. నవ్వుతావేం రేఖాభగత్ ?'

రేఖా— 'కంపెనీవారు రాజ్యపాలనయేకాక వ్యాపారంకూడా చేస్తున్నారు. ఇల్లాంటిరాజు ఎక్కడైనా ఉంటాడా అని నవ్వుతున్నాను. అంతేకాని నిన్ను గురించి కాదు.'

'సత్యయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగాలు గడిచిపోయాయి. అప్పుడే కలియుగం ప్రారంభమయి 1000 సం॥రాలు అయింది. కాని ఇల్లాంటిరాజుని కనివిని యెరుగం' అన్నాడు ఘోలాపండితుడు.

కరణం— 'ఘోలాంపడిత్ ! నాజిమ్ యొక్క దర్బారులో ఒక గుమస్తా 'కంపెనీ వారు తుపాకీదొంగలు' అన్నాడు. ఇంకోడు 'అది ఒకవర్తకులగుంపు. వ్యాపారం చేసికొందుకు వచ్చారు'. మళ్ళీ మొదటివాడు 'ఇక్కడివస్తువులను తీసికొనిపోయి తమదేశంలో అమ్ముకునేవారు. ఇప్పుడు పెద్దపెద్దమిల్లులుపెట్టి స్వయంగా వస్తువులు తయారుచేయించి ఇక్కడ అమ్ముతున్నారు' అన్నాడు.

మౌలా— 'అయితే చేతిపనులు చేసేవాళ్ళకుకూడా చిక్కే.'

---

## 2

శీతాకాలంలో గంగానది ఆకుపచ్చగా వుంటుంది. అప్పుడు పడవలకు ప్రమాదంలేదు. ఈకాలం వ్యాపారులకెక్కువ అనుకూలంగా వుంటుంది. అందుచేత వారు వ్యాపారానికై బయలుదేర్తారు. అనేక నావలద్వారా కంపెనీసరుకు విరివిగా పాట్నా, గాజీపూర్, మిర్జాపురం మొదలగు పట్నాలకు ఎగుమతి చేయబడుతోంది.

పాట్నా నుంచి విదేశములకు, లివాసీలు మొదలైనవి పంపబడు తున్నాయి. పాట్నానుంచి కలకత్తాకు వారంరోజులు ప్రయాణం. కోల్‌మన్‌కు తిన్‌కౌడీకి స్నేహం ఏర్పడింది. మొదట్లోవారు ఒకరితో ఒకరు మాట్లాడేటందుకు అనుమానించే వారు. తిన్‌కౌడీ పంట్లాము, నల్లనికోటు ధరించాడు. అతని తెల్లనిముఖం ఎంతో ఆకర్షణీయంగానేకాకుండా వెంపును గొలుపుతూవుంది. కోల్‌మన్ తిన్‌కౌడీతో సంభాషణ ప్రారంభించాడు. వారిసంభాషణనుబట్టి కోల్‌మన్‌కు కంపెనీ అంటే కోపం అనీ అతడు కంపెనీలోని పెద్ద, చిన్నఉద్యోగులందరినీ తుదకు గవర్నరునైనా నిందించుటలో వెనుకీయడని తెలుస్తోంది. తిన్‌కౌడీకికూ కంపెనీనౌకరులంటే ఈర్ష్య. ఇతడు 20 సం॥రాలు కంపెనీవారి ఆఫీసులలో గుమాస్తాగా పనిచేశాడు. అతడు చీద

కుటుంబీకుడు అయినా ఆత్మనిగ్రహం అలవరచుకొనిన దురాశలేనివాడు. కంపెనీవారు మితిలేని దోపిడీకొనసాగించేరోజులలో, కంపెనీలోని ఒకముఖ్యునివల్ల ఆతడు తన జీవితానికి సరిపడే ధనం సంపాదించుకొన్నాడు. 24 పరగణాలలో నాలుగుగ్రామాలు యితనికి అతడు యిచ్చివేశాడు. వాటి రాబడితోపోల్చితే పన్ను ఎంతోతక్కువకడతాను. దానిని ఒక సాహేబ్ దయవల్ల అతడు పొందగలిగాడు. తినకౌడి చేసిన పాపములు ఎన్నిజన్మలు ఎత్తినా మాసిపోయేవికావు. సాహెబును సంతృప్తిపరచుటకు తన గ్రామంలోని ఒక బ్రాహ్మణ బాలికను ఆతడు వానికి అప్పజెప్పాడు. గత ఆరునెలల ప్రయాణం అంత సుఖమైనది కాదు కనుక ఆ సాహెబులతో ఆడవాళ్ళు ఎక్కువగా లేరు. తినకౌడీవయస్సు 45 సం॥రాలు. ఆతని నల్లనిశరీరం మంచి ఆరోగ్యంగా వుంది. అయినా అతడు ప్రతిదినం అద్దంలో తనచేతులు చూచుకుంటూ వుంటాడు. బ్రాహ్మణ స్త్రీ పాతివ్రత్యభంగానికి తాను కారకుడగుటవల్ల ప్రతిరోజూ అతడు తనకు కుష్ఠురోగం వస్తుందని భావించేవాడు.

సాహేబుల సనుగుళ్ళు, అవమానాలు, తన్నులు భరించుట ఆతనికి కష్టమైపోయింది. ఆతని కుటుంబమంతా నాశనమైపోయింది. అందువల్ల ఉద్యోగం చేయటానికి యింకా వయస్సు ఉన్నా అతడు రాజీనామాచేసి తనగ్రామానికి తిరిగి పోతున్నాడు. 20 సం॥రాలు నుంచీ అతడు శాంతంగా అనుభవించిన బాధలు జ్ఞప్తికి వచ్చి అతని హృదయం మండిపోసాగింది. కోల్‌మన్‌కు కంపెనీవారిపై తనకంటే ఎక్కువకోపం వున్నదని నెమ్మదిగా తెలుసుకొన్న తరువాత, వారిరువురూ హృదయాలు విప్పి మాట్లాడుకోసాగారు.

'ఈస్టిండియాకంపెనీ వర్తకం నిమిత్తం ఏర్పడింది. కాని అది ఏర్పడినప్పటి నుంచీ దోపిడీకి పూనుకొంది. ఇక్కడకు వచ్చిన వారంతా ధనం సంపాదించుకొని, సాధ్యమైనంత త్వరలో తిరిగిపోవలెనని పై వారినుంచి క్రిందివారివరకూ అదే ఆలోచన. క్లైవు చేసినదీ యిదే. అతనిని ఎవరూ ఆపలేరు. వారెన్‌హేస్టింగ్సు చేతసింహుని రాణులను ఆకలితో మాడ్చివేశాడు. అయోధ్య బేగములను బికారులుగా చేశాడు. కాని వానిని స్వదేశంలో క్షమించలేము; వానికి శిక్షతప్పినా, కోర్టులలో నేరారోపణనుంచి తప్పించుకొనుటకు సంపాదించినదంతా ఖర్చయి పోయింది.' అన్నాడు కోల్‌మన్.

'సాహెబ్ ! నేరారోపణ ఎవరు చేశారు ?'

'పార్లమెంట్ మా దేశంలా రాజు తన ఇష్టంవచ్చినట్లు చేయటానికి వీలులేదు. తన ఇష్టంవచ్చినట్లు పాలించాలని ప్రయత్నించిన ఒక రాజు శిరస్సును ఒకసారి మేము గొడ్డలితో నరికివేశాం. ఇంకా ఆ గొడ్డలి మాదగ్గర భద్రంగావుంది. పార్లమెంటు ఒక కౌన్సిల్ - ఒక పంచాయితీ; దేశంలోని భాగ్యవంతులలోనుంచి ఏర్పడిన సంఘమది. కొందరు పెద్దభూస్వాములు దానిలో వంశపారంపర్యా సభ్యత్వం కలిగి వుంటారు.'

'ఈ భూస్వాములు ఎంతకాలంనుంచి దానిలోవున్నారు?'

'భారతదేశంలోని భూస్వామిక విధానం మా దేశమును అనుసరించే ఏర్పరచ బడింది. అదీకాక అవి ఒక శతాబ్దమునుంచి ఇంకా పెరిగిపోతున్నాయి. అక్కడకూడా రైతులనుంచి బలవంతంగా భూమి హక్కు తొలగించబడుతోంది. ఇక్కడ పెద్ద భూస్వాములను ఏర్పరచిన గవర్నరుపేరు నీకు తెలుసునా?'

'తెలుసును – కారన్‌వాలీస్.'

'అతడు ఇంగ్లండులోని ఒక భూస్వామి. మొదటి తరగతి నిరంకుశ ప్రభువు. భూమి రైతాంగంచేతులలో వున్నంతకాలం అతివృష్టి, అనావృష్టులు ఏర్పడినప్పుడు పన్నులు వసూలుచేయుట కష్టమని కారన్‌వాలీస్ గ్రహించాడు. ఇదీకాక, విదేశాన్నుంచి కొత్తగా వచ్చిన ఇంగ్లీషువారు వరాయిదేశంలో స్నేహితులను కలిగి వుండవలెనని కూడా అతడు గ్రహించాడు. అందువల్ల తమవారనే ఇంగ్లీషువారు భూస్వాములను మనదేశంలో సృష్టించారు. ఆ కారణముచే బ్రిటిష్‌వారిపై రైతులు ఎప్పుడైనా తిరుగుబాటుచేస్తే, అవి భూస్వాముల ఆస్తులకూ, భూములకూకూడా చిక్కు కలిగే పరిస్థితి. చిన్నరైతుల హక్కులను గుర్తించకుండా వారు భూస్వాములను ఒక్కొక్కరిని 50 గ్రామాలకు అధిపతులనుచేశారు. అందుకే ఇంగ్లండునుంచి వచ్చిన నిర్దాక్షిణ్యపరుడగు కారన్‌వాలీస్ భారతదేశంలోని రైతులను మట్టిలో తొక్కివేశాడు.'

'అతడు సరియైనపనిచేశాడు. బాగా తొక్కివేశాడు.' అన్నాడు లిన్‌కొడి ఎస్టేటులోని రైతులనుగూర్చి ఆలోచిస్తూ.

'ఈలాంటి 'ఫ్యూడల్' విధానంక్రింద ప్రపంచంలోని ప్రతిదేశంలోని ప్రజలు దోచుకోబడుతున్నారు. కాని ఇప్పుడు వారి రోజులు దగ్గరలోపడ్డాయి.'

'ఎందువల్ల సాహేబ్?'

'ఈ మధ్యకాలంలో ఫ్రాంసు ప్రజలు తమ రాజును, రాణీని కాల్చిచంపేశారు. ఈ విప్లవంలో అనేకమంది జమీందార్లు, జాగీరుదార్లు మరణించారు. జమీందారీ విధానం ఎత్తివేయబడింది. అప్పుడే స్వతంత్రం, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే సిద్ధాంతాలు ప్రజలు ప్రకటించారు. అప్పుడు నేను ఫ్రాన్సులో ఉన్నాను. నేను స్వయంగా ప్రజల త్రివర్ణపతాకం రాజభవనాలమీద ఎగురుతుంటే చూశాను. అప్పుడు ఇంగ్లాండులోకూడా విప్లవం రాగలదేమోయని రాజులు, జాగీరుదార్లు, జమీందార్లు వణికిపోయారు. కాని ఒక విషయమే వారిని రక్షించింది. ఇది నాకు చాలా విచారంగావుంది.'

'ఏవిషయం?'

'విదేశవస్తువులు హిందూదేశంలో ఎన్ని అమ్ముడుపోతున్నాయో నీవు చూడ్డంలేదా? మీదేశంలోని సాలీల, నేతగాండ్ర వృత్తి నాశమైపోయింది. మా దేశంలో ధనవంతులు అనేక ఖార్ఖానాలు స్థాపించి, జమీందారుల అత్యాచారములచే పీడింప బడుతున్న ప్రజలకు వాటిలో పని కల్పించారు. వారు తయారుచేసిన సరుకులే యిక్కడకు వస్తున్నాయి. ఇప్పటివరకూ మా దేశంలో యంత్రాలను మనుష్యులే త్రిప్పేవారు. కాని యిప్పుడు ఆవిరి యంత్రములచే త్రిప్ప బడుచున్నాయి. ఈ ఆవిరి యంత్రంమీద తయారుచేసిన బట్టలు చాలా చౌకగా వుంటాయి. మాదేశంలోని పనివారు నాశనమై పోయారు. కాని వారు యంత్రాగారములలో కూలిపనిచేసి పొట్టపోసు కొంటున్నారు. ఈ యంత్రాగారములే లేకపోతే ఫ్రాంసులోవలె మా దేశంలోకూడా విప్లవం వచ్చివుండేది. మానవుని మానవునిగానే చూడాలి. కాని యితరులనుజంతువుల్లా చూచేవారు తాము తమ కుటుంబం పశువుల్లాగ అయిపోవలసి వుంటుంది.'

'సాహేబ్! అది నిజం. నేను నా దాసులను, సేవకులను ఎన్నడూ మనుష్యులుగా చూడలేదు. నాకంటె గొప్పవారు నన్ను నీచంగాచూస్తే అవమానం ఎంత భరింపరానిదో నాకు తెలుస్తుంది.'

'దానిసత్వనిర్మూలనకు ఇంగ్లాండులో ప్రయత్నాలు జరుగుతున్నాయి.'

'ఇంగ్లాండులోకూడ బానిసత్వం వుందా?'

'ప్రపంచంలో ప్రతిచోట బానిసవ్యాపారం జరుగుతోంది. కాని ఇంగ్లాండులో దానిని ఆపుచేయటానికి త్వరలో చట్టనిర్మాణం జరుగుతుందని ఆశిస్తున్నాను.'

'అప్పుడు ఈ బానిసల యజమానులు ఏమిచేస్తారు?'

'వారు ఇందుకు వ్యతిరేకులు. పార్లమెంటులో వారిదే ప్రభుత్వం. కాని ధనికుల్లోకూడా కొందరు బానిసత్వాన్ని ఎదుర్కొంటున్నారు. నీకే తెల్సు బానిస వ్యాపారం ఎంతచెడ్డదో! బానిసత్వం పోవాలని వారు కోరటానికి అది పాపకారణ మని కాదు. బానిసలు యంత్రాలలో పనిచేయటానికి పనికిరారు. అదీకాక జీవితమంతా కష్టపెట్టబడిన వీరు యంత్రాలకు నష్టము కలగచెయ్యవచ్చు! అందువల్లనే వీరు బానిసత్వ నిరోధశాసనానికి అనుకూలురు.'

'సంతానంనుంచి బానిసస్త్రీని వేరుచేసి అమ్మటం చాలాబాధకరం.'

'బాధఅనేది లేనివాడు మానవుడేకాడు.'

'ఫ్రాన్సులో రాజులేని రాజ్యాన్ని ఏమంటారు?'

'ప్రజాప్రభుత్వం. ఇది నిరంకుశత్వం మొదలైన అన్ని ప్రభుత్వవిధానాలకంటే మంచిది. ప్రజల ధనాన్ని రాజులు అనవసరంగా వెచ్చిస్తారు. పంచాయితీ ప్రభుత్వంలో నియంతృత్వంలోవలెగాక న్యాయం నిష్పక్షపాతం, సానుభూతికి తావుంటుంది.'

'ఔను. మాగ్రామంలో పంచాయితీ ఎలాపనిచేస్తోందో నేను చూశాను. ధనం నాశనంకాకుండా న్యాయందొరికేది. కాని కారన్‌వాలీసుచే నియమింపబడిన జమీందార్లు, పంచాయితీని అణచివేసినప్పటినుంచీ ప్రజలు నాశనమైపోయారు.'

'ఇది నిజం. ఫ్రాంసుప్రజల భావాలు ప్రజాప్రభుత్వంకంటేనూ గొప్పవి. అవే స్వతంత్ర, సమానత్వ, సౌభ్రాతృత్వ సమన్విత రాజ్యనిర్మాణాన్ని కోరుట.'

'గొప్పవారిదృష్టిలో మేము మనుష్యమాత్రులం కాము.'

'స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే భావాలు రంగు భేదాలు లేకుండా ప్రపంచమంతా పాటించబడేవరకూ మనిషి మనిషికాలేడు. దురంతుడగు కారన్‌వాలీస్ తెల్లజాతి రైతులనుకూడా మానవులుగా పాటించేవాడుకాడు. ఫ్రాంసులో రాజులు, జమీందారులు నాశనంచేయబడ్డారు. కాని వారిస్థానాన్ని ఈస్టిండియా కంపెనీ వంటి వర్తకులు, ధనవంతులు ఆక్రమించుకొన్నారు. నిజమైన స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వాలకు తావులేదు.'

'అయితే ఫ్రాంసులో రాజుల, జమీందారుల స్థానాన్ని ధనికులైన వర్తకులు ఆక్రమించుకొన్నారా?'

'ఔను. సప్తసముద్రాలు దాటి భారతదేశంలో రాజరికం చేస్తున్నాము. ఇక్కడ ఇంగ్లాండులో ఎందుకు రాజ్యం చెయ్యలేమని అక్కడి ధనికులైన వర్తకులు గోల చేస్తున్నారు. రాజును నామమాత్రునిగాచేసి రాజ్యాధికారాన్ని వశపరచుకో గోరుతున్నారు.'

'అక్కడ రాజుమాట ఏమీ చెల్లదా?'

'ఔను. ఇక్కడ ఇంగ్లీషువర్తకుల దురన్యాయాలను చూశాను. నాకు దేశాలు చూడాలనే కోరికవుంది. అదనుచూచి నేను కంపెనీలో నౌకరుగా చేరాను. నౌకరీలో చేరకపోతే వర్తకులు నన్ను సందేహిస్తారు. నా కోర్కె నెరవేరుటకూడా కష్టమౌతుంది. అందుచేతనే నరకతుల్యమగు ఈ కంపెనీనౌకరీలో రెండు సంవత్సరాలున్నాను.'

'సాహెబ్! మంచివారికిది నరకం. ధనంకోసం అవమానాన్ని సహించేవారు మాత్రమే ఈ పనిలో ఉండగలరు. నాకు ఈ సంపాదనలో నాలుగు గ్రామాలుకలిగిన ఒక జమీందారిని కారన్ కాలీస్ అనుచరుడు ఒక పాపకార్యం చేసినందుకు బహుమతి చేశారు. ఆ పాప ఫలితం అనుభవించా- కలరావల్ల నా భార్యాబిడ్డలు మరణించారు. ఆ జాగీరు పేరు తలుచుకుంటే శరీరం కంపిస్తుంది. ప్రపంచంలో స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం ఏర్పడినప్పుడే భూమి స్వర్గతుల్యంకాగలదు. మానవుడు అవమానములనుంచి రక్షింపబడతాడు. ఈ విషయంలో మీతో ఏకీభవిస్తాను.'

'ఏకీభావమువల్లగాని, కోరుటవల్లగాని సఫలులం కాలేం. కాని ఫ్రాంసువలె వేలకొలది ప్రజ ఆత్మబలిదానం చెయ్యాలి. ఊరికే ప్రాణాలు కోల్పోవడం

నిరుపయోగం. ఇంగ్లీషువారికోసం భారత సిపాయిలు అనేకమంది మరణిస్తున్నారు. తమకై తెలుసుకొని ఈ బలిదానం చెయ్యాలి!'

'తెలుసుకొని - అంటే!'

'నా ఉద్దేశం- భారతీయులకు ప్రపంచజ్ఞానం కలగాలి. సైన్సు మనుష్యునికి గొప్ప శక్తినిస్తోంది. ఇందువల్లనే తుపాకులు మందుగుండు తయారుచేసి మనుష్యుడు బలవంతుడయ్యాడు. ఈ విజ్ఞానమే మీ దేశాల్లోని పెద్దపట్టణాల నాశనానికి ఇంగ్లాండు లోని నగరాల యంత్రాగారాల అభివృద్ధికి కారణం. మీరుకూడా దాని ఉపయోగాన్ని పొందాలి. యింకా మీదేశంలోని అంటరానితనం, కులతత్వమూ, హిందూముస్లిం విభేదాలు నశించాలి. మాలో అంటరానితనం లేదు.'

'లేదు.'

'మాలో ధనిక, పేద అనే తేడాలుతప్ప కులతత్వం లేదు.'

'లేదు - ఇంకా - '

'సహగమనం నిషేధించాలి! లక్షలకొలది స్త్రీలను ప్రతిసంవత్సరం నిలువునా తగులబెట్టటం భగవంతుడు క్షమిస్తాడా?'

కలకత్తా చేరుకున్నాక తిన్‌కౌడి, కోల్‌మన్‌లు విడిపోవలసివచ్చినందుకు చాలా విచారించారు. 'మనం 19వ శతాబ్దంలో ప్రవేశించాం. ప్రపంచంలో చాలా మార్పులు కలుగుతున్నాయి. ఇందులో మనంకూడా పాల్గొనాలి. ముఖ్యంగా మనం చేయవలసిన పని ముద్రణాలయం, సమాచారపత్రిక స్థాపించి ప్రపంచంలోజరిగే గొప్పమార్పులను ప్రజలకు తెలియజెయ్యాలి' అని అనుకొన్నారు.

---

## 3

ఆ సంవత్సరం వానలులేవు. క్రిందటి యేడాది ఎండిన చెరువులు అల్లాగే ఎండి పోయి వున్నాయి. ఆ సంవత్సరం పంటలు గుప్పెడైనా లేవు. చచ్చిపోవటంగాని, ఇళ్ళు పాడుపెట్టి వెళ్ళిపోవటంగాని జరిగింది. ధుర్‌దేహలోని పెద్ద చెరువు ఎండి

పోయినప్పుడు చుట్టుప్రక్కల 50 మై॥ దూరమునుంచి జనం ఆకలికడుపులతో ఆ చెరువుకు చేరారు. వారు తామరదుంపలను త్రవ్వుకోడానికి వచ్చారు. వాటికోసం వారు అనేకసార్లు తగాదా పడ్డారు.

తరువాతసంవత్సరం వానలుకురిసాయి. రాగులు బాగా పండాయి. రేఖా పొలంలో రాగులు కోడుతున్నాడు. అప్పుడే అక్కడకు వచ్చిన మంగరిని అతడు ఆశ్చర్యంతో చూచాడు. ఆసంవత్సరంలో భూమి ఎంతో మారిపోయింది. ప్రతి యింట్లోను ఎక్కువమంది మరణించారు. ఎంతోమంది చెల్లాచెదరై పోయారు. తనూ తన భార్యా ఎల్లా బ్రతుకగలిగామా అని రేఖాకు ఆశ్చర్యంగా వుంది. అతడు ధుర్ దేహకు కృతజ్ఞుడు.

ఇంతకుపూర్వకూడా వానలులేక క్షామం వచ్చి వుండవచ్చు; కాని రేఖావరె రైతులు ఇంతగా కష్టపడివుండరు. అప్పుడుకూడా రాజుకు పన్నులు చెల్లించవలసి వుండేది; కరువువస్తే వారు పన్నులు తగ్గించవలసివచ్చేది. కాని యిప్పుడు కంపెనీ పరిపాలనలో జమీందారుల నిరంకుశపాలన వుంది. వారి తాజేదారులు ప్రజల గుడిసెలపై కాసిన గుమ్మడికాయలను సహితం దోచుకొనేవారు. పంటధాన్యం 1 1/2 మాసంకూడా సరిపోనప్పుడు, కరువురోజులకని ఏమి నిలవచేయగలరు?

మార్గశిరమాసంలో మంగరీకి ఒక మగపిల్లవాడు జన్మించాడు. ఇంతటి కాటకంలో మంగరీ తననేకాకుండా గర్భంలోని శిశువునుకూడా ఎల్లాబ్రతికించ గలిగిందా అని రేఖా ఆశ్చర్యపడ్డాడు; కాని తన ఏభైయ్యో వడిలో పిల్లవాడు కలిగాడనికాదు. 30 సంవత్సరముల మంగరీకి ఇదివరలో పిల్లలుపుట్టి మరణించారు. కరువుకాలంలో పుట్టినందున ఆ బిడ్డకు 'సుఖాకీ' అని పేరుపెట్టాడు.

మాఘమాసంలో రామపురపు యజమాని తన గుర్రాలతోను, ఏనుగులతోను, సిపాయిలతోను దయాల్‌పురం వచ్చాడు. ఈతని కుటుంబంలోని ఒక్కపిల్లకూడా కరువురోజులలోకూడా చిక్కిపోలేదనీ, వారు 7 సం॥రాలక్రితం పాతధాన్యమే తింటున్నారని రేఖా విన్నాడు. దయాల్‌పూర్‌లో గ్రామచావడి చివరగావుంది. దాని యెదురుగా 25 ఎకరముల మామిడితోట వుంది. దానికి నీరుపెట్టటం, త్రవ్వటం మొదలైన వెట్టిచాకిరీపనులు ఆ గ్రామస్తులు చెయ్యాలి. ఆ భూస్వామి ప్రతిఇంటా 50 మొక్కలు పెంచమని ఆజ్ఞాపించాడు. ఎండిపోయిన మొక్కకు రూపాయపావలా జరిమానా చెల్లించాలి.

రేఖాకంటె చిన్నవాళ్ళు జమీందారునుగురించీ, అతని డాబు దర్పాలనుగురించీ ఆలోచింపసాగారు. భూస్వామిక విధానానికి ముందునాటి పంచాయితీరాజ్యాన్ని గురించి రేఖా, సోబరన్‌లు చెప్పిన విషయాలు యిప్పుడు కథలుగా తోస్తున్నాయి. కాటకంవచ్చినప్పటినుంచీ జమీందారీనౌకర్లు మరింత క్రూరులై పోయారు. ఈకాటకం తమ యజమాని గౌరవాన్ని పెంపుచెయ్యటానికీ, రైతుల మనోబలాన్ని ధ్వంసం చేయటానికీ వచ్చిందని వారు భావించసాగారు. రేఖా ఇంటిపై వున్న గుమ్మడిపిందెలు జమీందారు నౌకర్లను ఆకర్షించాయి. 'ఇప్పుడు రేఖా చాలా కోపధారయ్యాడు' అని అంటారు. కరువు తరువాత ప్రజల్లో వివేచనాశక్తి తగ్గిపోయింది. కాని రేఖా వీరితో పోలిస్తే మెరుగే. అందువల్లనే అతడు కోపిష్టివాడని ప్రజలంటారు. జమీందారు సేవకులు తన గుమ్మడిపాదుపై కన్నువేయటం చూచి, అతనికి చాలా కోపంవచ్చింది; కాని దాన్ని ప్రకటించలేదు.

ఒకరోజున గ్రామాధికారికొరకు ఒక కావలివాడు గుమ్మడికాయను కోయటానికి గుడిసెపైకి ఎక్కాడు. అదేసమయంలో తన బిడ్డ సుఖాకీని తొడపై పడుకోబెట్టుకొని రేఖా ఇంట్లోనే వుండి ఆడిస్తున్నాడు. ఇప్పటికే మూడు గుమ్మడికాయలు కోసుకుపోయారు. నాలుగోది అతడు కోయబోతున్నాడు. రేఖా క్రోధోద్దీపితుడయ్యాడు. గ్రామంలో చాలాదూరం వినబడే పెద్దగొంతుకతో అతడిలా అరచాడు.

'ఎవరది ?'

'కనపట్టంలేదా? గ్రామాధికారికోసం గుమ్మడికాయలు కోస్తున్నా.'

'నీ తోలు ఊడిపోతుంది. దిగిరా!' అని రేఖా అరిచాడు.

'గ్రామాధికారి నౌకరుతో మాట్లాడుతున్నావు?'

'అదంతా నాకు తెలుసు. వాటిని అక్కడ వదలివేసి దిగిరా.'

చడీచప్పుడు లేకుండా నౌకరు దిగి జారిపోయాడు. ఈ సంగతి గ్రామాధికారికి తెలియగానే, అతడు కోపాన్ని అదనుకోసం అరికట్టుకున్నాడు, జనవరిలో భూస్వామి వచ్చేవరకూ.

కొంతకాలం తరువాత భూస్వామి వచ్చాడు. ఇప్పుడు ఆ నౌకరే రేఖాభగత్ ఇంటివద్దకు వచ్చి 'రేపు ఉదయాన్నించి నీవు ప్రతిరోజు రెండుశేర్లపాలు గ్రామాధికారికి యివ్వాలి' అని ఆజ్ఞాపించాడు.

'నాకు ఆవు, గేదె ఏవీ లేవు. పాలు ఎక్కడనుంచి తేను ?'

'అది నీ యిష్టం. ఇది ఘాస్వామి ఆజ్ఞ.'

రేఖాకు ఆవులేదని గ్రామాధికారికి తెలియకపోలేదు. కాని రేఖాను అవమాన పరచుటకు అదే అదను. ఆనాటి సాయంత్రమే అతడు ఘాస్వామికి రేఖా కోపిష్టి తనాన్ని గురించి, అందువల్ల గ్రామస్థులు పడుతున్న బాధలను గురించీ వివరించాడు. అప్పుడే ఘాస్వామి శిక్షను నిర్ణయించుకున్నాడు.

ఉదయాన రేఖా పాలు పంపలేదు. గ్రామనౌకరు వస్తే తనకు పాడిలేదని అతడు వెనుకటివలెనే చెప్పాడు. అప్పుడు ఘాస్వామి ఐదుగురు బంటులను నియమించాడు వారికి 'పాడిపశువులు లేకపోతే వాడి భార్యనుంచే తియ్యండి పాలు' అని ఆజ్ఞాపించాడు.

గ్రామస్థులు అనేకమంది ఉన్నారు. కాని వారంతా రేఖాను ఎరస్టు చేశారని భావించారు. ఆ బంటులు రేఖాను నోరెత్తకుండా బంధించివేశారు. తరువాత వారిలో ఇద్దరు ఇంట్లో చొరబడి మంగరీని పట్టుకున్నారు. గోల పెడుతున్న ఆమె రొమ్ములనుంచి వాస్తవంగా ఒక కప్పులోనికి వారు పాలు లాగుతుంటే నిస్సహాయుడగు రేఖా నెత్తురుకళ్ళతో చూచాడు. తరువాత అతన్ని అదేవిధంగా వదిలివేసి వారు వెళ్ళిపోయారు.

సిగ్గుతో మంగరీ ముఖం కప్పుకొని ఏడుస్తూ కూర్చుంది. చివరకు రేఖానోరు తెరచి 'మంగరీ! సిగ్గు పడకు. మన గ్రామంలో పంచాయితీ ఉన్నట్లయితే, చక్రవర్తి కూడా ఈ పని చేయటానికి సాహసించేవాడు కాదు. అహీరుల నిజమైన రక్తం నా శరీరంలో ప్రవహిస్తుంటే, గ్రామాధికారి కుటుంబాల్లో ఒక్కరు కూడా బ్రతికి ఉండ లేరు. రాంపూర్‌లో వీరి కోసం యేడవటానికి కూడా ఎవరూ ఉండరు. మంగరీ! మనకు జరిగిన ఈ దారుణ అవమానానికి ప్రతీకారాన్ని నా స్వహస్తాలలో తీర్చు కొంటాను. రా. నా చేతికట్లు విప్పు' అన్నాడు.

ఆమె కళ్ళల్లో నీరు గ్రుక్కుకుంటూ అతనిని బంధవిముక్తుని చేసింది. అతడు లోపలికి వెళ్ళి బిడ్డ సుఖారీని ముద్దుపెట్టుకొని, భార్యతో 'ఇక్కడనుంచి అవసరమైన వస్తే తీసుకొని సరాసరి నీ పుట్టింటికి వెళ్ళిపో నేను ఈ ఇల్లు తగులబెట్టివేయాలి'.

మాటలనుబట్టి భర్త ఉద్దేశ్యం ఆమె తెలుసుకుంది. బిడ్డను ఎత్తుకొని కొన్ని బట్టలు తీసుకొని, అతని పాదములపై బడింది.

'ప్రతీకారం చేసితీరాలి' అన్నాడు రేఖా. ఎన్నడూ మాట్లాడనంత నెమ్మదిగా. 'నా గౌరవం కోసమే కాదు; యావత్తు గ్రామగౌరవం కోసం — సుఖారీకి వాని తండ్రి ఎటువంటివాడో తరువాత నీవు చెప్పవచ్చు ; ఇప్పుడు నీవు వెళ్ళిపో. ఆలస్యం చెయ్యవద్దు. నేను నా పనిని పూర్తి చెయ్యాలి'.

కొంతదూరంనుంచి అగ్నిజ్వాలలు ఇంటికప్పు పైకి ఎగబ్రాకేదాకా మంగరీ చూచింది. ఊరుచివర గుడిసెలలో నివసిస్తున్న వారందరూ రేఖా యింటివైపు పరుగెత్తుకొని రాసాగారు. రేఖా మాత్రం భూస్వామికోసం సిద్ధపరచిన కత్తిని త్రిప్పుతున్నాడు. ప్రాణభయంతో నౌకర్లు పలాయనమంత్రం పఠించారు; రేఖా భూస్వామిని గ్రామాధికారిని 'దురంతకులారా! మీరు చస్తే ఏడ్చేవాడు కూడా మిగలరు' అంటూ వారిని తెగనరికాడు.

అతడు తన ప్రతిజ్ఞ నెరవేర్చాడు.

దురంతకుడగు కారన్‌వాలీస్ వల్ల రేఖావంటి వారలెందరు తయారుకాలేదు.

---

# "మంగళసింహుడు"

## (పదునెనిమిదవ కథ)

[కాలం :- క్రీస్తుశ 1850 సం॥ల తరువాత.]

నేడే వీరిరువురూ గోపురం చూడ్డానికి వెళ్ళారు. అందులో ఉండే గదులను కూడా చూశారు. ఆ గదుల్లో రాజుయొక్క శత్రువులు ఆజన్మాంతం బంధింపబడేవారు. ఆ ఖైదీలు ఎప్పుడూ నిల్చునే ఉండాలి. ఆరాజులు అస్త్రాలు, శస్త్రాలు మొదలైనవి చూచారు. వారిని ఒక ప్రదేశం ఎక్కువగా ఆకర్షించింది. ఆ ప్రదేశంలోనే ఇంగ్లండు రాజుయొక్క రాణియొక్క తలలు నరుకబడి భూమిపై దొర్లాయి.

యానీరసల్ తన కోమలమైన చేతుల్ని ఆతనిచేతుల్లో ఉంచింది. కాని కోమలత్వం యొక్క ప్రభావం వేరుగా ఉంది. 11 సం॥ల క్రితం పాడరాడె కనిపెట్టిన

విద్యుత్ శక్తిలాంటిది అతని శరీరంలోకి ప్రవహిస్తోంది. మంగళసింహుడు 'యానీ! నీలో విద్యుత్ శక్తి పుడుతోందా ఏమి ?'

'మంగళ్ అల్లా అంటున్నావేం ?'

'నాకు అవిధంగానే ఉంది. 16 సం॥ల క్రితం నేను ఇంగ్లండు వచ్చినప్పుడు నాకు అంధకారంలోంచి వెలుతురులోకి వచ్చినట్లుంది. ఎంతో ముందుకు పురోగమించిన ప్రపంచాన్ని చూశాను. ఒక పెద్ద – కాదు, అద్భుతమైనదాన్ని – చూశాను. అనేక విచిత్రాలను చూశాను. రైళ్ళు, ఓడలు, అగ్గిపెట్టెలు, విద్యుత్కాంతి, దుంప పంచదార ఇవి అన్నీ ఆశ్చర్యమైన వస్తువులే. కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో నేను ఇవన్నీ రసాయనశాలలో పరిశోధించినప్పుడు ప్రపంచం ఎంతటి ఉజ్వల భవిష్యత్తును పొందగలదో నేను గుర్తించగలిగాను.'

'నిజంగా ! నీకు ఇంగ్లండు రావటం ఆనందంగా ఉందా ? - చీకటిలోంచి వెలుగులోకి వచ్చినట్లు భావించావా?'

'నేను నా మాతృదేశంనుంచి బయలుదేరేటప్పుడు నా ప్రభువగు క్రీస్తుయొక్క భక్తులు నివసించే దేశాన్ని చూస్తామని, రాజ్యలక్ష్మిని తిరిగి పొందటానికి ప్రయత్నించాలి అని అనుకొన్నాను.'

'నేను నిన్ను గురించి చాలాసార్లు తెలుసుకోగోరాను. కాని మాటల్లో మరచాను. ఈవాళ నీ సంగతి చెప్పు, మంగళ్.'

'నా జీవితాన్నే మార్చిన నీకు నా సంగతి చెప్పడానికేమీ అభ్యంతరం లేదు. ప్రేయసీ ! ప్రశాంతమైన థేమ్సునదీ తీరానికి వెడదాం నడు. థేమ్సునది మా గంగానదివలె పెద్దదీకాదు, సుందరమైనదీ కాదు. నాకు థేమ్సునది చూచినప్పుడు గంగానది జ్ఞాపకంవస్తుంది. అప్పుడు నాకు గంగానదియొక్క మధురమైన స్మృతులు తరుచు జ్ఞాపకంవస్తాయి. క్రైస్తవులు 'క్రీస్తుని' తప్ప యితర దేవతలను పూజించటం మతవిరుద్ధంగా తలుస్తారు. వారిని అసహ్యంగా చూస్తారు. అవునా, యానీ ! థేమ్సునది నన్ను మతద్రోహిగా చేస్తోంది. నా తల్లి తన ధర్మప్రకారం గంగానదిని పూలతో పూజిస్తోంది.'

వారిరువురూ థేమ్సునదీ తీరాన్ని చేరారు. ఒక రాతిబండపై కూర్చుని థేమ్సునదిని చూస్తున్నారు. కనుగుడ్డువలె తెల్లగావున్న ఆమె టోపీ క్రింద నుంచి ఆమె

కురులు చెక్కిళ్ళపై వ్రేలాడుతున్నాయి. గాలికి అవి చెదురుతున్నాయి. మంగళ సింహుడు ఆమె చెక్కిళ్ళను ముద్దాడి 'ఈ నదిని చూచి నేను చాలాసార్లు నా శ్రద్ధా పుష్పాల్ని గంగానదికి సమర్పించాను'.

'గంగానదిని నీ తల్లి పూలతో పూజిస్తోంది'.

'క్రైస్తవులు క్రీస్తుని పూజించినట్లే. ఎక్కువశ్రద్ధతో నేను క్రైస్తవమతాన్ని పుచ్చుకున్నరోజుల్లో ఆ పూజలూ అవీ నాకు అసహ్యంగా వుండేవి. గంగానదికి చేసిన అపచారానికి నేను ఇప్పుడెంతో పశ్చాత్తాపపడుతున్నాను.'

'మేము గంగానదిని తల్లిగా భావిస్తున్నాము'.

'మంగళ్ నీది మధురమైన స్మృతి-మరి నీ సంగతి చెప్పు'.

'రామనగరం, కాశీ గంగానదికి చెరొకవైపునా కొద్దిదూరంలో ఉన్నాయి. నేను 16 సం॥ల వరకు గంగానదిని చూచాను. మాయిల్లు గంగానది ఒడ్డునే వుంది. అక్కడే 60 చీడీలు గల రేవు వుంది. మా అమ్మ తరచు నాకు గంగానదిని చూపెట్టేది. రామనగరంలో మా తాతగారి కోటవుంది. దానిని నేను గంగానదిలో నావపైవెళుతూ రెండు మూడుసార్లు మాత్రమే చూశాను. తరచు దానిలోపలికివెళ్ళి చూడాలని నాకు కోరికలేదు. ఎవరు ఆకోటకు యువరాణి కావలసినదో ఆమె ఇంగ్లీషు వారి భయంతో మారుపేరుతో కాశీలో జీవితంగడుపుతోంది. ఆమె ఆకోటవైపు కన్నెత్తి ఎల్లాచూస్తుంది! యానీ! నీవే ఆలోచించు. క్రూరుడైన వారన్‌హేష్టింగ్సు మా తాత చేత్‌సింగును భ్రష్టుణ్ని చేసాడు. ఇంగ్లాండులో హేస్టింగ్సు తన దుశ్చర్యలకు కొంత ఫలితాన్ని పొందాడు. కాని మా తాతకు మాత్రం ఏమాత్రం న్యాయం జరగలేదు. లాక్కున్న రాజ్యాన్ని తిరిగి ఇవ్వటం నిజమైన న్యాయంకాదా! యానీ!'

'నీ తల్లి బ్రతికి ఉందా ?'

'ఐదుమాసాల క్రితంవరకూ బ్రతికిఉందని మాఫాదరీనుంచి వచ్చిన ఉత్తరాల వల్ల తెలిసింది. ఆయనద్వారానే మా అమ్మకు ఉత్తరం వ్రాసాను.'

'నీవు పుట్టుకతోనే క్రైస్తవుడవు కావా ?'

'కాదు. మా అమ్మ ఇప్పటివరకూ హిందువే. నేను ఆమెనుకూడా మతంలోకి మారుద్దామని అనుకొన్నా - కాని ఇప్పుడు——'

'ఇప్పుడు నీకు మీ అమ్మతో కలసి గంగానదిని పూజించాలని ఉందా?'

'ఆ పనిచేస్తే - మిషనరీలు నన్ను మతద్రోహినంటారు.'

'నీవు క్రైస్తవుడవు ఎట్లా అయ్యావు?'

'రోమ్ క్రైస్తవులకు ఎటువంటి పవిత్ర ధర్మక్షేత్రమో - హిందువులకు కాశీ అలాంటిది. అక్కడకూడా పాదరీలు వున్నారు. హిందూ పుణ్యక్షేత్రం కావటంచేత వారి మతబోధలు అక్కడ ఫలించలేదు. మా అమ్మకు జబ్బుచేసింది. ఒక పాదరీ డాక్టరు చికిత్సచేశాడు-అప్పటి నుంచీ ఆయనభార్య మా యింటికి వస్తూపోతూవుండేది. మాఅమ్మకీ ఆమెకూ స్నేహం ఏర్పడింది. నేను చిన్నవాణ్ని కాబట్టి ఆమె తరుచు నన్ను ఎత్తుకొనేది.'

'మంగళ్ నీవు చిన్నప్పుడు చాలా అందంగా ఉండి ఉంటావు. అట్లాంటప్పుడు ఎవరు ఎత్తుకోరు!'

'అప్పుడు ఆమె నాకు ఇంగ్లీషు చెప్పించవలసినదిగా నాతల్లికి సలహాఇచ్చింది. నాకు 6వ యేట ఆమెభర్త ఇంగ్లీషు నేర్పనారంభించాడు. నాతల్లి కోల్పోయిన మా కుటుంబ గౌరవాన్ని గురించి ఎల్లప్పుడూ ఆలోచించేది. తన కుమారుడు ఇంగ్లీషు నేర్చుకొంటే, ఏనాటికైనా పోయిన కుటుంబ గౌరవాన్ని తిరిగి నిలబెట్టకపోడని ఆమె ఆశ. నా మూడవయేటనే నా తండ్రి గతించాడు. అందువల్ల ఆమెయే ఇంటికి సర్వమూను. మా రాజ్యం పోవటంతో మా ఐశ్వర్యం మాయమైంది. కాని ఆమెకు అత్తవారిచ్చిన వస్తువులు ఎన్నో వున్నాయి. ఆమె సోదరుడు మమ్మల్ని సర్వవిధాలా కనిపెట్టసాగాడు.'

'నాకు ఎనిమిది ఏళ్ళు వచ్చాయి. నేను చాలాభాగం ప్రతిరోజు మిషనరీ ఇంట్లోనే గడిపేవాడిని. అందుచేత నాకు హిందూమతాన్ని గురించి తెలుసుకునే అవకాశంలేదు. ఏ కొద్ది అయినా తెలుసుకుంటే ఆమెవద్దనుంచియే - నా తండ్రి చనిపోయినప్పుడు మా అమ్మని సహగమనం చేయమని అనేకులు బలవంతపరచారు. కాని ఆమె చేయకపోవటంచేత నేను అదృష్టవంతుడనని అనేది. హిందూమతమంటే సహగమనం చేయటమే అని భావించాను. ఆకారణంచేత నాకు హిందూమతమంటే ఏహ్యం కలిగింది. రెండుసంవత్సరాల తరువాత సహగమనము నిషేధించ బడింది.

ఆమె సలహాతీసికొని నా తల్లి నన్ను కలకత్తాలోని బడికిపంపింది. నేను అక్కడ చదువుకొనేటప్పుడు వారి సహాయ సహానుభూతులు నన్ను క్రైస్తవునిగా చేయటానికేనని మా అమ్మ సంశయింప సాగింది. ఆమెకు అటువంటి అనుమానం త్వరలో కలగకపోవటం కూడా మంచిదైంది. ఎంచేతంటే మొదట్లోనే ఆమె అనుమానిస్తే నాకు పాదిరీల స్నేహం కలగదు. ప్రపంచాన్ని తెలుసుకోడానికి వీలు కలిగేదికాదు.'

'భారతదేశంలో పిల్లలకు చదువు చెప్పించాలనే ఆలోచనలేదా?'

'1300 సం॥ల క్రితం వుండే విద్యలాంటిది.'

'నీవు ఇంగ్లండు వచ్చుటకు నీ తల్లి అనుమతించిందా?'

'ఆమె అనుమతి? ఆమెతో సంప్రదించలేదు. కేంబ్రిడ్జిలో చదువుకోవటానికి మిషనరీయే అన్ని ఏర్పాట్లూ చేశాడు. ఇక్కడనుంచే ఆమెకు నేను కులాసాగా ఉన్నానని కబురుపంపాను. ఆమె నన్ను దీవించింది. ఆమెకు యిప్పుడు ఏభయేండ్లకు పైగా ఉంటాయి. ఆమెనన్ను ఇంటికివచ్చేయమని ఇప్పటికీ ఉత్తరాల్లో వ్రాస్తుంది.'

'నీవు సమాధానం ఏమి వ్రాస్తున్నావు?'

'జవాబులేదు-వంక. ఆమె నేను రాజధానిలో ఉన్నానని, మహారాణిని కలుసుకొన్నానని చేతసింహుని రాజ్యాన్ని తిరిగి పొందివస్తానని ఆమె తలుస్తోంది. పాపం ఆ భర్తరాలికి ఏం తెలుసు నేనిక్కడ నీచాహువల్లరిలో చిక్కానని.'

'ఆమెకు ఏమీ తెలియదు. కాని నీవు భారతదేశాన్ని గురించి మార్క్సుతో ఎన్నడైనా సంభాషించావా?'

'అతనికి భారతదేశాన్ని గురించి ఇంత విపులంగా ఎల్లాతెలిసిందా అని నేను ఆశ్చర్యపడ్డాను. ఇదేమీ మంత్రబలం కాదు. భారతదేశాన్ని గురించి క్షుణ్ణంగా తెలిసిన ఆంగ్లేయులు యిక్కడ చాలామంది వున్నారు. వారు అనేక గ్రంథాల్ని వ్రాశారు. మార్క్సు అవి చదివి ఇక్కడ ఉన్న భారతీయులతో వాటిలోని విషయాల్ని చర్చించి తానొక నిర్ణయం చేసుకొనేవాడు.'

'భారత దేశపు భవిష్యత్తునిగురించి ఆయన ఉద్దేశం?'

'అతడు భారతవీరుల పౌరుషాన్ని ప్రశంసిస్తున్నాడు. మా పూర్వాచారాలే భారత భూమికి గర్వశత్రువులని తలుస్తాము. మా గ్రామాలన్నీ స్వయంపోషకము లైన ప్రజాప్రభుత్వాలు.'

'ప్రజాప్రభుత్వాలా?'

'దేశం అంతాకాదు. కొన్ని గ్రామాలు ఏకమైకాదు – ఏ గ్రామమునకు ఆ గ్రామమే. కారన్‌వాలీసు ప్రవేశపెట్టిన జమీందార్లు వచ్చాక ప్రజాతంత్రాలు పోయాయి. పూర్వి 5 గురు సభ్యులుకల సభలుకాని అంతకు ఎక్కువమందిగల సభలు గాని పాలించేవి. అందులో పోలీసు, గ్రామరక్షణ, న్యాయం, విద్య, ధర్మం, అన్ని శాఖలూ ఉండేవి. వీటి పరిపాలన న్యాయంగాను, ప్రశంసింపదగినదిగాను జరిగేది. గ్రామంలోని ప్రతి వ్యక్తియొక్క గౌరవం కాపాడబడేది. అక్కడి ప్రజలు తమ పంచాయితీకోసం తమప్రాణాల్ని ధారపోయటానికూడా వెనుతీయరు. ముసల్మానులు ఢిల్లీలో రాజ్యం స్థాపించినప్పుడు తమ్ము వాటసాటులుగా భావించేవారు. పంచాయితీలను నాశనం చేద్దాం అనుకొన్నారు. ఎవరకు వాటిని అంగీకరించారు. కాని కారన్‌వాలీసు పంచాయితీని నాశనం చేద్దామని కంకణం కట్టుకున్నాడు. పూర్తి ప్రయత్నం చేశాడు. కాని అవి అంతత్వరగా నాశనమయ్యేవి కావు. ఇక్కడ గ్రామ సౌభాగ్యాన్ని లాంక్‌షైరు మిల్లులు ఎంతగా నాశనంచేశాయో ఇక్కడ నుంచి ఎగుమతిఅయ్యే ముడి పదార్థాలుకూడా అంతే. కలకత్తాలో 1822లో మొట్టమొదటి ఓడ నీటిలోకి వదలబడింది. ఆ ఓడ తనతోపాటు గ్రామసీమల ఆర్థిక ప్రజాతంత్ర పునాదుల్ని పెకలించివేసింది. హిందూదేశంలో సన్నబట్టల నేత మూడువంతులు మాయమై పోయింది. సాలీల సంగతి చెప్పనక్కరలేదు; ఏగ్రామములు సాలీలతోను, కుమ్మరివారితోను, స్వతంత్రంగా ఉండేవో వాటికి నేడు కావలసిన సరుకులు లాంక్‌షైరునుంచి, షెఫీల్డునుంచీ వస్తున్నాయి. చేతిపనులు మూలపడ్డాయి. కులవృత్తులు చేసుకొనేవాళ్ళు పనిలేక పస్తులుంటున్నారు. 1814లో 18,66,608 తానులబట్ట దిగుమతి అయింది. ఆ సంఖ్య నేటికి ఎన్నో ఎక్కువరెట్లు పెరిగింది ఢాకాలో మస్లినులు తయారుచేసేవారు తమ ముడి ప్రత్తిని విదేశాలకంపి బట్ట నేయిస్తున్నారు.

'ఎంత క్రూరత్వం! ఎంత అత్యాచారం!!'

'మాగురువుగారు ఈ అత్యాచారాలకు చాలా విచారిస్తారు. మాబోంట్లు పూర్వ విధానాలు పోయాయని సంతోషిస్తాం.'

'అప్పుడు మీ త్రోవలు తూర్పుపడమరలన్నమాట.'

'ఇరువురి దారులు వేరు. యానీ! తల్లి ప్రసవసమయంలో ఎంతగా బాధ పడుతుందో బిడ్డను అంతకు రెట్టింపు ప్రేమిస్తుంది. ఉన్నది పాడై పోతేనేకాని క్రొత్తది నిర్మించడానికి వీలుకాదు. చిన్న చిన్న ప్రజాస్వామ్యములు నశిస్తేనే కొత్తది, పెద్దది, బలవత్తరమైనది ఏర్పడటానికి వీలుంటుంది. భారతీయులు విడివిడిగా ప్రజాస్వామ్యాల్లో ఉన్నంతకాలం దేశభక్తి అలవడదు. దేశభక్తి ఉద్భవించాలంటే అంతా ఏకంకావాలి. ప్రజాస్వామ్యాలన్నీ పోయి దేశానికంతటికి ఐక్యప్రజాప్రభుత్వం ఏర్పడాలి. ఇందుకొరకై భారతీయులు ఆత్మబలిదానాన్ని చేయాలి. ఆంగ్లేయులు వర్తకాభివృద్ధికొరకే రైలు, తంతి, ఓడ మొదలైనవి భారతదేశంలో ప్రవేశ పెడుతున్నారు. వాటి మరమ్మతులకొరకు మనదేశంలోని బొగ్గు, ఖనిజాలు ఉపయోగిస్తున్నారు. వారికి అందుబాటులో ఉన్న వీటిద్వారా వారు చౌకవస్తువుల్ని తయారు చేయటం ఎట్లా మానగలరు? విజ్ఞానచిత్రములైన వీటిని చూస్తూ భారతీయులు ఎంత కాలం ఊరుకుంటారు?'

'అంటే భారతదేశంలోకూడా పెట్టుబడి విధానమూ, నౌకరీలు ఏర్పడక తప్పదా?'

'అవును.'

'1832 సంవత్సరములో ఇంగ్లండులో జరిగిన చట్టసంస్కరణ ఫలితంగా పరిపాలన ధనికులచేతుల్లోకి వచ్చింది.'

'లేక, ధనికుల ప్రాబల్యాన్ని సూచిస్తూ ఆ శాసనం చేయబడింది.'

'చార్టిస్టులసభలూ, ఉపన్యాసాలూ నీమీద తమతమ ప్రభావాన్ని ప్రసరించాయి. యానీ! నీవు సరిగా చెప్పావు.'

'సభలసంగతి నాకు జ్ఞాపకంలేదు. నాపినతండ్రి రసెల్ మంత్రి మండలిలో చార్టిస్టుల బలీయమైన ప్రత్యర్థి. ఆయనే చెప్పాడు 'ఇది చాలా భయంకరమైన పోరాటం' అని.'

'యానీ! లక్షలాది కార్మికులచేత సంతకంచేయబడిన వినతిపత్రం పార్లమెంటులో తృణీకరింపబడినప్పుడు ఎంత ఉద్రేకంగా మాట్లాడాడో అల్లాగేచెప్పాడా?'

'లేదు. ప్రియుడా!'

'ప్రభువులను తొలగించి ధనికులు ప్రభువులయ్యారు. ఆవిధంగా చేసి ప్రజలే తమ్ము పాలించుకోవచ్చు. అప్పుడు ధనికులూ పేదలూ, తెల్లవారూ నల్లవారూ అనే భేదాలు నశిస్తాయి.'

'మంగళ్! స్త్రీ పురుషులూ అనేది?'

'అవును. పురుషులతో స్త్రీలు చాలా బాధలు పడుతున్నారు. మాదేశంలో సహగమనంపేరుతో అనేకమంది స్త్రీలను నిలువునా కాల్చేస్తున్నారు. పరదాలోపెట్టి స్త్రీలకు పిత్రార్జితంలో న్యాయమైన హక్కును యివ్వటంలేదు. ఇవన్నీ మానవ జాతికి కళంకం.'

'మాదేశంలో ఘోషాపద్ధతి లేదని మేము స్వతంత్రులం అనుకుంటున్నావా? మంగళ్!'

'యానీ! స్వతంత్రులు అనుకోవటంలేదు. కాని మీస్థితి భారతీయ సోదరీ మణుల స్థితికంటె బాగుంది.'

'మంగళ్! దాస్యంలో మంచిచెడ్డలేమిటి? మాకు ఓటువేసే అధికారం లేదు. పెద్దపెద్ద శిక్షణాలయాల్లో మాకు స్థానం లేదు. మేము పురుషుల ఆనందంకొరకే పుట్టాం. పంపేది. మాప్కా ప్రపంచమంతటా ప్రజాప్రభుత్వాలు ఏర్పడతాయనీ రంగుభేదాలు నశిస్తాయని సర్వమానవ సౌభ్రాతృత్వం ఏర్పడుతుందనీ చెప్పాడు. భారతీయులు రెండవప్రపంచయుద్ధం ముందు అధునాతన ఆయుధాల్ని ఉపయోగిస్తారనీ అవే వారి స్వరాజ్యసాధనకు అధికసహాయాన్ని చేస్తాయనీ చెప్పాడు.'

'కాని ఆరోజులు చాలాదగ్గరలో ఉన్నాయా?'

'త్వరలోనే వస్తాయి. 1856లో అయోధ్య ఆంగ్లరాజ్యంలో కలుపబడిందని వార్తాపత్రికల్లో చదవలేదా?'

'అవును. ద్రోహంగా _'

'ద్రోహమో, న్యాయమో మనకనవసరం. ఆంగ్లేయులు స్వార్థంకోసం చేసారు. అందులో వారికి తెలియకుండా కొన్ని మేళ్ళుకూడా జరిగాయి. వారు చిన్న పంచాయితీల నన్నింటిని కలిపి పెద్ద రాజ్యంగా చేశారు. రైళ్ళు, తంతివార్తా మార్గాలు పెట్టి మాదేశాన్ని ఇతర ప్రపంచంతో కలిపారు. అప్పటినుంచీ మాకు ప్రపంచంతో సంబంధం ఏర్పడింది. అయోధ్యను అన్యాయంగా ఆక్రమించుటవలన ఆపత్తుగాక మానదు. ఏమాదిరిగా ఉంటుందాఅని ఎదురుచూస్తున్నాను.'

'నీవు ఏమీ చేయలేవు.'

---

## 2

ప్రశాంతమైన గంగాతీరంలో అశాంతి ఆవరించేకాలం ఆసన్నమౌతోంది. నానా నుంచి బిహార్‌రాజ్యలక్ష్మి తొలగించబడింది. మనోవర్తికూడా లేకుండాచేశారు. ఆంగ్లేయులు నానాదే కాకుండా అనేకమంది రాజ్యాలులాక్కొన్నారు. ఇప్పుడు వారంతా కూటమిగా ఏర్పడుతున్నారు. ఇంగ్లీషువాళ్ళు తెల్ల సిపాయిలకు బదులు భారతీయులనే సిపాయిలుగాచేసి ఒక గొప్పతప్పిదం చేశారు. అదీకాక అదివరకు ఉన్న తుపాకుల కంటె మంచివియిచ్చారు. ఆతుపాకులలో వేసేతూటాలు పంటితో నొక్కి తుపాకీలో పెట్టవలసివస్తోంది. ఇంగ్లీషు వాళ్ళ శత్రువులు ఈ చేజిక్కినసమయాన్ని ఉపయోగించుకొని 'తూటాలు, పంది, ఆవుల కొవ్వుతో చేయబడ్డాయి. హిందూ ముస్లిం మతాలు నాశనం అవుతున్నాయి. మీరు కిరస్తానీవారయిపోతారు' అనే నినాదాల్ని లేవతీశారు. దీనితో సిపాయిలలో అలజడి బయలుదేరింది. 'కాశీరాజు మనుమడగు మంగళసింహుడు' అనే పేరు సైనికుల్లో తెలిస్తే చాలా ఉపయోగకరం అని మంగళ సింహునికి తెలుసు. కాని అతడు ఈరహస్యాన్ని ఎన్నడూ వెల్లడించలేదు. ఇతడు ఇంగ్లీషుపరిపాలనా విధానానికి శత్రువుమాత్రమే అని నానాకు తదితర విద్రోహులకు తెలుసు. అదికాక ఇంగ్లండులో చదువుకొన్నాడనీ రాజనీతి తెలుసుననీవారి ఉద్దేశ్యం. ఆంగ్లదేశంలో నివసించటంచేత ధర్మం పోయింది. కాని అతనికి క్రైస్తవమతం అంటే ఇష్టంలేదనీ తెలుసును.

మంగళసింహుడు తిరుగుబాటుదారుల నాయకుల మనస్తత్వాల్ని సులువుగా గ్రహించాడు. పదచ్యుతులైన సామంతులు అంతా ఏకమై యింగ్లీషువారిని హిందూ దేశంనుంచి పారద్రోలి తమ అధికారాల్ని తిరిగి సంపాదించగోరుతున్నారు. వారి కొరకై ప్రాణాలు అర్పించే సిపాయిలు వారిదృష్టిలో చదరంగపుపావులు. సేవక ధర్మం నాశనంకాకుండా ఉండే వారు పంపేసేవార్ని ప్రశంసించేవారు. హిందూ ముస్లిము విభేదాలు ఏమీ తగ్గలేదు. మూఢులైన సిపాయిలు తమ మతంకోసమని ప్రాణాలు త్యాగంచేస్తారు. హిందువులు భగవంతుని కొరకు, ముసల్మానులు అల్లా కొరకు తమ ప్రాణాల్ని ఒడ్డుతారు. వారికి గ్రామాలు దోపిడీచేయవచ్చునన్నది రెండవకోరిక. సిపాయిలలో తక్కువమంది ఇటువంటి దురంతాలు చేసారు. కాని ఘోష అధికమై పోయింది. గ్రామస్తులంతా వీళ్ళని దోపిడీదారులుగా భావించారు! దేశాన్ని దాస్యశృంఖలాలనుంచి విముక్తిచేద్దామనే యీ సేనను అన్యథా భావించుట మంచిదికాదు. ఇవన్నీ ఆలోచిస్తే మంగళసింహుని ఆశ నిరాశ అయింది. అతడు జాతి, మత వివక్షతలులేని రాజ్యస్థాపనకు వచ్చాడు. కాని చేరసింహుని సింహాసనాన్ని అధిష్టిద్దామనికాదు. సర్వమానవ సౌభ్రాతృత్వమే అతని ఏకైక లక్ష్యం. దాని పరిపూర్తికొరకే అతడు కంకణంకట్టాడు. పూర్వపు భారతదేశాన్ని కాక అతడు ప్రపంచంలో ఒక భాగంగా భారతదేశాన్ని చేయాలని అతనికోర్కె. భారతీయులు కూడా స్వతంత్రులుకావాలనీ, యితరదేశీయులతో సమానప్రతిపత్తిని, గౌరవాన్ని పొందాలని అతని వాంఛ. అతని ఉద్దేశ్యం మతపునరుద్ధరణ కాదు. నానా తదితర విప్లవనాయకులూ దొరికితే సారాత్రాగి, పందిమాంసం తిని స్త్రీలతో నాట్యంచేస్తారు. కాని వారిప్పుడు ధర్మసంరక్షణార్థం సిపాయిలకు నాయకత్వాన్ని వహించకోరు తున్నారు.

ఈ దోషాల్ని గమనించి మంగళసింహుడు తన కర్తవ్యాన్ని నిర్ణయించు కొన్నాడు.

'భారతదేశం ధనికులైన ఇంగ్లీషు పరిపాలకులచేతా దేశంలోని సామంత రాజులచేతా దాసత్వంలో మగ్గిపోతోంది. ఇంగ్లీషువారి శాసనం అన్నిటికంటె బలమైనదీ, మోసముకలదీని. ఈ శాసనం తొలగింపబడితే సామంతరాజులు పెట్టే బాధలు అంతెక్కువలోవికావు.

అది జనవరినెల. రాత్రులందు చలిగా ఉంటోంది. బిటూర్ రాజభవనం ప్రశాంతంగా ఉంది. రాజకర్మచారులు తమ తమ ప్రదేశాలలో ఏమరక ఉన్నారు.

రోజూ రాత్రులందు క్రొత్తవారు వచ్చుట వారు చూస్తూనేఉన్నారు. నేనుకూడా ఒక అపరిచితుడు తమ యజమానితోకూడా మందిరంలో ప్రవేశించుట వారు చూశారు.

ఇది నానా మంగళసింహుడు ప్రథమ సమావేశంకాదు. వారిరువురు పూర్వ పరిచితులే. నానా మంగళసింహుడు అక్కడ, మనోవర్తి పొందుతూ ఉన్న ఢిల్లీ పాదుషాను, అయోధ్యనవాబును, జగదీశపుర కుమారసింహుని ఇంకా అనేక యితర సామంతుల్ని చూశాడు. కలకత్తా, కాన్పూరు, లక్నో, ఆగ్రా, మీరట్‌లో గల సిపాయిలలో తిరుగుబాటు చేద్దామనేకోరిక చాలా గట్టిగావుంది అని చెప్పాడు. తిరుగుబాటు దారులైన సిపాయిల సహాయంతప్పితే ఏ సామంతునికీ స్వంతబలం ఏమీలేదు. సైనికసంచాలనం అసలే తెలియదు. అయినప్పటికీ ప్రతివానికి 'జనరల్' అవుదామనే ఆశఉన్నది.

'హిందూదేశంలో ఆంగ్లేయులరాజ్యం సిపాయిలపై ఆధారపడి వుంది. నేడు ఆ సిపాయిలు మనతో కలుస్తున్నారు' అని నానా ఆశాపూరితస్వరంతో అన్నాడు.

'కాని, హిందూపటాలాలన్నీ కలియటంలేదు. పంజాబీసిక్కులు మనతో ఏకీభవించారో లేదో తెలియదు. హిందూస్తానంలోని ఇతర సైన్యాలన్నీ పంజాబు జయించుటలో ఇంగ్లీషు వారితరఫున పోరాడాయి. అది జ్ఞాపకంవుండే వాళ్ళు ప్రతీకారాన్ని కోరుతారు. నానాసాహెబ్ – ఇంగ్లీవారు చతురులు. అయోధ్యనవాబును, పీష్వాను ఏవిధంగా బంధించారో ఆలాగే దిలీప్‌సింగునికూడా ఖైదులో పెట్టిఉంచే నేడు సిక్కులవిషయంలో మనం అనుమానించ నవసర ముండేది కాదు. మంచిది సిక్కులు, గూర్ఖాలు మనకు తోడుగా రారని మనం జ్ఞాపకం ఉంచుకోవాలి. మనదేశ స్వాతంత్ర్యయుద్ధంలో మనకు సహాయకులుకారు. కాబట్టి మనం వారిని శత్రువులుగా పరిగణించాలి' అన్నాడు ఠాకూర్.

'ఠాకూర్ సాహెబ్, మీరు చెప్పినది నిజం. కాని ఆరంభంలో మనకు జయంకలిగితే దేశద్రోహులెవ్వరూ మనపైకి రారు' అన్నాడు నానక్.

'ఒక విషయంలో మనం శ్రద్ధవహించాలి. అది మనదేశ విముక్తికై యుద్ధం చేస్తున్న సైనికులమని ప్రజల్లో ప్రచారం. ఈపనియుద్ధం ప్రారంభించాక చెయ్యాలి.'

'ఇంతకంటె మనం ఓడిపోయామని ఆంగ్లేయులతో చెప్పరాదా ?' అన్నాడు తూర్పునుంచి వచ్చిన ప్రతినిధి.

'ఎప్పుడు- ఓటమి, ఓటమి అనేమాటేనా? ఆంగ్లేయులు అజేయులని తలిచే స్వార్థపరులు మనదేశంలో అనేకమంది వున్నారు. వాళ్ళు అనేకవిధములైన సమాచారాల్ని ప్రచారం చేస్తారు. ఇప్పుడు మనం తూర్పు, పడమర, మధ్యప్రాంతం అని మూడు భాగాలు చేసి హిందీ, ఉర్దూ భాషలలో పత్రికలు ప్రకటించాలి.' అన్నాడు మంగళసింహుడు.

'ఠాకూర్ సాహెబ్! మీకు ఇంగ్లీషువారి పద్ధతులంటే ఎక్కువ ప్రీతి. పత్రికలు లేకుండా మాటలతో మేము ఎంత ప్రచారంచేశామో చూశారా?' అన్నాడు నానాసాహెబ్.

'కాని నానాసాహెబ్ యుద్ధకాలంలో ఇంగ్లీషువారి తొత్తులుచేసే ప్రచారాన్ని అరికట్టడానికి మనం ఏమైనా చేయాల్సిఉంటుంది. ఒకరోజులో మనం రాజ్యాధికారాన్ని పొందలేము. వాళ్ళు మనం గ్రామాల్ని తగలేస్తూ, పిల్లల్నీ, పెద్దల్నీ నాశనంచేస్తూ దోచుకుంటూ, స్త్రీలను మానభంగం చేస్తున్నామని అపవాదుప్రచారం చేస్తే?'

'ప్రజలు నమ్ముతారా?' అన్నాడు నానా.

మంగళ్— 'ఏమాటనైనా పదిసార్లు చెబితే, దాన్ని కాదనేవారు లేకపోతే, ప్రజలుతప్పకుండా నమ్ముతారు. నమ్మట ప్రారంభిస్తారు.'

నానా- 'మనం కోటాంనుతీసుకొని ఇంగ్లీషువారు ధర్మనాశనం వాంఛిస్తున్నారని చెప్పాం. అటువంటి సమయాల్లో ఆంగ్లేయులమాట నెట్లానమ్ముతారు?'

మంగళసింహుడు— 'ఈ ప్రచారం ఎల్లప్పుడూ చాలదు. కాని యింకోమాట. ప్రపంచంలో మనవలె స్వాతంత్రాన్ని కోరేవారు చాలామంది ఉన్నారు. ఆంగ్లేయులూ శత్రువులున్నారు. కాని ఆంగ్లేయులు ఇది తెల్లవారు అని ప్రపంచానికి చాటుతారు. ఇది తెల్లజాతిమీద యుద్ధానికి కారణం కారాదు. పిల్లల్నీ వృద్ధుల్నీ ఏమీ బాధపెట్టకూడదు. జాతిమీదే యుద్ధం అనిపించేలాచేస్తే మనకు లాభంలేదు సరికదా ప్రపంచంలోని తదితర శ్వేతరాజ్యములలో భారతదేశం అపఖ్యాతి పొందవలసి వస్తుంది.'

నానా— 'అది సేనాపతుల కర్తవ్యం. ఎప్పుడు ఏది చెయ్యాలో దానిని వారే నిర్ణయించుకొంటారు.'

మంగళసింహుడు— 'మనం ఈయుద్ధంలో అనేక మంది సిపాయిల ప్రాణాలు ఒడ్డాం సాధారణజనుల సహాయంకూడా వుంటుందని ఆశిస్తున్నాం. అటువంటప్పుడు కొన్నివ్వతూటాల ప్రచారంమీదే ఆధారపడరాదు. మనం ఇంగ్లీషువారిని పారద్రోలి, ఎలాంటి రాజ్యం స్థాపిస్తామో, అందులో రైతులయొక్క, సైన్యంయొక్క స్థితి ఎలావుంటుందో వారికి చెప్పాలి.'

నానా— 'ధర్మనాశనంచేసే వారిని వెళ్ళగొడితే వారిసంతోషానికి చాలదా?'

'ఈ ప్రశ్న మిమ్ము అడిగితే మీరేం సమాధానం యిస్తారు? పీష్వారాజధాని పూనా రావాలని మీకు కోరికలేదా? నవాబుగారికి లక్నో సింహాసనంమీద కూర్చోవాలని లేదా? మీకు ఇంతింత కోరికలుంటే ప్రజలకు శుభలాభాలను గురించి చెప్పాలి.'

'ఎటువంటివి?'

'మేం గ్రామాల్లో పంచాయితీలు ఏర్పరుస్తాం. వాటివల్ల ప్రజల ధనం కోర్టులలో నాశనం కాదు. ప్రజలంతా ఎన్నుకొన్న పంచాయితీని దేశానికంతకూ ఏర్పాటుచేస్తాం. ఆ పంచాయితీ యిష్టప్రకారమే రాజుకూడా నడుచుకోవాలి. జమీందారీలు రద్దుచేస్తాం. రైతులకూ కార్మికులకూ పరిపాలకులకూ మాత్రమే సంబంధం ఉంటుంది. జమీందార్లు, జాగీర్దార్లూ ఉండరు. మేము యంత్రాలు పెట్టి అందరికీ పని చూపిస్తాం. ఎవరూ పనిలేకుండా బాధపడనవసరం ఉండదు. వ్యవసాయానికి కాలువలు త్రవ్విస్తాం, స్వతంత్రసైన్యం రాజ్యానికి వచ్చాక ప్రజలందరకూ సమానహక్కులు వుంటాయి. వారు ప్రభుత్వాన్ని ఏర్పరచుకోవలసి వుంటుంది. వారియొక్క క్షేమం, లాభం చూడబడతాయి. ఆంగ్లేయుల పాలనపోవటమే గాక ఎవరి ధర్మాలువారు నిర్వర్తించుకోవచ్చు. పన్నులు నిర్ధారింపబడతాయి. విద్య, విజ్ఞానం మొదలైనవిషయాల్లో అత్యధిక శ్రద్ధ వహింపబడుతుంది. చెరువులూ, ఆనకట్టలూ కట్టిస్తాం. రైతులకు సాగుచేసేందుకు భూములు వస్తాయి. పంటలు ఎక్కువ అవుతాయి. కూలీలకు పనిదొరుకుతుంది. ఎవ్వరూ ఆకలితో మాడి చావనక్కరలేదు.' అని ప్రచారం చేయాలి.

మంగళసింహుని మాటలకు ఎవరూ ప్రాముఖ్యం ఇవ్వలేదు. ఇది రాజ్యానికి వచ్చాక చేయవలసినపని అనుకొని అందరూ మౌనం వహించారు.

మంగళసింహుడు మంచంమీద పడుకున్నాడు. చాలాసేపటివరకు నిద్రరాలేదు. అతడు ఆలోచనలో 'ఇది విజ్ఞానయుగము. రైలు, తంతి మొదలగు అనేక విచిత్రాల్ని చూస్తున్నాం. అగ్గిపెట్టి, ఫొటోలు తీయుట, విద్యుద్దీపాలుకలిగిన ఆధునిక ప్రపంచంలో పడుతున్నాం. కాని ప్రజలు పురాతనాన్నే కలలుకంటున్నారు. ఈ యుద్ధం ప్రజల మూలాన్నే జయిస్తే ప్రజలకు తమ శక్తిసామర్థ్యాలు తెలుస్తాయి. ఇంగ్లీషువాళ్ళు తమ పనితీరిపోయాక ఏవిధంగా కార్మిక కర్షకులను త్యజించారో అట్లా ఈసామంతులు

కూడా ప్రజలనూ, సైనికులను త్యజిస్తారు. వారిమీద అనేక అత్యాచారాలు జరుపుతారు. కాని ప్రజల్లో ఉండే ఆత్మవిశ్వాసాన్ని నాశనంచేయలేరు. పై శత్రువులను ఎదుర్కొనేందుకు రసాయనిక విజ్ఞానం మూలంగా ఏర్పడే వస్తువుల్ని స్వీకరించ కుండా ఉండలేరు. రైలుపట్టాలూ, టెలిగ్రాఫ్ స్తంభాలూ భారతదేశంలో తయారయ్యే ఓడలూ యింక విదేశాలకుపోవు' అని ఆలోచిస్తున్నాడు. మంగళసింహుని విశ్వాసం యీ సామంతరాజులమీదకాక యావత్తు ప్రపంచంలోవున్న ప్రజలయొక్క శక్తిపై కేంద్రీకరింపబడింది.

---

## 3

1857 వ సంవత్సరం మే 10 వ తేదీని మంగళసింహుడు మీరట్ సమీపంలో ఉన్నాడు. నాడే సిపాయిలు తిరుగుబాటు ప్రారంభించారు. బహదూరుషా ప్రతినిధియై మంగళసింహుడు ఒక చిన్న సైన్యమునకు అధికారిఅయ్యాడు. మంగళసింహుడంటే తక్కిన సామంతులకు అసూయగా వుంది. మంగళసింహుని ఉద్దేశాలు, యోగ్యత వారినుంచి భిన్నమైనవి. అందుచేత మంగళసింహుని ఢిల్లీవైపురాక తూర్పువైపునకు పంపారు. మీరటు తూర్పుపశ్చిమములు పోయే దారులు ఈ స్వాతంత్ర్యయుద్ధాన్ని తూర్పు పడమర అని విభజించలేవు. ఢిల్లీవైపు పురోగమించే సైన్యాలకు మంగళ సింహునివంటి సేనాపతి అవసరం. ఎంచేతంటే ఢిల్లీని ఎలా జయించాలో, దాని గౌరవాన్ని ఏవిధంగా ఉపయోగించుకోవాలో అతనికి తెలుసు.

మంగళసింహుని అధికారంలో 1000 మంది సిపాయిలున్నారు. వారు ఎవరికి వారే సేనాధిపతులమని తలచేవారు. అంతా సేనాపతులయితే ఆ సైన్యం జయించ లేదని ఆ సిపాయిలకు నచ్చచెప్పేందుకు మంగళసింహుడు వారంరోజులు కష్టపడ్డాడు. యుద్ధకౌశలం తెలిసినవాడు మంగళసింహు డొక్కడుతప్ప తిరుగుబాటుచేసినవారిలో వేరొక్కడూలేడు. సైన్యాన్ని ఆపుచేసి కవాతునివ్వడానికి అతనికి సమయం చాలదు. ఎందుచేతననగా అప్పుడు సాధ్యమైనంత త్వరలో వీలైనన్ని ఎక్కువజిల్లాలలో ఇంగ్లీషువారి బలాన్ని నాశనం చెయ్యాలి.

గంగాపురంనుంచి రుహేల్‌ఖండ్‌లో ప్రవేశించగానే మంగళసింహుడు తామంతా ఎందుకు యుద్ధంచేస్తున్నారో, రాజకీయ పరిస్థితి ఏవిధంగా ఉంటుందో అవన్నీ సైనికులకు తెలియజెప్పనారంభించాడు. సిపాయిలు క్షణంలో అర్థంచేసుకొని

తమకుకలిగిన సందేహాల్ని మంగళసింహుని అడిగి నివారించుకున్నారు. మంగళ సింహుడు వారికి ఫ్రాన్సులోని విప్లవమును వర్ణించాడు. వేల్సులో ఇంగ్లీషువార్ని అక్కడి ప్రజలు ఏవిధంగా ఎదిరించారో, ఎంత ధైర్యంగా యుద్ధంచేశారో తమ సంఖ్యాబలంతో వర్తకులైన ఇంగ్లీషువార్ని అణచి తమ అధికారాన్ని ఏవిధంగా నిలబెట్టుకున్నారో అన్నీ తెలియజేశాడు.

తరువాత సిపాయిల నడతలో అద్భుతమైన మార్పువచ్చింది. వాళ్ళంతా స్వతంత్రసమరం అనే రథానికి భాగాలుగా తయారయ్యారు. వాళ్ళు తమప్రవర్తనతో ప్రజల ఆదరాభిమానాల్ని చూరగొన్నారు. ఇంగ్లీషువారి ఖజానాలలో దొరికినసొమ్ము జాగ్రత్తగా ఖర్చుపెట్టేవారు. అవసరంఅయితే పన్నులు వసూలుచేసేవారు — ప్రతి వస్తువూ సొమ్మునిచ్చి కొనుక్కునేవారు. ఏదీ ప్రజల్నుంచి బలవంతంగా లాగేవారు కారు. దోపిడీలు లేవు — హత్యలు లేవు. మంగళసింహుని సేన వెళ్ళినచోటల్లా ప్రజలు స్వతంత్రనినాదాలతో ఆహ్వానించేవారు. అనేకమంది యువకులు ఈ స్వతంత్ర సైన్యములో చేరారు. మంగళసింహుడు తనసైన్యంలో, గూఢచారుల్ని, వైద్యుల్ని, ఆహారపదార్థాలు సేకరించేవార్ని ఏర్పాటుచేసాడు. మంగళసింహుడు చెప్పేమాటలు అందర్నీ ఆకర్షించాయి. అతనిసేన 2000 మించిపోయింది. అతని ఆజ్ఞామాత్రంచే ప్రాణాల్ని అర్పించే యువకులే అతని సేనలోనివారందరూ. మంగళసింహుడు సిపాయిదుస్తులనే ధరించి కష్టసమయాల్లో తాను ముందుండేవాడు. సిపాయిలతో కలిసికొట్టుతనం కలిగివుండేవాడు. అధికారంచేత, దాబుచేతకాక హృదయంతో అతడు సిపాయిలను వశంచేసుకొన్నాడు. అతడు పట్టుబడ్డ ఆంగ్లేయ యువతులను, పిల్లలను — చాలా జాగ్రత్తగా చూసేవాడు. అతడు రుహేల్‌ఖండంలో నాల్గు జిల్లాలు జయించాడు — అన్నిచోట్ల చక్కటి ఏర్పాట్లు చేశాడు.

నానాసాహేబ్ 1857 జూన్ 8 వ తేదీని ఇంగ్లీషువారిమీద యుద్ధం ప్రకటించాడు. కాని 2 నెలలు పూర్తికాకపూర్వమే ఆంగ్లేయులచే ఓడింపబడ్డాడు. పరిస్థితి విషమించిందని తెలిసినా మంగళసింహుడు స్వతంత్రపతాకాన్ని క్రిందకు దింపలేదు. ఇంగ్లీషువాళ్ళు అయోధ్యలో అనేక అత్యాచారాలు చేస్తున్నారని తెలిసినా మంగళ సింహుడుగానీ అతని సైనికులుగాని బంధితులైన ఆంగ్లేయులను ఏమీ బాధించలేదు.

వర్షాకాలంముగిసేసరికి తిరుగుబాటుదార్లందరు ఆంగ్లేయులకు లొంగిపోయారు. కాని రుహేల్‌ఖండంలోఉన్న మంగళసింహుడు మాత్రం ఓటమి నంగీకరించలేదు. పంజాబీ, సిక్కు, ఘూర్ఖాసైన్యాలు అతనిని నాలుగువైపులా ముట్టడించాయి. స్వతంత్ర

సైనికుల సంఖ్య నానాటికి తగ్గిపోతోంది. మంగళసింహుడు పరిస్థితుల్ని వారికి తెలిపి చాలామందిని ఇళ్ళకు పంపివేశాడు. కాని అతని వేయిసైనికులలో ఒక్కడుకూడా తన యజమానిని వదలిపోవుటకు అంగీకరించలేదు. చిట్టచివర కాతనికి సైన్యంలోని ఒక్క విషయం సంతోషం కల్గించింది. సైన్యంలో అన్నిజాతులవారూ ఉన్నారు. వారు అంతా జాతి, మత వివక్షతలు లేక కలిసి భోజనం చేసేవారు. చాలా అన్యోన్యంగా వుండేవారు. ఈ మాదిరిగా అతడు హిందూస్థానంలో జాతీయతకు ఉదాహరణను చూపాడు.

బిందాసింహ దేవరామ్, సఫాఫల్ పాండే, రహీమ్‌ఖాన్, గులామ్‌హుస్సేన్ మీరటుకు చెందిన యీ ఐదుగురు సిపాయిలు మంగళసింహునితో కూడా వున్నారు. గంగానదీతీరాన్ని అతడు రెండువైపులనుంచి ఇంగ్లీషువారిచే చుట్టబడ్డాడు. ఇంగ్లీషు ఖైదీల ప్రార్థనపై ఇంగ్లీషు జనరలు యుద్ధం ఆపుచేశాడు. మంగళసింహుని లొంగిపొమ్మని కోరాడు. మంగళసింహుడు నిరాకరించాడు. చివరకు ఆరు శవములతో ఒక నావ గంగానదిలో పోతూండగా పట్టుపడింది. ఆంగ్లేయులు అప్పుడు భారతీయుల యొక్క శౌర్యాన్ని, ధైర్యాన్ని, వీరత్వాన్ని భక్తిశ్రద్ధలతో పూజించారు; శ్లాఘించారు.

---

# "సఫ్దర్"

## (పందొమ్మిదవ కథ)

[కాలం : క్రీ. శ. 1922]

అది చిన్న అందమైన బంగాళా. ఆవరణలో గులాబీ తోట. ప్రక్కనే బాట్ మెంటెన్ కోర్టు. మెత్తటి పచ్చికబయలు. మూడవవైపు మరొక లతామండపం. నాల్గవవైపు బంగాళవెనుక విశాలమైన అపగు. దానిపైననే బారిష్టర్ సఫదర్ తరచు సాయంకాలం కూర్చుంటాడు.

బంగాళా గోడలపై పచ్చని లతలు అల్లుకొన్నాయి. సఫదర్ అప్పుడప్పుడులో ఇటువంటి లతలతో అల్లుకొన్న భవనాలు చూశాడు. ముఖ్యంగా అందుకే వీటిని వేయించాడు. బంగళా ఆవరణలో రెండు మోటార్ షెడ్లు ఉన్నాయి. సఫదర్‌జంగ్ నడవడిక, బంగళా వాతావరణం, అంతా ఇంగ్లీషు పద్ధతి. అరడజను నౌకర్లు బట్లర్‌ల వలె దుస్తులుధరించి, ఇంగ్లీషునౌకర్లవలె ఉంటారు. ఆంగ్లేయపద్ధతి భోజనం ఆయనకు ప్రీతి. అందుకని బట్లర్లు ముగ్గురు నియమింపబడ్డారు.

సఫదర్ దొరల పద్ధతిలో వారు. అందుకే నౌకర్లు అతని భార్య సకేనాను 'దొరసాని' అనేవారు. విల్లువలె వొంగిన ఆమె కనుబొమ్మలు సన్నగా, రంగు పూసినందువల్ల నలుపుగా ఉంటాయి. 15 నిముషములకొకసారి ఆమె పెదవులకు రంగు వేసుకుంటుంది. కాని విదేశీపద్ధతిలో దుస్తులు ధరించుటకు ఆమె విముఖురాలు.

1920లో సఫదర్ భార్యతో విదేశయాత్ర చేశాడు. సకేనా గౌనువేసుకోవాలని ఆయన కోరిక. కాని ఆమె ఒప్పుకోలేదు. ఇంగ్లాండులో సకేనా సౌందర్యంతోపాటు ఆమె ధరించిన చీరనుకూడా ప్రశంసించారు. దానితో సఫదర్ సంతృప్తి చెందాడు. యూరప్‌లో ఈ దంపతుల్ని ఇటలీ దేశస్థులుగా అనుకొనేవారు.

అది 1921 చలికాలం, ఉత్తర హిందూస్థానమందలి ఇతర నగరాల్లోవలె లక్నోలోకూడా అది సుందరమైన ఋతువు. అపుడే సఫదర్ ఆఫీసునుంచి వచ్చాడు. వరండాలోని పేముకుర్చీలో కూర్చొనివున్నాడు. అతనిముఖంచూస్తే ఏదోఆలోచనలో

ఉన్నట్లుఉంది. ఎదురుగా ఒక చిన్నబల్ల వుంది. దానిపై ఒక నోటుపుస్తకం, మరి రెండు పుస్తకాలు వున్నాయి. గంభీరంగాఉన్న అతని ముఖంచూస్తే, నౌకర్లు దగ్గరకు రాకూడదని ఆజ్ఞ.

సాయంకాలం కాబోతుంది. ఇంకా సఫదర్ అక్కడేఉన్నాడు. నౌకరు వైర్ తగిలించి, 'టేబిల్‌లైట్' తెచ్చిపెట్టాడు. సఫదర్ బంగాళావైపునుంచి ఏదో శబ్దం విన్నాడు. అదేమిటని నౌకరును అడిగాడు. మాస్టర్ శంకర్‌సింహ్ వెళ్ళిపోతున్నారని నౌకరు చెప్పాడు. సఫదర్ వెంటనే నౌకరును పంపి మాష్టరుగారిని పిలిపించాడు. మాష్టరువయస్సు 30 లేక 32 సం॥రాలు ఉంటుంది. కాని ముసలివాలకం వచ్చింది. కంఠాన్ని బంధించే నల్లటికోటు, పైజమా ధరించాడు. తలమీద గుండ్రని ప్లేటుగల టోపీ, పెదవులమీద క్రిందకు వ్రేలాడే దట్టమైన మీసాలు ఉన్నాయి. కాని ఆయన కన్నులుచూస్తే, ప్రతిభావంతుడే అని తోస్తుంది.

మాష్టరుగారు రాగానే కుర్చీచూపుతూ 'శంకర్! నన్ను కలియకుండా పోతున్నావే' అన్నాడు సఫదర్.

'సోదరా! క్షమించు. మీరుఆలోచనలో ఉన్నారని—'

'కోర్టుకాగితాలుఉన్నా, రెండు నిమిషాలకు ఫరవాలేదు.'

సఫదర్‌కు శంకర్ అంటే అభిమానం. ఇంతకంటె మంచి స్నేహితుడు అతనికి లేడు. సైదపూర్ స్కూలులో నాల్గవ తరగతిలో ప్రవేశించినప్పటినుంచి లక్నోలో బి. యే ప్యాసయ్యేవరకూ వీరిద్దరూ సహాధ్యాయులు. ఇద్దరూ తెలివైన వారు. 4, 5 మార్కులు తక్కువ ఎక్కువలో ఇద్దరూ సమానంగానే ఉండేవారు. వారు ఎన్నడూ చదువులపోటీలో తగాయిదాలు పడలేదు. కారణం ఇద్దరూ రాజ పుత్రులే. కాని నేడు ఒకరు హిందువు. మరొకరు ముస్లిం. కాని పదితరాలకు ముందు వీరి పూర్వులు హిందువులే. ప్రత్యేకసమయాల్లో నేటికీ ఉభయ కుటుంబాలు కలుస్తూ ఉంటాయి.

సఫదర్ తన తండ్రికి ఏకైకపుత్రుడు. సోదరుడు లేనిలోటు శంకర్ తీర్చి వేశాడు. సఫదర్‌కంటె శంకర్ 6 మాసములు చిన్న. శంకర్ చాలా మంచివాడు.

అందుకే అతడంటె సఫదర్‌కు గౌరవం. శంకర్‌కు ముఖస్తుతి చేయుట తెలియదు. అందువల్లనే యం. ఏ. ప్రథమశ్రేణిలో ప్యాసైనా నేటికీ అతడు మామూలు ఉపాధ్యాయుడే. ఇతర సహాయాన్ని అర్థిస్తే ప్రభుత్వ పాఠశాలలో అతడు సులువుగా ప్రధానోపాధ్యాయుడు కాగలిగేవాడు. అతనికి వినయ విధేయతలు, ఆత్మగౌరవం ప్రధానం. అందుకే సఫదర్ గౌరవానికి పాత్రుడు కాగలిగాడు. 12 సం॥ వయస్సులో ఏర్పడిన వీరి స్నేహం 20 సం॥ల తరువాతకూడా యథాప్రకారంగానే ఉంది.

ఇంతలో సకేనా వచ్చింది. ఆమె అందమైన లేత ఆకుపచ్చరంగు చీరను, ఎర్రటి రవికెను ధరించింది. శంకర్ లేచి నిలబడి 'వదినా! నమస్కారం!'

చిరునవ్వుతో వదిన ప్రతినమస్కారం చెప్పింది. ధనవంతుని పుత్రిక సకేనా. ఈమె తన భర్త ఒక పల్లెటూరి బడిపంతులతో స్నేహం చేయుటను ఒకప్పుడు నిరసించేది. సకేనాకు తండ్రిఇంటివద్ద ఘోషా లేదు. అయినా ఆమె శంకర్‌కు కనిపించేది కాదు. సఫదర్ శంకర్‌తో కలిసికట్టుగా వుంటే ఆమె ముఖం చిట్లించుకొనేది. ఎట్టకేలకు వస్తుతః మంచివాడని, అందువల్ల శంకర్ స్నేహపాత్రుడని ఆమెకూడా అంగీకరించవలసి వచ్చింది.

ఇపుడు సకేనా శంకర్‌తో నిజమైన మరది-వదిన సంబంధం ఖాయపర్చుకుంది. సకేనా బుద్ధిపూర్వకంగా తనను సంతానహీనురాలను చేసుకొంది. కాని అప్పుడప్పుడు శంకర్‌బిడ్డను ఎత్తుకొంటుంది. శంకర్ ఇంట్లో రెండుసంవత్సరముల కొకసారి చంటి పిల్లలు పుడుతూ ఉంటారు.

గతవారం భర్త గంభీరంగా ఉండుట సకేనాకు విచారంగా వుంది. శంకర్‌ను చూస్తే ఆమెకు ఆనందంకలిగింది. దొరగారి హృదయావేదనను తగ్గించగలశక్తి శంకర్‌కు ఉన్నదని ఆమెకు తెల్సు. సకేనా శంకర్‌తో యిలా అంది— 'మరదీ! తొందరలులేవుగదా! వదినగారి చాక్‌లెట్లు ఏలావుంటాయి?'

సఫదర్— 'బాగుంది. అడుగు-అడుగు.'

సకేనా— 'మరిదిగారి జాడలేదు— ఏంలోపం వచ్చిందో తెలుసుకోవాలని ఉంది?'

శంకర్— 'వదినా! నీవు న్యాయంగా మాట్లాడ్డంలేదు. నీ ఆజ్ఞను నేను ఎప్పుడు జవదాటాను ?'

సకేనా— 'ఆజ్ఞ జవదాటటంగురించి కాదు. ఆజ్ఞ వినకుండా తప్పుకొని తిరగటమే.'

శంకర్— 'నేను నా వదినగారి ఆజ్ఞకు బద్ధుడను.'

సకేనా— 'సరే! నేవెడతా! పిండివంటలు భోజనం తినాలి.'

సకేనా త్వరగా వెళ్ళిపోయింది. సఫదర్, శంకర్‌ల సంభాషణ గంభీర రూపాన్ని దాల్చింది.

సఫదర్— 'శంకర్! మనం కొత్త విప్లవ యుగంలో ప్రవేశిస్తున్నాం. 1857 సం॥ తరువాత మొదటిసారిగా దేశం కంపించి పోతుంది.'

శంకర్— 'నీ ఉద్దేశం! రాజకీయ ఆందోళన గురించియేనా ?'

సఫదర్— 'అది మామూలుమాట- 1885 లో కాంగ్రెస్ ఏర్పడింది. అప్పుడు దానిని ఇంగ్లీషు ఐ. సి. యస్. ఆఫీసర్లు వాడుకొనేవారు. క్రిస్‌మస్ వినోదాలు, ఉపన్యాసాలతో గడిపేవారు. దానిని అందోళన అనేవారు. ఒకవేళ నీవుకూడా దానిని ఆందోళనఅంటే - మనం ఇప్పుడే వాస్తవిక ఆందోళనతో కూడిన విప్లవ యుగంలో ప్రవేశిస్తున్నాం' అని నేను అంటున్నా.

శంకర్— 'ఎందుకంటే— గాంధీజీ తిలక్ స్వరాజ్యనిధికి ఒకకోటి సేకరించి, ఆందోళన ప్రారంభించారు ?'

సఫదర్- 'శంకర్! విప్లవకర ఆందోళన ఒకవ్యక్తి లేక కొద్దిమంది వ్యక్తులతో సాధ్యం కాదు. దీనినిగురించి ఆలోచించేటప్పుడు నా మనస్సు 1857 సం॥నకు పోతుంది. నాటి విప్లవ నాయకత్వం పతనమై పోయింది. నాటి విప్లవ కేంద్రం లక్నో (లక్నో ఇంగ్లీవారి వశమైంది). ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. విఫలులపై ఇంగ్లీషువారు గుండ్లవర్షం కురిపించారు.

మన బలహీనతవల్ల మనం విఫలులమయ్యాం. ప్రజలను దేశ స్వతంత్ర సమరంలో ప్రవేశింప జేయటం 1857 సం॥ తరువాత ఇదే ప్రథమం. మునుపెన్నడూ ప్రజానీకం ఇటువంటి చైతన్యాన్ని పొందలేదు.'

'సఫదర్ ! నాగపూర్ కలకత్తా కాంగ్రెస్‌లు ముగిసాయి. గ్రామగ్రామం కదలిపోయింది. నీవు ఏదైతే ఆలోచిస్తున్నావో, దానిని నేను స్వయంగా చూశాను. అది ఒక అసాధారణ విషయం. ఇటువంటి తుఫానులు గడిచాయి. లక్నోలో విదేశ వస్త్రదహనం చేయబడింది. కాని నీకు చీమకుట్టినట్టులేదు. ఇంకా ఇప్పుడు విప్లవ సుడిగుండంలో పడ్డవానిలా మాట్లాడుతున్నావు ?'

'శంకర్ ! నీవు చెప్పినది నిజం ! ఈ సుడిగుండం నన్ను నిలవనీయటం లేదు. ఇది ఒకస్థానిక సమస్యకాదు. బలవత్తరమైన విప్లవశక్తి ప్రజలను వశపరచు కొంటోంది.'

'సఫదర్ నీవు 1857 నుంచి ప్రారంభిస్తున్నావు.'

'అవును. ఎందుకో చెప్పనా శంకర్ !'

'నేను వింటాను. వదినగారి భోజ్యాలు తయారౌతాయి. రేపు ఆదివారం కూడా. మాయింటికి మనిషిని కబురు పంపు నేనీ రాత్రికూడా యిక్కడేఉంటానని.'

'శంకర్! నీవు నాదగ్గరలేనందున ఆక్స్‌ఫర్డులో సగం ఆనందం తగ్గిపోయింది. ప్రపంచ పరిస్థితులలోమార్పు ఇంగ్లాండు రాజకీయాలలో మార్పుకు కారణమైంది. రాజకీయ విద్యార్థులందరు ఇదే చెపుతారు. గత శతాబ్దంలో జరిగిన విప్లవపరిణామాలే దీనికి కారణం. ప్రపంచపరిస్థితులకు మూలకారణం ఆర్థికసమస్యలే. 1857లో ఓడిపోయాం. దేశం నిద్రలోపడిపోయింది. లేదా నిద్రతో తుల్యమైన మాంద్యం ఏర్పడింది. కాని విదేశాలలో గొప్పమార్పులు జరిగాయి. రోమ్ సామ్రాజ్యం విచ్ఛిన్నంకావటంతో ఇటలీ 1861లో జాతీయైక్యతను పొందింది. మనయువకులకు ఆదర్శప్రాయులగు మేజనీ, గారిబాల్డీలను ప్రసాదించింది. రోమను సామ్రాజ్యాన్ని ధ్వంసంచేయగల్గిన జర్మనీ తనను సంఘటిత పరచుకొనలేక పోయింది. కాని 1866లో అసంపూర్ణముగను, ఫ్రాంసును జయించిన తరువాత ప్రష్యా నాయకత్వాన 1871 లో స్వరాష్ట్రమును నిర్మించుకో గలిగింది. 1866లో ఈ పరివర్తనలు ప్రపంచ వ్యాప్త మైనవి. దీని తరువాత 1870 లో జర్మనీ మహాశక్తివంతమైన ఫ్రాంసును జయించి

పారిస్, వెర్సైల్సులలో విజయపతాకను ఎగురవేసింది. ఇందువల్ల ఇంగ్లాండు రష్యాలు భయంతో బెర్లిన్ వైపు చూడసాగాయి. ఇది అంతర్జాతీయ పరిస్థితి. ఇంతలో పారిస్ కమ్యూన్ 1871 ఏప్రిల్ 2వ తేదీ నుంచి మే 21 తేదీ వరకూ (6 వారములు) జరిగింది. సామంతులు, వ్యాపారస్థులే కాకుండా కూలీలుకూడా రాజ్యం చేయవచ్చు నని ఋజువుచేసింది. ఇది భయానికి కారణమైంది.'

'వాటితో భారతదేశానికిగల సంబంధం ?'

'ఔను. ఇదేకాదు, భారతదేశంలో మన బ్రిటిష్ పాలకులు అవలంబించే వైఖరికి వీరితో సంబంధం వుంది. యూరప్‌లో అజేయమైన శక్తిగా జర్మనీ ఉద్భవించటంతో, ఇంగ్లాండునకు ఫ్రాన్స్‌తోగల వైరం మాయమై పోసాగింది. జర్మనీభీతి వారిలో మార్పు తెచ్చింది. కొద్దికాలమే నిల్చినా, పారిస్ కమ్యూన్ మనపాలకులలో భయభ్రాంతులు కలిగించింది. ఆస్ట్రియా బలంగా ఉంది. మిగతా జర్మన్ రాష్ట్రములన్నీ సమాఖ్యగా ఏర్పడ్డాయి. యింకా అనేక మార్పులు జరుగుతున్నాయి. 1670 సం॥ తరువాత వర్తకులైన బ్రిటిష్‌వారు పెద్ద భాగ్యవంతు లయ్యారు. ముడివస్తువుల కొనుగోలు, వస్తువుల తయారు, వర్తకము అన్నిటిలోను గుత్తపద్ధతిని అవలంబించి బ్రిటిషువారు ప్రతిఅవకాశాన్నీ వినియోగపరచుకొన్నారు. వర్తకునికి ఒకేసారి లాభంవస్తుంది. కాని పారిశ్రామికునకు ప్రతిసారి లాభం వస్తుంది. పత్తి కొనుగోలులోను, వడుకుటలోను, మాన్‌చెస్టర్‌లో నేయుటలోను, బట్టల తయారీలోను, వాటి రైలుప్రయాణంలోను, ఓడల ప్రయాణంలోను, అన్నింటిలోను లాభమే! ఇదంతా చేతితో తయారైన వస్తువుల విక్రయంవల్ల వచ్చే లాభంతో ఒకసారి పోల్చు!'

'అవును. పారిశ్రామికులకే చాలా లాభం వస్తోంది!'

'1871 లో విజేత అయిన జర్మనీ ప్రష్యారాజగు మొదటి విలియంను జర్మన్ కెయిజర్ (చక్రవర్తి)గా వెర్సైల్సులో ప్రకటించింది. మరుసటి సంవత్సరం సూక్ష్మ గ్రాహ్యులగు బ్రిటిషు ధనికవాదులు, టోరీలు కలిసి యూదువంశీకుడైన డిస్రాలీ ద్వారా తమ సామ్రాజ్యాన్ని ప్రకటించుకొన్నారు. ఇది ఏదో ఒక ప్రకటన కాదు. వాస్తవరూపంలో సామ్రాజ్యవాద జననం ప్రకటింపబడింది. కర్మాగారాలు ఎక్కువగా పెరిగిపోవుటతో సంరక్షిత ప్రాంతములు వర్తకము కొరకు ఏర్పరచుకోవాలి.

ఫ్రాన్సు, జర్మనీలు పోటీచేయుటకు వీలులేని గుత్త వ్యాపార కేంద్రముల అవసరం ఏర్పడింది. పెట్టుబడి విపరీతంగా పెరిగిపోవంటవల్ల పెట్టుబడి పెట్టుకొనుటకు సురక్షిత ప్రదేశముల అవసరముకూడా ఏర్పడింది. అంటే ఇతర ప్రాంతములమీద ఇంగ్లాండు అధికారం బలపడాలి. ఇదే 'డిస్రాలీ వాడిన 'సామ్రాజ్యవాదం' అనే పదమునకు వాస్తవమైన అర్థం. భారతదేశం ఈ రెండు అవసరములకు అనుగుణ్యంగా ఉంది. యూరప్‌నుంచి ఇండియాకు 1869 లో సూయజ్ కాల్వ తెరుచుటతో దగ్గర దారి ఏర్పడింది. 1875 వ సంవత్సరమున డిస్రాలీ తంతిద్వారా 1,77,000 వాటాలను 40 లక్షల పౌనులకు ఈజిప్టు చక్రవర్తివద్ద కొన్నాడు. ఇది సామ్రాజ్యవాద విధానంలో మరొక ముందడుగు. తరువాత 1877 జనవరిలో ఢిల్లీలో జరిగిన దర్బారులో విక్టోరియారాణీ సామ్రాజ్ఞిగా ప్రకటింపబడింది. ఈ విధంగా డిస్రాలీ ప్రభుత్వం సామ్రాజ్యవాదాన్ని వ్యాపింపచేసింది. తరువాత అధికారములోనికి వచ్చిన లిబరల్ పార్టీ నిర్మాత గ్లాడ్‌స్టన్‌కు ఈ విధానాన్ని మార్చటానికి వీలులేకపోయింది.'

'మహారాజ్ఞి బిరుదును అంగీకరించి విక్టోరియా మహారాణి దేశానికి గొప్ప గౌరవం ప్రసాదించిందని ఇప్పటికీ మేము విద్యార్థులకు పాఠాలు చెబుతున్నాం.'

'ఇటువంటి బిరుదాన్నే పర్ష్యారాజు 'కైజర్' బిరుదు వాడుకలోకి రాకపూర్వం అనగా 6 సంవత్సరముల క్రితం అంగీకరించాడు. కాని, రోమ్ పతనంతో ఈ బిరుదు విలువ పోయింది. కాని మరల దాని విలువ పెరుగుతున్నది.'

'కేవలము రోమన్ భాషాశబ్దమైన కైజర్ భారతదేశంలో వాడబడుతోంది. దీనినే ఇంగ్లీషులో 'ఎమ్ప్రెస్' అంటున్నారు. కారణం?'

'మంచిది. కైజరు శబ్దంతో 1871 నుంచి మనం సామ్రాజ్యవాద యుగంలో ప్రవేశిస్తున్నాం. మొదట ఇంగ్లాండు వస్తుంది. తరువాత ఓడిపోయిన ఫ్రాన్సు రిపబ్లిక్ రూపంలో 1881 లో ట్యూనిస్ ఆక్రమించి మళ్ళీ సామ్రాజ్యాన్ని నిర్మింప నారంభిస్తుంది. కొత్త ఫ్యాక్టరీలతోను ధనికవాదులతోను కూడిన జర్మనీకూడా 1884 నుంచి వలస రాజ్యముల కొఱకు తహతహలాడుతూ సామ్రాజ్యవాదాన్ని స్థాపింప ప్రయత్నిస్తుంది.'

'భారతదేశంలో బ్రిటిష్ రాజనీతికి దానికిగల సంబంధ మేమిటి?'

'నిత్యం పెరిగే యంత్రాలు, వృద్ధిపొందుతున్న కార్ఖానాలు - వీటినుంచి లాభాన్ని పొందాలి. 1874—80 లలో డిస్రాలీ మంత్రి మండలి ఇందుకు పునాది వేసింది. 1882 వరకు అధికారంలోవున్న గ్లాడ్‌స్టన్ ప్రభుత్వము ఈ మార్గాన్నే అనుసరించింది. కాని ఈసారి ధనికవాదమైన సామ్రాజ్యవాద రాక్షసత్వమునకు ప్రజలను మోసగించటానికి నాగరిక వేషం వేయబడింది. ఇదే 'భారత సామ్రాజ్ఞి.' ఈ నాటికయే ఐరిష్ బిల్లు రూపములోకూడా ఆడబడింది. నేటికీ ఐర్లెండు సమస్య మునుపటిలానే వున్నది. ఈ మితవాదమును అవకాశముగా తీసుకొని కాంగ్రెసు ఉద్యమం 1885 లో ప్రారంభింపబడింది. ఈ పద్ధతిలోనే దాని విధానం కొన సాగింది. 1895 నుంచి 1905 వరకు టోరీలు ఇంగ్లాండులో అధికారంలో వున్నారు. వారు ఎల్గిన్, కర్జన్‌లవంటి 'సుపుత్రు'లను భారతదేశానికి పంపారు. వారు సామ్రాజ్య వాదాన్ని బలపరచుకొన కోరారు. కాని ఫలితం?'

'మీ ఉద్దేశ్యం. లాల్ (లాలాలజపతిరాయ్), బాల్ (బాలగంగాధరతిలక్), పాల్ (బిపిన చంద్రపాల్) వీరు నడిపిన వుద్యమాన్ని గురించా?'

'లాల్, బాల్, పాల్ లు బాహ్యచిహ్నాలు. దేశంలో జరుగుతున్న సంఘటన లకు వారి ఉద్యమాలు ప్రతిబింబాలు. 1905 లో జపాన్ రష్యాను ఓడించి అగ్ర రాజ్యములలో కలిసి ఆసియాలో నూతన జాగృతిని కలుగచేసింది. కర్జన్ వంగవిభజన, జపాన్ విజయములకు భారత యువకులు ఉత్తేజితు లయ్యారు. అర్ధశతాబ్దము గడచినతరువాత ఐర్లెండు, రష్యన్‌ల త్యాగజీవితము వీరిని ఉత్సాహపరిచింది. అందు వలన దేశములోని మార్పులకు విదేశ సంఘటనల ప్రాబల్యము ఏర్పడింది.'

'ఔను. ప్రపంచము ఒకదానిలో మరొకటి కలిసి వున్నది.'

'శంకర్! విప్లవాత్మక ఆందోళనకు రెండు పరిస్థితులు అవసరం. మొదటిది అంతర్జాతీయ పరిస్థితి. రెండవది దేశంలోని విప్లవాత్మక వర్గము దానిలో పాల్గొనటం. మొదటి విషయం వివరింపబడింది. రెండవది కూలీలను, రైతులను సమీకరించుట. విప్లవపోరాటములో ఓటమికి భయపడరాదు. నా పెదవుల రంగు, ఈ భవనం యింకా నా తండ్రి తాలూకు గ్రామాలు చేతినుండి జారిపోతాయేమో నని భయపడేవారు విప్లవ సైనికులు కాలేరు. అందువలన సామాన్య ప్రజలే విప్లవాన్ని ముందుకు తీసుకొని పోతారు.'

'ఔను, అది నిజమే.'

'సామాన్య ప్రజలలో నేడు ఎంతో ఉద్రేకం వుంది. అంతర్జాతీయ పరిస్థితి వారిని పురికొల్పుతోంది. మొదటి ప్రపంచయుద్ధం పెద్ద నిప్పును రగుల్కొల్పింది. సామ్రాజ్యవాదపు పుట్టుకకు ఈ యుద్ధమే కారణం. ధనాన్ని, ఉత్పత్తి సామగ్రుల్ని సురక్షిత పరచటానికి వలసలు కావలసివచ్చాయి. జర్మనీ కొత్తవలసలను కోరింది. భూమి పంచబడింది. అప్పటికే వలస రాజ్యాలను కలిగివున్న ఇంగ్లండు ఫ్రాన్సులతో జర్మనీ కలహించింది. కాని జర్మనీ ఓడిపోయింది. ఈ యుద్ధంలోనే సామ్రాజ్య వాదమును అడ్డుకొనగల ఒక శత్రువు జన్మించాడు. అదే సామ్యవాదం. అంటే వస్తువులను లాభంకోసం కాకుండా మానవులకొరకు తయారుచేయాలి. యంత్రము లలో సంస్కారం కావాలి. ఫ్యాక్టరీలు ఎక్కువ కావాలి. వుత్పత్తి పెరగాలి. కార్మికు లకు కొనుగోలుశక్తి ఏర్పడేటట్లు జీతాలు హెచ్చుకావాలి. అందువలన సామ్యవాదం లాభాన్ని మరచిపొమ్మంటుంది. రాష్ట్రము లేక దేశమును ఒక కుటుంబముగా భావించాలి. దేశమునకు అవసరమైన వాటిని మాత్రమే తయారుచేయాలి. దేశంలోని వుత్పత్తిసాధనాలైన భూమి, యంత్రాగారములు వ్యక్తుల ఆధీనములోనుంచి సమాజ పరం కావాలి.'

'చక్కటి సిద్ధాంతం.'

'శంకర్ః సిద్ధాంతంమాత్రమేకాదు, నవంబరులో ప్రపంచములోని ఆరవ భాగంలో అనగా రష్యాలో సామ్యవాద ప్రభుత్వం ఏర్పడింది. ధనిక ప్రపంచం ఈ ఆశాజ్యోతిని ఆర్పివేయాలని చూస్తోంది. కాని సోవియట్ ప్రభుత్వం మొదటివాడికి నిలబడింది. 1919 లో ఫ్రెంచి, అమెరికన్ సహాయంతో 6 మాసాల తరువాత హంగేరీలోని సోవియట్ ప్రభుత్వం హతమార్చబడింది. సోవియట్ రష్యా ఉనికి ప్రపంచానికి గొప్ప ప్రేరణ. యుద్ధం ముగియగానే బ్రిటిష్‌వారు రౌలట్ చట్టాన్ని చేశారు. దీనికి కారణం యుద్ధమే. ఈ శాసన ధిక్కారమునకు గాంధీజీ పిలుపు నిచ్చాడు. దానితో (సిపాయిల తిరుగుబాటు) 1857 లో అణగారిపోయిన నిప్పు మళ్ళీ నేడు రగుల్కొంది. ఇందువలనే మనం విప్లవరంగంలో ప్రవేశిస్తున్నామని నేను చెప్తాను.'

'అయితే మీరు గాంధీజీని విప్లవనాయకుడుగా పరిగణిస్తారా ? అతడు గోఖ్లే వంటి మతవాదుల మార్గాన్ని అనుసరిస్తాడు గదా!'

'గాంధీజీ చేసిన ప్రతి పనినీ, అతని ప్రతి భావమునూ నేను విప్లవాత్మక మైనదిగా భావించను. విప్లవ రంగమున శక్తియుతపాత్ర వహించగల సామాన్య ప్రజలను అతడు మేల్కొల్పాడు. అందువల్ల అతడు ఒక విప్లవాత్మక కర్తవ్యమును నెరవేర్చాడు. ఖిలాఫత్తు ఉద్యమంవంటి వాటిని గురించి ఆయనకుగల మితభావము లను నేను అంగీకరించను. ఇదేవిధముగా పాఠశాలలు, కాలేజీలు మూసివేయుట, యంత్రాగారముల విషయంలోను నేను ఆయనతో అంగీకరించను.'

'సఫ్దర్! పాఠశాలలు, కాలేజీలు మూసివేయాలని గాంధీజీ చెప్పినదానితో మీరు అంగీకరించుటలేదని విని నేను సంతోషించాను. అవి సైతానుల (బ్రిటిష్) కార్ఖానాలని గాంధీజీ అంటారు.'

'అవును. మన విద్యావిధానం చాలా లోపభూయిష్టం. అది బానిసవిద్య కనుక దోషయుతం. కాని మానవునికి పనికివచ్చే సైన్సు మొదలైనవి మనమక్కడ నేర్చుకొనవచ్చును. పాఠశాలలు వదిలి నేతపనిలో విద్యార్థులు ప్రవేశిస్తే మనం చీకటిలోకి పోతాం. కాని విద్యార్థులను విప్లవకారులుగా ఆహ్వానిస్తే అది మంచిది.'

'మరి యితరసహాయనిరాకరణోద్యమాలో?'

'కోర్టులను బహిష్కరించితీరాలి. పరిపాలనపట్ల మన అసంతృప్తిని, వ్యతి రేకతను తెలపటానికి యిది ఒక సాధనం. విదేశవస్తు బహిష్కరణ బ్రిటిష్ పెట్టు బడిదారులకు ఒక దెబ్బపెట్టు. స్వదేశీవృత్తులకు ప్రోత్సాహకరం.'

'సోదరా మీరు చాలాదూరం పోయారు!

'అప్పుడేకాదు. ఇంకావుంది. మనం విప్లవయుగంలో వున్నాం.'

'అవును. నేను ఎన్నోప్రశ్నలు బుద్ధిపూర్వకంగానే వేసాను నీ వుద్దేశ్యం తెలుసుకోవడంకోసం. రష్యావిప్లవాన్ని గురించి విన్నప్పటినుంచి నేను సామ్యవాద సాహిత్యం చదివివాను. మన సమస్యలను ఈ మార్గంలో పరిష్కరించటాన్ని గురించి ఆలోచించాను. భారతదేశానికి, ప్రపంచానికి ఇదే సరియైన మార్గం. మహాత్ముని సహాయ నిరాకరణోద్యమంయొక్క వెన్నెముక ప్రజలేయని నీవు చెప్పి నప్పుడు నా సందేహం మాయమైంది. విప్లవాన్ని ప్రజాసహకారంతోనేగాని గాంధీజీ

జయప్రదముగా నడుపలేదని నేననుకుంటా. ప్రజలు నేడు తిండిసమస్యతో వ్యాకుల పడుతున్నారు. మతసమస్యకంటే ఈసమస్య చేపట్టితే విప్లవం 1857 నాటివలె ఆగ కుండా సాగిపోతుంది.'

'ఇందుకే నేను పోరాటంలో చేరాలనీ సహాయనిరాకరణవాదిని కావాలనీ నిశ్చయించుకున్నాను.'

'నీవు చాలా తొందరపడుతున్నావు.'

'నేను తొందరపడితే ఎన్నడో దుమికివుండేవాణ్ని. చాలా ఆలోచించి, నీ అభిప్రాయం తెలుసుకొని ఈ నిర్ణయానికి వచ్చా' అంటూ ఆలోచిస్తూ సఫ్దర్ చెప్పాడు. శంకర్ పరధ్యాన్నంగా చూడసాగాడు.

'సోదరా! నీవు బహుశా నీవదినగారిని గురించి లేక పెదిమలరంగు, సిల్కు బట్టలు, జోళ్ళు, లేక నాఇంటినిగురించో, నౌకర్లను గురించో ఆలోచిస్తున్నావు. వీటిలో నాకు మోజులేదు. సకేనాకు ఆస్థి, యిల్లు, భూములు వున్నాయి. ఆమె తన యిష్టంవచ్చినట్లు గడుపుకోవచ్చు.'

'నేను వదినగార్ని గురించి ఆలోచించటంలేదు. నన్నుగురించే. నాకుగల సంశయాలు తొలగిపోయాయి. మనం సోదరులవలె విప్లవమార్గంలో ప్రవేశిద్దాం.'

కన్నీటితో సఫ్దర్ అంటాడు, 'ఆక్స్ఫర్డులో నీకోసం నేను చాలా వ్యాకుల పడేవాడిని. ఇప్పుడు నేను ఉరిస్తంభానికి కూడా నవ్వుతూ వెళ్ళగలను.'

సకేనా వారిని భోజనానికి పిల్చుటతో వారి సంభాషణ ముగిసింది.

---

## 2

నాటి సాయంత్రంనుంచి తనభర్త ఉత్సాహంతో వుండటం సకేనా కనిపెట్టింది. శంకర్‌తో జరిపిన కులాసాసంభాషణే దీనికి కారణమని ఆమె తలపోసింది. తన నిశ్చయాన్ని సకేనాకు చెప్పడం సఫ్దర్‌కు చాలాకష్టమైనపని. సఫ్దర్‌కూడా ప్రేమతో

పెరిగాడు. గ్రామాల్లో నివసించినందున బీదప్రజలంటే జాలి. అతడు పరీక్షలో గెలుస్తానని ఆశిస్తున్నాడు. కాని సకేనాసంగతివేరు. ఆమె పట్టణవాసి. ధనికునిబిడ్డ. సఫ్దర్ ఆదివారంకూడా ధైర్యంగా లేడు. సోమవారం కోర్టులో తన నిశ్చయాన్ని ముఖ్యమిత్రులకు చెప్పాడు. సకేనాకు కూడా తెలియజేయకతప్పలేదు.

ఆరాత్రి లక్నోనుంచి విలువైన మద్యాన్ని తెప్పించాడు. ఎవరైనా స్నేహితులు వస్తారేమో అని సకేనా అనుకొంది. కాని భోజనానంతరం సఫ్దర్ ఒకగ్లాసు 'సారాయి' ఆమె పెదవులకు అందించి, 'ప్రియమైన సకేనా! యిది నీకు నా ఆఖరిప్రసాదం.'

'సారా మానేస్తున్నారా మీరు?'

'అవును సఖీ! పూర్తిగా. కాని నిన్నుకాదు. నేటినుండి నీవే నాకు సారా, నీ సౌందర్యాన్నే త్రాగి తృప్తిపడతాను.' సకేనా ముఖం వాడిపోవడంచూచి తిరిగి అంటాడు.

'ప్రియా, సకేనా! ఇప్పుడే మనం కలిసి త్రాగుదాం. ఇంకా కొన్ని మాటలు మాట్లాడాలి.'

సకేనాకు సారా అంటే ప్రీతిలేదు. గాని సఫ్దర్ ఉమర్ ఖయ్యాములోని పద్యాలెన్నో సారానిషాలో చదివాడు.

నౌకర్లు వెళ్ళిపోయారు. సకేనా సఫ్దర్‌వద్దకు వచ్చి ఏదో అరిష్టంజరిగే శంకతో ముడుచుకొని పరున్నది. అప్పుడు సఫ్దర్ మాటాడ్డం ఆరంభించాడు— 'ప్రేయసీ సకేనా! నేనొక నిశ్చయం చేసుకొన్నాను. ఇటువంటి నిశ్చయానికి ముందు నీ సలహాకూడా తీసుకోవలసివుంది. కాని అపరాధం చేసాను. ఈ అపరాధం ఎందుకుచేశావో తెలిసికొంటావు. నానిశ్చయం - నేనిప్పుడు దేశస్వాతంత్ర్య సైనికునిగా వెళ్ళిపోతున్నాను.'

సకేనా హృదయంమీద ఈమాటలు వజ్రంలాగ తగిలాయి. అందుకే ఆమె ఏమీ మాట్లాడలేకపోయింది. ఆమె మౌనంగా ఉండడం చూచి సఫ్దర్ తిరిగి

అంటాడు—'కాని సకేనా! చిన్నప్పటినుండి గడచిన సీసుఖజీవితాన్ని ముళ్ళలోనికి ఈడ్చాలని నాకులేదు.'

సకేనా హృదయానికి ఇంకా పెద్ద దెబ్బ తగిలింది. ఆమెలో మేల్కొన్న ఆత్మగౌరవం ఇలాచెప్పించింది — 'ఏమండీ మీరు నన్నింత విలాసప్రియురాలిగా భావించారా! మీరు ముళ్ళపై పడుంటే, నేను పరుపులపై కూర్చోగలనా! మీరు హృదయపూర్వకంగా నన్ను ప్రేమిస్తే అదేచాలు నాకు. మీ రెక్కడకు వెళ్ళినా నేను మీతో ఉండడానికి సహాయపడుతుంది. నేను నాకాలాన్ని విలాసంగాను, అలంకారంలోను గడిపాను. నేను కష్టజీవితాన్ని చవిచూడ లేదు. నాకు మీరే సర్వస్వం. నేను మీతోపాటే. మీరింతవరకువలెనే నాకు ముందుకూడా!'

సకేనా సంకల్పం దృఢమయిందని సఫ్దర్‌కు నమ్మకం లేదు. అందుకే తిరిగి యిలా అన్నాడు, 'నేను క్రొత్తదావాలు తీసుకొనడం మానివేశాను. పాతవికూడా ఇతరులకు వప్పచెప్పుతాను. ఈ వారంలోనే సెలవుతీసుకోవాలని వుంది. ఇంకొక మాట చెప్పనా సకేనా, శంకర్ కూడా నాతో ఉంటాడు.'

సకేనా ఆశ్చర్యంగా అంది - 'శంకర్‌కూడా?'

'శంకర్ నిజంగా అమూల్యమయిన రత్నం సకేనా! అతడు నాతో ప్రపంచంలో ఆఖరువరకు ఉంటాడు. ఆక్స్‌ఫర్డులో మాటి మాటికి అతనిని స్మరించేవాణ్ని.'

'కాని శంకర్ త్యాగం మీదానికంటే ఎక్కువయింది.'

'అతడు తన త్యాగజీవితాన్ని వశంలో ఉంచుకున్నాడు సకేనా! తెలిసికూడా అతడు వినిపించుకోలేదు. లేకపోతే గొప్ప వకీలయ్యేవాడు. తన డిపార్టుమెంటులో కూడా పేరుపొందేవాడు.'

'అతని ఇద్దరుపిల్లలు చనిపోయినప్పుడు నేను ఏడ్చాను. కాని నల్గురిలో ఇద్దరి బరువు తగ్గడమే మంచిదయింది.'

'కాని అతని భార్య చంప శంకర్‌నిశ్చయాన్ని ఎలా వప్పుకుంటుంది సకేనా?'

'ఆమె కళ్ళుమూసుకొని ఒప్పుకుంటుంది. ఆమే మీమీద నాకు ప్రేమను నేర్పింది.'

'మనం ముందు జీవితాన్ని నిర్ణయించుకోవాలి.'

'ఇప్పుడేగా చెప్పాను. ఆలోచించి మీరే చెప్పండి ?'

'మన గ్రామంలో దాసీలు శరీఫన్, మంగర్‌లను విడిచి మిగిలిన నౌకర్లకు రెండునెలల జీతం బహుమతిగా ఇవ్వాలి. ఇద్దరం మోటార్లు అమ్మివేయాలి.'

'చాలాబాగుంది.'

'ఒకటి రెండు మంచాలు, కొద్ది కుర్చీలుతప్ప ఇంటిలోఉన్న సామానంతా వేలం వెయ్యాలి.'

'ఇదీ బాగుంది!'

'లాటూశ్ రోడ్డుమీద పినతల్లిగారి గొప్ప భవన ముంది. మనం దాంట్లోకి మారి ఈ బంగళా అద్దె కిచ్చివేయాలి'

'చాలాబాగుంది.'

'ఇంకా ఏమీ జ్ఞాపకం రావడంలేదు.'

'మీ విదేశదుస్తులు ?'

'గాంధీగారి సహాయనిరాకరణంలో ప్రవేశిస్తున్నాను. అందుకే చెపుతున్నావా? వాటిని కాల్చాలనిలేదు. ముఖ్యమైన విదేశదుస్తులు కాల్చబడ్డాయి. కాని ఖద్దరుచొక్కా పాయ్‌జమా ఎల్లుండికి వస్తున్నాయి. ఈ ఖద్దరు చీర ధరిస్తావా సకేనా ?'

'ఆ! ఈ విదేశీదుస్తులు వేలంవేసి ఆ సొమ్ముతో బట్టలుకొని బీదలకు పంచితే చాలావాగుంటుంది.'

---

# 3

బారిష్టరు సఫదర్‌యొక్క ఈ త్యాగం నలువైపులా ప్రశంసింపబడుతోంది. ఐతే సఫదర్ తనకంటె ఎక్కువగా శంకర్‌నే యోగ్యునిగా తలుస్తాడు. అక్టోబరు నవంబరులంతా ప్రజల్లో తిరిగి ప్రచారం చేయడానికి సఫదర్‌కు సమయం దొరికింది. ఆయనతో శంకర్, సకేనాలు ఉండేవారు. వారి మనస్సు గ్రామాలపైనే ఉండేది. పట్టణంలో చదువుకున్న వాళ్ళమీద కంటె గ్రామాల్లో శ్రమజీవులు, రైతులయందే వారి కెక్కువ విశ్వాసం. కాని వారు మాట్లాడే ఉర్దూలో నాల్గవవంతు కూడా ప్రజలకు అర్థంకావడంలేదని గ్రహించారు. శంకర్ మొదటినుంచీ వారిభాషలో ఉపన్యసింప సాగాడు. అదిచూచి సఫదర్ కూడా అవధీభాషలో మాట్లాడసాగాడు. మొదట ఆయన భాషలో గ్రాంధిక శబ్దాలువచ్చేవి. కాని కష్టపడి శంకర్ సహాయంతో రెండు నెలల పాటు కొత్తశబ్దాలు వల్లించారు. వారిఒక్కొక్క మాటను గ్రామీణులు ఆనందంగా వింటున్నారు.

1920 డిసెంబరు ముందువారం. దేశభక్తులతోపాటు శంకర్‌కు సఫ్‌దర్‌కు కూడ ఒకసంవత్సరం శిక్షవిధించి ఫైజాబాద్ జైలుకు పంపారు. వారిదవురిస్థానం చంపా సకేనాలు అక్రమించారు కాని బంధింపబడలేదు.

జైలుకు వెళ్ళినతరువాత సఫ్‌దర్ నియమంగా ఒకగంట రాట్నం వడికేవాడు. ఎవరయితే వార్ని గాంధీవిరోధిగా, వారి రాజనైతిక ఉద్దేశ్యాలను ఎరుగుదురో వారు ఈ రాట్నాన్ని ఆక్షేపించేవారు. సఫ్‌దర్ ఇలా అనేవాడు—' విదేశదుస్తుల నిషేధాన్ని నేను ఒక రాజనైతిక ఆయుధమని అంటాను. మనదేశంలో చాలినంతబట్ట తయారు కావడంలేదని నాకు తెలుసు. అందుకే బట్టను ఉత్పత్తిచేయాలి. కాని దేశంలో మిల్లులు చాలినంతబట్ట ఉత్పత్తిచేస్తే అప్పుడు రాట్నం వడకడానికి వప్పుకోను.'

జైలులోని వారిసంఖ్య ఎక్కువగాఉంది. ఒక సంవత్సరంలో స్వరాజ్యం వస్తుందని గాంధీజీ చెప్పాడు. అది నమ్మారు. జైలుకువస్తే వారిపని పూర్తిఅయిందని అనుకున్నారు. ఇంతవరకు గాంధీవాదం దుర్మార్గాన్ని మోసాన్ని చూపించలేదు. అందుకే గాంధీజీ సహాయనిరాకరణోద్యమంలోని ఖైదీలలో చాలమంది నిజమైన దేశభక్తులు, కాని వారిలో రాజనైతికజ్ఞానం తక్కువ. వారిలో ఎంతోమంది రామాయణం, గీత లేక కురాన్ చదువుతారు; చేతిలో జపమాల ఉంచుకొని నామాన్ని

జపిస్తారు. ఎంతమంది కేవలం పేక, చదరంగాల్లో సమయాన్ని ఖర్చుపెడుతారు! దీనికి సఫ్దర్, శంకర్ విచారించారు.

ఒకరోజున గాంధీవాది, రాజనీతిలో గొప్ప విద్వాంసుడైన వినాయక ప్రసాద్‌ను సఫ్దర్ కలిసాడు. ఆ సమయంలో శంకర్‌కూడా అక్కడే ఉన్నాడు. వినాయక ప్రసాద్ ఇలా అన్నాడు–' మహాత్ముని అహింసాసిద్ధాంతం చాలాగొప్పది. ఇది గొప్ప ఆయుధం'

'మన వర్తమాన స్థితిలో అది ఉపయోగపడచ్చు' అన్నాడు సఫ్దర్– 'కాని అది ఒక్కటే విజయానికి మార్గంకాదు. ప్రపంచంలో ఎవరినీ హింసించని పశువులుకూడా ఇతరులచే ఎక్కువ హింసించ బడుతున్నాయి.'

'పశువులో ఉండకపోవచ్చు, మనుష్యునిలో అహింస అద్భుత ఫలితాల్ని కల్గిస్తుంది.'

'రాజకీయరంగంలో దీనికేదీ ఉదాహరణలేదు.'

'కొత్తసృష్టికి ఉదాహరణలుండవు' శంకర్ అన్నాడు–'బుద్ధుడు, మహావీరుడు, మరెంతోమంది ధర్మోపదేశకులు దీన్ని నొక్కి చెప్పారు.'

'కాని రాజకీయ సూత్రంగా కాదు.'

సఫ్దర్— 'మానవత్వాన్ని మేల్కొలపడంవల్ల దీని ఉపయోగం రాజకీయ క్షేత్రంలో అధికమయింది. పత్రికల్లో నిరాయుధులపై తుపాకి కాల్చడం నేరంగా భావిస్తారు. బ్రిటిష్‌వారు జలియన్‌వాలాబాగ్‌లో తుపాకికాల్చి దీని పరిణామాన్ని చూపారు!'

'ఐతే ఈ అహింసాత్మకమైన సహాయ నిరాకరణ స్వరాజ్యం కొరకు చాలదంటారా?'

'స్వరాజ్యమంటే మీ ఉద్దేశం?'

'స్వరాజ్యాన్ని వివరించాలి.'

'మీరు స్వరాజ్య పోరాటంలో చేరారు. మీ ఉద్దేశం ?'

'ఐతే మీ స్వరాజ్యంలో హృదయపూర్వకంగా సహాయం చేసేవారికి, కష్టాలు సహించి జైలుకువెళ్ళే శిక్షితులకు, షాహుకార్లకు, తాలూకాదార్లకు ఏమీ అధికారముండదా ?'

'షావుకార్లకు శాంతిసభల్లో పాల్గోడానికి ఓరికలేదు. వారు పాపం జైలుకెందు కొస్తారు. ఒకవేళవస్తే సంపాదించేవాడి స్వార్థంతో తన స్వార్థాన్ని వేరుచేయటానికి కాదు.'

'శంకర్, సఫ్దర్‌లు పుస్తకాలు చదవడం, దేశంలోని ఆర్థిక, సామాజిక పరిస్థితులను ఆలోచించడం చేసేవారు. మొదట వారిమాటలు కొద్దిమందే వినేవారు. కాని 1921 డిశంబరు 31 అర్ధరాత్రికూడా గడిచింది. జైలుద్వారం తెరుచుకోలేదు. వారికి నిరాశకల్గింది. చౌరీచౌరాలో ఉత్తేజితులయిన ప్రజలు కొంతమంది పోలీసులను చంపారనే వార్తతో సత్యాగ్రహం ఆపుచేయబడింది. ఇది ఆలోచనకు కారణమైంది. వారిలోకొందరు ముందుకువచ్చి సఫ్దర్, శంకరులతో ఏకీభవించి 'ప్రజలే విప్లవ శక్తి' అని భావించసాగారు.

మాధురీ ప్రింట్ ఆర్ట్స్, లకడీ కా పూల్, హైదరాబాదు-500004.

| Check List | | | |
|---|---|---|---|
| Book Number | NPR01f320 | Date | 14/3/2023 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CI, iv, iv, vi, 337 | | |
| Missing Pages | NO | | |
| Prepared By | chaithanya | Cutting By | chaithanya |
| Scanned By | Amrutha | Pages | 353 |
| Quality Checking | pragathi | | |